# మానవ జీవితము

## తృతీయ సంపుటము

చదువనివాఁ డజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక • చతురత గలుగున్
జదువఁగ వలయును జనులకుఁ
జదివిన శీలంబు మిగులఁ • జక్కఁగ నబ్బున్.

గ్రంథకర్త:
బౌద్ధవాఙ్మయబ్రహ్మ,
దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

# తొలిపలుకు



ఈ గ్రంథరాజమును రచించిన శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు - ఆధునికాంధ్ర వాఙ్మయములో గొప్పస్థానము నిదివఱలోనే యధిష్ఠించియున్నారు. బుద్ధభగవానుని దివ్యచరిత్రమును, తత్త్వములను విపుల వ్యాఖ్యాన సమేతముగ రచియించి "బౌద్ధ వాఙ్మయబ్రహ్మ" అను నఖండమయిన బిరుదమును బడసి మన భాషకు నూతన వికాసమును గొన్ని సంవత్సరముల క్రిందనే సేకూర్చియున్నారు. వయసునఁ జిన్నవారు. వాక్పటిమయందును, పాండిత్యమునందును దొడ్డవారు. తొలుత నీతిప్రధానమయిన బౌద్ధమతమును వివరించి, తగుపరి సర్వజనసామాన్యమయిన నీతిశాస్త్రమును విస్తరించుట వారి భావముయొక్క సహజపరిణామము.

ఈ క్రొత్త పుస్తకమునకుఁ బేరు మానవజీవితము. ఇందుఁ బ్రతి మనుష్యుఁడును అన్ని దశలయందును, అన్ని యవస్థలయందును, అన్ని పరిస్థితులయందును, ఎట్టి నడవడి నాశ్రయింపవలయునో యా ధర్మసూత్రము లన్నియు నిదర్శనపూర్వకముగ నివేదింపఁబడియున్నవి. దీనిలో లేని నీతులు లేవు. ఉండవలసిన నీతు లన్నియు నున్నవి. ఒక్కొక్క నీతిని గుఱించియుఁ బ్రాక్పాశ్చాత్య ప్రమాణపురుషులు చేసిన బోధనలును, ప్రపంచచారిత్రమునఁ జుక్కలవలె వెలుఁగుచుండు పాత్రల జీవితమునుండి ప్రసరించు కిరణములయొక్క వెలుతురువలన వ్యక్తమయ్యెడు నంశములును జేర్చి చదువువారికి సులభగ్రాహ్యమగునటు లీ మహాశాస్త్రమును సర్వాంకషముగ రచించి, భారతీయుల పురోభివృద్ధి కమోఘమయిన దోహదమును గల్పించి మనయొక్క యామోదమునకును, కృతజ్ఞతకును శ్రీ బలరామకృష్ణయ్యగారు సర్వవిధములఁ బాత్రు లయియున్నారని పలుకుటలో

నతిశయోక్తి యేమాత్రమును లేదు. ఒక్క సులభగ్రాహ్యమగుటయు కాదు. ఉత్సాహజనకముగను వెలయుచున్నది. శీలమును బోషించి, పెంపొందించు గ్రంథములలో దీనికి సమానమయినది నాకుఁ దెలిసినమట్టున కే భాష యందును లేదు. ఆంగ్లేయములో దీనికి మాతృకలును, మార్గదర్శకములును నగు పుస్తకము లున్నవి గాని, వానియం దింతటి విషయసమగ్రతయుఁ, విస్తీర్ణతయుఁ బొడకట్టవు. తెనుఁగులో నీరీతిని రచింపఁబడిన కబ్బములు సర్వ విధముల స్వల్పములు. కాఁబట్టి యీ గ్రంథము నూతనసృష్టి. ఇంగ్లీషు, తెనుఁగు, సంస్కృతము మొదలగు భాషాప్రపంచముల విశేషశ్రమ కోర్చి వివేకముతోఁ బరిశీలించి, అందుఁ దడవఁబడని విషయముల ననేకముల సమ కూర్చి, ఈ సంపూర్ణ నీతికోశమును మన గ్రంథకర్తగారు విరచించి యున్నారు. ఇది నిజముగా విశ్వనీతి. నీతిసర్వస్వము.

నీతిశాస్త్రమును వెల్లడించు పద్ధతులు రెండు. ఉపదేశమని, నిర్దేశ మని. ఉపదేశ మనఁగా నీ వీ రీతుల నడచుకొనవలయు నని బోధనఁ జేయుట. అనఁగా ధర్మసూత్రముల ప్రయోగము దీనియందుఁ బ్రధానము. ఈ సూత్రము లే తత్వములపై నాధారపడి యున్నవి? అని విచారణలు సలిపి, ఆ మూలాధారతత్వములయొక్క స్వరూపమును నిర్ణయించుట రెండవ పద్ధతి. ఎందున కయి యీ ధర్మమును జేయవలయును? అని ప్రశ్నించితిమేని మొత్తముమీఁదఁ జిట్టచివరను రెండు కారణముల నిరూ పింతురు. ఇది సరి, ఇది క్రమము కాఁబట్టి కర్తవ్యము. లేదా దీనిచే నీ ప్రయోజనమో, పరమార్థమో సిద్ధికి రాఁగలదు. కాఁబట్టి కర్తవ్యము కర్తవ్యములకు మూల కారణము లివి.

అగుఁగాక. ఈ మూలకారణములు భిన్నములా, లేక యవియు నొండొంటితోఁ దుట్టతుదను సమన్వయించి, అద్వైతభావమును దాల్చిన వియా? ప్రయోజనము లేని సక్రమమున్నదా? అతిక్రమణమునకు భాజన మయిన పరమార్థ మున్నదా? ఫలములేని వృక్షమా శీలము? శీలమునకు వశము కానిదా ఫలము? నిష్కామవ్యవహారము సాధ్యమా? ఉచితమా? వంధ్యశీలమా విధి? నిష్కర్మము ధర్మమా? నిష్కర్మము కర్మముకాదా?

నిష్కర్మత ననుష్ఠించుఁ డని యాదేశించెదరుగదా కొందఱు జ్ఞానవాదులు. అనుష్ఠానమున కలవడునది క్రియ, కర్మము కానేరకపోవు టెట్లు? ఈ నిష్కర్మత - ఆభాసభావమా కాదా? మఱియు దానిచే నేఫలము కలుగకపోనేర్చునా? "నిష్కర్మత మోక్షావహము" అని చెప్పఁబడి యున్నది. ఇంకొక వస్తువునో, స్థితినో యావహింపఁ జేయునది కార్యము కాకుండు టెట్లు? లేదు - నిష్కర్మతయ మోక్షము. ఈ రెండు స్థితులు నభేదము లని వాదింతురా? కర్మనిరోధము నిష్కర్మము. ఈ నిరోధము ప్రయత్నములేక సంభవించునా? సామాన్యముగాఁ జేయు ప్రయత్నమున కంటె నెక్కువ వలయుఁగదా యీ సిద్ధికి? ప్రయత్నము కర్మము కాదా? చేయుట కర్మయయినచోఁ జేయకుండుట కర్మ కాకపోవునా నిష్కర్మత కర్తవ్యమవునా కాదా? కర్తవ్యము కార్యముగఁ బరిణమించుటయు, ఫల ప్రదానబీజ మగుటయు స్వాభావికములు.

మఱియుఁ బురుషార్థ మనునది వ్యక్తికిఁ జెందిన యర్థమా లేక సంఘమునకుఁ జెందినదా? వ్యక్తికి సంఘమునకు నుండు సంబంధ మెయ్యది? సంఘము పోయిన వ్యక్తి నిలువఁడు. వ్యక్తి పోయిన సంఘము నిలువవచ్చును. ఒక్క పటాలము ధైర్యముతో యుద్ధముచేసి నిర్మూలమయినను సైన్యము విజయవంతము కావచ్చును. సైన్య మోడిపోయినయెడలఁ బటాలముల కేమి భద్రము? మఱి పటాలము లన్నియు నశించినయెడల సైన్య మెక్కడిది?

వ్యక్తు లన నెవరు? ఇప్పుడు సజీవులయి యుండువారు మాత్రమేనా? ఇఁకముందు పుట్టఁబోవునట్టి యనంతసంతతి పరంపరయా?

సంఘ మన నేమి? కులమా? గోత్రమా? రాష్ట్రమా? యావన్మానవమండలమా? మతమా? కేవల మనుష్యప్రపంచమా? వీనిలోని యంతరువు లెట్టివి? ప్రధానత్వమును బట్టి నిరూపించితిమేని, ఏది ఎక్కువ, ఏది తక్కువ, ఎయ్యది పరమార్థము? ఎయ్యది యుపకరణప్రాయము? ఏది చెట్టు, ఏది తీఁగ.

పరమార్థ మంటిమి. అది యెట్టిది? దానితో నేరీతి వ్యక్తిసాంఘి కాదిధర్మము లన్వయముఁ జెందియున్నవి?

జీవిత మనునది కొయ్యబొమ్మ కాదు. పరిణామమునకుఁ బాత్ర మయినది. పెఱుగును, తఱుగును, విఱుగును. స్థిరత్వమనునది జీవకళయందుఁ బొసఁగనిమాట. శాశ్వతత్వ ముండవచ్చునుగాని స్థిరత్వ ముండజాలదు. పెఱుగుటయో, తఱుగుటయో రెంట నొకటి సిద్ధము. నిరంజనత సమ కూడినఁ గూడవచ్చును. నిర్వికారత నేరదు.

అట్లగుట నేభావములనయినఁ గేవలము దుష్టములనిగాని, పూతము లనిగాని నుడువసాధ్యమా? మనవారు కామక్రోధలోభ మదమాత్స ర్యాదులు చెడ్డవి యని యందురు. ఈషణత్రయములు పనికిరావట. పెండ్లి మాత్రము ముఖ్యము! రాగ ద్వేషాదులు వర్జనీయములు. దేశభక్తి పరమ పూజ్యము! వాంఛలు తగవు. భూరిదానము లెంతచేసిన తీఱదు! ఇట్టి పర స్పరాభాసధర్మముల కవివేకమ తావలము. ఈ భావములు, గుణములు పశుపక్షికోటులలో లేవా? జీవరాసులకెల్ల సామాన్యమయిన గుణసము దాయమును ఖండించుట సృష్టికో, సృష్టికర్తనో భంజించుట కాకపోవునా? భంజించువారు భజించువారా? ఏ పరమార్థముల పరముగ గణించి వీనిని నిరసించిరి? ఏ తులలో వీనిని దూఁచిరి? వీనికి విశ్వజీవితములో నేర్పడ వలసిన స్థానప్రాముఖ్యత లెయ్యవి? సర్వవ్యాప్తములు సత్యములు గాకపో వునా? అట్లయినచో సత్వరజస్తమములను వర్గీకరణము సమంజసమా? ఎంతమాత్రము సమంజసము? ఎంతమాత్రము కాదు?

ఇంతకంటె నెక్కువగ నీమూలతత్వములను గుఱించి వ్రాయుట యిక్కడ నధికప్రసంగము. మొత్తముమీఁదఁ జెప్పవలసినమాట యేదనఁగా భావములు, గుణములు, నీతి సూత్రములు మొదలగు బోధనసామగ్రులను జర్చించునప్పుడు జీవకోటియు, మనుష్యులలో వ్యక్తులయు, మఱి నానా విధములయిన సంఘములయు - పరిణామములయు, ఆ పరిణామములయం దీ గుణగణములచే నెఱవేర్పఁబడిన వ్యాపారములయు, సాధింపఁబడిన సిద్ధులయు

విచారణలు చేసినఁగాని వాని యానుకూల్యతను, ప్రాశస్త్యమును నిర్ణయింప నేరము. ఇంతగాదు, మనశ్శాస్త్ర పరిశోధనలును లెక్కకుఁ దెచ్చుకొనవల యును. వానిని వదలిపెట్టి వ్రాసినచో సత్యము తేలదు. ప్రయోజనము చెడును.

ఉపదేశము ప్రయోగము. కాలదేశ వర్తమానముల ననుసరించి మాఱునది. మాఱవలయునది. పరమార్థములనుబట్టి నిర్ణయమునకు వచ్చునది.

శ్రీ బలరామకృష్ణయ్యగారి యఖండరచనలో నీమూలధారతత్త్వ శాస్త్రమునకుఁ జేరన యంశములు వెదఁజల్లఁబడియున్నవి. ఇది యెంతయుఁ బ్రశంసనీయము. వారియొక్క యుద్దేశ్యము తత్త్వనిర్దేశము గాదు. మఱి శిక్ష. శీలమునకుఁ గావలసిన శిక్షలనన్నింటి నేకొరుతయు లేనిరీతిని గ్రంథ కర్తగారు శాసించియున్నారు.

పుట్టువు మొదలు గిట్టుట పర్యంతము- తమకొఱకును, సంఘముకొఱ కును, ఐహికాముష్మికార్థసంపాదనకయి స్త్రీపురుషు లవలంబింపవలసిన నీతులన్నియు నీగ్రంథములో "నిఖిల వ్యాఖ్యానవైఖరీసమేతము"గా వివ రింపఁబడియున్నవి. ఈ గ్రంథమును జదివి యానందించుటతో విరమించుట బుద్ధిలేని పని. అనుష్ఠించుట కర్తవ్యమును, శ్రేయోదాయకమును.

శ్రీ బలరామ కృష్ణయ్యగారిలోని ప్రబలవిశేష మింకొండు కలదు. అది యేదనఁగాఁ బ్రసంగమునకుఁ దీటగు ప్రవర్తన. ఊరక నీతుల వాకొనుటతో విరమించు బొల్లుమాటలమాత్రపువాఁడు గాఁడు. మఱి సూత్రముల కుదాహరణముల నిజజీవితమునుండియ చూపఁగలయట్టి మహనీయుఁడు. తా నుపదేశించు పద్ధతులకు విరుద్ధముగ నడచుకొను కప టులు దౌర్బల్యమునకు, క్షయమునకుఁ బాల్పడిన మనజాతిలో మితిమీఱి యున్నారు. మాటల నాడంబరముగఁ బలికి యేచేతలు చేయక మిన్నకుండు నిష్ప్రయోజకులసంఖ్య యంతకంటెఁ దక్కువకాదు. సత్యము సత్త్వతో సమ్మేళించిన సుగుణము. సత్యముకొలఁది శక్తియు, శక్తికొలఁది సత్యమును ప్రవర్ధమానములగును. శక్తియన సంఘశక్తి. అదియ ప్రధానము. కోటిబృహ

న్నలయందు దేశములో నొక్క భీమసేనుఁడు సాధింపఁగలపరాక్రమ మేదియు నుండదు—ప్రాణత్యాగముచేయుట తప్ప. ఇది యేరీతి బహిస్స్థితిగతులును, అంతర్గుణములును బరస్పరాశ్రయములు. బలరామకృష్ణయ్యగారు గాంధి యుగమున జన్మించిన పుణ్యఫలము ననుభవమునకుఁ దెచ్చికొన్న యువకు లలో నొకరు. ఇట్టి వీరి మాటలు చెవులలోఁ జొచ్చుటయకాక హృదయ ములయందును నాటి వికసించునని నా నమ్మకము.

పద్మప్రభాస,
చిత్తూరు,
15–4–30.

కట్టమంచి రామలింగారెడ్డి.



గ్రంథకర్త :
బౌద్ధవాఙ్మయబ్రహ్మ
శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య

VIII B



కీ. శే. సర్ కట్టమంచి రామలింగారెడ్డి.

VIII C

# PREFACE

It is with great pleasure that I write this friendly not introducing to the Andhra Public the large work "MANAVAJIVITAM" by Sjt. Duggirala Balarama Kristnayya Garu of Angaluru. He is already well-known in the Telugu Country as the Author of Buddha Puranam and other works, as a sincere and devoted seeker of truth possessing, an unbounded enthusiasm for great ideals. In this book he deals with the fundamental principles of our culture and insists with great force and eloquence on the need for applying them in daily life and practice. Without a general outlook on life, a dominating philosophy, our life will be uncertain of purpose and distracted in aim.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినాం.

—భగవద్గీత.

If your life is not to be episodic but have a unity it must be controlled by a steady and stable purpose. Our author knows the conditions of our country, the strong as well as the weak points. He has adopted a style, which, slightly elaborate, is immensely fascinating. His wide reading. and large experience of life come out on every page. In short, the spirit, the method and the matter of this great book are alike remarkable. While every age may be regarded as transitional the present is more transitional than any other. New currents of life and thought are sweeping over us and the unrest is not confined to the economic and political regions. The western influence

is real and far-reaching and has begun to modify the very structure of our social organization in a subtle way. India to-day is in one of those momentous occasions in the passage of time which historians call 'turning points'. Many of us are uncertain about what we should do and what we should not. There is confusion of thought on every side.

Many of the politically-minded of our country are disgusted with our culture and institutions. They are convinced that orthodox fundamentalism which is still the creed and conviction of the majority of the people has cost us a lot in struggle and suffering, in stunted and deformed spiritual growth. A culture which has exposed the country to the invader and the spoiler has little to justify it. From a thousand platforms we are told that there is no hope for us unless we transform ourselves body, mind and soul.

Some of us including the author of this work are doubtful whether the part of wisdom lies that way. We all belive that Swaraj is the natural and legitimate birthright of every people. But political freedom is not an end in itself. It is only a means for self-expression and self-devlopment. Only nations that possess individuality as for freedom to express themselves. But if in our anxiety to secure the means of political freedom we surrender the end of our individuality, if we will our souls and lose our typical cultural genius what is political freedom worth? How does it matter even if we gain the whole world when once we lose our souls ?

Again, it is quite true that political freedom is an urgent necessity. Our external organization social and economic has broken down, Our misfortunes are staring us in the face. Our bodies are broken, and if we are told

that our souls are sick and require drastic remodelling, what have we to live for? Nations which are in distress have a future only if they have faith in themselves faith in their culture, faith in the redeeming power of the great ideas for which the nation has stood for millenniums. If we are poor, we can recover our possessions and become rich tomorrow, if not to-day; but if we are dead, no power on earth or heaven can help us. The sick can be cured but the dead cannot be raised.

Besides, in our mood of defeatism, we seem to assess the success and failure of civilization by many tests. Those who build sky-scrapers and fly in the air are not necessarily superior to those who lead more prosaic lives. The aim of life is not mere comfort and convenience. I am sure that we will not be happy if we reduce the world to a night club where all men are well fed and all houses are palatial, where all heads are hard and all pillows soft.

One of the tests of a successful civilization is its length of conscious continuity. The Jews look back on three thousand years of national existence focussed on an idea. The English look to a thousand years and the Americans to three hundred but the historic conciousness of the Hindus extends at the lowest estimate over four milenniums. A culture which could not only servive successive waves of conquest but actually conquer many of the conquerors is a power to be reckoned with. A great tradition is not to be lightly set aside. It requires many centuries of life to produce a little hostory and it requires many centuries of history to produce a little tradition and it is therefore very necessary that we should not do anything to undermine the strength of the Hindu tradition.

It does not follow that the only desirable attitude is one of conservatism. If radicalism is born of despair,

conservatism shows exhaustion of spirit. If we blindly perpetuate the old laws and taboo the old prescriptions and prohibitions, it is no good we want the spirit of life which while rooted in the past faces the future with faith. We should not confine our attention to the troubled surface waters for it is the silent stream that counts, the stream that runs by its own impetus, with its own velocity and in its own direction. What Bacon said of weighty things in general that they sink in the stream of time, while straws and feathers are borne safely on its surface is true of cultures as well. While we should not be blind to the failinges of our culture, we sh)uld not lose our grip on the springs of strength and vitality. It is this constructive conservatism of the author that appeals to me most. While he recognises that life is not mere repetition but renewal, he insists that it must be inspired by the spirit of the past. I hope that the enthusiasm of the author for the faith of the past and the vision of the future will spread to his readers as well.

CALCUTTA,
*26th August '29.* } (Sd.) S. RADHA KRISHNAN.

# ఉపోద్ఘాతము



అంగలూరు వాస్తవ్యులును, బుద్ధపురాణాది సద్గ్రంథ రచయితలును, ధర్మజిజ్ఞాస నిష్ఠాప్రతిష్ఠులును, సదాదర్శ వివేక నిరతులును, విఖ్యాతాంధ్ర గ్రంథకర్తలును నగు శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు నవీనముగ రచించిన "మానవజీవితము" ను ఆంధ్రలోకమునకు సమర్పించు నవసరమున నీ క్రింది యాప్తవచనములను నిండు మనంబుతో నాందీ ప్రస్తావనముగ నమర్చుచున్నాను.

ఈ గ్రంథమున భారతీయుల ప్రాచీన సనాతన సద్ధర్మములను, సభ్యతాతత్త్వములను గైకొని నిత్యవ్యవహారములో వాని నవలంబించెడి పద్ధతులు విస్తరింపబడినవి. పురుషార్థ మెద్దియో నెఱుంగక, ధర్మవిశ్వాసములేక పారమార్థిక లక్ష్యముల జాడ నెఱుంగక నడచెడి జీవితము పరిపరివిధంబుల వ్యభిచరించి సిద్ధిదూరమయి నష్టమగును.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినాం.

—భగవద్గీత.

"ఓ అర్జునుఁడా! శ్రవణ మననాదులచేతను, సాధన చతుష్టయము చేతను లెస్సగ సంస్కరింపఁబడిన మానవుల మనోవృత్తియు, వారి నిత్య వ్యవహారములును ఒకే విధముగ, ఒకేలక్ష్యము ననుసరించి అందముగ నడచు చుండును. ఈ విధమయిన సంస్కారశిక్షాలక్ష్యముల దారెఱుంగని బుద్ధులు అనేకరీతుల పలవరించుచుండును."

మన జీవితమం దెద్దియో ఒక సత్సంకల్పము, ఒక నియమము నుండిన గాని అది కుదురుగను, ఏకముఖముగను బ్రవర్తింప నేరదు. మన గ్రంథ

కర్త మనదేశపు మంచిచెడ్డలను, పరిస్థితులను పరిశీలించి యున్నారు. వీనిని చిత్రించుట కుపయోగించిన శైలి కొన్ని తావుల జటిలమయ్యును హృదయంగమమయి యలరారుచున్నది. వీరి పాండితియు, లోకానుభవమును ప్రతి పుటను దేజరిల్లుచున్నవి. వాస్తవమున నీగ్రంథమందలి విషయము, లక్ష్యము, పద్ధతి, శైలి ఒకదాని కొకటి వన్నెవెట్టుచు ప్రశంసార్హములుగ నున్నవి.

మానవచరిత్రలో నే యుగమయినను, ఏధర్మపద్ధతులయినను రాగల కాలమునకు దారిజూపెడి తాత్కాలిక నిదర్శనములేకాని శాశ్వతముగ నుండునవి కావు. ప్రస్తుతకాలము, ఇదివఱకు భారత చరిత్రలో గడచిన యుగము లన్నింటికంటె చంచలమయి, అస్థిరమయి యున్నది. నవ్యభావ తరంగములు అనంతముగ మహోద్వేగమున మనల దాకుచున్నవి. ముంచుచున్నవి. అంతట క్రమ్మివైచుచున్నవి. మన యార్థిక రాజకీయలక్ష్యము లెంతి శీఘ్రముగ మారొందు బాహ్యప్రచారములో గలవరపడుచున్నవో, అంతటి యాందోళనము మన హృదయాంతరంగమున నాధ్యాత్మిక జీవితాదర్శములగూర్చి జరుగుచున్న . ప్రతిరోధము, ప్రయత్నము రెండింటను సమముగనే జరుగుచున్నది. పాశ్చాత్యభావసంపర్కము మన సాంఘిక ధర్మములను, వ్యవస్థలను జల్లగ, బలవత్తరముగ మార్చుచున్నది. ఇందువలన గలుగనోపెడి ఫలితార్థము చాల విపులమయి యున్నది. భారతీయులు ఈనాడు పౌరాణికులు యుగసంధు లని చెప్పెడి విషమావస్థయందు ధర్మసమ్మోహము చేతనులయి యల్లాడుచున్నారు. ఎటు నడువను స్థిరపఱుప వీలులేకున్నది. ఏమి చేయవలయునో, ఏమి చేయగూడదో తెలియకున్నది. కాని సర్వత్ర భావపరిశీలనము భావసంగ్రహము జరుగుచున్నవి.

భారతదేశమునకు రాజకీయస్వాతంత్ర్యమును, ఆర్థిక ప్రాబల్యమును జేకూర్ప యత్నించెడి దేశసేవాధురంధరులు ఈ దేశము చిరకాలమునుండి పాదుదగిలి నిలిచియున్న నమ్మికలపై దాడి వెడలుచున్నారు. ఈ ప్రాచీన ధర్మములవల్లనే హిందూసంఘము భిన్నప్రవృత్తిగలదయి బయటి రేడుల జోరనిచ్చి దేశస్వాతంత్ర్యమును గోలుపోయిన దని వీరి వాదము.

స్వాతంత్ర్యము లేని దేశము నిలువనేరదు గాన తల్లాభమునకు దగిన సర్వధర్మముల నవలంబింపవలయు నని వీరనేక సభాపీఠములనుండి ఘోషిలుచున్నారు. కాని దేశస్వాతంత్ర్య మొకటియే పరమార్థము కానేరదు. మన వ్యక్తిత్వమును సంపూర్ణముగ వెలువరించుటకును, మన శక్తులను సర్వతోముఖముగను, యథేష్టముగను విస్తరింపజేసికొనుటకు స్వాతంత్ర్య మవసరమయి యున్నదిగాని కొన్ని రాజకీయసభలను, బంగారుమేడలను నిర్మించుకొనుటకు గాదు. వ్యక్తిప్రభావముగల జాతులే స్వాతంత్ర్యము నన్వేషించుచున్నవి. ఇదియు తమ వ్యక్తిత్వప్రాచుర్యార్థమే. కాని స్వాతంత్ర్యసంపాదనమునకయి మన చిరాభ్యస్త స్వధర్మములను విడనాడవలసి వచ్చినచో, మన విజ్ఞానకళాస్వరూపములను మార్పించవలసి వచ్చినచో, మన నామరూపములనే బుగ్గిలో గలుపవలసినచో, మన స్వాతంత్ర్య మేల ? స్వరాజ్య మేల ? మన ఆత్మలే, మన పరమావధులే ప్రనష్టములగు నెడల మనకు త్రైలోకసామ్రాజ్య ముండిన నేమి ? లేకుండిన నేమి ?

కాని మనకు దేశస్వాతంత్ర్య మనావశ్యకమని మన్నింపక తీఱదు. మన సాంఘిక వ్యవస్థలన్నియు సంధులు విరిగి విచ్ఛిన్నములైనవి. గుణకర్మవిభాగమున నేర్పఱుపబడిన సాంఘిక మర్యాద లడుగంటినవి. ఎటుజూచినను దారిద్ర్యము, కష్టపరంపరలు మనల నెదుర్కొని నిరుత్సాహులగావించుచున్నవి. శల్యప్రాయమయి, అస్థిమాత్రావశేషముగ మనజాతి జీవచ్ఛవమయి యున్నది. బాహ్యవ్యవహారములందే కాదు, మన శైథిల్యదౌర్బల్యములు ! మన హృదయాంతరాళములుగూడ నపవిత్రములయి ఆత్మహీనములయి యడుగంటుచున్నవి. కూలంకషముగ, నిర్మోహమోటముగ వీని సంస్కరించెడి యుపాయము లరయవలసియున్నది. పతితులయిన వ్యక్తులుగాని, జాతులుగాని మేల్కొని, తెప్పరిలి క్రమ్మఱ పూర్వోన్నత్యంమును బొందవలెనన్న వానికి యాత్మవిశ్వాసము ప్రధాన ధర్మముగ నేర్పడవలయును. తమ భావములందును, సభ్యతలందును గౌరవాదరములు గలిగి పూనికతో వానిని నిలుప యత్నించుటవలననే పతితులయిన జాతులు

మరల నిలువగలుగుదురు. కాని స్వధర్మమును విడనాడి పరధర్మముల నవలంబించెడి వారు శ్రేయఃపథమును జేరజాలరు. "బ్రతికియుండిన సుఖమును బడవయచ్చు" నిర్జీవులమయి నశించిన యెడల భౌతికాధ్యాత్మికశక్తు లేవియు మనల గ్రమ్మఱ బ్రతికింపజాలవు. రోగుల బాగుజేయవచ్చునుగాని, ప్రేతముల నిలువఁబెట్టెడివారు లేరు.

భౌతికైశ్వర్యములను గాని, విశాలసామ్రాజ్యములను గాని పరమావధిగ నెంచగూడదు. తుచ్ఛసుఖములు నిత్యైశ్వర్య సూచనలు కావు.

ధర్మముల పటిష్ఠతను, సభ్యతల సత్త్వమును విమర్శించుటలో, వాని ప్రభావప్రయోజనములను మన్నించుటలో మనము ప్రధానగౌరవ మొకవిషయమున కొసంగవలసియున్నది. ఇవి యెంతకాలము, ఎన్ని వ్యభిచరణ హేతువుల నడుమ నిలిచి, ఎందరిచే మన్నింపఁబడినవి? ఎన్నిశతాబ్దముల జాతీయ జీవనపద్ధతుల శాసించియున్నవి? కాలశిక్షయే ధర్మముల యొక్కయు, ప్రతిష్ఠాపనములయొక్కయుసార్వత్రికప్రయోజనమును, తత్వ ప్రభావమును చూపగిలదు. మన సభ్యతామూలములయిన భావములు అధమము నాలుగుయుగముల కాలశిక్ష ననుభవించియు చెక్కుచెదరక నిలిచియున్నవి. యూదులు మూడువేల సంవత్సరముల సభ్యతమాత్రమే, నాగరిక వికాసముమాత్రమే కలిగి అందునకే గర్వపడుచున్నారు. మనప్రభువులగు నాంగ్లేయులు వేయిసంవత్సరముల చారిత్రమును, లౌకికసంపదలందు వారిని తలదన్ని యెగసి పారలెడు అమెరికనులు మున్నూరేండ్ల మనోవికాసమును మాత్రమే యొప్పియున్నారు. వీరిభావములు, వీరి లక్ష్యములు, వీరిసభ్యతలు దుర్వారకాల ప్రవాహోద్వేగమున నే గతివ్యవహరించునో, ఎటులవ్యాపించునో, ఎందుల సిద్ధించునో ప్రస్తుత మూహింపజాలము. లౌకిక ప్రభావిభ్రాంతులమయి వారిశక్తియుక్తులే, మానససంచారక్రమములే పరమాత్కృష్యముగ నెంచుచున్నాము. మనసభ్యత, మనవిజ్ఞానము విదేశ విజాతీయ విసభ్యతాప్రవాహములదాడిన బడి కొట్టుకొనిపోవుటకుమాఱుగా వానినన్నింటిని స్వైవశముచేసికొని జేతలను జయించిన గారవ మందియున్నది. ఇట్టి స్థిరజీవి, ఇట్టి మహాసత్త్వసంపన్న, ఇట్టి జగన్మోహనప్రభాసంపూర్ణ యగు

సభ్యత తూలనాడదగినది కాదు. ఒకటి రెండు పురుషాంతరముల పాశ్చాత్య సభ్యతాసంపర్క వికారమున నెడబాయదగినది కాదు. అనేకపురుషాంతరముల సంకల్పసముచ్చయము, ప్రయత్నసమష్టి ఒక దేశచరిత్రను ఏర్పఱచుచున్నది. ఇట్టి చారిత్రపరంపరా సమన్వయమున నొకజాతియొక్క సభ్యతా లక్షణములేర్పడుచున్నవి. అంతియేకాని ఉసుళ్ళవలె క్షణభంగురములు కావు. కాని ధర్మవివేచనమందు కడుజాగరూకతతో, దూరదృష్టితో భూత, వర్తమాన భవిష్యత్పరిజ్ఞానములతో వ్యవహరించవలయునేకాని క్షణికావేశము ననుసరించి యాచరింపగూడదు. భారతీయ మర్యాదలను నిర్మూలన మొనరించు యత్నములన్నియు అనాదరణీయములే. కాని ఇందువలన పురాణ ధర్మములన్నియు సాధువులని దురభిమాన భరితులమయి యుండకూడదు. సంస్కరణాపేక్షయు, నాస్తికవాదములును ధర్మమాధ్యమువలన కలుగునట్లే పూర్వాచారపరాయణత్వము కూడ వార్ధక్యదౌర్బల్యమువలన గలుగుచున్నది. భావప్రకోపము చాంచల్యమువలన గలిగినట్లే ధర్మస్థైర్యముకూడ తదవలంబకుల మాధ్యమువలన గలుగుచుండును. మనవి గదా యను దురభిమానమున మన విజ్ఞానమందలి సమస్తవిషయములను సమానగౌరవముతో ఆదరించ గూడదు; ఆచరించగూడదు. అట్లు చేయుటవలన నవ్యపరిస్థితులలో మనస్థితి యుండనేరదు. కాలశిక్షితములయి నిలిచియున్న ధర్మములలో నెయ్యవి మన భావివికాసమునకును, ఔన్నత్యమునకును, అభివృద్ధికిని దోడ్పడగలవో వానినే స్వీకరించి వాని వెలుగున మన నడవడి నేర్పఱచుకొనుట యుక్తము ; కార్యసాధకము ; అభ్యుదయహేతువు. మనపూర్వుల పురుషార్థమును, లక్ష్యమును గమనించి అందులకు వ్యభిచరణలేకుండ వర్తించిన యెడల గమ్యస్థానమును నిరపాయముగ వ్యక్తిప్రభావముతో చేరగలము. విశ్వాసమే ముఖ్యసాధనము. పవనసంచలిత వారి తరంగభంగములు క్షణభంగురములయి ప్రబలియు సముద్ర గాంభీర్యమును గాని, జలరాశిబలమును గాని జూపనేరవు. జలప్రవాహము అగాధమగు అంతర్వాహినుల ప్రచారము ననుసరించియే నడచునుగాని పిల్లగాడ్పుల యూగింపులనంటి నడువనేరదు. అంతస్సారముగల వృత్తులు, ధర్మములు కాలగర్భమున మునిగి అందున లీన

మయియుండును. సారవిహీనములయినవి యాకలవలె ఎండుటాకులవలె కాలముఖమున కొంతకాలము తేలి మిరమిరలాడి వచ్చిపోయెడి గాలికిని, ఆటంకములకును జిక్కి కొట్టుకొని పోవును. అటులనే మనధర్మములలో సారవంతమగునవి కాలవాహినులలో కలిసి మజల మనయొంట జేరుచున్నవి; మనలను జీవింప జేయుచున్నవి. ఇవియే మన ప్రాణాధారమునకు ముఖ్య హేతువులు. ఇందే మనబలము, తేజము, జీవశక్తియు నున్నవి.

మనగ్రంథకర్త భారతీయ ధర్మములయొక్క పునాదులను బెకలించకుండ కాలవాహినిలో నిలిచియున్న ఆర్యధర్మరసాయనమును సంపూర్ణముగా నుపయోగించుచు ప్రస్తుతకర్తవ్యమును నిరూపింప యత్నించియున్నారు. ఇదియే నాకు మిక్కిలి నచ్చిన విషయము. గతానుగతికముగ పూర్వాచారములను అనుసరించుటలో సజీవజాతీయత లేదను సంగతిని గ్రహించుచు, ఆధర్మములనే, ఆప్రాచీనసంస్కారమునే నవ్యపరిస్థితులకనుకూలమగు రూపమున నాచరింపవలయునని సిద్ధాంతీకరించుచు నెప్పటికప్పుడు నవ్యవైఖరుల దాల్చినను, నూతననాటకము లాడినను ప్రాచీన సభ్యతాప్రవాహ మీప్రయత్నము లన్నింటియందును వెలుగుచుండవలయునని యీగ్రంథకర్త యాశయము. సనాతనధర్మములందు వీరి కేర్పడిన గౌరవాతిశయమును, భావిధర్మవివేచనమందు వీరి కేర్పడిన ఉత్సాహమును చదువరులనెల్లర వారిత్రోవకు దెచ్చునని విశ్వసించుచున్నాడను.

26—8—1929
కలకత్తా

యస్. రాధాకృష్ణ.

## ఆశీర్వాదము

సీ. మానిత మాదర్శ • 'మానవజీవిత'
మనెడు మహాప్రబం•ధార్ణవంబు
నైతికాధ్యాత్మ వి•ద్యాతత్త్వనవరత్న
సంకీర్ణమై విలా•సములఁ దేలు,
ప్రేమతరంగ తే•జోమాలికల విశ్వ
మానవకోటి నే•మాఱు దనిపి,
సహజ సౌందర్య ర•సస్వరూపము హృద
యోపలాళి వగల్చి • యుర్విజనుల,

తే.గీ. భాతి మొనలెత్త భువి వన•వాటి జేసి
ఇష్టఫలరాశి యందుండి • యిచ్చుచుండె
నిట్టిఫలసిద్ధి యెందు ల•భించఁబోదు
యిట్టి దృశ్యంబు నెందు • వీక్షింపరాదు.

సీ. మహితమా యాదర్శ • 'మానవజీవిత'
మన్నిటి కాదర్శమై దనర్చు,
ఇంపు సొంపారెడు • నిరువదినాలుగు
ప్రకరణంబులఁగల • గ్రంథరాజ,
మొక్కొక్క ప్రకరణ • మొక మహాదివ్య ప్ర
పంచమై యలరు ద•ర్శించువారి,
కర్థంబులను గూర్చు • నాపదలను దీర్చు
తోడునీడై తవ • తోడవచ్చు

ఆ.వె. బాల్యమాది వృద్ధ • పర్యంతమగు మహా
వ్యవధిలోన మాన•వాళి గాంచు
ప్రకృతి నాట్యరంగ•పటలి ముందటి తెర
పడెడు వరకు కథల • నడుపుచుండు.

సీ. నయ్యాయికుల కెల్ల • న్యాయశాస్త్రం బిది
యధ్యాత్మచరిత వే•దాంతులకును,

మానవకోటి వి♦జ్ఞానసర్వస్వంబు
నారోగ్యశాస్త్ర మ♦ధ్యాపకులకు,
అర్థార్థు లధిపుల ♦ కర్థశాస్త్రం బిది
వాఙ్మయ చరిత వి♦ద్వాంసులకును,
సంస్కర్తలకు ధర్మ♦శాస్త్రసంగ్రహ మిది
భక్తియోగము మహా♦భక్తులకును

తే. గీ. ఇది మహాసంహితాకృతి ♦ యొసఁగి మెసఁగి
కల్పవృక్షంబు లీల నే♦కాలమందు
వలయు ఫలవృష్టి గురియు భూ♦వలయమునకు
సిద్ధ మాదర్శ 'మానవ ♦ జీవితంబు'.

ఉ. ఒక్కొకనీతి యొక్కొక మ♦హోన్నత శాస్త్రము జాటిచెప్ప నా
ఫక్కినె వాఙ్మయంబు మన ♦ భారతభూమి నలంకరించి పెం
పెక్కెను దీనిలో నిఖిల ♦ వేద పురాణ యథార్థధర్మముల్
లెక్కకు మిక్కిలిన్ గలవు ♦ లీల నరుల్ చరితార్థు లౌటకున్.

సీ. ఘన నవాదర్శ ♦ గ్రంథమండలి కిది
యొక దివ్యసుమము కా♦నున్న దింక,
ఈ సుమ సౌరభ్య ♦ మెందాక ప్రాకునో
యంతదాక పవిత్ర♦మై తనర్చు
ఆ సుధాధారల ♦ నారగ్రోలెడు వార
లజరామరత్వంబు ♦ నందఁగలరు,
ఈ సుమంబు ధరించు ♦ నిందీవరాక్షులు
యుర్విదేవితో నిల్చి♦యుండఁగలరు,

తే. గీ. ఇట్టి సుమవృష్టి గురుపుచు ♦ నెల్లకాల
మాంధ్రభువి దుగ్గిరాల వం♦శాబ్ధిచంద్రుఁ
డైన బలరామకృష్ణయ్య ♦ యలరుగాత!
బౌద్ధవాఙ్మయబ్రహ్మగాఁ ♦ బ్రజ నుతింప.

30-8-1929
పిఠాపురం

ఉమర్ ఆలీషా

|

# తృతీయ సంపుటము



## విషయసూచిక

విషయము | | పుటసంఖ్య

విషయము | పుటసంఖ్య

46 వ ప్రకరణము



47 వ ప్రకరణము



48 వ ప్రకరణము



49 వ ప్రకరణము



50 వ ప్రకరణము

| విషయము | | పుటసంఖ్య |
|---|---|---|
| 57 వ ప్రకరణము | | |
| ధర్మము | .... | 1263-1280 |
| 58 వ ప్రకరణము | | |
| ధృతి (ధైర్యము) | .... | 1281-1296 |
| 59 వ ప్రకరణము | | |
| క్షమ (ఓరిమి) | .... | 1297-1313 |
| 60 వ ప్రకరణము | | |
| దమము | .... | 1314-1327 |
| 61 వ ప్రకరణము | | |
| అస్తేయము | .... | 1328-1341 |
| 62 వ ప్రకరణము | | |
| శౌచము | .... | 1342-1350 |
| 63 వ ప్రకరణము | | |
| ఇంద్రియనిగ్రహము | .... | 13051-1363 |
| 64 వ ప్రకరణము | | |
| ధీ (బుద్ధి) | .... | 1364-1374 |
| 65 వ ప్రకరణము | | |
| విద్య | .... | 1375-1391 |
| 66 వ ప్రకరణము | | |
| సత్యము | .... | 1392-1410 |
| 67 వ ప్రకరణము | | |
| అక్రోధము | .... | 1411-1431 |
| 68 వ ప్రకరణము | | |
| ఉద్బోధనము | .... | 1432 |

# మానవజీవితము

## ముప్పదియేడవ ప్రకరణము

### బ్రహ్మచర్యము

బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యు మపాఘ్నతా,
ఇన్ద్రోహి బ్రహ్మచర్యేణ దేవేభ్య స్స్వర మాలభేత్
—అథర్వవేదము.

"ఋష్యాదులు బ్రహ్మచర్యమను తపముననే మృత్యువును జయించియుండిరి. ఇంద్రాదులుసయితము బ్రహ్మచర్యము వలననే దైవత్వమునకుఁ బ్రాపించియుండిరి."

న తప స్తప ఇత్యాహు ర్బ్రహ్మచర్యం తపోత్తమం,
ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో న తు మానుషః.
—శంకరుఁడు.

"బ్రహ్మచర్యమే (వీర్యధారణము) సర్వోత్కృష్టమగు తపము. దీనిని మించిన తపస్సు ముల్లోకముల మఱొక్కటిలేదు. ఊర్ధ్వరేతుఁడు (అస్ఖలితవీర్యసంపన్నుఁడు) ఈలోకమున మనుష్యరూపమునందున్న దేవతాపురుషుఁడు.

మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్.
—సుశ్రుతము.

"వీర్యముయొక్క బిందుపతనము మరణమును, వీర్యముయొక్క బిందుసంగ్రహము నవ్యజీవనమును గలిగించును."

"ఆచార్యో హి బ్రహ్మచారీ బ్రహ్మచారీ ప్రజాపతిః,
ప్రజాపతి ర్విరాజతి విరా డిన్ద్రో భవే ద్వశీ."

బ్రహ్మచర్యధారణముననే మనుష్యున కాచార్యత్వము సంప్రాప్తమగుచున్నయది. బ్రహ్మచర్యముననే నరుఁడు భూపాలుఁడును నగును. వాఁడే సమస్తమును బాలించి వశమొనరించుకొని యింద్రుఁడగుచున్నాఁడు." (బ్రహ్మచారికిఁ దుల్యుఁడెవఁడని తాత్పర్యము).

"Chastity is life and sensuality is death"

"బ్రహ్మచర్యమే జీవనము. వీర్యనష్టమే మృత్యువు."

ప్రస్తుత బ్రహ్మచర్య ప్రకరణమునకును, గతారోగ్య ప్రకరణమునకును బ్రగాఢమగు నవినాభావసంబంధము కలదు. మానవుని సమస్తధర్మములలో బ్రహ్మచర్యమే యతిప్రశస్తమయినది. ప్రపంచమందలి సమస్త మత గ్రంథములందును విశేషించి, మన హిందూమతశాస్త్ర గ్రంథము లన్నింటను బ్రహ్మచర్యముయొక్క మహిమావిశేషము సంస్తవమొనరింపఁబడినది. ప్రాచీనఋష్యాదులు బ్రహ్మచర్యమహిమను సహస్రముఖంబులఁ గీర్తించి యున్నారు.

బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన ప్రభావముననే భారత వర్ష మొకప్పుడు సకల ప్రపంచమునకు నాయకమణియయి, బలవీర్య తేజములకుఁ బట్టుగొమ్మయయి, జ్ఞానవిజ్ఞాన

సిద్ధాంత రత్నముల సర్వ సర్వంసహా భూమండలమునందు వెదఁజల్లి యుండినది.

నాఁడు మన యీ భరతభూమియందు జనించి విశాల సామ్రాజ్యములఁ బరిపాలించియుండిన ధరణీపతు లనేకులు స్వయముగ భోగభాగ్యములను, దారాపుత్రమిత్రా దులను, మహోన్నత రాజప్రాసాదములను తృణప్రాయముగ విసర్జించివైచి, బ్రహ్మచర్య వ్రతానుష్ఠానమునకుఁ గడంగి, యావజ్జీవిత సుఖయానందపీయూషరసమును గ్రోలి నిర్వాణ పదము నందఁ గలిగియుండిరి.

సంసారతాపత్రయముచేఁ బీడితులయిన మన పూర్వార్యు లెందఱో దుఃఖదాయకములగు విలాసముల విసర్జించి, బ్రహ్మచర్యప్రభావముచే బ్రహ్మానందము ననుభ వించి ధన్యులయిరి. నేఁడు నిర్జీవమయి, జ్ఞానశూన్యమయి తొల్లింటి యౌన్నత్యమును గోల్పోయి దారిద్ర్యగ్రస్తమయి విలాప మొనరించుచున్న భారతవర్షము దేశచారిత్రమునం దే మహాపురుషులను, మహాపతివ్రతలను గౌరవదృష్టితోఁ దిలకించుచున్నదో వారెల్లరు బ్రహ్మచర్య మహాతపఃఫల స్వరూపులేయని వేఱుగ నుడువఁబనిలేదు. నేఁడు యావ త్ప్రపంచమునకు ముఖ్యావలంబనముగనున్న జ్ఞానతత్త్వమును మన పూర్వులు బ్రహ్మచర్యవ్రతానుష్ఠానముననే సులభ ముగ గ్రహించి యుండిరి.

అఖిలభారతవర్షమునకు సంపూజ్యమయి, కావ్యప్రపం చమునకు జ్యోతిస్వరూపమయి, రసమునకు ఖనియయి చెలంగు శ్రీమద్రామాయణమహాకావ్యమును గీర్వాణ

భాషయందు రచించియుండిన ధీరుఁడును, మహాపండితుఁడును, కవిబ్రహ్మయు నగు వాల్మీకి ఋషివరేణ్యుఁ డస్ఖలిత బ్రహ్మచారి. నేఁడు మనచేఁ బంచమవేదముగ సంభావింపఁబడి, హైందవసాహిత్యమునకు వన్నెలఁజిన్నెలఁ బెంచు మహాభారతమును రచించిన వ్యాసమునీంద్రుఁడు బ్రహ్మచర్యమందలి యక్షయసౌఖ్యమును బూర్ణముగఁ జవిఁజూచినవాఁడె.

బ్రహ్మచర్యవ్రతప్రభావముననే కపిలగౌతమాది ఋషులు నేఁటి పండితప్రకాండుల మేధాశక్తిని సయితము పరాభూత మొనరించునట్టి మహత్తరములగు షడ్దర్శనముల విరచించియుండిరి. బ్రహ్మచర్యవ్రతావలంబనముననే శ్రీమదాంజనేయుఁడు దీర్ఘాయుష్మంతుడయి, బుద్ధిమంతుడయి, వినయవిధేయతాసంపన్నుడయి, స్వామిభక్తిపరాయణుఁడయి, విశుద్ధవర్తనుఁడయి మహాబలపరాక్రమసంపన్నులగు రాక్షసవీరులకు సయితము జేయుఁ డయ్యెను.

నేఁటికిని సకలభారతవర్షముచేఁ బూజింపఁబడుచున్న మహాత్ముండగు శంతనపుత్రుఁడు శ్రీభీష్మాచార్యుఁ డస్ఖలిత బాలబ్రహ్మచారి యగుటవలననే చరిత్రప్రసిద్ధుఁడయినాఁడు. బాల్యమాదిగ నొక్క వీర్యబిందువు నయిన వెచ్చింపక యమితబలవీర్యముల సంపాదించి జితేంద్రియుఁడయి బాలబ్రహ్మచారిగ నుండుటవలననే శ్రీశుకయోగి గీర్వాణభాషయందు భాగవతమువంటి భక్తిరసప్రధాన మగు మహాకావ్యమును విరచింప సమర్థుఁడయ్యెను.

నేఁడు సకలజగమునకుఁ దనమతము పేర విశ్వప్రేమ ధర్మముల బోధించుచు, తృష్ణాదినింద్యవృత్తుల బహిష్కరింప

హెచ్చరించుచున్న బౌద్ధమతసంస్థాపకుఁడును, మహానుభావుఁడును నగు శ్రీ గౌతమబుద్ధుఁడు బ్రహ్మచర్యవ్రతమందలి విశేష ప్రయోజనమును గ్రహించినవారిలో నగ్రేసరుఁడు. ఋష్యాదులకును, మునీంద్రులకును, సకల సన్యాసులకును బూజనీయుఁడయిన రాజయోగియగు శ్రీ జనకమహర్షి బ్రహ్మచర్య వ్రతప్రభావ మనంత మని వచించి యున్నాఁడు.

ఎంతకాల మీ భారతవర్షమునందు బ్రహ్మచర్య వ్రతానుష్ఠానగౌరవము స్థిరముగ నెలకొనియుండెనో, అంత వఱకు దేశమం దంతట ననేకులగు మహాపండితులు, కవివరేణ్యులు, చరిత్రకారులు, వివిధశాస్త్రనిష్ణాతలు, బ్రహ్మవేత్తలు, ధర్మావతారులగు సార్వభౌములు, లోకోద్ధరణ క్రియాధురంధరులగు మహాత్ములు, విశ్వకల్యాణస్వరూపిణులగు సతీమణులు, పావనచారిత్రలగు కవయిత్రులు జన్మించి యుండిరి.

బ్రహ్మచర్యభానుఁడు భారతాకాశమండలమునుండి యదృశ్యమయ్యెను. భారతవర్షమునందంతట నవివేకాంధకార పుంజములు దట్టముగ నలమికొనియెను. భారతీయుల సకల సంపద లడుఁగంటెను. జ్ఞానవిజ్ఞానము లంతరించెను. దారిద్ర్యము పెచ్చుపెఱిగెను. బలవీర్యములు నామమాత్రావశిష్టము లయ్యెను. భోగవిలాసములు మితిమీరెను. వ్యాధులు చెలరేగెను. మృత్యువు లధికమయ్యెను. ఇంక భారతవర్షమునం దేమున్నది? దేశము నల్దెసలఁ బీనుఁగు పెంటలతో నిండిపోవుచున్నది. నిరంతర విపత్పరంపరలచేఁ

గలుగు దుఃఖములు మితిమీఱుచుండ, భారతీయభ్రాతలు హాహాకార మొనరించుచున్నారు.

విశ్వమణియనఁజెల్లిన భారతవర్షము నేఁడు వర్ణింప రాని హీనస్థితికిఁ బ్రాపించుటకుఁ బ్రకృతిసిద్ధాంతరాజమగు బ్రహ్మచర్యమును దిరస్కరించుటయే ముఖ్యకారణమని వచింపఁదగును. రాష్ట్రమున కాధారస్వరూపులగు యువకులు నేడజ్ఞానాంధకారమునఁ జిక్కి, యుక్తాయుక్తములఁ దెలియనేరక, బ్రహ్మచర్యప్రభావమును విస్మరించి, భోగవిలాసపరులయి నింద్యజీవితములఁ గడపుచుండు టెంతయు విచారకరము !

వీర్యవంతులును, శక్తిసామర్థ్యసంపన్నులును, జ్ఞానతేజోరాసులును నగు నార్యఋషులసంతతివారమగు మనము వీర్యము నొక నీచపదార్థముగను, విలాసవస్తువుగను భావించి నేఁటికి క్షుద్రకీటకములకంటె హీనులమును, దీనులమును గావలసివచ్చినది. వీర్యమాహాత్మ్యము నెఱింగి సచ్చారిత్రుఁడయి, సన్మార్గానువర్తియయి, జితేంద్రియుఁడయి దేదీప్యమానముగఁ బ్రకాశించియుండిన ప్రాచీనభారతీయయువకునకును, బ్రహ్మచర్యము నొక వ్యర్థక్రియగ భావించి వీర్యమును సంభోగాదినింద్యవృత్తులకు నిరంతరము యథేచ్ఛగ దుర్వ్యయోగ మొనరించుచుఁ గామాంధుఁడయియున్న నేఁటి భారతీయయువకునకును బలమందును, వీర్యమందును, తేజస్సునందును, ధనమందును, మానమందును, జ్ఞానమందును, ఆనందమందును, శాంతియందును, భూమ్యాకాశభేదము గోచరించు చున్నయది.

భారతీయయువకుడా! నీదేహమునకు, నీజీవితమునకు నీసౌఖ్యానందములకు, నీమోక్షమునకు మూలమయిన వీర్యమును నీవొక నీచపదార్థముగఁ జూచుచుంటివేమి? వీర్యమెంత యమూల్యమును, పవిత్రమును నగు పదార్థమయి యున్నదో నీవూహించితివా? వీర్యమువంటి దివ్యపదార్థము శరీరమునం దెట్లు సంచితమగుచున్నదో గ్రహించితివా! సుశ్రుతమున ధన్వంతరిమహాత్ముఁడు వచించియున్న విధమును గనుఁడు.

రంజితా తేజసా త్వాపః శరీరస్థేన దేహినః
అవ్యాపన్నాః ప్రసన్నేన రక్త మిత్యభిధీయతే
రసా ద్రక్తం తతో మాంసం మాంసా న్మేదః ప్రజాయతే
మేదసోఽస్థి తతో మజ్జా మజ్జః శుక్లస్య సంభవః.

—సుశ్రుతము.

"అన్నజలాదిసమ్మేళనమునుండి రసమనుపదార్థమేర్పడుచున్నయది. రసమునుండిరక్తముపుట్టుచున్నయది. రక్తమునుండి మాంసము, మాంసమునుండి క్రొవ్వు, క్రొవ్వునుండి అస్థులు, అస్థులనుండి మజ్జ, మజ్జనుండి వీర్య మేర్పడుచున్నయది."

దేహనిర్మాణమున కావశ్యకమును, సారభూతపదార్థమును నగువీర్యమును దుర్వ్యసనములచే నష్టమొనరింపఁజూచు యువకులారా! నేఁడు మీ రనుభవించుచున్న దుర్భర దారిద్ర్య దుఃఖములు, భయంకర దేహవ్యాధులు, నిరంతరా సంతోష నిరాశాది మానసికరోగములు దేనిచే మీకుఁ దటస్థించుచున్నవో గ్రహించితిరా? ఏనాఁడు మీరు బ్రహ్మచర్యవ్రతపరిజ్ఞానశూన్యులయి ప్రాణమునకుఁ బ్రాణ

మగు వీర్యమును నీరసములును, నింద్యములును నగు భోగములకయి వెచ్చింపనారంభించితిరో నాఁటినుండియే మీస్థితి నికృష్టమయ్యెనని గ్రహింపుఁడు.

అయ్యో! జీవితముయొక్క వికాసదశయందు, మనోహరమగు తరుణప్రాయమందు వెలయుచున్న మీరు భీమసేన హనుమదాది మహాబలాఢ్యులవలె నుండుటకుమాఱు శవాకృతులఁదాల్చియున్నారేమి? అయ్యో! యౌవనకాలమందే మీశరీరములు సువర్ణకాంతిఁ దప్పుచున్నవి. చర్మమంతయు ముడుతలు పడుచున్నది. దంతములా పటుత్వమును దప్పినవి. శిరోజములా పరిపక్వము లయిపోయినవి. నేత్రజ్యోతియా క్షీణించినది. జఠరశక్తియా పూర్తిగనశించినది. శ్రవణములా గురుజనుల నుడువుల నాలింప నసమర్థములయినవి. శరీరమందలి రక్తమాంసాదులు నామమాత్రావశిష్టము లయినవి. ఎముకల నంటియున్న చర్మపుఁదిత్తి కొనయూపిరితో నిండియున్నది. సమగ్ర ప్రపంచమును శాసింప సమర్థుఁడయి యుండిన విజ్ఞానరాశియు, మహాబలాఢ్యుఁడునునగు భారతీయ యువకుఁడు నేఁ డిట్టి దుర్దశగ్రస్తుఁడగుట కేమికారణము? వీర్యనాశనమే యువజనప్రపంచముయొక్క నేఁటి హైన్యస్థితికి ముఖ్యకారణమని నొక్కి వక్కాణింపవలయునా?

దయామయుండగు సర్వేశ్వరునిచే విజ్ఞానమూలమున సర్వము నెఱుంగుట కనువగు దేహయంత్రము మనకుఁ బ్రసాదింపఁబడియుండ నాదేహముయొక్క మహిమ నెఱుంగక యువజనులు మూఢమతులయి, దుర్జనసాంగత్యప్రభావమునను, దుష్టగ్రంథ పఠనంబునను, అశ్లీలదృశ్యావలోకనంబు

నను గామోద్రిక్తులయి దేహపోషక పదార్థమగు వీర్యము ననేక విధముల దుర్వినియోగ మొనరించి భయంకరమృత్యు ముఖమునఁ బడిపోవుచున్నారు.

భారతవర్షము బ్రహ్మచర్య వ్రతపరిపాలనమునుండి విముఖత్వమును వహించినప్పటినుండియే మనదేశము సమస్త విధముల భీషణపతనమునకు గుఱికావలసివచ్చినది. బ్రహ్మ చర్యతిరస్కారము భగవంతుని శాపమువంటి దగుటచే మన మెల్లరము విషయలోలురమయి సర్వనాశనమునకుఁ బ్రాపించి నారము.

మనసౌఖ్యానందములు, తేజస్సు, విద్య, బలము ఆరో గ్యము, సామర్థ్యము, స్వాతంత్ర్యము, ధర్మము వేయేల- మానవ జాతీయోత్తమసంపదలగు సమస్తమును సదా బ్రహ్మచర్యము మీఁదనే యాధారపడి యుండుచుండును. బ్రహ్మచర్యమే మానవప్రపంచారోగ్యమందిరమున కేక మాత్రాధారభూతమగు దృఢస్తంభము. ఆధారభూతమగు స్తంభపతనముచే మందిరము విరిగిపడునట్లు వీర్యనాశనముచే మానవజాతియు శరీరబలారోగ్యప్రాణములఁ గోల్పోవఁ గలదు.

నేఁటియువకులకంటె గతశతాబ్దమందలి యువకులు దృఢగాత్రులై, తేజోవంతులై స్వస్థదేహులై యుండిరి. అంత కుఁదొల్లింటిశతాబ్దమునం దంతకంటె నున్నతస్థితియందుయువ కులుండిరి. పది పదిహేను శతాబ్దములనుండి భారతీయు లవ లంబించియున్న బ్రహ్మచర్యవ్రతోపేక్షాభావమునఁ గ్రమ క్రమముగ మన మనశ్శరీరములకు సంబంధించిన సమస్త

సంపదలు హరింపఁబడినవి. ఈదేశమున యువజనులు విద్యాలయముల నైష్ఠికజీవితమును గూర్చియు, నైతికచారిత్రమును గూర్చియుఁ జదువక, జీవితమందుఁ గేవలాప్రధానములును, వ్యర్థములును నగు పాఠముల వల్లించుటయందుఁ దగుల్కొని యున్నప్పటి నుండియే వారిస్థితి హీనాతిహీనమయినది.

యువకులారా! మీ రేనాఁడు బ్రహ్మచర్యమహిమను గ్రహించి వీర్యసంపాదనమునకు గడంగుదురో, నాఁడే మీరు యథార్థమానవులయి పవిత్రజీవయాత్రచేఁ గలుగు సచ్చిదానంద సౌఖ్యముల ననుభవించి ధన్యులు కాఁగలుగుదురు. వీర్యార్థి నకాలమృత్యువు యెదిరింపఁజాలదు. మహాపురుషులచే విరచింపఁబడిన శాస్త్రగ్రంథము లన్నియు నైక్యకంఠమున వీర్యబిందుసంపాదనమే జీవనమనియు, తద్దుర్వినియోగమే భయంకరమృత్యువనియు సిద్ధాంతీకరించి యున్నవి.

శాస్త్రములయొక్క యీసిద్ధాంతము పరమసత్యము. బ్రహ్మచర్యాభావమున యువకు లేదిశయందును, విజ్ఞానధనులును, సౌఖ్యసంపన్నులును గాఁజాలరు. బ్రహ్మచర్యమే యిహ పరలోక సౌఖ్యసంపాదనమున కేకమాత్రమగు నుత్తమసాధనము. ఇంతయేకాదు. ఇదియే పురుషార్థచతుష్టయప్రాప్తికి ముఖ్యహేతువు; మోక్షోపలబ్ధికిఁ బ్రధానకారణము.

సకలసృష్టి కాధారమయిన వీర్య మమూల్యమయినది. ఇదియే మనుష్యుని దేవతాపురుషు నొనరించును. ఇద్దానిని నిరాదరించు మనుజుఁడు పతితుఁడగు పరమదౌర్భాగ్యచక్రి

వర్తి. బ్రహ్మచర్యవ్రతము నవలంబింపక యేపురుషుఁ డేకాల మందును శ్రేష్ఠపదవి నంది యుండలేదు. ఇంద్రియ దమనము చేతను, కామబహిష్కరణముననను, సంయమనిష్ఠచేతను వీర్యమును సంరక్షింపఁజూడనట్టి భ్రష్టమానవుఁ డెట్లు పవిత్రాత్ముఁడును, ధర్మాత్ముఁడును, మహాత్ముఁడును గానేర్చును? బ్రహ్మచర్యనిష్ఠాశూన్యుఁ డెట్టి జగదేకసార్వభౌముఁ డయినను మృత్యుపద దళితుఁడగుట నిక్కవము.

యువకులారా! మీ రీవిషయముల నన్నింటిని గుర్తించి సమస్తవిద్యలకును, సర్వవైభవములకును, సకలసౌభాగ్యములకును, నిఖిలసౌఖ్యానందములకును బ్రహ్మచర్యమే మూలకారణమని గ్రహింపుఁడు. విశ్వసింపుఁడు. హృదయపూర్వకముగా సన్మానింపుఁడు. బ్రహ్మచర్యమే మనుజునకు శ్రేష్ఠత్వమును, స్వాతంత్ర్యమును, సమగ్రాభ్యుదయమును, నీతిధర్మజ్ఞానములను బ్రసాదించి యుద్ధరించు తారకమంత్రము. సకలార్థసిద్ధుల కిదియే దివ్యసాధనము. బ్రహ్మచర్యమునకు సదా జయమగు గాక!



# ముప్పదియెనిమిదవ ప్రకరణము



## అష్ట మైథునములు

పరమపవిత్రమగు బ్రహ్మచర్యవ్రతమును భంగ మొనరించి, జీవశక్తి రూపమగు వీర్యమును దుర్వినియోగపఱచుటకు మానవుఁ డవలంబించు కృత్రిమసాధనము లెన్నియో కలవు. అట్టి దుష్టసాధనములలో ముఖ్యములయినవి అష్ట మైథునములు. ఈ యెనిమిదివిధములుగ నున్న మైథునములచే మానవజీవిత మెటు లధఃపతితమయి పోవుచున్నదియు విచారించుటయే ప్రస్తుత ధర్మము.

> "స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం
> సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవ చ
> ఏత న్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః
> విపరీతం బ్రహ్మచర్య మేతదేవాష్టలక్షణం."

మనశాస్త్రము లీ స్మరణకీర్తనాద్యష్టవిధములగు చిత్తముయొక్క దుష్ప్రవృత్తులే వీర్యనష్టమునకు ముఖ్యకారణము లగుచున్నవని యెలుఁగెత్తి చాటుచున్నవి. ఈయష్ట మైథునములఁగూర్చి యొకింత ముచ్చటించుట సమంజసము.

1. ఏస్థానమందయిన విలోకించియున్నట్టియు, పఠించియున్నట్టియు, ఆకర్ణించి యున్నట్టియు, చిత్రపటముల దర్శించియున్నట్టియు స్త్రీని ధ్యానించుట, చింతించుట, స్మరించుట ప్రథమమైథున లక్షణములు.

2. స్త్రీలయొక్క రూపగుణాంగప్రత్యంగముల వర్ణించుట, అశ్లీలభావయుక్తములగు శృంగార గీతములను, జావళీలను, కామరస సంక్షుభితములగు పాటలను బాడుట, దుష్ప్రసంగము లొనరించుట ద్వితీయ మైథున లక్షణములు.

3. పడంతులతోడి సరససల్లాపములు, క్రీడావినోదములు తృతీయమైథునలక్షణములు.

4. రమణీమణుల వైపునకు గ్రీవమునెత్తి పాపపూరితములును, కలుషితములును నగు నింద్యదృక్కులతోఁ జోరుని పగిది వీక్షించుట మొదలగునవే చతుర్థమైథున లక్షణములు.

5. సదా స్త్రీసంఘమునఁ బ్రవేశించుచు వచ్చుచునుండుట, స్త్రీలతో నేకాంతముగ విహరించుట, భాషించుట మున్నగునవే పంచమమైథున లక్షణములు.

6 అశ్లీలశృంగార రసపూర్ణములగు కథలను, కామవిషయప్రధానములగు నవలలను బఠించుట, దిగంబరావస్థలోనున్నస్త్రీల యవినీతికరములగు చిత్రపటముల నాసక్తితో విలోకించుట, నాటకములయొక్కయు, సినీమాలయొక్కయు, వేశ్యానృత్య గానాభినయములయొక్కయుఁ గామ భావప్రపూర్ణములగు దృశ్యములను గాంచి యట్టి దుష్టకల్పనలయందు సంపూర్ణముగా నిమగ్నమగుట షష్ఠమైథున లక్షణములు.

7. అలభ్యయు, పరసతియు నగు స్త్రీని బడయుటకుఁ బాపపూర్ణమగు రాక్షసప్రయత్న మొనరించుట సప్తమ మైథున లక్షణము.

8. ప్రత్యక్షస్త్రీ సంభోగము అష్టమమైథున లక్షణము.

ఈ యష్టమైథునములు నీతివిరుద్ధములును, నింద్యము లును నగుటచే సత్వరత్యాజ్యము లయియున్నవి. ఈ దుష్ట లక్షణములకువిరుద్ధములగుసల్లక్షణములచేఁగల్పింపఁబడినదే యఖండ బ్రహ్మచర్యము. ఆదర్శబ్రహ్మచర్య మేవిధమగు సామాన్యమైథునమునకు సమ్మతింపఁ జాలదు. మానవుని నైతికజీవితపతనమునకును, ఇంద్రియదాస్యమునకును నీ యష్ట మైథునములే మూలకారణము లగుచున్నవనియు, భారతీయ యువకులెల్ల రిట్టి భయంకరములగు దుష్టవృత్తుల నిగ్రహించిప నిదే భారతజాతి కిహపరములు లేవనియు గాంధి మొదలగు మహాత్ము లనేకులు ఘోషించుచున్నారు.

వాస్వానీపండితుఁడు సకలప్రపంచసంచార మొనరిం చుచు బాహ్యసృష్టికి సామాన్యములుగఁ గానఁగు నీయష్ట మైథునములే మానవచారిత్రవృక్షమునకు వేరు పురుగులయి చేవ యను వీర్యమును బిప్పిఁజేసివేయుచున్నవనియు, వీని దుస్సాంగత్యమునుండి యెల్లవిధములయువకులు విముక్తిఁనంది నఁగాని బ్రహ్మచర్యదివాకరుఁడు విశ్వమునం దుదయించి మానవలోకమునకు సౌఖ్యానందముల ప్రసాదింపఁజాలఁ డనియు సకలప్రపంచ యువజనసమితికి గొంతెత్తి యుద్బో ధించుచున్నాఁడు.

శరీరారోగ్య బలవీర్యముల సంరక్షించుకొని సుఖింప నభిలషించు యువకు లష్టమైథునముల భయంకరప్రవంచనల నుండి సావధానులయి యుండుట శ్రేయస్కరము.



# ముప్పదితొమ్మిదవ ప్రకరణము



## మాతాపితాచార్యుల కర్తవ్యము

తే.గీ॥ బాగుగాఁ దమసుతులఁ గా♦పాడనట్టి
వారు లోకంబులోఁ బశు♦ప్రాయు లెపుడు
విద్యయును బుద్ధి చెప్పించి ♦ పెంచువారి
యెడఁ గృతజ్ఞులై బాలురు ♦ నడువవలదె ?

—నీతిదీపిక.

నేఁడు ప్రపంచధర్మములన్నియు నించుమించుగఁ దారుమాఱయినవి. ప్రపంచమం దీశ్వరత్వముప శేషభాగము లోపించిపోవ నహంబ్రహ్మత్వము స్వాధికారమును సుస్థాపిత మొనరించుకొనుచున్నయది. ప్రాణికోటిలోకెల్ల నుత్కృష్టజీవి యగు మానవుఁడు స్వధర్మానుష్ఠానమునుండి విముఖుఁడయినాఁడు. ఇటనుండియే విశ్వముయొక్క యవనతి ప్రారంభమైనది. నేఁడు మానవుని ధర్మానుష్ఠాన పరతంత్రబుద్ధిని బశువుల ధర్మపురస్సరమగు నైష్ఠికజీవితవిధానము గేలిసేయుచున్నది. ఏనాఁడు మానవుఁడు సచ్చిదానందస్వరూపమగు ధర్మముయొక్క విశాలమగు మహిమను విస్మరించెనో నాఁడే పిత పితృధర్మమును, మాత మాతృధర్మమును, ఆచార్యుఁ డాచార్యధర్మమును, మఱి యితరులు తమతమ ధర్మములను మఱచిపుచ్చినారు.

నేఁ డీ విశ్వమునం దాదర్శమాతాపితాచార్యులు కడు స్వల్పముగఁ గాననగుచున్నారు. విజ్ఞానఖనియగు భారతవర్ష

మునం దాదర్శమాతాపితాచార్యులసంఖ్య నేఁడు వ్రేళ్ళపై లెక్కింపఁబడునట్టి దుస్థితికిఁ బ్రాపించుట కెంతయు దేశహితాభిలాషులు విచారింపవలసియున్నది. నేఁటి జననీజనకులు కామాతురులయి సంగమింపఁ గలుగు సంతానముయొక్క కుక్షింభరణభారమును వహించుచున్నారలేకాని వారి ప్రశస్తమగు నిహపరజీవితనిర్మాణమునకుఁ దోడ్పడకుండు టెంతయు శోచనీయము! సంతానమునకు మాతాపితలకుఁ బిదప సంపూజ్యుఁడగు నాచార్యుఁడును గృహావిద్యాపీఠమున సుశిక్షితులుకాని బిడ్డల జ్ఞానప్రబోధముచే నుద్ధరించు బాధ్యతను వహింపకున్నాఁడు. దేవతాతుల్యులుగ నారాధింపఁబడఁ దగిన జననీజనకాచార్యులే స్వార్థాంధులయి, అజ్ఞానులయి, సంతానాభ్యుదయమున కయి కృషిసలుపకుండు టెంతయుఁ జింత్యము!

మాతాపితలలో నొకరుగాని, ఇరువురునుగాని లేక యాచార్యుఁ డొక్కఁడేగాని బాలబాలికల నడవడినిగూర్చి మిక్కిలి శ్రద్ధవహించుచు, సదుపదేశములచే వారి చిత్తముల దురభ్యాసములనుండి మరలించి, సదభ్యాసములఁ సంలగ్నమొనరించుచున్నచో బాలబాలిక లెంతయు నుద్ధరింపఁబడి బుద్ధివివేక సంపన్నులయి, సదాచారయుక్తులయి, సచ్చరిత్రులయి తరుణప్రాయమందు దుర్వ్యసనములకుఁ బాల్పడక యుందురు. బాల్యమందే బిడ్డలహితమును గూర్చి తగు శ్రద్ధవహింపనపుడు వారవశ్యము దూషితవర్తను లగుదురనుట నిస్సంశయము.



# నలుబదవ ప్రకరణము



## బ్రహ్మచర్యము — విద్యార్థి

తే॥గీ॥ బలము నార్జింప సుగుణసం ♦ పద గడింప
భక్తి మదిఁ బెంపఁ బరము నీ ♦ శ్వరు భజింప
గురుల సేవింప విద్యల ♦ నెఱిఁ బఠింప
బ్రహ్మచర్యంబు వహియింప ♦ వలయుఁ బుత్ర!
—ప్రబోధశతకము.

విశ్వమందు జడముకంటెఁ జేతనమే శ్రేష్ఠమైనది. జడమునం దెట్టి శ్రేష్ఠలక్షణములును గానరావు. జడమును లోకోపయోగకరమే యయినను, చేతన మంతకంటె సహస్రగుణము లధికముగ లోకకల్యాణమొనఁగూర్ప సమర్థమయి యున్నది. చేతనము విలక్షణ లక్షణ లక్షితమయి మానవ హృదయాంతరాళమున విస్మయతరంగపరంపరల నుదయింపఁ జేయుచుండును. చైతన్యమయజీవితము సర్వేశ్వరుని యతుల నీయ శక్తిసామర్థ్యములఁ దెలియుటకు సజీవమగు దృష్టాంతముగ నున్నది.

విజ్ఞానసంపన్నమగు మానవజీవితము బ్రహ్మాండకావ్యముయొక్క చేతనజీవిత ప్రకరణములలోనికెల్ల ముఖ్యమయినది. మనుష్యజీవితమందు విద్యార్థిజీవితము యెన్నఁదగినది. విద్యార్థి జీవితనిర్మాణమునకు బ్రహ్మచర్యము

మూలము. బ్రహ్మచర్యాశ్రమమందుండి విద్యనభ్యసించు యువకుని జీవిత మెంత బ్రహ్మానందసంధాయకమో వర్ణింప శక్యముకాదు.

విద్యాసంపాదనమునకును, బ్రహ్మచర్యమునకును దేహాత్మలకు, సూర్యచంద్రులకు, క్షీరనీరములకు, వాగర్థములకు, సుమనసుగంధములకు, చంద్రచంద్రికలకుఁ గల యవినాభావసంబంధమే కలదు. బ్రహ్మచర్యములేని స్థానమందు విద్యయు, విద్యలేనిస్థానమందు బ్రహ్మచర్యము నుండనేరవు. నేఁటి ఛాత్రులు బ్రహ్మచర్యమునకును, విద్యాభ్యాసనమునకును నేవిధమగు సంబంధము లేదనియే భావించుచున్నారు.

నిశ్చయముగ నేఁడు విద్యార్థులనఁబడు యువకులు బ్రహ్మచర్యవ్రతదీక్ష నేరీతిఁ బరిత్యజించియున్నారో, అదియే విధముగ యథార్థమగు విద్యను సయితము బహిష్కరించివైచినారు. సద్విద్య బ్రహ్మచర్య ముత్తమమానవజీవితమున కెంతయావశ్యకమయి యున్నదో బోధించుచుండును. నేఁటి కేవల భాషాప్రధానమగు సద్విద్య ఛాత్రునకు బ్రహ్మచర్యమునుగూర్చి బోధించుటయే తనధర్మముగ భావించుచుండుట లేదు.

నేఁడు దేశదేశముల విద్యార్థులు నమూల్యమగు తమ జీవితకాలమును వ్యర్థమొనరించుకొనుచున్నారు. విద్యార్థిదశయందుండియే వివాహమాడిన యువకులు నేఁడు గృహస్థోచితమగు ఋతుసంగమముచే బ్రహ్మచర్యవ్రతమును గౌరవింపకున్నారు. ఆదర్శగుణగణాలంకృతుఁడయి వెలుఁగవలసిన భారతీయవిద్యార్థి నేఁడు సుగంధద్రవ్యముల

శరీరమునందంతట నలదికొనియున్నను, పీతాంబరముల ధరించి యున్నను నిర్వీర్యుఁ డగుటచేఁ బరిపక్వశిరోజములను, దృష్టి మాంద్యమును, వక్రకటిసీమను, నిర్జీవముఖమును, దుర్బల శరీరమును, శుష్కకపోలములను గలిగి దుర్బలుఁడయి, నిస్తేజుఁడయి మూర్తీభవించిన దుఃఖమువలెను, కేంద్రీకృత మయిన వ్యాధి వలెను, సాక్షాత్కరించిన దాస్యమువలెను గానవగుచున్నాఁడు.

అయ్యో! బ్రహ్మవరప్రసూతుఁ డనఁదగు భారతీయ విద్యార్థి నేఁడిట్లు పతితుఁడయి తన యావజ్జీవితమును దుఃఖ భయసంతాపవ్యాధులమధ్యఁ గడపుచున్నాఁ డేమి? బ్రహ్మ చర్యవ్రతతిరస్కారమే భారతీయవిద్యార్థి నిట్టి యధోగతికిఁ బాల్పడఁ జేసినది. ఇరువది సంవత్సరముల ప్రాయమునకుఁ దొలుతనే భారతీయవిద్యార్థి కామాగ్నికిఁ దన బలవీర్యముల నింధనములుగ నొసంగి వృద్ధుఁడయి పోవుచున్నాఁడు.

విద్యాబుద్ధుల సంపాదించి నిజజ్ఞానరత్నముచే మానవ లోకమును దేదీప్యమానముగఁ గావింపవలసిన విద్యార్థి దుర్బుద్ధి యుతుఁడయి, విషయదాస్యమున కొడఁబడి, రోగ గ్రస్తుఁడయి బంధుబాంధవుల దుఃఖవారిధిని ముంచి యక స్మాత్తుగా నకాల మృత్యువును సందర్శించుచున్నాఁడు. ప్రస్తుతము విద్యార్థిసంఘమును దహించివేయుచున్నది ప్రచండమగు కామాగ్నియే. రాష్ట్రోద్ధారకులు కావలసిన విద్యార్థు లెందఱో బ్రహ్మచర్యవ్రతపరిజ్ఞానశూన్యు లగు టచేఁ దమ పవిత్రములగు జీవితముల విషయాగ్నిచే బుగ్గిఁ గావించుకొనుచున్నారు. నేఁడు విద్యార్థిప్రపంచమందు

సంయమము, న్యాయము, ప్రకృతిశాసనానుసరణశక్తి, స్వాస్థ్యము మున్నగు సద్గుణములు నామమాత్రావశిష్టము లయినవి.

మనుష్యసంఘ మందిరమునకుఁ బ్రధానాధార స్తంభ స్వరూపులయిన విద్యార్థులు బ్రహ్మచర్యవ్రతమును విడనా డుటచే సమస్తవిధముల భ్రష్టులయిపోయినారు. నేఁటివిద్యార్థి జీవితము బహుసంకటగ్రస్తమయి యున్నది. నిరంతరదుఃఖ విచారములచే వాని జీవితము, ఆయువు, ఆనందము, ఉత్సా హము నానాఁట క్షీణించిపోవుచున్నవి. ఆత్మబలవిశ్వాస ములు వాని జీవితవేదముయొక్క యే యధ్యాయమందలి పుటలను ద్రిప్పి చూచినను గానరాకున్నవి.

ఉదరపోషణమే తన కసాధ్యమగు కార్యమని భావించు నంతటి యధమస్థితిని ఛాత్రజీవితము వరించినది. పరమార్థ మెట్టిదో, ఆముష్మికధర్మము లెవ్వియో, వాని ననుష్ఠించు టెటులో నేఁటి మన విద్యార్థి గుర్తింపజాలకున్నాఁడు. వాని హృదయము ప్రాపంచికములగు నశ్వరసౌఖ్యములఁ జవిఁ జూచుటకయి సదా యాతురపడుచుండఁగలదు. నేఁటి విద్యార్థి జీవితమున సమస్తములగు విషయవాసనలు మూర్తీ భవించి యున్నవి. నేఁడు విద్యార్థి బ్రహ్మచర్యమును గౌణధర్మముగ భావించుటచే దినక్రమమునఁ దన యాదర్శ స్థానమునుండి పతితుఁడై పోయినాఁడు.

నిరంతరదారిద్ర్యమే వాని సంపత్తి కావలసివచ్చినది. వాని జీవితలక్ష్యభానుఁడు ప్రమాదమేఘములచేఁ గప్పఁ బడి పోవుచున్నాఁడు. నేఁటి విద్యార్థి విశ్వమునందుఁగల

యంధునికంటె, పంగునికంటె, మూకునికంటె, బధిరునికంటె, వృద్ధునికంటె, రోగగ్రస్తునికంటె, అనాథస్త్రీకంటె, పసిపాపకంటె మిక్కిలి కనికరింపఁదగిన హీనస్థితియం దున్నాఁడు. విద్యార్థియొక్క యిట్టి హైన్యమునకు ముఖ్య కారణము వాని కాదర్శ మాతాపితలు లేరు. ఆదర్శాచార్యుఁ డా వాలుకిక్క. ఆదర్శవిద్యాలయమా స్వప్నమందలి సంపదవలె నలీకము.

ఉత్తమసాంగత్యము దుర్లభమయినది. ఆత్మజ్ఞానము, స్వాయంకృషి, చరిత్రపరిశోధనము నేఁటివిద్యార్థికిఁ గంటక తుల్యములయినవి. కామభావములు విద్యార్థియొక్క చిత్త సీమయం దంకురించి యనుదినము వానిని బ్రహ్మచర్యమునకును, ప్రకృతికిని విరోధుని గావించివేయుచున్నవి. సత్యమును వానిచే నుల్లంఘింపఁజేయుచున్నవి. ధర్మము నతిక్రమంపఁజేసి వేయుచున్నవి. వేయేల? విద్యార్థియొక్క జీవితమే శలభంబుమాడ్కి విషయదీపాగ్నియందుఁ బడి భస్మమయిపోవుచున్నది.

నేఁటి భారతీయ విద్యార్థిజీవితమును వర్ణింపఁబూను ప్రతికవీంద్రుని హస్తమందలి లేఖని కంపించితీరును. బ్రహ్మచర్యవ్రతమునుండి దూరముగ నుండుటవలననే నేఁటివిద్యార్థులజీవితములు దుర్వ్యసనములకును, దుర్వ్యాపారములకును, విషయవాసనలకును, విలాసములకును, బాహ్యాడంబరములకును, ద్వేషమాత్సర్యములకును, కామక్రోధములకును బట్టుగొమ్మలగుచున్నవి. ఇట్టి నానావిధములగు దుర్గుణపుంజములచే నిండియున్న విద్యార్థు లెట్లు విద్యోపార్జనమొనరింపఁ జరితార్థులు కాఁగలరో యూహింప శక్యము గాకున్నయది.

"ఆలస్యం మదమోహౌ చ చాపలం గోష్ఠి రేవ చ
స్తబ్ధతా చాభిమానిత్వం తథా త్యాగిత్వ మేవ చ
ఏతే వై సప్తదోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః"

—మహాభారతము

"సోమరితనము, మదము, మోహము, చపలత్వము, వ్యర్థప్రసంగము, వృథాభిమానము, త్యాగశూన్యత యను నీ యేడును విద్యార్థులందుఁ గలుగుదోషములు. ఈదోషములు గలవారికి విద్య లభింపనేరదు."

మహాభారతము వచించినరీతి భయంకరములగు నీదుర్గుణములన్నియు నేఁటి విద్యార్థిజీవితమున మూర్తీభవించి వానినుత్తమ విద్యోపార్జనమునుండి వంచించుచున్నవి. ఇదియే కారణముగ భాషాపరిజ్ఞానము, వృత్తిమూలకమగు విద్య నేఁటి మానవసంఘమందు విశేషముగాఁ గానసగుచున్నదే కాని, ఆత్మ సంస్కరణమున కావశ్యకమగు విద్య నేఁడు విద్యార్థులందుఁగాని, గురుజనులందుఁగాని గోచరింపకున్నయది.

ఏనాఁడు భారతీయవిద్యార్థి యైహికాముష్మికజీవిత సౌఖ్యప్రదాయకమగు బ్రహ్మచర్యమును, బ్రహ్మవిద్యను బరిత్యజించెనో, నాఁటినుండియే విద్యార్థిలోక మధోగతి పాలయినది. పతితంబును, శోకపూర్ణమును నగు విద్యార్థి జీవితమును గాంచి దుఃఖింపని భారతీయుఁ డెవఁ డుండును?

జగదీశ్వరా! తిరిగి నీవు మా భారతీయవిద్యార్థి లోకమునకు బ్రహ్మచర్యవ్రతపాలనమున కావశ్యకములగు సౌమ్యభావములను సౌజన్యమును, సాధువర్తనమును, శిష్ట

చారిత్రమును, ఉన్నతాశయములను, ఉత్తమవివేకమును, సుయమశక్తిని, నిస్సంగత్వమును ప్రసాదించుము.

భారతీయవిద్యార్థులారా! ఒకప్పు డీ భారతవర్షమున ఛాత్రులు బ్రహ్మచర్యాశ్రమమం దుండి, గురుకులవాసులయి, మిథ్యాభిమానమును బాసి "భవతి భిక్షాం దేహి" "తల్లీ! భిక్షఁ బెట్టుము" అని యాచించుచు మాధుకర వృత్తిచే నుదరమును బోషించుకొనుచు బలవీర్య తేజస్సంపన్నులయి మహాత్ముల చెంతనుండి సర్వోత్కృష్టమగు విద్యనార్జించుచున్నపుడు విదేశీయులు, విజాతీయులు, ఈర్ష్యాద్వేషమయులు మన భరతమాత వైపునకుఁ గన్నెత్తిచూడఁ గలిగియుండిరా?

నాఁడు మనస్వాత్వముల, జన్మహక్కుల, సంపదల, విద్యావైభవముల, జ్ఞానవిజ్ఞానముల, మానాభిమానముల హరించుట కెవఁడేని సాహసింపఁ గలిగియుండెనా? ఆ గురుకులవాససంప్రాప్తమగు విద్యోపాసనాయుగమున మనల గాసాధములవలె, బానిసీంద్రచందమున నీచమానవులుగఁ బగణింప మనల సృజించిన బ్రహ్మకేని తరమయియుండెనా? లేదు, లేదు. కారణమేమి?

నాఁడు మనము—భారతీయవిద్యార్థులమగు మనము బ్రహ్మచారులము, తేజస్సంపన్నులము, సచ్చారిత్రులము, త్మబలవిరాజితులము, వజ్రసమదేహులము, సమస్తశాస్త్రల కజేయులము. నేఁడో - విద్యావిహీనులము, భీరువులము, ర్భదరిద్రులము, నిరాశాపీడితులము కావుననే మన లక్ష్మీరస్వతులు మన దేవాలయములనుండి యంతర్ధానము లయి

పోయినవి. మనయొద్ద నుత్తమవిద్య లేదు. భూరిధనమా హాళశక్తి.

విద్యార్థులారా! లెండు! సత్వరము మేల్కొనుఁడు! అజ్ఞానారణ్యమునుండి, విషయవాసనాంబుధినుండి, నిరాశా పర్వతభారము క్రిందనుండి వెడలిరండు! సమస్తలోకరక్షా దక్షమగు బ్రహ్మచర్యవ్రతమును బూనుఁడు! మి మావ హించియున్న సమస్తదారిద్ర్యముల రూపుమాపుటకు బ్రహ్మచర్యమే బ్రహ్మాస్త్ర మను ప్రబలవిశ్వాసమును మీ యంతరంగముల సుస్థాపిత మొనరింపుఁడు. విషయాదుల దృఢతరపాశములఁ ద్రెంచివేయుఁడు!

మీ హితాహితములు మీమీఁదనే యాధారపడి యున్నవి. మీ పూర్వవైభవమును సులభముగా సంపాదింపఁ గలశక్తి మీయందే నెలకొనియున్నది. బ్రహ్మచర్య మను మణిని మఱచి సకలవిశ్వమందలి విద్యార్థు లెల్లగు విలాస ములను, శిలాఖండముల నన్వేషించుచున్నారు. భూమ్యా కాశములఁ బ్రతిధ్వనింపఁ జేయుచున్న కరుణాక్రందనధ్వను లన్నియు బ్రహ్మచర్య వ్రతభంగ పరిణామములే య గుర్తింపఁదగును.

విద్యార్థులారా! మీరు ప్రమత్తులయియుండి నిగ్రహ మాచరణసాధ్యము కాదని సందేహింపకుఁడు. "who sleep his fortune sleeps." మీ రెట్లు ప్రగాఢమగు వ్యామోహ నిద్రయందు మునింగియున్నారో, అదియేచందమున మీ యదృష్టములును నిద్రించుచునే యున్నవి. సాధుత్వము నభ్యసించి, సంయమమును బాలించి, దేహబుద్ధిని వీడి

యాత్మబుద్ధిని సంపాదింపుఁడు. ఆడంబరములను, పటాటోపములను ప్రేమించుట వలననే విలాసపిశాచములు మీ జీవితములఁ గబళించివేయుచున్నవి.

"Simpleness is itself greatness. Simplicity is beauty." సరళత్వమే సౌందర్య మని గ్రహించి సాధుజీవితయాత్రను గడపుచు మీరు బ్రహ్మచారులయి, కర్మయోగులయి, వీర్యరక్షకులయి సాత్త్వికాభీష్టముల నెల్ల సిద్ధింపఁజేసికొనుచు సుఖింపుఁడు శుభమస్తు.



# నలుబదియొకటవ ప్రకరణము

## బ్రహ్మచర్యము——ఇంద్రియములు

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"
"మానసమే మనుష్యుని బంధమోక్షములకుఁ గారణము".

"It is mind that makes good or ill
That maketh wretch or happy, rich or poor."
—Spencer.

"మంచిచెడుగులను, సౌఖ్యాసౌఖ్యములను సౌభాగ్య దుర్భాగ్యములను గల్పించునది మానసమే."
——స్పెన్సరు.

ఈ దృశ్యప్రపంచము వింతఁగొలుపు తళుకుబెళుకులతో నొప్పుచున్నది. ఇద్దాని ప్రతియణువు యాకర్షణ శక్తియుత మయినది. మానవుని జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియ ములు సదా యీ విశ్వరామణీయకమును విలోకించి ముగ్ధము లగుచుండును. మానవుని సకలేంద్రియములలో మానసము ప్రధానమయినది. ఇద్దాని యభిప్రాయముతోఁ దదితరేంద్రి యము లన్నియు నేకీభవించినపుడే భావానుభవము కలుగు చుండును.

ఒక మనోహరమగు దృశ్యమును దలవని తలంపుగా నేత్ర మవలోకించును. కేవల మవలోకించుటయే నేత్రము

యొక్క విధి. మనస్సుతో నేత్రముయొక్క వృత్తి మేళగింప నిచో నేత్రముయొక్క ప్రయోజనమే లేకుండఁబోవును. మానవుని సమస్తేంద్రియములు మానసముచేతను, మానసము సమస్తేంద్రియములవలనను సార్థకము లగుచున్న వని నుడువవచ్చును.

నేత్ర మొక సుందరవస్తువును వీక్షించిన మనస్సున కాహ్లాదము కలుగును. మానస మూహించినఁగాని నేత్ర మొకపదార్థము నవలోకింపఁ గడంగదు. మర్కటస్వభావము గల మానసము సదా వివిధేంద్రియప్రవృత్తులతో నేకీభవించుచు భిన్నములగు పరిణామముల ననుభవించుచుండును. మానసముయొక్క స్వభావచాంచల్యము నణఁచి యద్దాని చపలంబగు గతిని నిరోధించు మానవుని జీవితమే సార్థకమయినది. మానవజీవితమును బహుళదుఃఖమయం బొనరించు చపలమగు మానసమునకు స్థిరత్వమును బ్రసాదింపఁ గల దివ్యసాధనము పవిత్రమగు బ్రహ్మచర్యము.

మానసమును యథేచ్ఛగా సంచరింపనిచ్చినకొలఁది యు, సమస్తేంద్రియములు చంచలములై జీవితము ననియమిత మొనరించి భ్రష్టత్వమునకుఁ బాల్పడజేయును. ఇంద్రియము లుచ్ఛృంఖలములయి యుండరాదు.

రథమునఁ బూన్పఁబడిన మదోన్మత్తములగు నశ్వముల వశము గావించుకొనువాఁడే చతురుఁడగు సారథిగ నెన్నఁబడు చందముననే యౌవనమందుఁ గడు చపలములగు నింద్రియముల స్వాధీనమొనరించుకొను వ్యక్తియే వీరుఁడు; ధీరుఁడు. వేలకొలఁది శత్రువులపై విజయమును సంపాదించు

వాని కంటెను, సమరక్షేత్రమున యోధానుయోధుల ననేకుల సంహారమొనరించువానికంటె స్త్రీయేంద్రియములపై నాధిపత్యము వహించువాఁడే శ్రేష్ఠుఁడగు వీరవరేణ్యుఁడని శ్రీ బుద్ధాది మహాపురుషులు వచించియున్నారు.

ఇంద్రియముల విచ్చలవిడిగా సంచరింపనీయక తగు కట్టుబాటులో నుంచుట మనుష్యున కసాధ్యమగు కార్యము కాదు. "పురుషస్య ప్రయత్నశీలస్య అసాధ్యం నాస్తి" యనునట్లు ప్రయత్నముచేఁ బ్రతియువకుఁడును బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించి తన్మూలమున సకలేంద్రియముల చంచలత్వమును రూపుమాపి ధన్యుఁడు కావచ్చును.

బ్రహ్మచర్యము నొక పరిశుద్ధమగు భగవత్కార్యముగ భావించి దాని నాచరింపఁ గడంగుటచే నింద్రియములు తమంతటనే మనుష్యునకు స్వాధీనము లయిపోవుచున్నవి. విద్యార్థులారా! మీరొకవేళ దుస్సాంగత్యముచేఁ జారిత్ర బలమును, ఆత్మబలమును గోల్పోయియున్నవార లగుచో, మీ రింద్రియదాసులయి యున్నచో మోక్షము నశించెఁ గదాయని విచారపడ నవసరము లేదు.

విలాసముల కొక నమస్కారముఁ జేసి తత్క్షణమే బ్రహ్మచర్యమును శరణుఁజొచ్చిన మీ రింద్రియదాస్యాంధకారము నుండి సత్వర విమోచనము నందఁగలరు. 'గతం న శోచ్యం' అన్నటుల గతించినదానికయి విచారింపక మీ రిప్పటినుండి యయిన నింద్రియదాస్యమును విసర్జింపుడు. మలినవస్త్రము శుద్ధజలప్రక్షాళనముచే నిర్మలమగు చందమున నింద్రి

యాదుల దుర్వ్యసనములచే దూషితమయిన మానసము బ్రహ్మచర్య వ్రతస్వీకారమునఁ బవిత్రము కాఁగలదు.

ఈ పుణ్యకార్యమునకు సక్రమనియమపాలనశక్తి సత్వరోపార్జనీయము. సమస్తేంద్రియముల కధిపతియగు మానసము పరిశుద్ధమగునేని యుద్యాది మాతాపితాచార్య బంధు బాంధవులకంటె విశేషోపకారమును గలిగింపఁగలదు. మానసమే మనుష్యుల బంధ విమోచనములకు హేతువను నుపనిషద్వాక్యము గౌరవార్హమయినది.

మానసమే మానవుని యున్నతికిని, అవనతికిని, ముఖ్యకారణము. సుఖదుఃఖములును మనస్సువలననే కలుగుచున్నవి. ఈ విషయమును గూర్చి ప్రాక్పశ్చిమఖండములందలి ప్రాజ్ఞులెల్ల రేకాభిప్రాయులయి యున్నారు. కాన విద్యార్థులెల్లరు బ్రహ్మచర్యవ్రతపాలనముచే మానసేంద్రియ వశీకరణ ప్రయత్నమున విజయమును బడయుదురు గాక! మానసముకంటె నీ భువియందు మనల మోసగించు టక్కరి మఱొకఁడు లేడు.

విద్యార్థులు టక్కరితనమునఁ గడు దిట్టయగు మానసముయొక్క విశ్వాసశూన్యములగు నుడువుల నన్నింటి విశ్వసింపరాదు. స్వాధీనమయిన మనస్సు బాలుని హస్తమందలి వెన్నముద్దవంటి మృదుమధురభావ పీయూషము నొసంగును. పరాధీనమగు చిత్తము విషప్రాయములగు భావముల నుత్పత్తిఁ జేయుచుండును. మానసము మనుష్యునకు వశమైనచోట స్వర్గము నిర్మింపబడుచున్నది.

మానసమునకు మనుష్యుఁడు స్వాధీనమయిన తావునందు నరకము రచింపఁబడుచున్నది.

చిత్తము చలించినవిధముగ వర్తించు మనుష్యుఁ డెంతటి బలాఢ్యుఁడయినను, ధనాఢ్యుఁడయినను, సుగుణ సంపన్నుఁడయినను, ధీనిధియయినను బూదెఁబోసిన పన్నీటి చందమునఁ దనకుఁగల సర్వస్వమును వ్యర్థ మొనరించుకొను చున్నాఁడు. విజ్ఞాననిధియగు శంకరాచార్యులు మన స్తత్వ మును బాగుగాఁ బరిశోధించి దానికంటెఁ జపలమగు పదా ర్థము వేఱొండు లేదని సిద్ధాంతీకరించెను. ఆతఁడు తన శిష్యుల "జితం జగత్ కేన" "జగత్తులో విజయు లెవరు?" అని ప్రశ్నించియుండ వారు తమకు స్ఫురించినట్లెల్లఁ బ్రత్యు త్తరముల నిచ్చిరి.

ఒకఁడు వేదవేదాంగపారీణుఁడగు పండితప్రకాండుఁడే విజేత యనియె. మఱొక్కఁడు సకల సామ్రాజ్యముల కైవస మొనరించుకొనినవాఁడే విజయుఁడని వచించెను. శంకరాచార్యులు శిష్యుల యదూరదృష్టికి మందహాస మొనరించి 'మనో హి యేన' 'మనస్సును జయించినవాఁడే విజేత' యని యుత్తర మొసంగెను. శంకరుని యీ ప్రశ్నో త్తరములు విద్యార్థులకుఁ జిత్తవశీకరణప్రబోధ మొనరింప దగియున్నవి.

మన ప్రాచీన ఋష్యాదుల దీర్ఘకాల తపోలబ్ధమగు జ్ఞానానుభవ మీరీతి ఘోషించుచున్నది:—

"మనుష్యుఁడా! జాగ్రత్తగా నుండుము. నీవు చోరు లేతెంచి నీగృహమందలి ధనధాన్యముల నపహరించుకొని

పోయెదరను భయమున ద్వారముల నినుపగడియలచే బంధించుకొనుచున్నావు. కాని, నీదేహ గేహమునఁ బ్రవేశించు కామక్రోధములతో నేకీభవించి విజ్ఞానమణి నపహరించుకొనిపోవఁ దోడ్పడు మానసమును బ్రహ్మచర్యమను ద్వారముచే బంధింపకుంటివేమి?

బ్రహ్మచర్యముచే నీమానసము నీకుఁ గట్టువడియుండి నీవు చెప్పిన చొప్పున దుష్కార్యాచరణమునుండి మరలి, సత్కార్యానుష్ఠానమున నీకు మిక్కిలి సాహాయ్యమొనరింపఁ గలదు. కావున నీవు బయట నెటనుండియో దొంగలు వత్తురని భావింపక కామక్రోధాది దస్యులనాయకుఁడగు చిత్తమును బంధించుము."

శ్రీ బుద్ధభగవానుఁ డింద్రియదాసుఁడగువాఁడు వేద వేదాంగపారంగతుఁడయినను వాఁడు పండితుఁ డనఁబడఁ డనియు, పామరుఁడుగనే పరిగణింపఁబడఁగలఁడనియు వచించి యున్నాఁడు. ఆప్రభువు మానసమును జయించిన ధీరుని జగదేకసార్వభౌమునికంటె వంద్యునిగ నిశ్చయించియున్నాఁడు. వృక్షముయొక్క మూలము ఖండింపఁబడినపుడు స్కంధము, శాఖలు, ఫలపత్రపుష్పములు శుష్కించిపోవురీతిగనే మానసముయొక్క చపలత్వము నశింపఁజేయఁబడగనే యింద్రియములన్నియుఁ దమ తమ దుష్ప్రవృత్తుల వీడి సక్రమముగ మానవుని విజ్ఞానమయజీవితాభివృద్ధికిఁ దోడ్పడుచుండఁ గలవు.

ప్రతివిద్యార్థియుఁ దన మానసమున దుష్టసంకల్పముల కెడమీయక, పవిత్రసంకల్పముల ధరించుచు వర్తించు

చున్నచో సమస్తేంద్రియనిగ్రహమునుగూర్చి విచారింపవలసిన పనియే యుండదు. మనస్సుయొక్క చాంచల్యమును బాపి దానికి స్థిరత్వమును, దృఢత్వమును, ధీరత్వమును గలిగించి భగవద్భక్తమగు నంతరాత్మకును, బుద్ధికిని ననుకూలముగా మెలంగునట్లు చేయగల శక్తిసామర్థ్యములు కేవల మొక్క బ్రహ్మచర్యవ్రతమందే కలవని గుర్తించి, ఆరీతిగ వర్తించి విద్యార్థులెల్లరు స్వోద్ధరణముఁ గావించుకొనియెదరుగాక !



# నలుబదిరెండవ ప్రకరణము

## బ్రహ్మచర్యము—గృహస్థాశ్రమము

"బ్రహ్మచర్యం సమాప్యాయ గృహధర్మం సమాచరేత్,
ఋణత్రయవిముక్త్యర్థం ధర్మేణోత్పాదయే త్ప్రజాం".

"బ్రహ్మచర్యాశ్రమము పూర్తియైనవెంటనే తరుణ ప్రాయమందు గృహస్థాశ్రమమును బరిగ్రహింపఁ దగును. ఋణత్రయ (దేవ ఋషి పితృఋణములు) విముక్తినిమిత్తము ధర్మవిధానము ననుసరించి యుత్తమసంతానమును సృజింపఁ దగుఁగాని దుష్టసంతానము నుత్పత్తి సేయరాదు."

పూర్వకాలమున మన భరతఖండమందు సమస్త జనులు నాశ్రమచతుష్టయమును సక్రమముగఁ బాలించుచుండెడివారు. పూర్వకాలమున మాతాపితలు బాల్యమందే తమబిడ్డల గురుకులాశ్రమముల కంపి 25 సంవత్సరముల ప్రాయము వచ్చుసరికి వారల సకలవిద్యావిశారదులఁ గావింపఁజేయుచుండెడివారు. నేఁడు 25 సంవత్సరముల ప్రాయమునందే సకలవిద్యావిశారదు లయినవారిసంఖ్య వ్రేళ్ళపై లెక్కింపఁ దగియున్నది.

నేఁటి విద్యార్థులయం దెందఱో తరుణప్రాయమునకుఁ బూర్వమే బ్రహ్మచర్యాశ్రమము నతిక్రమించి వివాహితు లయి, గృహస్థాశ్రమము నవలంబించువా రుండుటచేఁ బ్రత్యే

కముగా వారి హితము నపేక్షించి నే నీప్రకరణమును వ్రాయు చున్నాఁడను. ఈప్రకరణమందలి విషయములు సమస్త గృహస్థప్రపంచమునకు ధ్యేయములును, సత్వరాచరణీయములును నయియున్నవి.

మన ప్రాచీనార్యు లిహపరధర్మనిర్ణయమున సకల ప్రపంచమందలి నాగరికులలోని కెల్ల నగ్రేసరులు. ఆర్య జీవిత విధాన మధికప్రశంసనీయ మయినది. శ్రీ బుద్ధుఁడు, జీసను, మహమ్మదు, రామమోహనుఁడు, గాంధి మొదలగు నవతార పురుషులెల్లరు నార్యఋషులు. మనవిజ్ఞానధనులగునట్టి ఋషిపుంగవులచే నిశ్చయింపఁబడిన మానవజీవిత ధర్మసూత్రము లత్యుత్కృష్టములు.

ఋషులు తాము స్వానుభవమునను, ధీవిశేషమునను గొన్ని ధర్మసూత్రముల నిశ్చయించి తొలుతఁ దా మవ్వానినిఁ దమజీవితమునం దాచరించి, ఫలాఫలముల గుర్తించి, శ్రేయస్కరములయిన సూత్రముల నెల్ల సిద్ధాంతములుగ నిశ్చయించి తమ భావిసంతతివారమగు మన హితము నిమిత్తము శాస్త్రములుగ సిద్ధమొనరించియున్నారు. ఆ శాస్త్రములందలి సకలసిద్ధాంతములు మానవునకు సౌమ్య జీవితమును గడప విశేషప్రయోజనకరము లయి యున్నవి.

మధ్యకాలమునం దా మన శాస్త్రగ్రంథముల స్వసిద్ధాంతస్థాపనాభిలాషులును, జాతిమతవ్యక్తిద్వేషపరతంత్రులును నగు లోకవిద్రోహులచే ననేకకృత్రిమసిద్ధాంతములు చొప్పింపఁబడినవి. ఇదియేకారణముగఁ దొలుత వైదికమును పిదప బౌద్ధమును, పిమ్మట క్రైస్తవమును, అటుతరువాత

మహమ్మదీయమును, తదనంతరము బ్రహ్మసమాజము, మఱిపిమ్మట నార్యసమాజము మొదలగు సంస్కరణోద్యమములు విశ్వమండంతటను బయల్వెడలినవి.

అవి తమదృష్టికి గోచరించిన కల్పితసిద్ధాంతముల నన్నింటి విమర్శించి కొద్దిపాటి దిద్దుబడులతోఁ దమయాస్తిక్యమును సిరపఱచుకొనియున్నవి. మొత్తముమీఁద నీ మతములు, సమాజములు పేరునకుఁ గ్రొత్తవియే యయినను బ్రాచీనార్యమతమునే సంపూర్ణముగా నాధారము జేసికొని యుదయించినవియే. వివేకానంద, రామతీర్థ, రామకృష్ణ, రాధాకృష్ణాదులు భారతీయమతమునకు మఱొకనామాంతరమును గల్పించకయే దానియందు మధ్యకాలకల్పితములగు పౌరాణికవిషయముల విమర్శించి యుపనిషద్ధర్మముల నాదర్శముగాఁ గొని మతవ్యాపన మొనరించియున్నారు.

శీర్షికకు సంబంధింపని యితరవిషయముల నిట వ్రాయఁబని యేమని విద్యార్థులు తలంపకుందురుగాక! నేటి విద్యార్థులయందనేకులు విలాసప్రియులును, పాశ్చాత్యనాగరికతా దాసులును, పారమార్థికవిద్యయందు విశ్వాసము లేని వారగుటచే వారు శాస్త్రవాక్యము లని నాచే నుడువఁబడినవానియం దాదరమును వహింపకుందురేమో యని యెడి యుద్దేశ్యముతో సకలప్రపంచమతములు సనాతనార్యమతమునకు లోఁబడినవేయని నిరూపింప నింతదీర్ఘప్రసంగముఁ గావింపవలసి వచ్చినది.

"Good out of evil, evil out of good."

"మంచియందు చెడు, చెడుగునందు మంచి యంతర్గతమయియున్న" దను పాశ్చాత్యకోవిదవాక్యమునందు

విశ్వాసముగల కోటిలోనివాఁడను నేను. హైందవశాస్త్రములయం దెచ్చోటనయినఁ గల్పితసిద్ధాంతములున్నఁ బరిత్యజింపవచ్చును. సర్వజనీనములగు సిద్ధాంతములనే పరిగ్రహింపఁదగును. సామాన్యముగా నీ గ్రంథమందు శాస్త్రసిద్ధాంతము లని వచింపఁబడు వాక్యములన్నియుఁ బ్రస్తుతకాలము విశ్వమండలి నాగరికులెల్లరిచే సన్మానింపఁ బడునవేకాని ఛాందసములగు పౌరాణికసిద్ధాంతములు కావు.

మనకు భారతీయశాస్త్రములందలి పరిశుద్ధమగు విజ్ఞానము స్వీకరించుట కెట్టి యభ్యంతర ముండరాదు. వివేకానందుఁడు ప్రాక్పశ్చిమ విజ్ఞానపరిశీలనావిశారదుఁడు. అట్టి మేధాసంపన్నుఁడు—వివిధసాహిత్యసార్వభౌముఁడు— మహావక్త యేరీతి భారతీయమతశాస్త్రములందలి కాల్పనికభాగమును బరిత్యజించి ముఖ్యభాగముల స్వీకరించియున్నాఁడో, అదియేచందమున మంచిచెడ్డలతోఁ గూడియున్న శాస్త్రప్రపంచమునం దుండి మంచిని గ్రహించుట భారతీయులమగు మనకెల్లరకుఁ బరమధర్మమయి యున్నది. నాశాస్త్రశబ్దముల కర్థము ప్రాచీనార్యవిరచిత్తోత్తమ సిద్ధాంతసముదాయమే. ఇంకఁ బ్రస్తుతాంశమునకు వత్తము.

మనశాస్త్రగ్రంథములందు మహానుభావులగు నార్యఋషులు ప్రకృతి ననుసరించియే దేహారోగ్యము నపేక్షించి బ్రహ్మచర్యనిబంధనముల గ్రంథస్థ మొనరించియున్నారు. వారి యుత్తమానుభవమును, నేఁటి విజ్ఞానానుభవమును బ్రకృతి నతిక్రమించుటచే మనుష్యుఁడు సుఖియయి యుండఁ

జాలఁడని చాటుచున్నవి. ప్రకృతితత్త్వమును గ్రహించి యద్దాని శాసనపాలనమునందు శ్రద్ధవహించు వ్యక్తి సపత్నీకుఁడయ్యు బ్రహ్మచారి జీవితమును గడుప సమర్థుఁడు కాఁగలఁడు.

అఖండ బ్రహ్మచర్యమునకును, గృహస్థబ్రహ్మచర్యమునకును భేదమున్నను ధర్మమును, ప్రకృతిని ననుసరించి వర్తించు గృహస్థబ్రహ్మచారియుఁ దేజస్వియు, ఓజస్వియు, యశస్వియు, మనస్వియు, బలాఢ్యుఁడును, ప్రశాంతజీవియు నయి నిర్మలసౌఖ్యానందముల ననుభవింప సమర్థుఁడగుచున్నాఁడు. అస్ఖలితాజన్మబ్రహ్మచారి పడయు స్థానమునే మన యీ యాదర్శగృహస్థబ్రహ్మచారియుఁ బడయఁగలఁడనుట కెట్టి సందియమును లేదు. కాని నేఁ డుత్తమ గృహస్థ బ్రహ్మచారులసంఖ్య భరతఖండమున మిక్కిలి లోపించిపోయినది.

రాజర్షి జనకుఁ డుత్తమ గృహస్థబ్రహ్మచారిగనే యుండెను. ఆతని జీవితము వాల్మీకి మునీంద్రాదుల జీవితాదర్శముకంటెఁ దీసిపోయి యుండలేదు. తనకాలమందలి ఋష్యాదుల కతఁ డాచార్యుఁడు; పూజనీయుఁడు. నేఁటి గృహస్థుఁడు జనకునివంటి యాదర్శగృహస్థుల జీవితముల నాదర్శప్రాయముగఁ గొని తదనుకూలముగ వర్తింపక కామస్రోవ జీవియయి మనుచున్నాఁడు.

వాని యున్నతజీవితమార్గము, ఆదర్శభావములు, ప్రశస్తకర్మలు, ఉత్తమవిధులు మంటఁగలసిపోయినవి. ఆత్మజ్ఞానమునకును, పరమార్థమునకును, ధర్మకర్మభక్తి వైరా

గ్యములకును నిలయమై యుండవలసిన గృహస్థప్రపంచము నేఁడు పెడదారిఁ ద్రొక్కినది. నిత్యసంభోగము, కామము, ద్వేషము, తృష్ణ, ధనసంపాదనము, మిథ్యాభిమానము మొదలగు దుర్గుణముల నేఁటి భారతీయగృహస్థుఁడు పాశ్చాత్య సంపర్కముచే సంపాదించి యున్నాఁడు.

ఈ నాఁటి గృహస్థులెల్లరు విలాసాంబుధి మునిఁగి యున్నవారగుటచే నేఁడు నూతనముగా గృహస్థులగువారికి గృహస్థనీతిని బోధించు గ్రంథములయినను లభింపకున్నవి. ప్రాచీనగృహస్థునకును, నేఁటి గృహస్థునకును నరకమునకును, నాగలోకమునకును గల తారతమ్యమే కలదు.

ప్రాచీనగృహస్థుని ధర్మము లెంతవిశాలములో, ఉన్నతములో, పవిత్రములో నీదిగువ నుదహరింపఁబడు శ్లోకరాజములచే వ్యక్తము కాఁగలదు. ఆదర్శప్రాయములగు నీధర్మముల ననుష్ఠించు గృహస్థుఁడు మహాత్ముఁడగు ననుట కేమి యుసందియము లేదు.

బ్రహ్మనిష్ఠో గృహస్థస్స్యాత్ బ్రహ్మజ్ఞానపరాయణః,
యద్యత్కర్మ ప్రకుర్వీత తద్బ్రహ్మణి సమర్పయేత్.
మాతరం పితరంచైవ సాక్షాత్ప్రత్యక్ష దేవతామ్,
మత్వా గృహీ నిషేవేత సదా సర్వప్రయత్నతః.
తుష్టాయాం మాతరి శివే! తుష్టే పితరి పార్వతి!
తవ ప్రీతి ర్భవేత్ దేవి! పరబ్రహ్మ ప్రసీదతి.
ఆసనం శయనం వస్త్రం పానం భోజనమేవ చ,
తత్తత్సమయ మాజ్ఞాయ మాత్రే పిత్రే నియోజయేత్.
శ్రావయే న్మృదులాం వాణీం సర్వదా ప్రియ మాచరేత్,
పిత్రో రాజ్ఞానుసారీ స్యాత్ సత్పుత్రః కులపావనః

ఔద్ధత్యం పరిహాసం చ తర్జనం పరిభాషణమ్,
పిత్రోరగ్రే న కుర్వీత యదీచ్ఛే దాత్మనో హితమ్.
మాతరం పితరం వీక్ష్య నత్వో త్తిష్ఠేత్ స సంభ్రమః,
వినాఽఽజ్ఞయా నోపవిశేత్ సంస్థితః పితృశాసనే.
మాతరం పితరం పుత్రం దారా నతిథి సోదరాన్,
హిత్వా గృహీ న భుంజీయాత్ ప్రాణైః కంఠగతైరపి.
వంచయిత్వా గురూన్ బంధూన్ యో భుక్తే స్వోదరంభరః,
ఇహైవ లోకే గర్హ్యోసౌ పరత్ర నారకీ భవేత్.
జనన్యా వర్ధితో దేహో జనకేన ప్రయోజితః,
స్వజనైః శిక్షితః ప్రీత్యా సోఽధమ స్తాన్ పరిత్యజేత్.
ఏషా మర్థే మహేశాని! కృత్వా కష్టశతాన్యపి,
ప్రీణయేత్ సతతం శక్త్యా ధర్మో హ్యేష సనాతనః.
స ధన్యః పురుషో లోకే స కృతీ పరమార్థవిత్,
బ్రహ్మనిష్ఠః సత్యసంధో యో భవే ద్భువి మానవః.
న భార్యాం తాడయేత్ క్వాపి మాతృవత్ పాలయే త్సదా,
న త్యజేత్ ఘోరకష్టేఽపి యది సాధ్వీ పతివ్రతా.
తిష్ఠేషు స్వీయదారేషు స్త్రియ మన్యాం న సంస్పృశేత్,
దుష్టేన చేతసా విద్వా నన్యథా నారకీ భవేత్.
విజనే శయనం వాసం త్యజేత్ ప్రాజ్ఞః పరస్త్రియా,
అయుక్తభాషణంచైవ స్త్రియం శౌర్యం న దర్శయేత్.
ధనేన వాససా ప్రేమ్ణా శ్రద్ధయా మృదుభాషణైః,
సతతం తోషయే ద్దారాన్ నాప్రియం క్వచి దాచరేత్.
యస్మి న్నరే మహేశాని! తుష్టా భార్యా పతివ్రతా,
సర్వో ధర్మః కృత స్తేన భవతీప్రియ ఏవ సః.
చతుర్వర్షావధి సుతాన్ లాలయేత్ పాలయేత్ పితా,
తతః షోడశపర్యంతం గుణాః విద్యాం చ శిక్షయేత్.

వింశత్యబ్దాధికాన్ పుత్రాన్ ప్రేరయేత్ గృహకర్మసు,
తత స్తాన్ తుల్యభావేన మత్వా స్నేహం ప్రదర్శయేత్.
కన్యాఽప్యేవం పాలనీయా శిక్షణీయాఽతియత్నతః,
దేయా వరాయ విదుషే ధనరత్న సమన్వితా.
ఏవం క్రమేణ భ్రాతౄంశ్చ స్వసౄర్భ్రాతృసుతానపి,
జ్ఞాతీన్ మిత్రాణి భృత్యాంశ్చ పాలయేత్తోషయేత్ గృహీ.
తతః స్వధర్మనిరతా నేకగ్రామనివాసినః,
అభ్యాగతా నుదాసీనాన్ గృహస్థః పరిపాలయేత్.
యద్యేవం నాచరే ద్దేవి! గృహస్థో విభవే సతి,
పశురేవ స విజ్ఞేయః స పాపీ లోకగర్హితః.
నిద్రాలస్యం దేహయత్నం కేశవిన్యాసమేవ చ,
ఆసక్తి మశనే వస్త్రే నాతిరిక్తం సమాచరేత్.
శూరః శత్రౌ వినీతః స్యాత్ బాంధవే గురుసన్నిధౌ,
జుగుప్సితాన్ న మన్యేత నావమన్యేత మానినః.
సౌహార్దం వ్యవహారాంశ్చ ప్రవృత్తిం ప్రకృతిం నృణాం,
సహవాసేన తర్కైశ్చ విదిత్వా విశ్వసేత్ తతః.
స్వీయం యశః పౌరుషం చ గుప్తయే కథితం చ యత్,
కృతం య దుపకారాయ ధర్మజ్ఞో న ప్రకాశయేత్.
విద్యాధనయశోధర్మాన్ యతమాన ఉపార్జయేత్,
వ్యసనం చాసతాం సంగం మిథ్యాద్రోహం పరిత్యజేత్.
జితేంద్రియః ప్రసన్నాత్మా సుచింత్యః స్యాత్ దృఢవ్రతః,
అప్రమత్తో దీర్ఘదర్శీ మాత్రాస్పర్శాన్ విచారయేత్.
సత్యం మృదు ప్రియం ధీరో వాక్యం హితకరం వదేత్,
ఆత్మోత్కర్షం తథా నిందాం పరేషాం పరివర్జయేత్.
జలాశయాశ్చ వృక్షాశ్చ విశ్రామ గృహ మధ్వని,
సేతుః ప్రతిష్ఠితో యేన తేన లోకత్రయం జితమ్.

సంతుష్టౌ పితరౌ యస్మి న్ననురక్తాః సుహృద్గణాః.
గాయంతి యద్యశో లోకాః తేన లోకత్రయం జితమ్,
సత్యమేవ వ్రతం యస్య దయా దీనేషు సర్వథా,
కామక్రోధౌ వశే యస్య తేన లోకత్రయం జితమ్.
విరక్తః పరదారేషు నిస్పృహః పరవస్తుషు,
దంభమాత్సర్యహీనో య స్తేన లోకత్రయం జితం.
జ్ఞానినా లోకయాత్రాయై సర్వత్ర సమదృష్టినా,
క్రియన్తే యేన కర్మాణి తేన లోకత్రయం జితం.

—మహానిర్వాణతంత్రము.

"గృహస్థుఁడు బ్రహ్మనిష్ఠాపరతంత్రుఁడయి, బ్రహ్మజ్ఞానసంపన్నుఁడయి సమస్తకర్మల బ్రహ్మార్పణ మొనరింపవలయును. మాతాపితలను ప్రత్యక్షదైవములుగ నెంచి వారల ననారతము సేవింపవలయును. వారు సంతోషించి నచోఁ బార్వతీ పరమేశ్వరులును సంతసింపఁగలరు. కుమారుఁడు సమయానుసారముగ వారికి శయ్యాసనములను, వసనభోజనపానీయములను సమకూర్పవలయును.

వారితో మృదుభాషణము లొనరించుచు వారికిఁ బ్రియముఁ గూర్పవలయును. జననీజనకుల యాజ్ఞాపాలకుఁడే సత్కుమారుఁడు; కులపావనుఁడు. వారిసమక్షమున నతిశయమును, పరిహాసమును, తర్జనమును, అధికప్రసంగమును గావింపరాదు. వారి నవలోకించినంత ససంభ్రమముగ లేచి నమస్కరింపవలయును. వారియాజ్ఞ యగువఱకు నుపవిష్టింపరాదు.

గృహస్థుఁడు తనప్రాణములు పోవుచున్నను జననీజనకులను, దారాసుతులను, అభ్యాగతులను, సహోదరులను

విడిచి యీారగింపరాదు. ఆచార్యులను, బంధుబాంధవులను వంచించి కుక్షింభరుఁడగు నాతఁ డిహలోకమున నింద్యుఁ డయి పిమ్మట నరకమును జెందును. ఈకాయము జనకునిచే నొసంగఁబడినది. మాతచేఁ బోషింపఁబడినది. స్వజనులచే శిక్షిత మయినది.

కావున వారలఁ బరిత్యజించువాఁ డధముఁడు. ఎన్ని వందల కష్టములకు గుఱియయినను వారి ననారతము సదా యథాశక్తి సంతసింపఁ జేయవలయును. ఇదియే సనాతన ధర్మము. ఎవ్వాఁడు బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడయి సత్యసంధుఁ డగునో, అతఁడే ధన్యుఁడు; చరితార్థుఁడు. కళత్రము నెప్పుడును దాడన మొనరింపరాదు. మాతృదేవినివలె సర్వదా రక్షించుచుండ వలయును.

సాధ్వి, పతివ్రతయగు కళత్రమును ఘోరకష్టమునం దయిన విడువరాదు. స్వపత్ని యుండగ దుష్టచిత్తుఁడయి పర కాంతను స్పృశించువాఁడు నరకమును బడయును. నిర్జనస్థల మందుఁ బరకాంతతో నేకాంతశయన మొనరింపరాదు. స్త్రీలయొద్ద ననుచిత సంభాషణ మొనరింపఁదగదు. స్వీయ శౌర్యమును వెల్లడింపరాదు. ధనవసనములవలనను, శ్రద్ధాను రాగములచేతను, మృదుమధురభాషణములవలనను భార్యను సదా సంతుష్ట నొనరింపవలయును.

ఆమె కెపుడు నప్రియ మాచరింపఁజనదు. ఎవ్వాఁడు పతివ్రతయగు తనపత్నిని సంతోషసంభరితస్వాంత నొనరిం చునో, వానిసకలధర్మములు నెఱవేఱినట్లేయగును. వానియం

దీక్షవారికిఁ బ్రీతి కలుగఁగలదు. కుమారులను నాలుగేండ్ల వఱకు జనకుఁడు లాలన పాలన మొనరింపవలయును.

తదనంతరము షోడశవత్సరప్రాయమువఱకు విద్యాబుద్ధుల గఱపవలయును. వింశతివత్సరములప్రాయము గతించిన పిమ్మట గృహకార్యములందుఁ బ్రవేశింపఁ జేయవలయును. అటుపిమ్మట దనకుఁ దుల్యునిగా భావించి స్నేహభావమును జూపవలయును. కన్యనుసైత మిట్లే పాలించుచు శ్రద్ధాపూర్వకముగ విద్యాభ్యాస మొనరింపఁజేయవలయును. అవ్వల ధనరత్నసహితముగ విద్వాంసుఁడగు వరున కొసంగవలయును.

ఈ చందముననే క్రమముగా సహోదరులను, సోదరీసోదరులను, ఆత్మజులను, జ్ఞాతులను, మిత్రులను, పరిచారకులను బాలించుచు సంతసింపజేయవలయును. అటు పిమ్మట స్వధర్మనిరతులగు స్వగ్రామవాసులను, అతిథులను, మిత్రులు శత్రువులుకాని యుదాసీనులను భక్తితోఁ బాలింపవలయును. సంపన్నుఁడయి యుండియు నిట్లొనరింపని గృహస్థుఁడు పశువు, పాపి, లోకనిందాపాత్రుఁడు.

సుషుప్తి, సోమరితనము, దేహరక్షణము, కేశవిన్యాసము, భోజనప్రీతి, వసనాసక్తి మున్నగువాని నమితమొనరింపరాదు. శత్రువునెడల శౌర్యమును, గురుబాంధవులందు వినయమును బ్రదర్శింపవలయును. గుణహీనుల మన్నింపరాదు. మానధనులను నిరసింపరాదు. మనుష్యుల సౌహార్దమును, చారిత్రమును, ప్రవృత్తిని, స్వభావమును సాంగత్య

ము చేతను, ఆలోచనమూలమునను గ్రహించి యటుపిమ్మ టనే విశ్వసింపవలయును.

స్వకీర్తిని, పౌరుషమును, రహస్యమును, స్వయం కృతోపకారమును వెల్లడింపరాదు. విద్యను, విత్తమును, యశమును, ధర్మమును ప్రయత్నబలముచే సముపార్జింప వలయును. వ్యసనమును, దుస్సాంగత్యమును, మృషను, ద్రోహబుద్ధిని విసర్జింపవలయును. జితేంద్రియుఁడు, సంతుష్ట చిత్తుఁడు సద్భావయుతుఁడు, దృఢవ్రతుఁడు, అప్రమత్తుడు, దీర్ఘదర్శియునై గృహస్థుఁడు విషయసంబంధములను విచా రింపవలయును.

సత్యము, మృదులము, ప్రియము, హితకరము నగు వాక్యము లుచ్చరింపవలయును. స్వోత్కర్షను, పరనిందను వర్జింపవలయును. జలాశయములను, వృక్షములను, విశ్రాంతి గృహములను,వంతెనలనునిర్మింపఁ జేయువాఁడుముల్లోకముల జయించుచున్నాడు. ఎవ్వాని తలిదండ్రులు సంతృప్తులో, మిత్రులనురక్తులో, ఎవనికీర్తిని లోకములు గానము సేయునో యతఁడు లోకత్రయమును జయించుచున్నాఁడు.

ఎవఁడు సత్యవ్రతుఁడో, దీనదయాళువో, జితకామ క్రోధుఁడో అతఁడును లోకత్రయమునుజయించుచున్నాఁడు. ఎవడు పరకాంతలయందు విరక్తుఁడో, పరవస్తువులందు నిస్పృహుఁడో, దంభమాత్సర్యశూన్యుఁడో అతఁడు లోక త్రయమును జయించుచున్నాఁడు. ఎవఁడు జ్ఞానియై సమదృష్టి యుతుఁడై జీవయాత్రనిమిత్తము సమస్తకర్మల నాచ

రించుచున్నాఁడో యతఁడు లోకత్రయమును జయించు చున్నాఁడు.''

పరమపావనములగు నిట్టి ధర్మముల ననుష్ఠించు గృహస్థుఁడు ఋషీశ్వరులకంటెను, తాపసోత్తములకంటెను శ్రేష్ఠత్వమునఁ దీసిపోవువాఁడు కాఁడు. ప్రాచీనకాలమునం దిట్టి ధర్మములచేతను, సద్గుణములచేతను నలంకరింపఁబడి యుండుట వలననే గృహస్థుఁడు సకలలోకముచే సన్మానింపబడుచుండెడివాడు. కావుననే నాఁడు గృహస్థాశ్రమము శేషాశ్రమత్రయముకంటె సంపూజ్యముగను, శ్రేష్ఠముగను భావింపఁబడు చుండెను.

నాఁడు 25 సంవత్సరముల ప్రాయము వచ్చుసరికి ప్రతి యువకుఁడును సకలవిద్యావిశారదుఁడై యుండుట సామాన్య ధర్మముగఁ బరిగణింపఁబడుచుండెను.

శ్రీ బుద్ధభగవానుఁడు సైతము త్తమగృహస్థబ్రహ్మచారిని ఋషిపుంగవునికంటె నెక్కుడుగఁ బూజింప దగునని వచించియున్నాఁడు. గార్హస్థ్యము శాస్త్రోక్తధర్మసమాశ్రితమగుచో నానందకంద మగుట నిస్సంశయము.



# నలుబదిమూడవ ప్రకరణము

## అజ్ఞానమే మృత్యువు

"Ignorance is the curse of God"—Shakespear

"అజ్ఞానము జగదీశ్వరునియొక్క యభిశాపము."
—షేక్స్పియరు.

"తే॥గీ॥ జ్ఞానమున్ బొందలేనట్టి ♦ జనుఁడు వసుధఁ
బుట్టుటే తప్పు, పుట్టిన ♦ గిట్టుటొప్పు..."

మానవుని యిహపరసంపదలలోనికెల్ల జ్ఞానమే సర్వోత్తమంబును, శాశ్వతంబును, పరబ్రహ్మస్వరూపంబును నగు పదార్థమయియున్నది. దేవునిసృష్టిలోనికెల్ల మనుష్యుఁడు జ్ఞానావలంబనముననే సర్వశ్రేష్ఠత్వమునకుఁ బ్రాపించియున్నాఁడు. మానవుఁడు పాణ్యమునం దెంత యధికుఁడయినను జ్ఞానశూన్యుఁడగునేని మూఢుఁడగు నర్భకుని కంటె హీనుఁడే యగును. అపారమగు నీభవసాగరమును దరించుటకు జ్ఞానమే యక్షయంబును, సర్వోత్తమంబును నగు తరణియయియున్నది.

అనంతమగు నీవిశ్వమునకుఁ బరాత్పరునకు: బిమ్మట మనుష్యుఁడే జ్ఞానప్రభావముచే శాసకుఁడుగ నుండుచున్నాఁడు. నానావస్తుసంచయ సమనిత్వమై, వివిధ తత్వాభిభూతమై

విస్మయోత్పాదకమై, అతివిశాలమయి యున్న యీవిశ్వ మండలమున మనుష్యుఁడు జ్ఞానమే లేకున్నచో నిశీథమునం దేకాకియయి, అపరిచితప్రదేశమున సంచరించుపూర్ణాంధుని వలె విపద్గ్రస్తుఁడయి నశించును.

సృష్టియందొక రేణురూపమునందున్న మనుష్యుఁడు జ్ఞానమహిమవలననే దంతావళమువంటి భయంకరమగు మహాజంతువును స్వాధీన మొనరించుకొనఁ గలుగుచున్నాఁడు. మనుష్యజీవితమును సౌఖ్యభూయిష్ఠముగను, నాగరికముగను జేయుటకు జ్ఞాన మక్కఱకు వచ్చినట్లు మఱి యే వస్తువును ప్రయోజనకరము కానేరదు. ఇహమందలి సమస్తశక్తులును జ్ఞానశక్తి యెదుట జలనిధియందలి సలిలబిందువులకరణి నుండఁగలవు.

మానవసంఘము జ్ఞానశూన్యుని ద్విపాదపశువుగ భావించినన్నాని(?)ంపనేరదు. పశుపక్ష్యాది జీవకోటులు జ్ఞానము లేనివగుటచే నున్నతజీవితసౌఖ్యము ననుభవింప నసమర్థము లయియున్నవి. క్షుత్పిపాసలను, సుఖ దుఃఖ భయ నిద్రా మైథునములను దెలుపు వస్తువు జ్ఞానము కానేరదు. ఇట్టి చేతనసామాన్యమగు జ్ఞానము ప్రతిజీవికిని గలదు. దీనికంటె నుత్తమోత్తమమగు జ్ఞానమే మానవజీవితసాఫల్యమున కావశ్యకమయి యున్నది.

మనుజుఁడు సభ్యతాసభ్యతలను, యుక్తాయుక్తములను, నిత్యానిత్యములను, హితాహితములను గ్రహించుటకు జ్ఞాన మెంతేని యగత్య మగుచున్నయది ఇది ధర్మమనియు, ఇది యధర్మమనియు, ఇది కర్తవ్యమనియు,

ఇది యకర్తవ్యమనియు మనకు బోధించునట్టి యంతః కరణముయొక్క పవిత్రవికాసమే జ్ఞానము.

జ్ఞానశూన్యుఁడయి మనుజుఁడు భువిపై జీవింప వచ్చును. కాని యట్టి జీవితము మృతప్రాయమయినది. నిస్సారమయినది. జ్ఞానశూన్యులసంఘమును మానవసంఘ మని వచింప వలనుపడదు. కారణమేమన నట్టిసంఘము ధర్మాధర్మముల గుర్తింపజాలని మూఢదశయం దుండుటచే నయ్యెడఁబాపాచరణము, హింస, ద్వేషము, కలహము, క్రోధ ము మొదలగు వివిధ దురాచార దుర్గుణ దుర్వృత్తులు నెల కొనియుండి పశు సంఘులక్షణములఁ జాటుచుండఁగలదు.

నేఁడు మనుష్యసంఘమునం వ్యాపించియున్న సప్త వ్యసనములకును, భయంకరహత్యలకును, కామ, క్రోధ, మద, మాత్సర్య, ద్వేష, దంభ, దర్పాహంకారాది దుర్గు ణములకును, అజ్ఞానమే ముఖ్యకారణము. యథార్థమగు మనుష్యత్వము మనోహరమును, నిర్మలమును నగు జ్ఞానము నుండియే యావిర్భూతమయినది. జ్ఞానమునం దెట్టి కల్మష మునకును, దుష్కర్మలకును, దుర్విచారములకును స్థాన ముండ నేరదు. అయ్యది చిరశాంతికిని, సద్యశస్సౌఖ్యానంద ములకును ప్రబలసాధనము.

జ్ఞానశూన్యుఁడు సమస్తములగు నైహికసంపదల కధి కారియయియుండియు వ్యర్థజన్ముఁడే యగుచున్నాఁడు. నేఁడు ప్రపంచమున గోచరించు వికాసము, విజ్ఞానము ఉన్నతి, సంస్కరణము, అంతర్దృష్టి, బ్రహ్మానందము మొదలగు సద్వృత్తులన్నియు జ్ఞానసంభూతములే. జ్ఞానముచే

మనుష్యునకు లభింపని వస్తువేదియు భగవంతునిచే సృజింపఁబడియుండలేదు.

జ్ఞానసంపన్నుఁడు ధర్మప్రతికూలములు కాని తన సాత్వికాభీష్టముల నన్నింటి నెట్టి శ్రమయు లేకయే సహజముగా సఫలీభూతము లొనరించుకొనుచున్నాఁడు. మనుష్యుఁడెట్టి భౌతికవిభవసమృద్ధికి స్వామి గాకున్నను కుబేరులు వడయ లేని బ్రహ్మానందమును గర్భదారిద్ర్యమునం దుండియే యవలీలఁగఁ బడయఁగలుగుచున్నాడు. ఆకాశశూన్యమగు ప్రపంచము లేనట్లు జ్ఞానశూన్యమగు సత్కార్యమీ ధరణియం దుండ నేరదు. ఏమనుజున కేవిధమగు సౌఖ్యము కలిగినను నది జ్ఞానముయొక్క దయాభిక్షయే యని గ్రహింపవచ్చును.

మనుష్యజీవితాభ్యుదయమునకు జ్ఞానసంపాదన మత్యంతావశ్యకము. బ్రహ్మచర్య మెట్టిదో, మోక్షమున నెద్దియో, సజ్జను లెవ్వరో, దుర్జను లెట్లుందురో, మానవుఁ డీలోకమందేమేమి యాచరింప నీశ్వరునిచే సృజింపఁబడియున్నాఁడో యను విషయముల నన్నింటిని గ్రహించి యాచరించుటకు ధనము, ధాన్యము, పుత్ర, కళత్రాది బాంధవులు, భోగములు సమగ్రములు కాఁజాలవు. జ్ఞానమొక్కటియే సమర్థమయి యున్నది.

నేఁడు మనుష్యసంఘము పశుసంఘమునకంటె నధమస్థితియం దుండుటకు ముఖ్యకారణ మజ్ఞానమె. మనుజుఁడు తెలివిలేమిచేఁ దనకుఁ దశదిశల వ్యాపించియున్న మంచిచెడుగులన్నియు జ్ఞానాజ్ఞానసంభూతములే యని గ్రహింపఁజాలకు

న్నాడు. జ్ఞానశూన్యతవలన దేవుని జీవసంతానములోని కెల్ల జ్యేష్ఠపుత్రస్థానము నలంకరించియున్న మనుష్యుఁడు జ్ఞానమును స్వర్గమార్గమనియు, అజ్ఞానము నరకపథమనియు గ్రహింపఁ జాలకున్నాఁడు. పూతచారిత్రులగు మహర్షులు జ్ఞానమును బరిశుద్ధమగు సూర్యప్రకాశముగను, అజ్ఞానమును నిశీథమండలి నిబిడాంధకారముగను వర్ణించియున్నారు.

"స్వయం కర్మ కరో త్యాత్మా స్వయం తత్ఫల మశ్నుతే,
స్వయం భ్రమతి సంసారే స్వయం తస్మా ద్విముచ్యతే."

"మనుష్యుఁడు తానే కర్మ నాచరించుచున్నాఁడు. తానే తత్ప్రాప్తములగు దుష్టాదుష్టఫలముల ననుభవించుచున్నాఁడు. వాఁడు తనకర్మలవలననే విశ్వవలయమును జుట్టివచ్చుచున్నాఁడు. తన కర్మచేతనే తిరిగి వీని నన్నింటి నుండి విముక్తుఁడగుచున్నాఁడు."

దుష్టఫలప్రాప్తికిదుష్కర్మయు, శిష్టఫలప్రాప్తికి సత్కర్మయుఁ గారణభూతములు. దుష్టకర్మ నాచరించుటకు మనుష్యుని బ్రేరేపించున దజ్ఞానము. శిష్టకర్మాచరణమునకుఁ బ్రోత్సహించునది జ్ఞానము. ఆత్మోత్థానమునకును, ఆత్మపతనమునకును జ్ఞానాజ్ఞానకారణముగ మనుష్యుఁడు గుఱియగుచున్నాఁడు.

ప్రకృతి స్నేహమయి యగుటచే నున్నతి, అవనతుల సూత్రధారణభాగ్యమును జ్ఞానమను బాధ్యతపై మనుష్యునకే కల్పించియున్నది. కాని, ఈ రహస్యమును జ్ఞానియగు వాఁడే గ్రహించి యభ్యుదయము నందుచున్నాఁడు. అజ్ఞాని

గ్రహింపనేరక తన జీవితభాను నస్త్రాద్రికిఁ బయనము సేయు చున్నాఁడు.

మహాపురుషులతత్త్వజ్ఞానము కర్మఫలము వృథా కానేరదనియు, కర్త గృహమందు డాగినను, సాగరమందుఁ జొచ్చినను, ఘోరారణ్యమున దూరినను, పాతాళమున కరిగినను, మేఘమండలమున దాగినను ననుభవింపక తప్పదనియు ఘోషించుచున్నది. మనుష్యుఁ డజ్ఞానముచే వ్యభిచరించియో, వీర్యనష్టముఁ గావించుకొనియో తన కెట్టి కష్టము కలుగనేరదని లోలోన సంతసించుచుండును. పాప మజ్ఞానియధర్మము పీడాకర మను మర్మము నెఱుంగకున్నాఁడు.

"నాధర్మ శ్చరితో లోకే సద్యః ఫలతి గౌ రివ,
శనై రావర్తమానస్తు కర్తు ర్మూలాని కృంతతి."

—మనుధర్మశాస్త్రము.

"అధర్మముయొక్క ఫలము సత్వరము లభింపఁజాలదు. అది నెమ్మదిమీఁద మానవుని కవశ్యభోక్తవ్య మగును. ఈ కారణముననే జ్ఞానశూన్యులు, మోహాంధులు పాపకర్మలఁ గావింప భయముఁ జెందకున్నారు. పాపాచరణ మెప్పుడో యొకప్పుడు ఫలించి దుశ్చరిత్రుని సౌఖ్యానందముల నిర్మూలించివేయఁగలదు.

విద్యార్థులు తా మొనరించియున్న దుష్కర్మలే తమ దుస్థితికిఁ గారణములనియు, దుష్కర్మలయొక్క దుష్ఫలము లవశ్యభోక్తవ్యములనియు, దుశ్చరిత్రుల నీశ్వరుఁడు క్షమింపఁజాలరనియు, తామాచరించియున్న పాపము యొక్క పరిణామము ప్రత్యక్షమగునంతనే లోకమంతయుఁ దమ్మొక్కసారిగ నసహ్యభావముతో వీక్షింపఁగలదనియు

కామాది దుష్టవికారములకు దాస్యమొనరించుటచే జీవిత మూల్య మంతరించుననియు గ్రహించియుండురేని దుష్కర్మల నాచరించుట కీషణ్మాత్రమయిన సమ్మతింపఁజాలరు.

లోకమున వాటిల్లుచుండు తప్పిదములు విశేషముగా నజ్ఞానముచేఁ గలిగినవే యని గ్రహింపఁదగును. అజ్ఞానముచే మనుష్యుఁ డున్మత్తునివలెఁ జేయరాని పనులనెల్లఁ జేయుచు విపద్గ్రస్తుఁడగును. అగ్ని నగ్నిగా నెఱింగి యద్దాని స్వభావమును దెలిసియుండిన దానిని స్పృశింపనొల్లఁడు. కారణ మేమన నగ్నిస్పర్శచే దేహబాధయు, బాధచే దుఃఖమును గలుగుచున్నది. మనుష్యుఁడు దుఃఖమును ప్రేమింపనొల్లఁడు.

విద్యార్థులు పవిత్రమగు జ్ఞానమును సంపాదించియుండిన స్వప్నమందయిన నేవిధమగు దుష్కర్మల నాచరింపక విశుద్ధ బుద్ధిసంపన్నులమయి సులభముగాఁ దమ యున్నతి సూత్రము నన్వేషించి పట్టుకొనఁగలరు. ఎట్టిశ్రేష్ఠమగు రాజాన్నము నయినను విషలిప్తమయి యున్న దని గ్రహించిన నెట్టి మూఢుఁడయినను భుజింపనొల్లఁడు. అదియే చందమున యథార్థమగు నాత్మోన్నతి నందఁగోరు విద్యార్థులు స్త్రీలయొక్కయు, ఇతరమోహోత్పాదకములగు పదార్థములయొక్కయు బాహ్యాటోపమును గాంచి వ్యామోహాంధులు కానొల్లరు.

అజ్ఞానులును, మోహాంధులును నగు విద్యార్థులు విలాసములవంటి దుష్టపదార్థముల బాహ్యారూపమును విలోకించి ముగ్ధులయి దీపమునఁబడి దగ్ధమగు శలభములమాడ్కి నశించుచున్నారు. కావున విద్యార్థు లెల్లరు నజ్ఞానమునే

మృత్యువనియు, సుజ్ఞానమునే సుందరజీవనమనియు బాగుగా గ్రహింపఁదగును.

"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతేఽర్జున" అని కృష్ణుఁడర్జునున కుపదేశించియున్నాఁడు. విద్యార్థులు తమయందు వ్యాపించియున్న సమస్త దుర్వ్యసనములకు మూలకారణ మజ్ఞానమే యని గ్రహించి తన్నాశనమునకయి యత్నించెదరుగాక! విద్యార్థులు బుద్ధిమంతులయి, సదాచార సంపన్నులయి సజ్జనసాంగత్యమునను, సద్గ్రంథపఠనమునను, సద్గురు హితోపదేశమునను, అంతఃకరణప్రబోధమునను, స్వానుభవముచేతను జ్ఞానమును వృద్ధిఁగావించుకొనుచుఁ దన్మూలమున బ్రహ్మచర్యవ్రతపాలనాధిపణులయి జన్మసాఫల్యమును బడయుదురుగాక! సచ్చారిత్ర నిర్మాణమునను, సుజ్ఞాన సంపాదనమునను, సందేహితచిత్తుఁడగువాఁడు మూర్ఖుఁడు.

"విశ్వాసో ఫలదాయకః
సంశయాత్మా వినశ్యతి."



# నలుబదినాలుగవ ప్రకరణము



## మాతృభావదృష్టి

"మాతృవత్ పరదారేషు పరద్రవ్యేషు లోష్టవత్,
ఆత్మవ త్సర్వభూతేషు యో జానాతి స పండితః".

"పరస్త్రీని మాతవలెను, పరధనమును మట్టిపెల్లగను, సకలభూతములఁ దనవలెను జూచుకొను వ్యక్తి పండితుఁడు; పూజనీయుఁడు."

విద్యార్థులు శ్రీమదాంజనేయుఁడు ప్రతిస్త్రీని మాతృసమానగ భావించి, గౌరవించియుండినవిధమునఁ దమదృష్టికి గోచరించు ప్రతివనితను త్రికరణములఁ దల్లివలెఁ దలపోయు టావశ్యకము. మానసిక దుర్బలత్వమును, వ్యభిచారమును బహిష్కరింప నభిలషించు విద్యార్థులెల్లరు బాలభక్తవరుఁ డగు ప్రహ్లాదునివంటివా రగుటకయి కృషిసలుపు టెంతేని యగత్యము. ప్రహ్లాదునిచారిత్రము నలంకరించియుండిన సద్గుణములు మానసిక దౌర్బల్యమున కెంతమాత్ర మెడ మీాయ నేరవు.

సీ॥ తనయందు నిఖిలభూ♦తములందు నొకభంగి
సమహితత్వంబున ♦ జరుపువాఁడు,
పెద్దలఁ బొడగన్న ♦ భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ ♦ సేయువాఁడు,

కన్నుదోయికి నన్య ♦ కాంత లడ్డంబైన
మాతృభావము జేసి ♦ మరలువాఁడు,
తల్లిదండ్రులభంగి ♦ ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జిం ♦ తించువాఁడు,

తే॥గీ॥ సఖులయెడ సోదరస్థితి ♦ జరుపువాఁడు
దైవతము లంచు గురువులఁ ♦ దలఁచువాఁడు
లీలలందును బొంకులు ♦ లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్ర♦హ్లాదుఁ డధిప!

—భాగవతము.

ప్రహ్లాదుని చారిత్రమందలి సద్గుణములచేఁ జెన్నొందువాఁడే యథార్థమగు నాదర్శవిద్యార్థి. పవిత్రమగు మాతృభావదృష్టిచే ననుదినము వర్తించుచుండుటచేఁ గొంతకాలమునకు విద్యార్థియొక్క మానసమునందు దుస్సంకల్పములుదయించుట నిలిచిపోవును. అనవసరముగఁ బరకాంతను గన్నెత్తి చూడకుండుటయే మాతృభావదృష్టియొక్క ప్రథమ లక్షణము. ఒకస్త్రీని జూచుట తటస్థించెనేని తత్క్షణమే హృదయమున సద్భావములఁ జింతించుటగత్యము. విస్మరించియు నే స్త్రీని ధ్యానించుట గాని, స్మరించుట గాని విద్యార్థులకుఁ దగదు.

వాల్మీకిరామాయణమున లక్ష్మణుఁడు లోకమందలి సమస్తస్త్రీలయందు జానకీదేవియొక్క స్వరూపమునే విలోకించుచుఁ దత్స్వరూపమునెడ మాతృభావమును ప్రకటించుచుండెడివాఁడని వ్రాయఁబడియున్నది. విద్యార్థులవలె విద్యార్థినులును బరపురుషులఁ దమ్ముఁ గన్నతండ్రులుగ

భావించు కొనుట మిక్కిలి శ్రేయస్కరము. మాతృభావ చింతనము, ఈశ్వరసంస్మరణము, భగినీభావధ్యానము దుష్ట సంకల్పనిర్మూలమునకుఁ బరమోత్తమసాధనములు.

మాతృభావదృష్టిని గలిగియుండుటయందు లక్ష్మణుఁడపూర్వశక్తిసంపన్నుఁడగుటవలననే యౌవనవతి యగు భార్యను గృహమున విడిచి, రాజప్రాసాదముల నివసించుటకు మాఱుగా ఘాతుకమృగవిషసర్పసంకులమగు ఘోరారణ్యమున నివసించి, షడ్రసోపేతాన్నములకు బదులుగాఁ గందమూలాదుల భక్షించుటకును, పీతాంబరముల విడనాడి నల్కలధారి యగుటకును, యావద్భారతవర్ష రాజలోకహృదయము నాకర్షింపఁగలట్టి లోకోత్తర సౌందర్యనిధియగు సీతాదేవిని గన్నతల్లివలెఁ గాంచుటకును, చతుర్దశవత్సరము లస్ఖలితబ్రహ్మచారియయి మనుటకును సమర్థుఁడు కాఁగలిగెను.

సీతాన్వేషణసందర్భమున రామలక్ష్మణులు ఋష్యమూకపర్వతమును సమీపించినపుడు శ్రీమదాంజనేయుఁడు వారిచెంత కేతెంచి పరిచయమునంది, రావణాపహరణ సమయమున సీత స్వప్రాణసంరక్షణమునకు సాహాయ్యపడునను విశ్వాసభావముతోఁ దమయొద్దకు విసఱిపాఱవైచిన భూషణములఁ గొనివచ్చి చింతాభరముచే రాముఁడవనతవదనుఁడై విలపించుచుండ, లక్ష్మణునికా యా భూషణముల నొక్కొక్కటిగాఁ జూపి నీ వీ యలంకారము లెవరివో గుర్తింపఁగలవా యని ప్రశ్నింప నతఁ డిట్లుత్తర మొసంగెను. ఆంజనేయా !

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్".

—వాల్మీకి రామాయణము

"నేను నీవు చూపించునట్టి యీ దండగడియము లెవరివో గుర్తింపజాల. ఈ కుండలము (పోఁగులు)లను గుర్తింపఁజాలను. నేను నిత్యము సీతాదేవియొక్క పాదారవిందములకు నమస్కరించుచు వానియందే భక్తిభావయుతమగు దృష్టి నిల్పియుండువాఁడనుగాన నీ నూపురము (అందెలు) లా యమ్మవే యనిమాత్రము స్పష్టముగాఁ నుడువఁగలను"

ఛాత్రులారా! చూచితిరా! శ్రీ లక్ష్మణుని పవిత్ర మాతృభావదృష్టి, సుస్థిరచిత్తసంయమశక్తి యెంతగంభీరములై యున్నవో, ఆతడు తనజీవితకాలమంతయు సీతారాములఁ బాదసన్నిధియందే కడపియున్నవాఁడై యుండియు నెప్పుడును దనదృష్టిని జానకీముఖారవిందసందర్శనమున లగ్నమొనరించి యుండలేదు. సౌమిత్రుని గంభీరమగు నీపద్ధతియే వాని నొక మహాపురుషు నొనరింపఁగలిగినది. తమహితము నభిలషించు విద్యార్థు లెల్లరు లక్ష్మణుని జీవితవిధానము ననుసరించుట సమంజసము.

లక్ష్మణునిదే యథార్థమగు బ్రహ్మచర్యవ్రతానుష్ఠాన విధానాదర్శము. మీరును సుమిత్రానందనునివలెఁ జంచల దృష్టినిఁ బాసి, స్థిరచిత్తులయి సకలస్త్రీసముదాయమునెడ నిర్మలమగు భావమును గలిగియుండి పరిశుద్ధహృదయులయి, ఆదర్శ బ్రహ్మచారులయి, ధిషణులయి విద్యావివేకముల సంపాదించి, యుక్తప్రాయమున గృహస్థాశ్రమమును స్వీక

రించి, గృహస్థబ్రహ్మచారులయి, ఉత్తమజీవితానందసౌఖ్యముల ననుభవించుచు నిహపరాభ్యుదయమును బడయుఁడు. పరమోజ్జ్వలమును, అమూల్యమును నగు నీశ్లోకమును విస్మరింపకుఁడు.

"ధర్మ్యం యశస్య మాయుష్యం లోకద్వయరసాయనం,
అనుమోదామహే బ్రహ్మచర్య మేకాంతనిర్మలమ్".

"లోకమందు ధర్మమునకు హితకరమయినదియు, కీర్తిని, ఆయువును వృద్ధిఁ గావించునదియు, ఇహపరములయందు సౌఖ్యదాయకమగునదియు బ్రహ్మచర్యమే."

ఛాత్రులారా! మీ రీ రహస్యమును మఱవకుఁడు.

శుభమస్తు.



# నలుబదియైదవ ప్రకరణము



## గాంధిగారి ప్రబోధము

ఒకపర్యాయ ముత్తరదేశమున సంచార మొనరించు చుండిన సందర్భమున గాంధిమహాత్ముఁడు విద్యార్థిసభయం దిట్లుపన్యసించెను:—

"విద్యార్థులారా !

నేఁడు మీహితము నపేక్షించి బ్రహ్మచర్యమును గూర్చి సంక్షిప్తముగా ముచ్చటించుచున్నాఁడను. మీరెల్లరు నాప్రబోధమందుఁగల ముఖ్యవిషయముల గ్రహించి, ఆచ రించి ధన్యులగుఁడు. యువకులగుమీరు మీజీవితకాలమందు సర్వకాలసర్వావస్థలలో బాహ్యాభ్యంతరములఁ బరిశుద్ధు లయి యుండవలయును. ఇదియే మీ ప్రథమాచరణీయమగు పవిత్రధర్మము మీరు మీజీవితములయొక్క సమస్తకర్త వ్యముల శౌచమునకే ముఖ్యస్థానము నొసంగుఁడు.

మూర్తీభవించిన శౌచమునకే బ్రహ్మచర్యమని పేరు. బ్రహ్మచర్యము నిత్యానందసంధాయకమయినది. విజ్ఞానధను లగు మనపూర్వులు వచించినట్లు "బ్రహ్మణి చరతీతి బ్రహ్మ చర్యః" బాహ్యాభ్రమణమునుండి చిత్తమును నిరోధించి స్వాత్మయందు విలీన మొనరించుకొనుటయే బ్రహ్మచర్యమని నేనుసయితము విశ్వసించుచున్నాఁడను. మానవునకు

సర్వోత్తమపురుషార్థమగు మోక్షోపలబ్ధికి బ్రహ్మచర్యమే యుత్తమ సాధనము.

అనాదిసిద్ధమును, జగత్ప్రసిద్ధమును నగు భారతీయ ధర్మ మెట్లు బ్రహ్మచర్యమహిమాసంకీర్తనము సలిపి యున్నదో, అదియేచందమున మహమ్మదీయధర్మమును బాపదమన మను నామాంతరముచే బ్రహ్మచర్యమును స్తుతించుచున్నది. క్రైస్తవ, పారశీక, యహూదీ(యూదులు) మతములును బ్రహ్మచర్యమును గీర్తించియున్నవి. నేఁడు భారతీయయువజనమండలికి బ్రహ్మచర్యరత్నాభావముచేఁ గలిగిన నష్ట మింతింతయని వచింప వలనుపడదు.

యువకులగు మీజీవితము లపవిత్రములయి పోయినవి. ప్రతియువకుఁడును వ్యక్తిగతముగఁ దనజీవితమును బరిశుద్ధ మొనరించుకొననిదే సాంఘికజీవితము సంస్కరింపఁబడఁ జాలదు. విద్యార్థులు బ్రహ్మచర్యావలంబనముచే స్వీయ జీవితసంస్కరణోద్ధరణకార్యమును నిర్వహింపనిదే మఱి యే విధమగు పుణ్యకార్యమును సాధింపఁజాలరు. మానవుని యైహికాముష్మికధర్మములలో సర్వప్రథమమగు బ్రహ్మచర్యము ననుష్ఠింపఁజాలని విద్యార్థు లెట్లు రాష్ట్రోన్నతిని గావింప సమర్థులగుదురో నే నూహింపఁజాలను.

నే ననేకులగు యువకులతోడ నీవిషయమును గూర్చి దీర్ఘముగఁ బ్రసంగించియుంటిని. పండితులును, కవులును, మేధావంతులును, గ్రంథరచయితలునగు విద్యార్థులెందఱో తమ జీవితరహస్యముల నన్నింటి నాతోఁ జెప్పుకొని తమ దురదృష్టజీవితచర్యల కెంతయు విలపించియున్నారు.

పాపము ! అపవిత్రజీవితములచే వారిసమస్తకర్తవ్యములును, జీవితానందస్వేచ్ఛాసౌఖ్యశాంతులు వ్యర్థములయిపోయినవి.

యువకులును, విద్యార్థులును నగు మీప్రయోజనము నభిలషించి యొక యువకునివిషయమునుగూర్చి యొకింత ముచ్చటించెదను. ఆ యువకుఁడు నాతోఁ గలిసి యనేకసంవత్సరములు తనజీవితమును గడపియున్నాఁడు. విద్యార్థిదశయందతఁడు భ్రష్టుఁడను నపకీర్తికిఁ బాల్పడియుండెను. అనంతర మతఁడొక విద్యాలయమునం దుపాధ్యాయుఁడుగఁ బ్రవేశించెను. దుష్టవృత్తులతనిని వ్యర్థుని గావించివైచెను.

ఆతఁడిపుడే కార్యము నాచరింపలేనంతటి యసమర్థుఁడై పోయిన హేతువుచే నేఁడేని యొక నిర్జనస్థానమునం దేకాకియయి యుండి తన సమస్తపాపములకై చింతించుచుఁ బ్రాయశ్చిత్త మొనరించుకొనుచున్నాఁడు. నే నిపుడు మీకు యుదాహరణము నొకదానినే చూపించియున్నాడను. కాని యిట్టి దురభ్యాసములచేఁ తమజీవితములఁ గలుషితములుగను, నిరుపయోగములుగను జేసికొనియున్న యువకుల ననేకుల నెఱుంగుదును. మీరు సచ్చరిత్రులయి, దురభ్యాసముల నన్నింటిఁ బరిత్యజించి, బ్రహ్మచర్యము నవలంబించి సమస్తవిధముల స్వోన్నతిని, దేశోన్నతినిఁ గావింపఁగోరుచున్నాడను.

ప్రేమాస్పదులగు విద్యార్థులారా! నేఁటినుండి మీరెల్లరు దుర్వాసనలను, దురభ్యాసములను విసర్జించి నిర్మలజీవితములఁ గడప దృఢసంకల్పదీక్షితు లగుఁడు. ఇందే మీ జన్మసాఫల్యము కలదని విశ్వసింపుఁడు. ఈకార్యము మిక్కిలి

కష్టసాధ్యమని నేనెఱుంగుదును. మద్యపానదురభ్యాస విసర్జనముకంటె బ్రహ్మచర్య వ్రతానుష్ఠానము కరము కష్టసాధ్యమయినదేయని నేనెఱుంగుదును.

ప్రయత్నించినచో నిది మీకు సులభసాధ్యమే యగును. మహాభయంకరములగు దురభ్యాసములను విపత్సముద్రములనుండి మిమ్ము మీరుద్ధరించుకొనుటకై మీచిత్తసీమలయం దీశ్వరవిశ్వాసమును నెలకొల్పుఁడు. పరమాత్మునియందు మీ రవలంబించు విశ్వాసము మీకు సమస్త కర్తవ్యముల నిర్వహించుటయందు సాహాయ్యభూతమయి మిమ్ముఁ బరిశుద్ధులఁగా వించును. ప్రభాతమున నిద్రనుండి మేల్కాంచి నంతనే కరుణామయుండగు భగవానుని సంస్మరించి దైనిక కర్తవ్య క్రమమును నిర్ణయించుకొనుఁడు.

జీవితకాలమందలి యొక్క క్షణకాలము నేని నిరుద్యోగమున వ్యర్థమొనరింపక ప్రతిక్షణమును సద్వినియోగపఱచుచున్నచో దురభ్యాసములు మిమ్ము బాధింపనేరవు. అహోరాత్రములు కర్తవ్యనిర్వహణమున లీనుడఁయి యుండువాని చిత్తమును విషయాదు లాకర్షింపఁజాలవు. బ్రహ్మచర్యపాలనమున కిదియే ప్రశస్తమగు సదుపాయము.

బ్రహ్మచర్యమనఁ గేవలము వీర్యమును వృద్ధిఁ గావించుకొను వ్యాపారమేయని తలంపకుఁడు.

"కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా
సర్వత్ర మైథునత్యాగం బ్రహ్మచర్యం తదుచ్యతే."

"కార్యరూపమునను, మానసికముగను, వాగ్రూపముగను సర్వకాల సర్వావస్థలయందును సర్వత్ర సర్వదా సకలమైథునములను ద్యజించుటచే బ్రహ్మచర్య మనఁబడును.

విద్యార్థు లీ సూక్ష్మమగు మర్మము నర్థము జేసికొనవలయును. సకలార్థసిద్ధికి దేహారోగ్యము ముఖ్యసాధనమగుటచే వీర్యమువలన ఛాత్రులు స్వస్థదేహులయి సకలాభీష్టముల సిద్ధింపఁ జేసికొనఁగలరు. "శుక్రం తస్మా ద్విశేషరక్ష్యమారోగ్య మిచ్ఛతా." అను ఋషివాక్యమును విస్మరింపఁకూడదు. శుభమస్తు.



# నలుబదియాఱవ ప్రకరణము

## ఈశ్వరభక్తి

"సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ, ఆనందరూప మమృతం యద్విభాతి శాంతం శివ మద్వైతం, శుద్ధ మపాపవిద్ధం."

"ఈశ్వరుఁడు సత్యస్వరూపుఁడు. సర్వజ్ఞుఁడు. ఆద్యంత రహితుఁడు. స్వయంజ్యోతిస్స్వరూపుఁడు. ఆనంద పరిపూర్ణుఁడు. మధుమయుఁడు. నిర్వికారుఁడు. శాంతస్వరూపుఁడు. మంగళాకారుఁడు. అనన్యుఁడు. ఏకమాత్రుఁడు. నిత్యపరిశుద్ధుఁడు. పాపశూన్యుఁడు. బుద్ధుఁడు. స్వయంసిద్ధుఁడు."

అపూర్వమహిమాభిరాముండగు సర్వేశ్వరుఁ డనంత శక్తిసంపన్నుఁడు. లోచనగోచరమగు నీవిశాలచరాచరాత్మక ప్రపంచమున కతఁడే కర్త. ఆ మహానుభావుని దివ్యతత్వమును సంపూర్ణముగా గ్రహింపఁ గించిజ్ఞుఁడగు మనుష్యుఁడు సమర్థుఁడు కాఁజాలడు సృష్టియందు నేఁటివఱకు జన్మించిన మహాపురుషులెల్లరు సర్వేశ్వరుని యపారాద్భుతాప్రమేయ సద్గుణసముదాయముల కచ్చెరువొంది, తద్దేవుని సద్గుణసంకీర్తనమునకును, తత్సేవకును దమజీవితధనమును సమర్పించి యున్నారు.

మనుష్యుఁడు ప్రశాంతహృదయుఁడయి, గంభీరమనస్కుఁడయి దీర్ఘముగ విచారించి విశాలమగు జ్ఞానదృష్టితో

వీక్షించు నేని వాని కీ జగతీతలమందలి ప్రతిరేణువును సర్వేశ్వరుని కతని నిర్వ్యాజకరుణామృత వృష్టికయి క్షణక్షణము కృతజ్ఞతను దెలుపుచున్నట్లు గ్రహింపఁగలఁడు. ఈశ్వరుని భావములును, వాంఛలును, సంకల్పములును, ప్రయత్నములును, కార్యములును సర్వకాలసర్వావస్థల లోకకల్యాణమందే సంలగ్నములయి యున్నటులఁ బరిశోధనచేఁ బ్రాజ్ఞ ప్రపంచము సులభముగా గుర్తింపఁగలదు.

జగదీశ్వరుఁడు సకలప్రపంచమునందోతప్రోతభావమునం దధివసించుటవలననే మన మీలోకమందు సనాథులముగను, సౌఖ్యవంతులముగను నుండి సకలాభీష్టముల సిద్ధింపఁ జేసికొనుచు నిర్మలానందశాంతుల ననుభవింప సమర్థులమగుచున్నారము. సమస్తలోకమునకు జనకుఁడును, భర్తయునగు నప్పరమేశ్వరుని కసాధ్యమగు కార్యమును, అతీతమగు వస్తువును లేదు.

సమస్తమా జగన్నేతకధీనమయి యున్నది. వింత వింతరంగులతో, వివిధములగు కాంతులతో, నానాచిత్ర విచిత్రములతోఁ దనరారుచున్న యీ ప్రకృతికి సూత్రధారుఁడు పరాత్పరుఁడే. సృష్టియొక్క విస్మయోత్పాదకరచనాకౌశలమును సందర్శింప సమర్థుండగు వ్యక్తికి తత్స్రష్టయగు జగదీశ్వరుఁ డెట్టి ఘనుఁడో, సర్వమాన్యుఁడో స్పష్టము కాఁగలదు.

ఖం వాయు మగ్నిం సలిలం మహీం చ
జ్యోతీంషి సత్త్వాని దిశో ద్రుమాదీన్
సరిత్ సముద్రాంశ్చ హరేః శరీరం
యత్కించ భూతం ప్రణమే దనన్యం.

—మహాభాగవతము.

"గగనమును, అనిలమును, అనలమును, సలిలమును, వసుంధరను, తారకాదిగ్రహములను, భూతములు, దిక్కులు, నదులు, సముద్రములు, మున్నగు సకలపదార్థములను సర్వేశ్వరునియొక్క దేహముగ భావించి మనుజుఁడా! నమస్కరించుచుండుము. అట్లొనరించుచుండుటచే మానవుఁడు పరాత్పరుని యనంతసద్గుణములను, లోకోపకారపరతంత్రతను, దయాళుత్వ కృపాళుత్వములను, దివ్యశక్తులను క్రమక్రమముగా గ్రహింపఁగలుగుచున్నాఁడు.

దివాకరుఁ డేవిధముగఁ దన సహస్రకిరణములచే సకలప్రపంచమును బ్రకాశవంత మొనరించుచున్నాఁడో, అదియేచందమున మహత్తరానూనశక్తిసంపన్నమగు తన జ్ఞానజ్యోతిచే దృశ్యాదృశ్యవిశ్వముల నెల్ల దీప్తివంతములుగఁ జేసి కడు సావధానుఁడయి సంరక్షించుచున్నాఁడు. ఆ పరమదయాంబుధియగు నానందస్వరూపుని దివ్యశక్తిచే నావృతముగాని స్థలములేదు. లోకమందలి ప్రతిరేణువునందతని నిర్మలమగు చైతన్యము నెలకొనియున్నది. కావుననే భక్తశిరోమణియగు ప్రహ్లాదుఁడు నిజజనకునితో నిట్లు నుడివెను:—

మ॥ కలఁడంభోధిఁ గలండుగాలిఁ గలఁ డాకాశంబునన్ గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తుల ద్రిలింగ వ్యక్తులం
దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల? యీ యా యెడన్.

క॥ ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే.

—భాగవతము.

ప్రహ్లాదుని యీ వచనము లెంతయు గంభీరములును, యథార్థములును నయి యున్నవి. సృష్టినిర్మాతయగు సర్వేశ్వరుఁ డెట్లు సర్వశక్తిసంపన్నుఁడై యున్నాఁడో, అదియే చందమున సనాతనుండును, సర్వవ్యాపకుండును, సచ్చిదానందుఁడును, అగమ్యుఁడును, అగోచరుఁడును నయి వెలయుచున్నాఁడు.

God is a circle whose centre is everywhere,
and circumference no where.

—St Augustine.

"పరాత్పరుఁ డెచ్చోటఁ గాంచినను మధ్యములభించు వలయమువలె నున్నాఁడు. కాని యీ వర్తులముయొక్క చుట్టుగీతమాత్ర మెచ్చోటను లేదు."

అనగా దేవుఁ డెచ్చోటఁజూచినను దానెయై వెలయుచున్నాఁడు. కాని యతనికిఁ బారమున్నటులే కానరాదు. కావుననే యనంతుడయినాఁడు. —సెంటు అగస్టయిను.

సర్వప్రపంచమును నుద్దీపిత మొనరింపఁగల శక్తిని భాను డీశ్వరునినుండియే పడసినాఁడు. అట్లగుట దివాకరుఁడు పరమేశ్వరునియొక్క విశుద్ధప్రతిబింబమే యగుఁ గాని స్వయమీశ్వరుఁడు గాఁజాలఁడు. ఈశ్వరుని దివ్యశక్తియే భానురశ్మి రూపంబున విశ్వమున కుష్ణమును బ్రసాదించి తన్మూలమున

పత్రరసోపేతములగు నాహారముల వృక్షములచే ఫలింపఁ జేయుచు మన కొసంగుచున్నది.

ఈశ్వరానుగ్రహంబుననే వసుంధర సుస్థిరమయి, ప్రశాంతమయి, సారవంతమయి సమగ్రసృష్టికి జీవనాధారము గల్పించుచున్నది. ఈశ్వరుని కరుణాళుత్వముననే దివాకరనిశాకరులు నిస్స్వార్థభావముతో సదా లోకసేవయందు నిరతులయి యున్నారు. సర్వేశ్వరుని నిర్వ్యాజకృపావిశేషముననే నీరదములు సకాలమున వర్షించుచు, మధురోదకముచే నదీనదముల నింపుచు జీవరాసులఁ గాపాడుచున్నవి.

క్షుత్పిపాసలఁ దీర్చు జలాన్నములకంటె నమూల్యమయి, అనుక్షణాపేక్షణీయమయి మహత్సుఖదాయకమగు మందమారుతము సర్వేశ్వరుని నిర్వ్యాజప్రేమాతిశయముననే హాయిగావీచుచున్నది. దయామయుండగు సర్వేశ్వరుని పవిత్ర శాసనమును శిరసా వహించియే వృక్షములు మనకు వివిధములగు పరిపక్వరుచ్యఫలాదులను, సుగంధమయసుందర పుష్పములను బ్రసాదించుచున్నయవి. ఈశ్వరుని నిష్కళంకమగు పరిపూర్ణకరుణామృతరసమే జడప్రాయమగు సృష్టికి జీవకళ నొసంగుచున్నయది.

సర్వలోకమున కాశ్రయభూతుఁడగు నిట్టి సర్వేశ్వరుఁ డెంతటి మేధావంతుఁడో, సర్వశ్రేష్ఠుఁడో, దయాసాగరుఁడో, సద్గుణశీలుఁడో యూహింప మనకు శక్యముగాదు. నిరంతరము మనశ్రేయమునభిలషించి, కృషిసలుపుచునుండు మహాఘనతయగు సర్వేశ్వరుని పవిత్రశాసనములఁ బాలింపని

వారెంత మూఢులు! మానవులు దుష్టులయి, దుర్మార్గులయి ధర్మమార్గము నతిక్రమించినపుడు సర్వేశ్వరుఁడు క్రుద్ధుఁడయి సముద్రముల నుప్పొంగఁజేయును. భూకంపముల నొదవించును. అగ్నిపర్వతములనుండి భయంకరాగ్నిజ్వాలలఁ బుట్టించి సకల లోకంబుల దహించివైచును. కుంభవృష్టిచే భూమ్యాకాశముల జలమయం బొనరించి వైచును. హృద్విదారకములగు పిడుగుల నాకాశమునుండి యగణితముగ రాల్చుచుండఁగలఁడు. ఈశ్వరుఁడు సంకల్ప మాత్రంబున సకలమును సృజించుచు నిచ్ఛామాత్రంబున విధ్వంస మొనరించివేయ సమర్థుఁడయి యున్నాఁడు.

సర్వశక్తిసంపన్నుండగు నిట్టి జగదీశ్వరుని దివ్యతేజస్సమ్ముఖంబున నవనతమస్తకుండగుట మానవుని యుత్తమ ధర్మము. మనుష్యుఁడా! నీవు సావధానుఁడవయియుండి సదా సత్కర్మానుష్ఠానముచే సర్వేశ్వరుని ప్రీతికిఁ బాత్రుఁడ వగుచుండుము.

ఈశ్వరుని బ్రసన్న మొనరింప వాంఛింతువేని యీ నిమ్నోదాహృతములగు సుగుణసుమనముల నాతని కర్పింపుము.

"అహింసా ప్రథమం పుష్పం
పుష్ప మింద్రియనిగ్రహం
సర్వభూతదయా పుష్పం
క్షమాపుష్పం విశేషతః
శాంతిపుష్పం తపఃపుష్పం
ధ్యానపుష్పం తథైవచ
సత్య మష్ట విధం పుష్పం
విష్ణోః ప్రీతికరం భవేత్ ||"

కుమారా! శిలాఖండమునకు శ్రవణనేత్రములను, కరచరణములను గల్పించి యాయాకృతికి జలాభిషేక మొనరించియు, ధూపదీప నైవేద్యముల సమర్పించియు, కర్పూరహారతి నొసంగియు, పుష్పాదుల నర్పించియు నంతమాత్రము ననే యీశ్వరుపూజ ముగిసిన దని మురియవద్దు. భక్తిప్రధానమగు పూజ కిది విధానము కాదు. అహింస, ఇంద్రియనిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపము, ధ్యానము, సత్యము మున్నగు సద్గుణములతో విరాజిల్లు హృత్కమలమును సమర్పించుటవలననే భగవంతుఁడు ప్రసన్నుఁడగును. దీనికి విరుద్ధములగు పూజలన్నియు యథార్థమగు భక్తికిఁ జిహ్నములు కానేరవు. వేమన్ననీతి యిట స్మరణీయము!

ఆ॥ అరయ దేవదేవు • నారాధనముసేయ
నష్టదళ సుమనంబు • లమరవలయు
దీని దెలిసికొనని • దేవుని పూజేల
విశ్వదాభిరామ • వినుర వేమ!

మానవుని హృదయమునం దొదవుచుండు సమస్త భావముల దేవదేవుఁ డెఱుంగును ఆతఁడు సకలలోకరహస్యసంవేది. ఇంగితజ్ఞాన సముపేతుఁడు. భగవంతుఁడు సకలమును గుర్తించుచుండువాఁడగుటచే వానికి భయపడుము. భవిష్యద్విషయము లన్నియు దర్పణమందలి ముఖమువలె సులభముగ నతనికి గోచరించుచుండును. ఆతఁడు త్రికాలజ్ఞుఁడు. నీభాగ్యాభాగ్యము లెట్లున్నవో యాప్రభు వెఱుంగును.

పరమేశ్వరుఁడు దీనదయాళుఁడు. సకలజనకృపాళుఁడు. దానశీలుఁడు. ప్రేమమయుఁడు. అతని దయవలనను, వాత్సల్య భావమునను సమస్తజీవప్రపంచము సుఖపూర్వకముగ మనుచున్నయది. తద్దేవుని నిష్కళంకమును, అపారమును, అత్యద్భుతమును నగు సౌజన్య మతని ప్రకృతియందునఁగోచరమగు చున్నయది. ఆదేవుఁడు సంపద్భండారము. సకలఋద్ధి కేంద్రము సృష్టియొక్క ప్రత్యణువునుండియు నతకృపారస మభిరామముగా నొలుకుచుండును.

ఆ దేవుఁ డనుక్షణ మీసృష్టిని నూతనసౌందర్యముచే విభూషితము గావించుచున్నాఁడు. కరుణానిధియగు నాపరమపిత మనహృదయహ్లాదార్థము విశ్వమున నిత్యనవీనతను ప్రబర్శించుచున్నాఁడు. వాస్తవ మాలోచింప దైవకృపకు దూరముగానున్న ప్రాణి యేదియు నీవిశాలవిశ్వంబున గోచరిందు. కావుననే మహానుభావుఁడగు నొక కవీశ్వరుఁడు సృష్టి యీశ్వరునిచే నేరీతి సర్వోత్తమంబగు రూపము నరియున్నదియు నిట్లు వచించియున్నాఁడు.

**O friend, my bosom said**
**through Thee alone the sky is arched**
**through Thee the rose is red**
**all things through Thee take nobler form.**

—Emerson.

ఓ సహృదయుఁడా! నీమూలముననే గగనము మండలాకృతిని వహించియున్నది; నీవలననే గులాబిపుష్ప మరుణరంజితమయియున్నది; సమస్తపదార్థములు నీవలననే ఉత్తమ రూపము నందియున్న వని నాహృదయము వచించియున్నది."

—ఎమర్సను.

ఎమర్సను కవీంద్రుఁడు వచించిన విధముగ భూమండలమంతయు దేవునిమహత్తరమగు ప్రభావముననే దేదీప్యమానమయి వెలయుచున్నది. ఆ ప్రభువుయొక్క శరోపకారబుద్ధి, సృష్టిహితకాంక్ష, విశ్వకల్యాణపరతంత్రిత నేత్రముల విప్పిచూచినను, శ్రవణములచే నాలించినను, హృదయముచే భావించినను, నాసికచే నాఘ్రాణించినను, జిహ్వచేఁ జవిఁజూచినను, త్వగింద్రియముచే స్పృశించినను హృదయంగమము లగును.

ఆ జగన్నియంతయొక్క లోకోత్తరంబగు దివ్యశక్తి వికసితపుష్పములందును, తరంగిణీ వీచికాపరంపరలయందును, విహంగవితతుల యవ్యక్తశ్రావ్యసంగీతమందును, ప్రభాతశీతల వాయుతరంగములందును, రవిరశ్మియందును, రాకాసుధాకరచంద్రికయందును, దీపజ్యోతిశిఖయందును, గగనమండల వ్యాప్త వివిధవర్ణములందును, నిశీథకాలకవతయందును, ఉత్తుంగ గిరిశిఖరములందును, కోలహలమగు ప్రపంచస్వభావ మందును, బాల్యక్రీడావినోదములందును, గంభీరభావనలందును, మృదుమధురశబ్దములందును, ఉష:కాలప్రకృతియందును, దిగదిగంతవ్యాప్తినిస్తబ్ధతయందును, నిర్జనస్థలనైర్మల్యమందును, శరత్కాలనీరదశకలమందును, అరవిరిచూడ్కియందును, వసంతఋతువందలి వనలక్ష్మీసందర్శనమందును, ఘోరాంధకారపుంజవ్యాప్త గగనమండల ప్రకాశిత ధ్రువతారయందును, మరంద పానోన్మత్తషట్పద ఝుంకారమందును, పుష్పితరసాల వనాంతరాస్థిత పికగానమందును, మానవజీవితతత్వగాంభీర్యమందును వర్ణింపసాధ్యపడని యింకెన్నెన్నియో వస్తుసముదాయములం

దును సూక్ష్మాతి సూక్ష్మరూపంబునను, స్థూలాకృతియందును ప్రతిబింబితమయియున్నది.

మనము గ్రీవమునెత్తి, కనువిప్పి, భూమ్యాకాశములకు మధ్యనున్న వాయుమండలములలోని దృశ్యము నవలోకించినంతనే మహానుభావుఁడగు సర్వేశ్వరుని యపూర్వ తేజము, అనంత ప్రభావము, అద్వితీయశక్తిసామర్థ్యములు స్పష్టపడఁగలవు. విశాలమగు నీ సర్వసర్వంసహా చక్రమును బరిశీలనాదృష్టితో వీక్షించినచో దేవుని సహజౌదార్యము, సౌజన్యము, సహృదయత్వము ప్రకటితంబులగును.

పర్వతములు, కందరములు, సానువులు, సాంద్రాటవులు, సస్యశ్యామలములగు క్షేత్రములు, నదీనదములు, పాదపపంక్తులు దేవుని మహిమాస్వరూపములే. బ్రహ్మాండభాండమే దేవాలయము, పంచభూతములా ప్రభుసత్తముని దివ్యదేహముయొక్క వివిధావయవములు ఈలోకమందలి విలక్షణములగు కృతులతనివిభూతులు.

మనుష్యుఁడా! సమస్తప్రాణులకంటె విజ్ఞానముచే నిన్నధికుని గావించి తనకృపకుఁ బాత్రునిఁ గావించియున్న సర్వేశ్వరునే విస్మరించి విశ్వమున విఱ్ఱవీగుచుంటివా! మూఢమతీ! ఆ దేవుఁడు కృపాసింధువయి నీ జీవితము విశ్వమున సౌఖ్యానందకందమయి నెగడ నిర్మలాంతఃకరణమును, బుద్ధిని, సంఘాభ్యుదయమునకు విమలమగు వాణిని, తత్సిద్ధికయి విచారశక్తిని బ్రసాదించియుండ కృతఘ్నుఁడవయితివా?

మనుష్యుఁడా! విజ్ఞానరాశియగు జగదీశ్వరుఁడు నీ జీవితాభ్యుదయమునకై కల్పించియున్న నిబంధన లెంత మనోహరములు! ఆ మహాప్రభువు నీ స్వాభావికస్థితి ననుసరించి కర్తవ్యములఁ గొన్నింటి నిర్ణయించి తత్పాలనమందే నీ యథార్థములగు సౌఖ్యానందముల వెలయింపఁజేసియున్నాఁడు. నిన్నంటియుండు నీ ప్రతిబింబమువలె సర్వకాల సర్వావస్థలయందు నీ కేదేని కష్టము వాటిల్లునేమోయను భయముచే వాత్సల్యనిధియగు భగవంతుఁ డొక్కక్షణమేని నిన్నెడఁబాసి యుండక త్వదీయహితమునే సేకరించుచున్నాఁడు. నీకొఱకుఁ దనసర్వస్వమును ధారవోయుచున్న మహాత్యాగియగు నప్పరమాత్ముని ఋణము నెట్లు తీర్చుకొనవలయునో సహోదరుఁడా! యెపుడేని చింతించియుంటివా? అయ్యో! ఆ దేవుని పవిత్రనామమునే విస్మరించితివా? అట్లగుచో మానవుఁడవయి భువి నవతరించిన నీ జన్మ మేల?

శా॥ అంధేందూదయముల్ మహాబధిరశంఖారావములూమకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గ్రంథంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్.
—భాగవతము.

సోదరుఁడా! నీవు మూఢుఁడవయి నిన్ను సృజించి, పోషించుచు, నీ సకలసౌఖ్యములకు వలయు సాధనసంపత్తుల సేకరించి యిచ్చిన లోకబాంధవు నేక్షణమందు విస్మరించితివో, అప్పటినుండియే నీమతి జాడ్యగ్రస్తమయినది. నీయు న్నాయు కజ్ఞాన మంతరించినది. తదాదిగ నీవు దుష్టసంకల్ప

ప్రేరితుఁడవయి దుష్కర్మ లొనరించునపుడు జగదీశ్వరుఁడు పరమదయానిధి యగుటచే నీ యవివేకమునకు విచారించి నీ యంతరంగమున నాత్మారాముఁడయి యుపవిష్టించి నీకుఁ గర్తవ్యబోధ నొసంగుచుండుట నీవు విస్మరించితివా? దేవుని నీవు జడుఁడవయి నిరసించినకొలఁదియు నా కన్నతండ్రి నిన్నెడఁబాయలేక సదా నీకంతరాత్మచే ననుక్షణము ప్రబోధింపఁ జేయుచున్నాఁడు.

సహోదరుఁడా! ఒక్క నిమేషకాలము స్థిరచిత్తుఁడవయి, గుణవంతుఁడవయి, ధీమంతుఁడవయి నీకీ విశాలవిశ్వమునం దయాచితముగ హితమొనరించువాఁ డెవఁడేని కలఁడేమో విచారించుకొనుము. నీవు ప్రేమించుచున్న బంధుబాంధవులు, దారాపుత్రమిత్రులు, దాసదాసీజనులు స్వార్థాపేక్షచే నీ పొంతఁ జేరుచుండ వారల సన్మానించుటకయి నీవు ప్రయత్న మొనరింతువే కాని, నీ వెంతగా నిరసించుచున్నను నీహీనస్థితిని విలోకింపలేక సహానుభూతితో, నిండు ప్రేమతో నిరంతర మాత్మజ్ఞానముచే నిన్నుచితపథమునుండి విముఖునొనరింప యత్నించుచున్న నిస్స్వార్థుఁడును, పరమాప్తుఁడును, జగదేక సార్వభౌముఁడును నగు దేవుని సద్గుణగణముల సంస్మరించి యానందబాష్పముల రాల్చకుంటివేమి? అబ్బా! నీ కెల్ల విధముల తోడునీడయయి, చేదోడువాదోడు యయి, సంరక్షకుఁడయి యున్న లోకారాధ్యుని మఱచిపోయిన నీ వెంతటి స్వార్థాంధుఁడవు! జడుఁడవు!!

అయ్యో! కుమారా! నీహితాహితముల, ధర్మాధర్మముల గుర్తింపలేని నీ జీవిత మెందులకు? ఇంకెంత

కాలమిట్లు నాస్తికుఁడవయి, ధూర్తుఁడవై, జ్ఞానశూన్యుఁడవై గాఢాజ్ఞానాంధకారమున భోగమందిరమున - వ్యామోహ నిద్రలోఁ బడియుండెదవు ! లేలెమ్ము ! సావధానుఁడ వగుము ! నీ పరమహితైషియగు మహాత్ముని, జగదాధారుని, జగద్వంద్యుని, శ్రీపరమేశ్వరుని నిశ్చలహృదయముతో ధ్యానించుము. భజించుము. కీర్తించుము. నుతించుము. అపుడే నీజీవితము ప్రశాంతమయి, గంభీరమయి, నిర్వికార మయి నిర్మలానందమును బ్రసాదింపఁ గలదు.

కుమారా! నీవు సభక్తికముగఁ బరమేశ్వరుని సద్గుణ గణసంకీర్తన మొనరించుచు నతని యొక్కొక దివ్యగుణమును గూర్చి ప్రత్యేకముగాఁ జింతించుచు నతనివలెఁ బరిశుద్ధుఁడ వగుటకును, సద్గుణాలంకృతుఁడ వగుటకును యత్నించు చుందువేని సుగుణప్రియుఁడగు జగదీశ్వరుఁడు సంతుష్ట స్వాంతుఁడయి నిన్నాశీర్వదించఁగలఁడు. ఆతనియందుఁగల పవిత్రమగు కరుణారసముచే నీహృదయభాండ మెపుడు పరిపూర్ణమగునో, ఆ దేవుఁడు నిన్నుఁ బ్రేమించునట్లు నీ వెపుడు నీసాటి జీవరాసుల నన్నింటి హృదయపూర్వకముగఁ బ్రేమింతువో, అపుడే నీ వీశ్వరభక్తుఁడవు కాఁగలిగి భగవ త్ప్రీతిభాజనుఁడ వగుదువు.

నీవు సదా పరమేశ్వరుని కత్యంతప్రీతికరములగు సత్కర్మల నాచరించుచుండుము. భగవంతునినుండి నీ వెట్టి దయాదాక్షిణ్యములను, ప్రేమానురాగములను సంపాదింపఁ జూచుచుందువో అట్టిదయను, దాక్షిణ్యమును, ప్రేమను సమస్తజీవకోటులందుఁ గలిగియుండుము. నీసాటి సహో

దరుల హింసింపఁ గోరకుము. ద్వేషింపఁ దలంచకుము. నీహితము నీవెట్లు కోరుకొనుచుందువో, పరహితమును నట్లె మదియేరీతి నభిలషించుచుండుము.

లోకము భగవంతునిది. భగవంతుఁడు లోకమంతట వ్యాపించియున్నాఁడు. వాని తేజము జడములందుకంటెఁ జేతనములందు మిక్కిలి వ్యాపించియున్నది. కావున నీవీ రహస్యము నెఱింగి లోకసేవ యొనరించుము. లోకసేవయే భగవత్సేవ. లోకమందలి సత్పురుషుల సద్గుణములను, ప్రకృతియందుఁ గాననగుచున్న లోకోపకారపారీణతను గృతజ్ఞతతో నభినందించుటయే హరిని గీర్తించుట.

తే॥ గీ॥ చేతు లలయంగ శివునిఁ బూ♦జింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి♦ నుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ♦ దలఁపఁడేని
గలుగనేటికిఁ దల్లుల♦ కడుపుఁ జేటు.

—భాగవతము.

ఏ మానవుఁడు హస్తము లలసటఁ జెందువఱకు శివుననగా మంగళాకృతిని దాల్చియున్న లోకమందలి సమస్త జీవులయొక్క సేవ సలుపఁడో, ఏ మనుష్యుఁడు నోరునొచ్చువఱకు హరియనగా జ్ఞానసంపన్నములగు సద్గుణముల ఘనతను కీర్తింపఁడో, ఎవ్వాఁడు సత్యసంధుఁడయి లోకమునెడ దయార్ద్రహృదయుఁడయి మెలఁగఁడో, అట్టివాడు తల్లియొక్క కడుపును జెఱచుటకుఁ బుట్టినవాఁడే కాని జన్మసాఫల్యమునంద జన్మించినవాఁడుకాదను భాగవతపద్యము మను

ష్యున కీశ్వరభ_క్తియొక్క ముఖ్యావశ్యకతను జాటుచున్న యది.

కుమారా! నిత్యము నీవు నీయంతఃకరణముయొక్క దివ్యప్రబోధముల శ్రద్ధమెయి వినుచుఁ దదనువర్తివగుము. విశ్వప్రేమరహితుఁడును, సేవామార్గవిముఖుఁడును, కృపణుఁడును, స్వార్థాంధుఁడును సర్వేశ్వరునిప్రేమకుఁ బాత్రుఁడు కాఁజాలఁడు. ప్రఫుల్లవదనుఁడును, దయాధర్మసంలగ్నచిత్తుఁడును, పరోపకార పారీణుఁడును, మృదుమధురభాషియు, విశ్వసోదరభావోపేతుఁడును, ప్రేమానందమయ హృదయుఁడును, దీనజనపోషకుఁడును, దుర్బలమానవసేవకుఁడును, సముదారుఁడును, శుద్ధసాత్వికవర్తనుఁడును, ధీరుఁడును నగు నరరత్నమే —విశ్వభూషణమే —సద్గుణఖనియే భాగవతుఁ డనఁ బఱఁగి సర్వేశ్వరుని నిండు కృపారసమును జూరఁగొన సమర్థుఁ డగుచున్నాఁడు.

కుమారా! సర్వేశ్వరుఁడు నీకుఁ గావించియున్నట్టియు, కావించుచున్నట్టియు, కావింపనున్నట్టియు మేళ్లనుగూర్చి విచారింతువేని నీశరీరము జలదరింపకుండునా? ఈశ్వరుని నిస్స్వార్థమగు నుపకారతత్వమును స్మరించినకొలఁదియు, అతని గుణగణముల గానమొనరించినకొలఁదియు నీహృదయ మతనియెడఁగృతజ్ఞమై, ద్రవీభూతము కాఁగలదు. వెంటనే దుఃఖానందబాష్పములు నేత్రద్వయమునుండి ధారారూపంబున స్రవించి, సంగమించి తన్మాలమున నిన్నుఁ బరిశుద్ధుని గావించును. కావుననే భక్తునిహృదయ మానందరసపరిపూర్ణమని కోవిదులు వచించియున్నారు.

"యస్య మే హిమవంతో మహిత్వా యస్య సముద్రం
రసయాసహాహుః.
యస్యేమా ప్రదిశో యస్య బాహూ కస్మై దేవాయ
హవిషా విధేమ."

—యజుర్వేదము.

"భూధరము తనశీర్షముపై హిమము నాచ్ఛాదిత మొనరించుకొని యచలమయి నిలిచియున్నవిధమున నీశ్వర భక్తుఁడు నితాంతముగ నింద్రియముల నిరోధించి నిశ్చలుఁడగుచున్నాఁడు. పరత్వశిఖరమునుండి నదీజలము స్రవించుచుండువిధంబున భక్తునిహృదయము సముద్రమువలెఁ బ్రేమ సలిలముచేఁ దరంగాయితమగుచుండును. అన్నిదిశలందు దేవుని మహిమయే వ్యాపించియుండుటను భక్తుఁ డవలోకించుచున్నాఁడు."

ఉత్తమాచరణము దేవుని కానందదాయకములగు కార్యములలోఁ దొల్లింటిది. ఈదేహమునుండి పవిత్రమగు నాత్మ బహిర్గతమైపోయినంతనే యున్నతులు, అవనతులు, ధనాఢ్యులు, నిర్ధనులు, పండితులు, పామరులు, సుబుద్ధులు దుష్టబుద్ధులు వీరువారను భేదములేక సమస్తజనులును నిజకర్మానుసారముగ సర్వేశ్వరుని సమ్ముఖంబున యథోచితములగు ఫలములఁ బడయఁగలరు. ఈశ్వరుఁడు న్యాయమూర్తియయి, సత్యపీఠమునం దాసీనుఁడయి ధర్మాధర్మముల విచారించునపుడు తమ జీవితకాలమున నేయములొనరించి యుండిన దుర్జనులు వాతాహతిచే నటు నిటుఁ గొట్టుకొను వృక్షపత్రములవలెఁ గంపితగాత్రు లగుదురు. సజ్జనులు తామొనరించియుండిన భగవత్ప్రీతికరములగు సుకృతముల

స్మరించుకొని దేవుఁడొసంగనున్న సత్ఫలముల సానందముగ ననుభవింప నువ్విళ్ళూరుచుందురు.

సర్వేశ్వరుఁడు పుణ్యాత్ములకు దాసుఁడు. పాపాత్ముల పాలిటి కాలయముఁడు. ఈ మర్మము నెఱింగి నీవు యావజ్జీవితము పాపములకడకును, అధర్మముల దరికిని, దుర్గుణముల చెంతకును, దుర్విచారముల పొంతకును బోవలదు. సదా సర్వేశ్వరునియందు శ్రద్ధాభక్తులఁ గలిగియుండి యతనికెల్లపుడు భయపడుచుండుము.

"యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మై వాభూ ద్విజానతః,
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః."
—యజుర్వేదము.

"ఎవరు పరమాత్ముని దమకు సహచరుండనియు, సమస్తప్రాణులును దమకుఁ దుల్యములనియుఁ దెలిసి యా దేవుని శరణమును విశ్వసించియుందురో, ఎవరు శోకమోహాదులకు దూరులయి యుందురో, వారు సదా సుఖులయి యుందురు."

ఈశ్వరసమ్మతమగు సత్పథానుసరణమే తన పవిత్ర కర్తవ్యముగ భావించువ్యక్తియే వాస్తవముగు భాగవతుఁడు. కావున నాయనా! పరమేశ్వరుని యుద్దేశ్యము లేవియో ప్రకృతిపాఠమునం దభ్యసించుచుఁ దదనుగుణ్యముగ నీచారిత్రమును, జీవితవిధానమును నిర్మాణ మొనరించుకొనుము. ప్రకృతి నీ కొనరించు యుపకారమునకయి నీవు హర్షించి కృతజ్ఞతతో భగవానునకు వందనము లాచరించుము.

రేణువుకంటె నల్పమగు బీజమునుండి వటవృక్షము జనించి లోకమున కొనరించునట్టి యుపకారము నీశక్తిచే

గలిగినది కాదనియు. దానికిఁ బ్రకృతి నియంతయగు జగదీశ్వరుఁడే కారకుఁడనియు గ్రహింపుము. స్త్రీపురుషుల కామోద్రేకముచే సంభోగింప జలబిందువునందలి మొక్క-వీర్యబిందువు కంటకమయి దివ్యమగు నాకృతిని, వివిధావయవములను, బుద్ధిజ్ఞానములను, మానసము ఆత్మ మున్నగు మహాపదార్థములను చిత్రముగ సృజించునది నీశక్తి యని భావింపకుము.

పరమాద్భుతమగు శరీరయంత్రమును నిర్మించుటకును సజీవ మొనరించుటకును భగవంతునిశక్తియే మూలాధారముగాకున్న, మానవునివీర్యబిందువే ముఖ్యకారణమయి యున్న మానవదేహము కళానిర్మాణచతురులచే సృజింపఁబడు మృణ్మయమూర్తికంటె నధికమూల్యవంతముగ యుండఁగలిగెడిదికాదు. సర్వత్ర సమస్తవిషయములందును దైవశక్తియే ముఖ్యకారణముగ నెసఁగుచున్నయది.

కావున కుమారా! నీవు సదా నీకు సంరక్షకుఁడయి యున్న భగవంతునియందు భక్తిభావమును గలిగియుండుట విస్మరింపకుము. వివేకనిధియగు దేవుని స్మరించి సదా సద్వివేకమును, తత్సంబంధములగు సద్విషయములను సంగ్రహించుము. ఈశ్వరసమ్మతమగు విశుద్ధసాత్త్వికజీవితానందమునకవాంతరములఁ గల్పించు తుచ్ఛప్రాపంచిక విషయానందముల నుండి నీ సమస్తేంద్రియముల సంయమప్రభావముచే వశమొనరించుకొనుచుండుము.

న్యాయమునచే నీవు పవిత్రపదార్థసాధనము [illegible] చుము. ఔదార్యమునకు హృదయమున స్థానమొసంగు

చుండుము. ధన్యవాదపూర్వకముగ నీశ్వరమహిమను గూర్చియు, తత్సంకల్పప్రభావమునుగూర్చియు విచారించుచు నీ భౌతికజీవితమును నీతిచే నాదర్శప్రాయ మొనరించుకొనుము. నైతిక జీవితమును గడపు వ్యక్తి సులభముగా నైహికాముష్మిక సౌఖ్యానందశాంతులం దేలియాడుచుండఁ గలఁడు.

భగవద్భక్తి మానవునిధర్మములలోనికెల్ల సర్వోత్కృష్టమును, సర్వశ్రేష్ఠమును. నగు ధర్మమనుట కేమియు సందేహము లేదు. సంతప్తహృదయమును ప్రశాంత మొనరించుటకును, అపవిత్రమగు మానసమును నిర్మలము గావించుటకును భగవద్భక్తియే సర్వోత్తమంబగు నేకమాత్రసాధనము. భవవ్యామోహపీడితున కీశ్వరభక్తికంటె నుత్తమంబగు వేఱొండు యౌషధము లభింపఁజాలదు. కావుననే శ్రీకృష్ణభగవానుఁడు తనగీతయందు నీరీతి వచించియున్నాఁడు:—

> క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
> కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి.
>
> —భగవద్గీత.

"సుస్థిరమగు భావముతో సర్వేశ్వరుని భజించువాఁడు శీఘ్రమే ధర్మాత్ముఁడై చిరశాంతికిఁ బ్రాపించును. కౌన్తేయా! నాయందు భక్తిఁ గలిగియుండువాఁ డెట్టియవస్థయందు నధోగతి నందఁజాలఁ డని గుర్తెఱుంగుము."

ఆత్మాభ్యుదయమునకు దైవభక్తికంటె శ్రేష్ఠమగు సాధనము లేదు. ఈశ్వరభక్తుఁడు దుఃఖభయాదిజీవసామాన్యములగు నవస్థల నతిక్రమించి నిత్యానందము ననుభ

వించుచుండఁగలఁడు. భక్తిచే ముక్తినందిన మహాపురుషుల చారిత్రములు నేఁటికిని జగత్ప్రసిద్ధములయి యున్నవి.

భక్తి వాగాడంబరము నందుఁ గాని, బాహ్యకర్మ లందుఁగాని వెలయుచుండుట లేదు. అయ్యది చిత్తశుద్ధి పూర్వకమగు స్వయంసమర్పణబుద్ధినుండియే కలుగుచున్నది. భక్తిని గుఱించి సకలలోకాదర్శప్రాయుఁడగు గాంధిమహాత్ముఁడు వచించిన నుడువులు సంపూజ్యములు.

"చిత్తశుద్ధిపూర్వకమగు భగవంతునియందుఁ గల శ్రద్ధయే భక్తి. భక్తి నిరాడంబరమయినది. భక్తుఁడు వాని వర్తనముచేఁ బరీక్షింపఁబడునుగాని బాహ్యకర్మలచేఁ గాదు. లోకసేవాపరతంత్రుఁడగు పరమసాధువుయొక్క హృదయము భక్తిరసపూరితమయి యుండును. అహింసలేని తావులో భక్తి కాపుర ముండనొల్లదు."

ప్రస్తుతము లోకమం దనేకులు కామక్రోధమదాంధులయి యుండియు, ఆత్మసంస్కరణమును స్వప్నమందయినఁ దలంపకుండియు, 'హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణహరేహరే' అని మృదుమధురముగ గాన మొనరించుచుఁ దమ్ము భక్తశిరోమణులుగను, మోక్షభాజనులుగను భావించుకొనుచున్నారు. పురాణగాథలు మనుష్యుఁ డెట్టిపాపాత్ముఁడైనను రామా! యని యొక్కసారి స్మరించినంతనే సకలపాపములుడిగిపోవుచున్నవని నుడువుచున్నవి.

తనమ్మాలమునఁ బౌరాణికు లెందఱో దుర్వ్యసనములఁ జిక్కియుండియు, కలుషితమతులయి యుండియుఁ జరిత్ర సంస్కరణమునకుఁ గడంగక రామనామమే తారకమంత్ర

మని భావించి వీలు కలిగినప్పుడెల్ల రామనామోచ్చారణ మొనరించుచు నంతమాత్రముననే భక్తివిషయమునఁ దమ ధర్మము, బాధ్యత నెఱవేఱినట్లుగ భావించుకొనుచున్నారు. కాని కేవల మిది భ్రమ భక్తికి మూలము మాత్మసంస్కరణము. బాహ్యానుష్ఠానము లన్నియు నప్రధానములు. భక్తుఁ డెట్టివాఁడయి యుండవలయునో తిలకింపుఁడు.

సీ॥ శమనుయను కవచంబుఁ ♦ జక్కఁగా ధరియించి
శ్రద్ధాకిరీటంబు ♦ సంఘటించి,
భక్తియను డాలును ♦ బదిలమ్ము గాఁబట్టి
సత్యమను శస్త్రంబు ♦ సరగఁ దాల్చి,
దయయను దూతను ♦ దగుసంధికై పంచి
వేగువానిగఁ దన ♦ విద్య నునిచి,
లోశత్రు లార్వుర ♦ లోపల బంధించి
యజ్ఞానమున్ దెగ♦టార్ప నెంచి
తే॥గీ॥ రాజరాజగు నీయాజ్ఞ ♦ రక్తిఁగాంచి
ధర్మరంగంబునందు యు♦ద్ధంబుసేయ
సిద్ధమై పొల్చు నీభక్తుఁ ♦ జెనకఁ దరమె?
సకలకల్యాణగుణధన్య ♦ సర్వమాన్య.
— సర్వమాన్యశతకము.

ఈశ్వరభక్తుఁడు సృష్టికిఁ దం మానికము వంటివాఁడు. మన ప్రాచీన మతగ్రంథములందును, భారతభాగవతాది మహాకావ్యములందును భక్తశిరోమణుల దివ్యజ్యోతి వెలుఁగుచున్నయది. భాగవతము సర్వేశ్వరభక్తుల పుణ్యకీర్తి నెలుఁగెత్తి గాన మొనరించుచున్నది. భగవద్భక్తులలో

బాలుఁడును, భూపాల నందనుఁడును నగు ప్రహ్లాదుఁడు సర్వజనమాన్యుఁడు.

ఆతఁడు బాల్యమందే భగవంతుని మహామహిమను, అసాధారణప్రభావమును, అనంతశక్తిని, అపారకరుణాళుత్వమును, అమేయవాత్సల్యమును గుర్తెఱింగినవాఁడయి షడ్రిపులఁ దోలిపుచ్చి, స్థితప్రజ్ఞుఁడయి, వీతరాగియయి తన సహచరుల కెల్లరకు నీశ్వరమహిమ నుద్బోధించి నాస్తికుఁడును క్రూరుఁడును నగు పితృశాసనమును దృణీకరించెను. భూపాలుఁ డొనరించిన దురంతము లేవిధముగను భగవద్భక్తిపరాయణుండగు ప్రహ్లాదుని బాధింపనేరవయ్యె. బాలభక్తుఁడగు ప్రహ్లాదుఁడు:—

"శా॥ పానీయంబులు ద్రావుచుం గుడుచుచుం ♦ భాషించుచుం ♦ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచుం ♦ లక్షించుచుం ♦ సంతతా
శ్రీనారాయణపాదపద్మయుగళీ ♦ చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెం సురారిసుతుఁ డే ♦ తద్విశ్వముం ♦ భూవరా!"

ఈరీతిగ భగవద్భక్తియందే విలీనుఁడయియుండుటచే నతఁ డెట్టి ప్రాపంచికదుఃఖముల నందకుండెను. ప్రతిమనుష్యుఁడు ప్రపంచమందలి క్షణికములగు సంపదలకంటె భగవత్పదార్థమే సుస్థిరమును, అమూల్యమును నగు దివ్యపదార్థమని విశ్వసించి దానియందు శ్రద్ధవహించుట యావశ్యకము. నిశ్చయముగ భగవదాశ్రితమగు లోకమును సేవింపనట్టి మానవుఁ డరుదెంచి సౌఖ్యాంబుధి నోలలాడఁజాలఁడు. కావున మానవుఁడైనవాఁడు:—

ఉ. ఓపరమేశ్వరా! నిఖిల ♦ మొక్క తెఱంగునఁ జేసినట్టి నీ
రూప మెవండెఱుంగు నపు♦రూపపు తేజము నీది యో జగ
ద్వ్యాపక దీనరక్షక ద ♦ యామయ సన్నుత సర్వలోకబం
ధూ పరమాత్మ నాహృదయ ♦ తోయజమందు వసింపు
మీశ్వరా!

— దానవవధలోనిది.

అని సర్వసమర్పణబుద్ధి నీశ్వరు భజించి తరించుట కర్తవ్యము.

"యది భవతి ముకుందే భక్తి రానందసాంద్రా
విలుఠతి చరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః."

"ప్రగాఢానందరసాభిభూతమగు సర్వేశ్వరభక్తిని గలిగియుండు సత్పురుషుని చరణకమలములసన్నిధిని మోక్షసామ్రాజ్యలక్ష్మి దొర్లుచుండఁగలదు.

కావున మనుష్యుఁడు సచ్చరిత్రుఁడయి సర్వేశ్వరుని యందు నిశ్చలమగు భక్తిభావమును గలిగియుండుట శ్రేయస్కరము. ఈశ్వరభక్తి నార్జింప నభిలషించువ్యక్తి దుర్జనుల సాంగత్యమును గలిగియుండరాదు. ఆతఁడు నిత్యపరిశుద్ధుఁడయి, లోకోద్ధారకుఁడయి, సద్గుణాలంకృతుఁడయి యుండు టవసరము దుష్టసాంగత్యాసక్తిచే మనుజునియందు స్వభావ సిద్ధముగ నెలకొనియున్న సద్వృత్తులన్నియు నశింప భక్తి గగనపుష్పము కాఁగలదు.

"సత్యం శౌచం దయా మానం బుద్ధిశ్చ హ్రీ ర్యశః క్షమా
శమో దమో భగశ్చేతి యత్సంగా ద్యాతి సంక్షయం."

"దుర్జనమైత్రిచే సత్యము, శౌచము, దయ, మౌనము, బుద్ధి, అభిమానము, కీర్తి, సహనము, శమము, దమము, ఐశ్వర్యము మున్నగున వన్నియు నశించును."

ఈశ్వరభక్తికి సద్గుణములన్నియు ముఖ్యాంగములయి యున్నవి. ఈశ్వరభక్తునియందు దయ, దాక్షిణ్యము, సానుభూతి, పరోపకారము, అహింస, శౌచము, సత్యము, శాంతము, మౌనము, స్వార్థశూన్యత, ప్రేమ, వినయము, సన్మానము, జ్ఞానము, న్యాయము, స్థైర్యము, ధైర్యము, వివేకము, విశ్వాసము, నిర్వేదము, ద్వేషశూన్యత, పరాభ్యుదయచింతనము, సచ్చింతనము, సద్వర్తనము, కర్తవ్యనిష్ఠ, సాధుత్వము, సౌజన్యము మొదలగు సద్గుణములన్నియు సహజముగనే లభించుచుండఁగలవు. ఈ సద్గుణములయొక్క సమ్మిశ్రణముచే సంభవించు సదమలవృత్తినే భగవద్భక్తియన్నను నభ్యంతరము లేదు.

లోకమందు ప్రతిమనుష్యుఁడును స్వీయజీవితసంతరణార్థము భక్తుఁడు కావలసియున్నది. భక్తిసంపాదనము విధ్యుక్తధర్మము.

"యఆత్మదా బలదాయస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్యదేవాః,
యస్య చ్ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషావిధేమ."

—యజుర్వేదము.

"పరమాత్మయే యాత్మకు బలము. ఆత్మకుఁ బరమాత్మయే జీవనము. ఆత్మ చేతనపదార్థము. ఇట్టి చేతనపదార్థమును జ్ఞానసంకలితముగఁ జేసి, తరింపఁజేయుటకు ముక్తి

పాత్రయగు పరాత్పరునియందు భక్తిని నెలకొనఁ జేయఁ దగును.”

ఉత్తముఁడగు భక్తుఁడు తాను మాతృగర్భమునఁ బడి జన్మించినపుడు తనతోఁ బాటుగ నెట్టివస్తువును గొనివచ్చి యుండలేదనియు, తనతో నిపుడు కల సమస్తపదార్థము లీశ్వరునివే యనియు భావించి “గోవింద! త్వదీయవస్తు తుభ్యమేవ సమర్పిత” మ్మనుచు నహంకార మమకారబంధనముల ద్రెంచివైచి తన సకలసంపదలను, స్వశరీరమును లోకసేవకయి వినియోగించుచున్నాఁడు.

శ్రీ బుద్ధుఁడు, శ్రీ యేసు, శ్రీ మహమ్మదు, లూథరు, సుకరాత్తు, రామమోహనరాయలు, చైతన్యుఁడు, కబీరు, గురునానకు, సమర్థరామదాసు, రామానుజుఁడు, శంకరుఁడు, మధ్వుఁడు, బసవదేవుఁడు, దయానందుఁడు, వివేకానందుఁడు, రామకృష్ణపరమహంస, కేశవచంద్రుఁడు, శ్రీ గాంధి మున్నగు మహాపురుషులెల్లను నీశ్వరభక్తులే. వీరెల్లరు వ్యక్తిగతజీవితము నుండి విడివడి, సార్వజనికజీవితాసక్తులయి, లోకసేవయందే బ్రహ్మానందము కలదని విశ్వసించి, సర్వేశ్వరుని యాధిపత్యమును శిరసా వహించి, తద్దేవునియందు సుస్థిరమగు భక్తివిశ్వాసములఁ గలిగియుండి లోకోద్ధరణ మొనరించియున్నారు.

నేఁడు విద్యార్థులు భక్తిహీనులయి, సర్వేశ్వరుని నిమిషమునయిన స్మరింపక దురాచారపరతంత్రులయి, నాస్తికులయి, పాశ్చాత్యసభ్యతకు బానిసీండ్రయి ప్రపంచమునే సర్వస్వముగఁ బట్టికొని, భోగవిలాసముల మునింగి

యుండుట యెంతయు సంతాపకరము. ఏనాఁడు మన భారతీయ విద్యార్థులు దైవభక్తి నొక నిష్ప్రయోజనమగు కర్మగ భావించిరో, నాఁటినుండియే ఛాత్రమండలినుండి సద్గుణ సముదాయము లంతరించిపోవఁ బాశవికములగు దుర్గుణ పుంజములు నెలకొన నారంభించినవి. ఒక యౌవనుఁడు సమస్తసౌభాగ్యములఁ గలిగియుండి సకలభోగముల ననుభవించి, దైవభక్తిశూన్యుఁడయి, కాలముగడచి పిమ్మటఁ దన యవివేకమునకు విచారపడి, అనుతాప పూర్వకముగ నిట్లు వచించియున్నాఁడు:—

"భోగానుభుక్తా వయమేవ భుక్తా
స్తపో న తప్తం వయమేవ తప్తాః
కాలో న యాతో వయమేవ యాతా
స్తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణాః
సురూపం శరీరం నవీనం కళత్రం
ధనం మేరుతుల్యం వచశ్చారుచిత్రం
హరే రంఘ్రియుగ్మే మనశ్చే దలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం."

"భోగములు భుక్తములు కాలేదు. మేమే భుక్తుల మయితిమి. తపస్సు ఆచరితము (తప్తము) కాలేదు. మేమే తప్తుల మయితిమి. కాలము గడవలేదు. మేమే గడచితిమి. ఆశ జీర్ణింపలేదు. మేమే జీర్ణించిపోయితిమి. సుందరమయిన శరీరము, యౌవనవతియగు భార్య, మేరుపర్వతసమానమగు ధనము, చక్కని వాగ్ధోరణి, మంచిస్నేహితుఁడు యేమి యున్న నేమి ప్రయోజనము? మనస్సు హరిపాదముల యందు లగ్నము కానిచో సర్వము నిష్ప్రయోజనము."

కావున విద్యార్థులెల్లరు జగదీశ్వరునియందు శ్రద్ధాభక్తులను, విశ్వాసమును, సమస్తమానవులందు సహోదరభావమును దీనులందు దాక్షిణ్యమును, పశుపక్ష్యాదిజీవజాలమునందుఁ గారుణ్యమును గలిగి పరిశుద్ధులయి భక్తితత్త్వమును గుర్తెఱింగి యిహమందు విశుద్ధసౌఖ్యానందములను, పరమందు శాంతిని బడయుట శ్రేయస్కరము.

శుభమస్తు.



# నలుబదిపదవ ప్రకరణము

## దైవప్రార్థన

"చేతోదర్పణ మార్జనం భవమహాదావాగ్నినిర్వాపణం
శ్రేయః కైరవచంద్రికావితరణం విద్యావధూజీవనం
ఆనందాంబుధివర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మస్నపనం పరం విజయతే శ్రీకృష్ణసంకీర్తనం.

—పదావళి.

శ్రీకృష్ణసంకీర్తనమువలన హృదయదర్పణము శుభ్రమయిపోవఁ జిత్తమందలి సమస్తకళంకములు దూరమగును. మహాదావాగ్నివలె నెల్లప్పుడు మనల దగ్ధమొనరించుచున్న విషయవాసనలు నశించును. చంద్రకిరణములకుఁ గలువలు వికసించు విధముననే శ్రీకృష్ణసంకీర్తనమువలన నాత్మయొక్క శ్రేయస్సు వికసించును.

బ్రహ్మవిద్య 'అసూర్యంపశ్యా' యైన వధువు వంటిది. అంతఃపురములోని యంతఃపురమునందు నివసించు వధువువలె బ్రహ్మవిద్య హృదయాంతరాళమున దాఁగియుండును. బ్రహ్మవిద్యకు భగవత్సంకీర్తనము జీవస్వరూపము. దానిచే నానందసాగరము పొంగి పొరలుచుండును. అచటఁ బ్రతిపదమందు పూర్ణామృతాస్వాదన ముండును. అందువలన మానవుఁ డా రసమునందు మునిఁగి యాత్మను మఱచుచుండును.

ప్రపంచమందలి సమస్తమతములు, సాంఘికనిబంధన శాస్త్రములు మానవుని పవిత్రములగు నిత్యకృత్యములలో దైవప్రార్థనమునకుఁ బ్రథమస్థానము నొసంగియున్నవి. ప్రార్థనముచే మానవుని చిత్తము నైర్మల్యమును బడసి ప్రశాంతస్థితి నందఁగలుగుచున్నది. ప్రార్థనావిధాన మతిగంభీరమైనది. నేఁటి ప్రార్థనాపద్ధతిచే మానవజీవితాభ్యుదయమున కెట్టి సాహాయ్యమును లభింపనేరదు. ప్రార్థనకును బాహ్యానుష్ఠానమునకును సంబంధము లేదు. వీణను మీటుచుఁ గంఠమెత్తి శ్రావ్యముగఁ గీర్తనలఁ బాడుట ప్రార్థన యనఁబడదు.

"స్తుతియు, ఉపాసనయు, ప్రార్థనయు' ఇవి గ్రుడ్డినమ్మకములు కావు. ఇవి పానభోజనస్థానగమనములకంటె నధిక సత్యములు. మిగిలినవి యసత్యములన్నచో నతిశయోక్తి కాఁజాలదు. ఈ యుపాసన, ఈ ప్రార్థన వాణీవైభవము కాదు. దీనికిఁ గావలసినది నాలుక కాదు. హృదయము. కావున భక్తిని నించి హృదయమును నిర్మలము చేసికొంటిమేని, మన మా యనంతమునకెగురఁగలము. ప్రార్థనకు జిహ్వతోఁ బనిలేదు. అది స్వభావముచేతనే యద్భుతవస్తువు."

—ఆత్మకథనుండి.

నేఁడు సమస్త మతావలంబులు తమ దేశాచార, మతాచార, సంఘాచారముల ననుసరించి ప్రార్థనామందిరముల నిర్మించుకొనియున్నారు. మానవుఁడు తన దైనికజీవితమునందుఁ దెలిసియో, తెలియకయో కావించియుండిన సమస్తపాపముల నీశ్వరునిసమ్ముఖంబున నొప్పుకొనుచు వానికయి యాత్మ పశ్చాత్తాపమును వెలిఁబుచ్చుచు దుర్గుణ

వినుక్తిని, సద్గుణసంపాదనమునకును స్థిరమగుబుద్ధిని, ప్రగాఢమగు నభిలాషను, బలమును, సామర్థ్యమును బ్రసాదింపనకుశింతెభక్తిభావముతో, అచంచలహృదయముతోం త్రికరణపూర్వకముగ దేవదేవుని వేడుకొనుటయే ప్రార్థనయని మతకర్తలు సిద్ధాంతీకరించియున్నారు. మతకర్తల యీసిద్ధాంతముచే మానవుని యాంతరికజీవిత సంస్కరణమే ప్రతిపాదితమగుచున్నయది. కాని నేడు మతకర్తల సిద్ధాంతమునకు విరుద్ధమగు ఫలమును గలిగించు ప్రార్థనావిధానమే సర్వత్ర కానవచ్చుచున్నది.

పాపాచరణమునకయి పశ్చాత్తాపమును, సత్యాన్వేషణమునకయి జిజ్ఞాసను, ఆత్మోన్నతికయి దృఢసంకల్పమును గలిగియున్న ప్రశాంతమగు హృదయముతోం బ్రార్థనమేభాషయందుం గావింపంబడినను నభ్యంతరము లేదు. గాంధిమహాత్ముని సిద్ధాంతము ననుసరించి విచారించినచో శబ్దోచ్చారణతో నిమిత్తమే లేదు. భక్తిపూరితమగు హృదయమున భావముల సంచలనముచేతనే ప్రార్థనాఫలమును బడయవచ్చును.

> "ఏకాకీ చింతయే న్నిత్యం వివిక్తే హిత మాత్మనః,
> ఏకాకీ చింతయానో హి పరం శ్రేయోఽధిగచ్ఛతి."

"నిర్జనస్థానమందు దేకాకియయి కూర్చుండి, ఆత్మచింతనముం జేయువాండు పరమశ్రేయమునకుం బ్రాపించును."

ఆతండు నిమీలితనేత్రుండయి, తన మానసము నీశ్వరునియందు విలీనమొనరించి, న్యాయమూర్తియెదుట భయకంపితగాత్రముతో స్వేదకణములు ముఖమండలమునుండి

యాణిముత్తెములరీతి జలజల రాలుచుండ, నిజదోషముల నంగీకరించు నేరస్తునివలె స్వయంకృతాపరాధములనెల్ల దేవునకు నివేదించుకొనుచుఁ బాపభీతుఁడయి తన దుష్టాచరణమునకయి పశ్చాత్తాపతప్తుఁడగుచు, జనయిత్రిని గడు ప్రేమపూర్వకముగఁ గాంక్షితపదార్థముల నర్థించు డింభకునివలె సాత్వికాభీష్టసిద్ధికయి పరాత్పరుని గోరఁదగును.

భక్తిగద్గదకంఠముతో వాఁడు ప్రశాంతభావముతో సర్వేశ్వరుని బ్రార్థింప హృదయభారమంతయుఁ దగ్గిపోవును. వ్యాకులత దూరమగును. మనస్తాప ముపశమించును. అపుడతఁ డానందబాష్పముల నెపమునఁ దా నొనరించియుండిన సమస్త పాపమాలిన్యమును ద్రవరూపమున స్రవింపఁజేయఁగలఁడు.

అనుదినప్రార్థనముచే నిశ్చయముగ మానవుని దైనిక జీవితము సంస్కరింపఁబడుచు హృదయదౌర్బల్యము నశింప వానికి దుష్కృతములయెడ రోఁతను జనింపఁజేసి సుకృతములపట్ల ప్రగాఢమగు నాసక్తి నొదవఁజేయఁగలదు. కావుననే మహాపురుషు లెల్లరు ప్రార్థనమును వేనోళ్ల స్తుతించియున్నారు.

"I am past all comforts here, but prayers"

—Shakespear.

"నా సౌకర్యము లన్నియు గతించినవి. కాని, ప్రార్థన నింక విడువలేదు."

—షేక్స్పియరు.

"Battering the gates of heaven with storms of the Prayer."

— Tennyson.

"ప్రార్థన లను తుపానులచే స్వర్గద్వారముల భేదింప వచ్చును."

—టెన్నిసను.

ప్రార్థనముచే ధర్మమందును, సత్యమందును మానవుని కాసక్తి జనింపఁ దన్మూలమున వాఁడు యథార్థమగు మనుష్యత్వమును సంపాదింపఁ గృషిసలిపి, తత్పరిణామముగ స్వర్గీయతేజము నంది మోక్షభాజనుఁడు కాఁగలుగుచున్నాఁడు. ప్రార్థనము సక్రమముగ నాచరింపఁబడుచోఁ బ్రార్థించువాఁడు బ్రహ్మానందపరవశుఁడై ప్రార్థనానంతరము మహాబలశాలియయి, స్థిరచిత్తుఁడయి, నూతనోత్సాహోల్లాసపూరితుఁడయి యెట్టి ఘనకార్యములనయిన సమర్థింప శక్తుఁ డగుచున్నాఁడు.

ఇంక ఛాత్రహితార్థమయి యిట వివిధధర్మములఁ బ్రశస్తములుగనున్నట్టియు, ప్రాతస్సాయంకాలములనాచరించుట కనుకూలము లయియున్నట్టియు శ్లోకములను, పద్యములను, గద్యగీతములను వ్రాయుచున్నాఁడను. విద్యార్థులు వీనిని గంఠస్థమొనరించుట శ్రేయస్కరము.



# నలుబదియెనిమిదవ ప్రకరణము

## ప్రాతఃకాల ప్రార్థన

### వైదికము

"ప్రాతః స్మరామి హృది సంస్ఫురదాత్మతత్త్వం
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయం
యత్స్వప్నజాగరసుషుప్త మవైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కల మహం న చ భూతసంఘః."

"పంచభూతములకంటె నన్యమయి వెలయునట్టియు, సదా జ్యోతిస్స్వరూపమునందున్నట్టియు, సచ్చిదానందరూపమయినట్టియు, పరమహంసలకు గమ్యస్థానముగ నున్నట్టియు, స్వప్నాద్యవస్థాత్రయాతీతుఁడయ్యు నిత్యమును స్వప్నజాగరణ నిద్రాదులఁ బడయుచుండునట్టియుఁ బరబ్రహ్మ నిదే ప్రాతఃకాలమున స్మరించుచున్నాఁడను."

"ప్రాత ర్భజామి మనసా వచసా మగమ్యం
వాచో విభాన్తి నిఖిలా యదనుగ్రహేణ
యన్నేతి నేతి వచనై ర్నిగమా అవోచు
స్తం దేవదేవ మజ మచ్యుత మాహు రగ్ర్యం."

"మనోవాక్కులకగోచరమయినట్టియు, సమస్తము ప్రకాశించుటకుఁ గారణభూతమయినట్టియు, నిగమముల చేతను నిదమిత్థమని నిర్ణయింప వలనుపడనట్టియు, దేవదేవుఁ

డును, అజరామరుఁడును నగు భగవానుని బ్రాతఃకాలమందే భజియించుచున్నాఁడను.

"ప్రాత ర్నమామి తమసః పర మర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యం
యస్మి న్నిదం జగ దశేష మశేషమూర్తౌ
రజ్జ్వాం భుజంగమ మివ ప్రతిభాసితం వై."

"తమోగుణాతీతుఁడును, సూర్యసమానప్రభాభాసురుఁడును, సంపూర్ణుఁడును, ఉపనిషత్కథితుఁడును, పురుషోత్తముఁడను నామధేయయుక్తుఁడును, ఈ జంగమస్థావరాత్మక ప్రపంచమును రజ్జుసర్పభ్రాంతివలెఁ దనవిశ్వస్వరూపమునఁ బ్రకాశింపఁజేయువాఁడును నగు పురుషోత్తమున కిదే ప్రాతస్సమయమున నమస్కరించుచున్నాఁడను."

"తేజోఽసి తేజో మయి ధేహి"

"పరమేశ్వరా! నీవు తేజోమయుఁడవు. నాకును దేజమును బ్రసాదించుము."

"యాం మేధాం దేవగణాః, శనో్నదేవీ రభిష్టయ"

పరమాత్మా! నాకు బుద్ధి నొసంగుము. బ్రహ్మానందమును బ్రసాదించుము.

"ద్విషో నో విశ్వతోముఖాతి నావేవ పారయ అపసఃశోశుచదఘం"

"ప్రభూ! నీవు నావలె మాశత్రువుల నీసంసారసాగరమునుండి తరింపఁజేయుము. మాపాపమును హరింపుము." (శత్రువులకుఁ గూడ కల్యాణమును గోరునట్టి యీసాధకుని వచన మహింసాతత్వమునకుఁ బరమావధియయి వెలయుచున్నది.)

## ఆర్యసామాజికము

ఈశ్వరా! నీవు సర్వత్ర వ్యాపించి యున్నాఁడవు. నాకు వెలుపలను, లోపలను నీవే నెలకొనియున్నాఁడవు. నీవు సత్యస్వరూపుఁడవు. జ్ఞానస్వరూపుఁడవు. ఆనంద స్వరూపుఁడవు. కాన నో సచ్చిదానందా! నేను నిన్నాశ్ర యించితిని. సంరక్షించుము. నీవే నాకింక దిక్కు.

పరిపూర్ణుండవగు నో ప్రభూ! నీవలె నన్ను సయితము నిస్సంగుని, నిష్పాపుని, నిర్భయుని గావించుము. నేనుసయి తము నీచందముననే నిష్కాముఁడనయి, నిర్విషయుఁడనయి, సౌభాగ్యసంపన్నుఁడనయి, సామర్థ్యయుక్తుఁడనయి వెలయు చుందునుగాక!

ఈశ్వరా! నీశక్తి యనంతమైనది. నీవు సంకల్ప మాత్రమున వాంఛించున దెల్ల సృజింపఁగలుగుచున్నాఁడవు. దేవా! నాదోషములనన్నింటి మన్నించుము. నన్ను క్షమించి నా కుచిత పథమును దర్శింపఁజేయుము తండ్రీ! నీయాజ్ఞాను సారిణియగు ప్రకృతియొక్క శాసనములనెల్లఁ బాలింపఁగల శక్తి సామర్థ్యములఁ బ్రసాదించుము.

జగదీశ్వరా! ఇంద్రియవిషయములనుండి నాచిత్త మును, బుద్ధిని మరల్ప లేకున్నాఁడను. నీవు నా యీ దౌర్బల్య మును నశింపఁజేయుము. నాకు సంయమశక్తిని బ్రసాదిం చుము. నాయింద్రియముల వివేకముచేఁ దృప్తిపఱచుము. నిర్మలమగు వివేకమే సౌఖ్యానందములకు సాధనమగుగాక! దేవా! నేను దివారాత్రములు నీయాజ్ఞానువర్తినయి మెలఁగు నట్లు నన్నాశీర్వదించుము!

ఓ పరాత్పరా! భక్తవత్సలా! దీనదయాళూ! నన్నుద్ధరించుభారము నీమీఁదనే యున్నది. నీవే నా సంరక్షకుఁడవు. తండ్రివి. తల్లివి. సహోదరుఁడవు. నీవు ప్రేమస్వరూపుఁడవును, శాంతిస్వరూపుఁడవును, ఆనందస్వరూపుఁడవును, జ్ఞానస్వరూపుఁడవును నయి యున్నావు. నీదాసుఁడ నగు నాకును బ్రేమను, శాంతిని, ఆనందమును, జ్ఞానమును బ్రసాదించుము. అపారమగు నీదయయే నన్నెల్లవిధముల నంరక్షించునుగాక!

దయానిధీ! జగన్నాటకసూత్రధారీ! నీయందు దుఃఖములు, భయములు రోగములు, దారిద్ర్యము, నిరుత్సాహము, కామక్రోధములు, జరామరణములు మున్నగు దుర్గుణములును, దుష్టప్రవృత్తులును మచ్చునకయిన లేవు. తండ్రీ! నీకుమారుఁడనగు నన్నునయిత మట్టి యున్నతస్థితికిఁ బాత్రునొనరింపవా? నే నీక్షణమునుండి స్వయంకృతాపరాధములచే దూషితమయిన చిత్తమును బశ్చాత్తాపసంజనిత దుఃఖాశ్రువులచేఁ గడిగివైచెదను. అనుక్షణము నా యవివేకమునకయి పరితపించెదను. కావున తండ్రీ నన్ను క్షమించి నాకు జీవితాభ్యుదయభిక్ష నొసంగుము.

ఓ నా దేవా! నారాయణా! దివారాత్రములు నేను పరిశుద్ధుఁడనయి యుండునట్లనుగ్రహించుము. నాదృష్టి యందుఁ బ్రతిస్త్రీయు మాతవలెను, సోదరివలెను గోచరించునుగాక! తండ్రీ నే నెల్ల మానవుల సహోదరులవలెను, పశుపక్ష్యాదుల బిడ్డలవలెను బ్రేమించుచుందునుగాక! నా వర్తన మకళంకమగును గాక! శీఘ్రమే నాకు నీసన్నిధిని జేరుభాగ్యము కలుగుఁగాక!

ఓ విశ్వోదరా! విశ్వవ్యాపకా! అనంతకోటిరవిప్రభాభాసమానా! సమస్తవిఘ్నముల నశింపఁజేసి నాయుత్తమ కార్యములనెల్ల సిద్ధింపఁజేయుము. సదా నాయందు సద్బుద్ధి కాపురము సేయుచుండునుగాక!

ఓ జగద్గురూ! నీవే బ్రహ్మవిష్ణుమహేశ్వరుఁడవు. నీవే సకలప్రపంచమునకుఁ బ్రేరకుఁడవు. సంచారకుఁడవు. నీయాజ్ఞవలననే సూర్యచంద్రులు ప్రకాశించుచున్నారు. వాయువు వీచుచున్నయది. మేఘములు వర్షించుచున్నవి. సమస్తచరాచరములు సువ్యవస్థితములయి యున్నవి. తండ్రీ! నన్నుసయితము నీశాసనమును బాలించువానిగఁ జేయవా?

శరణాగతత్రాణపరాయణా! నీకిదే ప్రణమిల్లుచున్నాఁడను. నా పాపముల నన్నింటి మన్నింపుము. నేటినుండి నేను పవిత్రుఁడనయి యుందును. నాకుఁ జేయూఁతనొసంగి తండ్రీ! నన్ను సన్మార్గము ననుసరింపఁజేయుము. నన్నుద్ధరించుము!

త్రాహి మాం - త్రాహి మాం - త్రాహి మాం
శాంతిః పుష్టి స్తుష్టిశ్చాస్తు! శుభంభవతు! తథాస్తు!
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## క్రైస్తవప్రార్థనావిధానము

ప్రేమమయుఁడా! ప్రభూ! ఘోరాంధకారబంధురమగు నీప్రపంచమునఁ దెన్నుఁ గాంచలేని నాకు మార్గమును జూపించుము. నన్ను ముందునకు నడిపించుము. ఈ భయంకరజీవిత నిశీథమందు మార్గచ్యుతుఁడనయి, గృహముఁ జేరఁజాలకున్న నన్ను నా నికేతనమునకుఁ జేర్చుము. దేవా!

అందరాని పండ్లకై యఱ్ఱులుజాచు బుద్ధి నాయందు దొరవకుం డునుగాక!

ధర్మమార్గమును స్థిరచిత్తముతో ననుసరింప నాకు నవీనసామర్థ్యము నొసంగుము. నా జీవన విధాతవు నీవే యగుటచే నాకు మార్గదర్శకుడ వగుము. సర్వశక్తి సంపన్నుండవగు నిన్ను సంస్మరించునంత నా యహం బ్రహ్మత్వ మంతరించును గాక!

తండ్రీ! జగదీశ్వరా! నేటిదనుక జడమతినయి, నేను భవవ్యామోహాగతచిత్తుడనయి యెన్నియో పాపముల నాచరించియుంటిని. స్వయంకృతాపరాధములకయి నే నిదిగో నశ్రువుల స్రవింపజేయుచు నాత్మపశ్చాత్తాపమును వెల్ల డించుచున్నాడను. క్షమింపుము. నన్ను ధిక్కరింపకుము. తండ్రీ! నీవే నాకు దిక్కు.

జగద్బాంధవా! దయారాశీ! నీకిదే భక్తిపూర్వక ముగ నమస్కరించుచున్నాడను. నీదగు పవిత్ర తేజము నాయందావిర్భవించి నన్ను వివేకసంపన్నుని గావించి సత్ప థానుగామిగ నొనరించుగాక! పరాత్పరా! సుకృతముల యందు నా కాసక్తి కలిగి వర్ధిల్లునుగాక! నీ ప్రేమరసమును బానమొనరించి నే నెల్లజీవుల బ్రేమించువిధము నభ్యసించె దనుగాక! తండ్రీ! అంధకారము తొలగినంతనే నీయానంద ధామమును నిర్భయముగా జేరుదునుగాక! నేను సదా నీ యాధిపత్యమునకు నవనతమస్తకుడనయి, పుణ్యమూర్తి నయి భువి సంచరించెదనుగాక!

హిమాచ్ఛాదనము దూరమయినఁగాని భూధరము యొక్క సౌందర్యము గోచరింపఁజాలదు. అదియేవిధముగ జగన్నాయకా ! అవివేకము నాహృదయమునుండి తొలఁగనిదే నాజీవిత మెట్లు ప్రకాశింపఁగలదు ? తండ్రీ ! నన్నావరించియున్న యవివేకాంధకారము నీ జ్ఞానభానుకిరణప్రసారమున దూరమగుఁగాక !

మానవుఁడనగు నేను మూఢుఁడనయి ప్రేమమూర్తివయిన నీ సజీవములగు సందేశముల నాలింపక, విద్వేషభావపూరితుఁడనయి సంఘశక్తిని నశింపఁజేయుచున్నాఁడను. నీ ప్రేమజ్యోతిని నాయందు వెలుఁగఁజేసి ప్రేమతత్వానుభవశక్తిని నాకుఁ బ్రసాదించుము. నా హృదయాకాశమున భవత్ప్రేమభానూదయ మయినంతనే ద్వేషభావములను విసర్జించి తరంగితానందరసపరిపూర్ణుఁడనయి, విశ్వవిధాతవగు నీ పూతచరణకమలసన్నిధినిఁ జేరి సుఖించునట్లాశీర్వదించుము. తండ్రీ! నాయాహ్వానము నందుకొని నన్ను ధన్యునిగావించుము. నీ యాశీర్వాదముచే నాయందు నెలకొనియున్న యహంకార మమకారభ్రాంతులు నశించునుగాక ! అపుడు నా యాక్రోశవచనములకు హృదయాహ్లాదకరములగు ప్రేమగీతములు మిక్కుటముగా వినిపించఁ గలవు.

దేవా ! నే నింక నిన్నెడఁబాసి యుండఁజాలను. నీధర్మ సామ్రాజ్యమును జేరు నిమిత్తము నే నెట్టికష్టముల నయినను, నిష్ఠురములనయినను తుదకు మృత్యువునయినఁ గౌఁగిలించుకొన సన్నద్ధుఁడను. ఈశ్వరా ! నీ యీదాసునకు బుద్ధివివేకములఁ బూర్ణముగా నొసంగుము. నా జిహ్వ సదా

సత్యమునే భాషించుఁగాక ! నాచిత్తము నిత్యము సదాచార నీతిధర్మములందే సంలగ్నమయి యుండునుగాక ! నాకర్ణములు సత్ప్రసంగములనే యాలించుచుండుఁగాక! నాకరములు సాధుసేవ కుపయోగించునుగాక !

ప్రభూ ! నీయందు నాకు భక్తియు, నాయందు నీకుఁ గరుణయుఁ గలుగుఁగాక ! ఇంతియే నాయభీష్టము. నే నీ లోకమం దనుభవించు సమస్త సౌఖ్యానందములకు నీవే కారకుఁడవు. సమస్తదుఃఖములకు నా యవివేకమే ముఖ్య హేతువు. దేవా ! స్వర్గమందిరసోపానాధిరోహణ శక్తిని నాకుఁ బ్రసాదించుము.

పరాత్పరా ! నేను జాగ్రత్స్వప్నములందును సావధానుఁడనయి సదా నిన్ను స్మరించుచుందునుగాక ! కష్టనిష్ఠురములమధ్య దుఃఖ పరంపరలయందు, విపజ్జాలముల నడుమ ముక్తిసాధమును నిర్మింప నేను సమర్థుఁడ నగుదునుగాక ! విస్మృతియందును నిరుత్సాహమును జెందక, సహజమునకయి వాపోవక నేను ప్రేమాంబుధిలో నానందతరంగములపై శాంతినౌక నధిరోహించి, స్వర్గమను తీరమును జేరి నీ పవిత్రపాదపీఠిని నామస్తకము నుంచుదునుగాక ! తండ్రీ ! నిరంతరము నాహృదయమందిరము నీసద్గుణగణ మధురగానముచేఁ బ్రతిధ్వనించుచుండునుగాక !

ఆపద్బాంధవా ! నీప్రియకుమారుఁడగుజీససుయొక్క యాత్మసమర్పణవిధానము నా పాలిపంచికై శం[illegible]నిమాన మును, అహంభావమును, విషయ భోగాస[illegible]ఛి వైచుచున్నయది. తండ్రీ ! నీతిశూన[illegible]

నాకే యసహ్యముగ నుండ నీతిమూర్తివగు నీకెట్లుండునో నుడువవలయునా? అనాథనాథా! సకల జనదుఃఖశోషణపరాయణా! సమస్తపాపముల దహించివేయు జ్ఞానాగ్నిని నా కొసంగుము. నేను మహాత్ముఁడగు జీససు యొక్క యనుచరుఁడనయి నీపవిత్ర సన్నిధిని జేరుదునుగాక!

తండ్రీ! ఇదిగో! నేఁడే సర్వలోకరక్షకుఁడవును, పాపులకు సయితము పరిత్రాణము నొసంగునట్టి కరుణాసాగరుండవును నగు నీచరణకమలముల నాజీవితమును, నా యాత్మను నా సర్వస్వమును సానందచిత్తుఁడనయి సమర్పించివైచితిని. తండ్రీ! నా మొఱాలకించి బిరాన నన్నుఁ గనికరించుము. మహాత్యాగియగు జీససు పవిత్రనామమునకు జయమగుఁ గాక!

## మఱికొన్ని ప్రార్థనగీతములు

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ.

"తల్లియు, తండ్రియు, గురువు, స్నేహితుఁడవు, దైవము, ప్రభువు, విద్యయు, ధనము మున్నగు సమస్తము నీవే."

"రోగా హరంతి సతతం ప్రబలాః శరీరం
శోకోఽప్యనుదినం ప్రదహంతి చిత్తం
కృత్యాతి సదాకలయన్ దినాని
శరణం మమ దీనబంధో!

ఓ దీనబంధూ! బలముగల రోగములు నిత్యము శరీరమును గృశింపజేయుచున్నవి. కామక్రోధాద్యరిషడ్వర్గము ప్రతిదినము హృదయమును దహించుచున్నది. మృత్యుదేవతకూడ దినములు లెక్కపెట్టుచు గంతులువేయుచున్నది. కావున అనాథుఁడ నగు నాకిపుడు నీవే దిక్కు.

"దేహో వినశ్యతి సదా పరిణామశీల
శ్చిత్తంచ ఖిద్యతి సదా విషయానురాగీ
బుద్ధిః సదాహి రమతే విషయేషు నాంత
స్తస్మాత్త్వమద్య శరణం మమ దీనబంధో."

పరిణామమే స్వభావముగఁ గల దేహము నిత్యము నశించుచున్నది. విషయాసక్తము గు చిత్తమునయిత మెపుడును క్లేశముఁ జెందుచున్నయది. బుద్ధి యెల్లప్పుడును విషయములయందే క్రీడించుచున్నది. ఏవియు నాకు స్వాధీనముగాక యున్నవి. తండ్రీ నీవే నాకు దిక్కు.

"ఆయుర్వినశ్యతి యథా ఽఽమ్భఘటస్థతోయం
విద్యుత్ప్రభేవ చపలా నవ యౌవనశ్రీః
వృద్ధాప్రధావతి యథా మృగరాజపత్నీ
తస్మాత్త్వ మద్య శరణం మమ దీనబంధో.

పచ్చికుండలో నుంచిన యుదకమువలె నాయువు క్షీణించిపోవుచున్నది. మెఱుపువలె యౌవన మతిచపలమయినది. సింహమువలె వార్ధక్యము తఱుముకొనివచ్చుచున్నది. స్వామీ ఇంక నీవే దిక్కు".

దృష్టి ర్నభూతవిషయా సమతాఽభిధానా
వైషమ్యమేవ తదిదం విషయీకరోతి

శాంతిః కుతో మమ భవే త్సమతా న చే త్స్యాత్
తస్మా త్త్వ మద్య శరణం మమ దీనబంధో."

"సమత్వదృష్టి గోచరించుటలేదు. వైషమ్యమే పొడఁ గట్టుచున్నది. సమత్వబుద్ధిలేని నాకు శాంతి యెట్లుకలుగును? కాన, తండ్రీ! నీవే నాకు దిక్కు.

"శా॥ నాపై రాదు భవత్కటాక్ష మిఁకనై నన్ న్యాయమా? రక్షకా!
నీపాలంబడనో? నినుంగొలువనో? నీవాఁడగానో? యొరుల్
ప్రాపున్నారొ యెఱుంగనో? మఱతునో పాల్మాలినావోగదే?
తాపంబగ్గలమాఱ్ఱ్పరా వెపరమాత్మా! భక్తచింతామణీ!"



# నలుబదితొమ్మిదవ ప్రకరణము



## సాయం ప్రార్థనము

"నమస్తే సతే తే జగత్కారణాయ
నమస్తే చితే సర్వలోకాశ్రయాయ
నమోఽద్వైతతత్త్వాయ ముక్తిప్రదాయ
నమో బ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ."

"జగత్కారణభూతుఁడవగు దేవా! నీకు నమస్కారము. సత్యస్వరూపా! నీకు నమస్కారము. సర్వలోకాశ్రయ ప్రదా! చిత్స్వరూపా! నీ కిదే నమస్కారము. మోక్షప్రదాతా! అద్వైతరూపా! నీకు నా నమస్కారము. సర్వవ్యాపకా! అచ్యుతా, నీ కిదే నమస్కరించుచున్నాఁడను."

"త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యం
త్వమేకం జగత్పాలకం స్వప్రకాశం
త్వమేకం జగత్కర్తృ పాతృప్రహర్తృ
త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పం."

"ఈశ్వరా! నీ వొక్కఁడవే సంరక్షకుఁడవు; నీవొక్కఁడవే సర్వశ్రేష్ఠుఁడవు; జగత్పాలకుఁడవు; స్వయంప్రకాశకుఁడవు; జగన్నిర్మాణాభరణహరణములకు హేతుభూతుఁడవు. నీవొక్కఁడవే నిశ్చలుఁడవు; నిర్వికల్పుఁడవు."

"భయానాం భయం భీషణం భీషణానాం
గతిః ప్రాణినాం పావనం పావనానాం
మహోచ్చైః పదానాం నియంతృత్వమేకం
పరేషాం పరం రక్షణం రక్షణానాం."

"పరాత్పరా! నీవు భయములకు భయంకరుడవు; భయానకములకు భయానకుఁడవు; జీవులకు గతివి; పవిత్రతకుఁ బరమపావనుఁడవు. నీవొక్కఁడవే సమస్తోన్నతపదవులకు నియంతవు; సర్వశ్రేష్ఠుఁడవు; మహారక్షకుఁడవు."

"వయం త్వాం స్మరామో వయం త్వాం భజామో
వయం త్వాం జగత్సాక్షిరూపం నమామః
సదేకం నిదానం నిరాలంబ మీశం
భవాంభోధిపోతం శరణ్యం వ్రజామః"

"నేను నిన్ను స్మరించెదను; భజించెదను. జగత్సాక్షి రూపుడవగు నీకు నమస్కరించెదను. నీవు సత్స్వరూపుఁడవు; ఆదికారణుఁడవు; అవలంబరహితుఁడవు; నేతవు; పాపసముద్ర నౌకవు. అట్టి నిన్నొక్కని నే శరణుఁ జొచ్చెదను."

ఈశ్వరా! నీ యీ యనంతమగు సృష్టియందు సాగరమందలి సలిలకణంబు పగిది నే నొక్క రేణుమాత్రుఁడనయి యున్నాను. తండ్రీ! నాజీవితము కమలపత్రస్థిత జలబిందువు వలెఁ జంచలమయియున్నది. అనుదినము, అనునిమేషము కామక్రోధాది శత్రువులు నాచిత్తమును ముట్టడించుచున్నవి. కరుణానిధీ! పరమపావనా! తుచ్ఛములగు విషయాదులఁ బరిత్యాగ మొనరింప నాకు సామర్థ్యమును, బలమును, వివేకమును బ్రసాదించుము. అనాథుఁడ నగు నాకు నీవే రక్షకుడవు.

భక్తవత్సలా! అచ్యుతా! ఈలోకమందలి క్షణికమగు నే పదార్థవ్యామోహమందును నాచిత్తము తగుల్కొనకుండుఁగాక! నేను త్రికాలములందు, త్రిదశలయందు, అవస్థాత్రయమందుఁ బరిశుద్ధుఁడనయి నిత్యనిర్మలుఁడవును, మంగళమయుఁడవును నగు నీ చరణకమలముల భక్తివిశ్వాసములఁ గలిగియుందునుగాక!

తండ్రీ! నీకృపయే లేకున్న పంచభూతము లిట్లేల మాకుఁ దోడ్పడుచుండఁగలవు? సూర్యచంద్రాదు లేల బానిసలవలె మాకు సేవఁ జేయుచుందురు? తండ్రీ! రేబవలు మా హితమునందు సంలగ్నచిత్తుఁడవయి యుండు నీ వెంతటి కృపామయుఁడవు! నిర్వ్యాజముగ, నిస్స్వార్థుఁడవయి మమ్ము సృజించి, పోషించి సుఖింపఁ జేయు నీ వెంతటిదయాళుఁడవు! నీ పరమకృపచే, నీమహచ్ఛక్తిచే రేణుసమానమగు బీజమునుండి యెట్టి మహోన్నతమును, అతివిశాలమును నగు వటవృక్ష ముత్పన్న మగుచున్నయది.

జగన్నాయకా! సచ్చిదానందస్వరూపా! నాకు సద్బుద్ధిని బ్రసాదించుము. నీ సంతానమగు సమస్తజీవులఁ బ్రేమించువానిగ నన్నొనరించుము. మాతాపితాచార్యుల సేవాశుశ్రూషలఁ గావించుచు, గురుజనులకు విధేయుఁడనయి, శాంతుఁడనయి దాంతుఁడనయి ధర్మమును దప్పక, సత్యమును సన్మానించుచు, నీతివర్తనుఁడనయి సంచరించునట్లు నాహృదయమునం దుత్సాహమును గలిగింప నీ కిదే మ్రొక్కులిడుచున్నాఁడ.

దీనబంధూ! నే నైశ్వర్యములు లేవని సంతాపమును జెందను. ఉన్నతప్రాసాదములు స్వప్నప్రాయము లయ్యెనని

విచారింపను. భోగవిలాసము లపాప్రియము లని చింతింపను. ధనము లేదని, ధాన్యము లేదని దుఃఖింపను. రూపము లేదని, వైభవము శూన్యమని కొందల మందను. సేవకులు లేరని డెందమునఁ గుందను. సామ్రాజ్యమునకయి వాపోవను.

తండ్రీ! నేను దివారాత్రములు నీయనుగ్రహమునకు, నీయామోదమునకు, నీకృపకు, నీదయకుఁ బాత్రుఁడను గాఁ జాలనైతిని గదాయనిగొంతెత్తి రోదనమొనరించుచుందును. పరమపితా! నా యీ మొఱాలకించి, సమస్తపాపముల నుండి విమోచనమునందుటకు నాయంతరాత్మను బ్రోత్సహించుము. నాకు దుఃఖములందు ధైర్యము నొసంగుము. ఆపదలయందు స్థైర్యమును బ్రసాదించుము. వాసనలయందు వైరాగ్యమును దయసేయుము. క్రోధమందు సహనశీలత నొసంగుము. ద్వేషమందుఁ బ్రేమ నిమ్ము. తండ్రీ! ఈ నా యభీష్టముల సిద్ధింపఁజేయవా?

ప్రభూ! శాశ్వతముగా భువి జీవింపవలయునను వెఱ్ఱి తలంపు నాకు లేదు. నేను స్వార్థాంధుఁడనై నిన్ను "పుత్రం దేహి, యశో దేహి, ధనం దేహి" అని కోరుటలేదు. నేను నిస్స్వార్థుఁడనయి, పవిత్రుఁడనయి, బుద్ధిమంతుఁడనయి జీవింపవలయుననియే కోరుచున్నాఁడను. సత్యమందాసక్తియు, ధర్మమందనురక్తియు, సేవయందభిలాషయు, ప్రేమయందాదరమును నాకు నిత్యము వర్ధిల్లుచుండునుగాక! నాయందుఁగల యాత్మదౌర్బల్యము దూరమగుఁగాక. నేను సమస్తమతములందలి సమస్తదేశములందలి మహాపురుషుల హితోపదేశముల నాలించి, తదనుకూలముగ వర్తించి ధన్యుఁడనగుదునుగాక.

దేవా! నాకు నీయందును; నాయంతఃకరణమందును, మహాపురుషులందును, మహాపతివ్రితలందును, నాదేశనుందును, నా జాతీయతయందును దినదినము భక్తిభావన మతిశయించును గాక! తండ్రీ! అనునయపూర్వకంబును, అనురాగపురస్సరంబును నగు నా యీవిన్నపమునం దేవేని దోషములున్న మన్నించుము. పాపములు శమించుఁగాక!

"మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం
యత్కృపా తమహం వందే పరమానందమాధవం."

"ఎవనికృపచే మూకుఁడువాచాలుఁడగునో, పంగువు గిరిని లంఘించునో, అట్టి పరమానందస్వరూపుఁడగు మాధవునకు వందనములు."

"దృతేదృథంహమామిత్రస్యమాచక్షుషా
సర్వాణి భూతాని సమీక్షంతాం.
మిత్రస్యాహంచక్షుషా సర్వాణిభూతాని
సమీక్షేమిత్రిస్యచక్షుషా సమీక్షామహే."

—యజుర్వేదము.

"జగదీశ్వరా! నీవు దయానిధివి; కృపాసింధువవు; కరుణాసాగరుడవు. నీకరుణా విశేషముచే దుష్టగుణములు నశించును. శుభగుణములు వృద్ధిఁ జెందును. ప్రభూ! నేను సమస్తప్రాణులను దయాదృష్టితో వీక్షించుటకును, సమస్త జనులతో మిత్రభావమున వర్తించుటకు నాకు సత్స్వభావమును బ్రసాదించుము. సమస్తప్రాణులు నన్ను సయితము మిత్రభావముతో విలోకించున ట్లనుగ్రిహించుము. భక్తవత్సలా! ఆపద్బాంధవా! తండ్రీ! నేను ప్రతిప్రాణిని స్నేహదృష్టితో నాత్మసమానముగఁ బ్రేమింతును గాక!

పక్షపాతబుద్ధిని విసర్జించి విశుద్ధవిశ్వ ప్రేమతోడఁ బ్రవర్తించెదనుగాక! అన్యాయముతోడ నెపుడు నే నేకీభవింపకుందును గాక! మనుష్య జీవితమను వృక్షమున ఫలించు ధర్మార్థకామమోక్షములను చతుర్విధసత్ఫలముల సంపాదించుటకయి నా సర్వస్వమును సమర్పించి కృషి సలుపుదునుగాక; ఓ నా కన్న తండ్రీ! కరుణానిధీ! నాయీ యభీష్టములు సిద్ధించునటు లాశీర్వదించుము.

"భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః,
స్థిరై రంగై స్తుష్టువాగ్ం స స్తనూభి
ర్వ్యశేమ హి దేవహితం యదాయుః."

"ప్రభూ! మా శ్రవణములు సదా మంగళమయము లగు శబ్దములనే వినుచుందును గాక; మా నయనములు నిత్యము శుభదృష్టితో శౌచమునే వీక్షించుచుందునుగాక; మాజీవితము సజ్జనసేవ యందుఁ గడచునుగాక! తండ్రీ! సర్వలోకమాన్యా! ఈ నా వరముల సిద్ధింపఁజేయవా!

"O Lord, look upon my evil qualities
Thy name O' Lord, is same sightedness
By the touch if thou wilt
Thou canst make me pure
So Lord, look not upon my evil qualities."

—Sister Nivedita.

"ఓ ప్రభూ! నీవు నాయందుఁ గల దుర్గుణముల గణింపకుము. నీవు సంకల్పమాత్రమున నన్ను స్పృశించి పరిశుద్ధుని గావింప సమర్థుఁడవు. కావుననే నీవు నా దోషముల నెన్నకుము తండ్రీ"

——సోదరి నివేదిత.

విద్యార్థులారా; మీరనుదిన మీ చందమున సాయం సమయమందును, ప్రభాతకాలమందును నిర్మలంబగు ప్రదేశమున నిమీలితనేత్రులయి, నిశ్చలహృదయులయి కరుణాసింధువగు సర్వేశ్వరుని ప్రగాఢానుతాపపూర్వకముగఁ బ్రార్థింతురేని యపూర్వమగు నాత్మబలమును, మనశ్శాంతిని, తుష్టిని, పుష్టినిబడసి శుద్ధాంతఃకరణులయి, నిర్మలచారిత్రులై, లోకోపకారపారీణులయి పుణ్యపురుషులయి, ధన్యులుకాఁ గలుగుదురు. శ్రీశంకరుని భక్తిభావోత్పాదకమగు నీమేలు కొలుపుతోఁ బ్రార్థనవిషయమును ముగించెదను:—

“భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్ కరణే.



# పదవ ప్రకరణము

## ఆత్మవిశ్వాసము

"True Hope is swift, and flies with swallow's wings, kings it makes gods, and meaner crertures kings.

—Shakespeae.

"యథార్థమగు విశ్వాసము కడు వేగము గలది. అయ్యది సమస్తమును గబళించివేయునట్టి పక్షములతో నెగురుచుండును. ధరణీపతులు దానికృపచే దేవత లగుదురు. క్షుద్ర జీవులు పృథ్వీశు లగుదురు." —షేక్స్పియరు.

విశ్వమందలి సర్వేశ్వరప్రదత్తములగు సకలసౌభాగ్యములతో నాత్మవిశ్వాసమే యక్షయసంపన్నిధి. మనుష్యుండీ మహత్తరంబగు పదార్థావలంబనముచే నైహికాముష్మిక సౌఖ్యమును సులభముగా సంపాదింపసమర్థుండగుచున్నాఁడు. ఆత్మవిశ్వాసము పరమపవిత్రంబగు దైవికశక్తి. ఇయ్యది సకలస్త్రీపురుషులకు సత్వరసంపాదనార్హమయి యున్నది. మనుష్యజాతి ఆత్మవిశ్వాసశూన్యమగునేని క్షణమాత్రకాలముననే నిర్జీవంబగుట నిశ్చయము.

ఆత్మవిశ్వాసవిభూషితుండగు వ్యక్తి తొలుఁదొల్త గర్భదరిద్రుఁడై యుండియున్నను నిమేషమాత్రకాలంబున సకల సామ్రాజ్యాధిపతి యగు ననుటయం దేమాత్ర

మతిశయో_క్తి కానరాదు. ఆంగ్లకవి సార్వభౌముఁడు వచిం చినరీతి క్షుద్రజీవులే నరనాథులు కాఁగలిగినపుడు సామాన్య బుద్ధివివేకసంపన్నులగు మనుష్యులు మహాత్ములగుటయం దాశ్చర్యము లేదు.

అచంచలములగు మహో_త్తుంగభూధరముల నయిన జలింపఁజేయఁగల మహాద్భుతమగు శ_క్తి షడక్షరాన్వితమగు నీ యాత్మవిశ్వాసమునందే కలదనుటలో నబ్బుర మేమియు లేదు విశ్వముయొక్క బలవ_త్తరములును, పరమప్రయోజన కరములును, మానవజీవితశ్రేయస్కరములును నగు సమస్తా న్యాన్యశ_క్తు లీ యాత్మవిశ్వాసమునుండియే యుద్భవించుచు న్నవి. సాధారణముగా సామాన్యమానవులకును, మహాపురు షులకును మధ్య వెలయు భేదమున కీ యాత్మవిశ్వాసమే కారణ భూతమయినది. ఆత్మవిశ్వాససంపన్నునికంటె నధిక భాగ్యవంతుఁడును, ఆత్మవిశ్వాసదూరునికన్న మిన్నయగు దరిద్రుఁడును వసుంధరాతలమం దెచ్చోటను లేఁడనుట తథ్యము.

ఎంతటి ఘనకార్యమునయిన మనుష్యుఁడు తనయాత్మ యందు విశ్వాసము గలవాఁడగునేని నిస్సందేహముగ సాధించి సిద్ధినంద సమర్థుఁడగుచున్నాఁడు. బహుకష్టసాధ్యం బగు నొక కార్యమును నిర్వహింపవలసివచ్చినపుడు మను ష్యుఁడు సందేహింపక, భయముఁజెందక, సుస్థిరహృదయుఁ డయి 'నేనీ కార్యమును సులభముగా సాధించఁగలను' అను ధీరభావముతో ముందంజవేయుచో వానికి_ర్తవ్యపథ మవ శ్యము పరిష్కృతమయి సుఖసంపన్నము కాఁగలదు. అప్పు

డతనికిఁ దత్కర్మయొక్క సత్ఫలము సులభముగా హస్త గతమగును.

ఆత్మవిశ్వాస సంపన్నుఁడు కర్మయోగి యనఁబడు చున్నాఁడు. కర్మయోగి కిలాతలంబున వానిసంకల్పమార్గము నకుఁ బ్రతిబంధకములఁ గల్పించు శక్తు లుండుట యసంభవము.

"న దైవమపి సంచిన్త్య త్యజే దుద్యోగ మాత్మనః,
అనుద్యోగేన తైలాని తిలేభ్యోనాప్తుమర్హతి."
ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ
ర్దైవేన దేయ మితి కాపురుషా వదంతి
దైవం నిహత్య కురు పౌరుష మాత్మ శక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః?"

—నీతిశిక్ష.

"యువకుఁడా! అదృష్టముపైఁగల నమ్మకముచే నుద్యోగమును విడిచిపుచ్చకుము. నిరుద్యోగముచేఁ దిలములనుండి తైలమును బడయుట సంభవించునా! ఉద్యోగనిరతుండగు పురుషసింహమునకు లక్ష్మి సులభముగా లభించుచున్నయది. అదృష్టమును నిత్యము భీరువులే సంస్మరించుచుందురు. అదృష్టము నణఁగఁద్రొక్కి పురుషార్థ మొనరించుము. యత్నించినను కార్యము సిద్ధింపనిచో దోష మెవరిది?"

నీతిశిక్షయొక్క యీ వాక్యము లెట్టిసితియందును మనుష్యుఁడు ధైర్యస్థైర్యోత్సాహముల బహిష్కరింపరాదని బోధఁ జేయుచున్నది. ఆంగ్లభాష నభ్యసించిన యువజనులు తమ పాఠపుస్తకముల 'రాబర్టుబ్రూసు — సాలీఁడు' కథచే

లభించు నీతిచే ప్రయత్నమే, సాహసమే లక్ష్మియని గ్రహింపఁగలరు.

ప్రకృతి సదా కర్మయోగియొక్క యడుగులకు మడుగు లొత్తుచుండును. కర్మయోగతత్పరుఁడు పరాత్పరుని ప్రియ నందనుఁడు. అట్లగుట వాని కసాధ్యంబగు కార్యమేదియు భూమండలమునఁ దటస్థింపనేరదు. ఆత్మవిశ్వాసపరిమాణ మనుసరించియే ఫలమునయిత నుండుననుట నిర్వివా దాంశము. అధికమగు నాత్మవిశ్వాసముచేఁ జెన్నొందువ్యక్తి యపూర్వములగు ఘనకార్యముల సాధించుటయందు వెను కాడ నొల్లఁడు.

ఆత్మవిశ్వాసశూన్యుఁడగు దుర్బలుఁడు కాపురుషభీరు వయి, శక్తియుతుఁడై యుండియు నిజాత్మవికాసహంతకుఁ డయి యెట్టి సామాన్యకార్యములనయిన సాధింపలేని భ్రష్టుఁ డును, హీనుఁడును నగుటయం దేమియు నాశ్చర్యము లేదు. ఆత్మవిశ్వాసశూన్యతచే మానవునకుఁ గర్తవ్యపథమునఁ బ్రతి పదమందును సందేహములపై సందేహములు కలు గుచు, వాని కార్యకరణశక్తిని క్షీణింపఁజేసి వేయుచుండఁ గలవు.

తత్కారణమున వానిహృదయ మనుక్షణము దుర్బల మయి, అసఫలతకుసుస్వాగతము నొసంగుచుండగలదు. ఆత్మ విశ్వాసశూన్యుఁడు జీవన్మృతుఁడు. నిరంతరాపజయాపమాన పరాభవములే వాని కవశ్యభోక్తవ్యములగు సంపదలు.

"When I take the honour of a thing once
I am like your tailor's needle I go through"

—Ben-Janson.

"నే నొక పదార్థమును ఘనమని గ్రహించినప్పుడు దర్జీవాని సూదివలె దానిలో దూరుట కేని సందేహపడు వాఁడను గాను."

—బెన్ జాన్సను.

అనగా నొక విషయమును మనము ప్రశస్తమని గ్రహించినపుడు తత్సంపాదనమునకయి యావచ్ఛక్తిని వినియోగించుట పరమధర్మము. అట్టిసందర్భములం దేమాత్రము శంకింపరాదు. ఆత్మవిశ్వాసముచే నా ప్రశస్తమగు పదార్థ మెచ్చోట నున్నను సాధించుటకు సమస్తవిధములఁ గటిబద్ధులమయి యుండవలయును. ఆత్మవిశ్వాససంపన్నుఁడగు వ్యక్తికిఁ గర్తవ్యమార్గమందలి తీక్ష్ణములగు కంటకములు వికసితకోమల ప్రసూనములవలెఁ గానరాఁగలవు.

మంచుకొండ వానికి రేయెండ యగును. ఎట్టిభయంకర కష్టనిష్ఠురము లయినను వానికి సౌఖ్యానందదాయకములు గనే తోఁచుచుండఁగలవు. ఆత్మవిశ్వాస బలసంపన్నుఁడు విషముకు సయితె మమృతమని పరిగ్రహించు భయపడ నాతఁడు ధీరుడఁయి యుండును. ఆత్మవిశ్వాసముచే కార్యసాధనోన్ముఖుఁడగు మనుష్యుఁడు కార్యభారమునుగూర్చియు, తద్భయంకర దుస్థితినిగూర్చియు, కాఠిన్యమునుగురించియుఁ బరిసంగించుచుండు కార్యభీరువులను, నిరుత్సాహయుతులను మఱచియుఁ జెంతఁ జేరనీయరాదు.

మనుష్యులమగు మన మెపుడును నూతనోత్సాహమును, నవీనోద్రేకమును, నవ్యకార్మికస్ఫూర్తిని దృఢమగు నాత్మవిశ్వాసముచే నార్జించుచు నీశ్వరసృష్టియొక్క విశాల

మగుకర్మక్షేత్రమందు వెనుదిరిగి చూడకయే ముందడుగిడు చుండవలయును. ఇట్లొనరింతుమేని సమస్తసందర్భములందు విజయలక్ష్మి మన పరిచారికవలె వెంటాడుచు మన పాద సాన్నిధ్య మహాభాగ్యము నంద దీనాతిదీనయయి వచ్చు చుండఁగలదు.

ఆత్మవిశ్వాసదూరులగు ప్రమత్తులయొక్కయు, అల సులయొక్కయు, నిరుద్యోగుల యొక్కయు దుస్సాంగత్యము నను, వారి నిరాశాభావద్యోతకములగు నింద్యప్రసంగశ్రవ ణమునను కర్మయోగ సాధకుని హృదయ వికాసము క్రమ క్రమముగా నశించిపోవు చుండఁగలదు. ఆత్మవిశ్వాసముచే మశకము దంతావళ మగుననియు, అవిశ్వాసముచే గజమే మశకము కావలసి వచ్చుననియు మహాపురుషులు సిద్ధాంతీక రించి యున్నారు.

నేటి పర్యంత మీ విశాలవిశ్వవలయమున జననమంది యద్భుతోత్తమ మహాకార్యములఁ గావించి, తమ యశః కాయములఁ జిరస్థాయిగ భువి నెలకొల్పి పరమపదించి యున్న మహాపురుషులెల్లరు కేవల మీ యాత్మవిశ్వాస మునే తనుజీవిత సర్వస్వముగ భావించియుండిరి. వారు తమ యుపన్యాసముల మూలమునఁ దమజీవితానుభవమును లోక మునకుఁ జాటుచు నాత్మవిశ్వాసమే మానవజీవితాభ్యుదయ మున కుత్తమంబగు సత్సాధన మని నొక్కి వక్కాణించి యున్నారు.

దూరదృష్టిలేని మూఢులు త్రిపుండ్రకముల ధరించి 'విష్ణు ర్నారాయణః కృష్ణో' యని స్మరించుచుండువారలే

వైష్ణవులు లేక భాగవతులని భావించువిధంబున నే 'నేను భూపాలుఁడ నగుదునుగాక! కాళిదాసుని శాసించువాఁడ నగుదునుగాక' యని కోరుకొనుచుఁ దత్తదుచితకర్మానుష్ఠానమునకు గడంగనిచో వారి భావములు వజ్రసమానములగు సత్సంకల్పములని భావింపఁబడక పేరాసలుగనే పరిగణింపఁబడఁగలవు.

భక్తి కాత్మసంస్కరణము మూలమయినటుల నాత్మవిశ్వాసమునకు ముఖ్యలక్షణ మవక్రమంబగు కర్మయోగ ప్రదర్శనమయే. ఆచరణశూన్యములగు సంకల్పము లెంతటి మహోన్నతములయినను మానవుని కేవిధమునను శ్రేయస్కరములు కానేరవు. ఆచరణపూర్వకమును, ఆత్మవిశ్వాసపురస్సరమును నగు కర్మయోగము నవలంబించువాని కిలాతలంబున లభింపనివస్తు వేది?

"నాత్యుచ్చశిఖరో మేరు ర్నాతి న చరసాతలం,
వ్యవసాయద్వితీయానాం నాప్యపారో మహోదధిః."

"ఉద్యోగికి మేరుతుల్యమగు సమున్నతభూధరము ఉన్నతపదార్థముగ గోచరింపదు. రసాతలమయిన నతని కగాధముగ నుండఁజాలదు. సంపూర్ణమగు ధ్యానముతోఁ గృషిసల్పువానికి జలధి యపారముగ నుండనేరదు."

ఆత్మవిశ్వాసరహితుఁడగు వ్యక్తి యేకాలమందును, ఏ రాష్ట్రమందును సఫలజీవనుఁడయి యుండలేదు. ప్రపంచమందలి సమస్తదేశములయొక్క భూత వర్తమానకాలకాల మహాపురుషుల జీవితచారిత్రముల శ్రద్ధతోఁ బఠింతుమేని వారి యౌన్నత్యమునకును, సామాన్యమానవాతీతము

ములగు లోకోత్తరకార్యములకును మూల మాత్మవిశ్వాసమే యని సువ్యక్తము కాఁగలదు.

అధునాతనప్రపంచమందలి యావదాదర్శమానవులు తమ జీవితములతో నాత్మవిశ్వాసము నేరీతి సమన్వయ మొనరించుకొని యున్నారో విచారింపుఁడు. ఆత్మవిశ్వాసముచే రోగగ్రస్తుఁడు తన వ్యాధిని నిర్మూలించుకొనఁగలఁడు; దరిద్రుఁడు తన దారిద్ర్యమును బాపుకొన సమర్థుండగును; పామరుఁ డపారపాండిత్యమును సంపాదింప నర్హుఁడగును.

ఆత్మవిశ్వాసముచే మనుష్యుఁడు వాంఛితపదార్థముల నెల్ల సులభముగాఁ బడయఁ గలుగుచున్నాఁడు. ఏ మానవుఁ డయినను గ్రమక్రమముగా నాత్మవిశ్వాస మను స్వర్గీయమహత్సంపదను బడయ యత్నించుకొలఁదియు ధీరుఁడయి యపూర్వసాహసపూర్వకములగు కార్యము లొనరించుచు లోకపూజ్యుఁడయి సుఖింపఁగలఁడు.

ఆత్మవిశ్వాససంపన్నుఁ డవక్రపరాక్రమోపేతుండగు వీరకేసరి యగుటచేఁ బ్రపంచమంతయు నేకీభవించి తన్నుఁ బరిహసించుచున్నను, నిందించుచున్నను, పరిత్యజింపనున్నను, ప్రాణమిత్రు లనేకులు భయంకర శత్రువులయి కార్యావరోధములఁ గల్పించుచున్నను, తన దుస్సాహసమునకయి, స్వకుటుంబ సభ్యులే కుపితులయి తన్ను నిరసించుచున్నను, అంతమున నఖిలమున కధినాయకుండగు సర్వేశ్వరుఁడే విరుద్ధమయి యున్నట్టులఁ దోఁచినను దన కర్తవ్యపథమునుండి యీషణ్మాత్రమయిన జలింపక మహాధైర్యస్థైర్యములతోఁ

ప్రారంభించిన ఘనకార్యమును సాధించి, విజయలక్ష్మీ కోమల కరపల్లవ గ్రహణ మొనర్చియే తీరును.

ఎన్ని యవరోధములు, దూషణములు, నిరసనములు, నిష్ఠురములు, విపత్పరంపరలు తటస్థించినను బట్టినపట్టు వీడక కార్యసాఫల్యము నందనోఁచిన యాయాత్మవిశ్వాససంపన్నుం డగు వీరవరేణ్యుని సమస్తలోకము హృదయపూర్వకముగా నభినందింప గలదు. సమస్తమానవు లవ్వాని ధీరవీరచరిత్ర మున కచ్చెరువొంది, విస్మయ విస్ఫారితనేత్రులయి వాని దేవతామూర్తి నవలోకించుచు నాత్మవిశ్వాస మాహాత్మ్య మును వేనోళ్ళఁ బొగడుచు నా విశ్వాససంపన్నునిపైఁ గుసు మముల వర్షింపఁజేయఁగలరు.

ఆత్మవిశ్వాససంపన్నుఁడు భగవత్పదార్థమగు నాత్మ యొక్క ప్రభావముచే మహత్తరకార్యముల సాధించి, వాని సత్ఫలప్రాప్తిచే స్వయముగా సౌఖ్యానందాంబుధి నోలలాడు టయేకాక మనుష్య ప్రపంచమంతటికి నాత్మోన్నతికరమగు గుణపాఠమును నేర్పి, పరోపకార పరతంత్రుఁడను విఖ్యాతికఁ బాత్రుడయి, మూర్తీభవించిన మనుష్యత్వమున కాదర్శ పాత్రియుఁడయి, భగవద్దత్తమగు నాత్మను సముచితముగ సన్మానించినందులకయి పరమాత్ముని దృష్టియందు దున్నత స్థానము నలంకరింపఁ గలుగుచున్నాఁడు.

ఆత్మవిశ్వాసయుక్తునకు భూమండలమునం దెవ్వారి తోడునీడయు లేకున్నను, మఱి యెవ్వారు చేదోడు వాదో డుగా నుండకపోయినను, వానికి వాని యుదారములగు భావ నలే - అపూర్వములగు కల్పనలే - పరాక్రమ స్ఫూర్తిచే

నుద్దీపితములగు దృఢసంకల్పములే మూర్తిమంతములయి మిత్రులవలెఁ గర్తవ్యపథమున సాక్షాత్కరించి, తోడ్పడి, వాని కర్మయోగశక్తి నినుమడింపఁజేయుచుఁ బరిశ్రమక్లాంతి నుపశమింపఁజేయఁ గడంగుచుండఁగలవు.

యువకుఁడా! నీవు నయిత మాత్మవిశ్వాసమువంటి దైవికసంపత్తిని నీదిగాఁ జేసికొనఁ బ్రయత్నింపుము. నీహృదయమునం దచంచలమగు విశ్వాసోదయమైనంతనే నీ హృదయ మపూర్వ సాహసోద్రిక్తమయి కార్యోన్ముఖము కాఁగలదు లేలెమ్ము. సత్వరము కర్మయోగివై విశ్వాస పూర్వకముగా సకలధర్మముల నిర్వహింప నుద్యుక్తుఁడవై సాధించి ధన్యతను గాంచుము. నీహితము నపేక్షించు కవివరు లెట్లుపదేశించుచున్నారో శ్రద్ధతో నాలించుము.

> "That which we are we are
> One equal temper of heroic hearts
> Made weak by time and fate, but strong in will
> To strive, to seek, to find and not to yield"
>
> —Tennyson.

"యువకులారా! మనమెల్లరము సమాన వీరరస పూరితహృదయులమయి యుండియుఁ గాలప్రభావమునను కర్మ పరిపాకంబునను దుర్బలస్థితిని సూచించు దశయందే యున్నారము. అదియే మనస్థితి. కాని మనము దృఢసంకల్ప చిత్తులమయి ఉద్యమించుటకును, అన్వేషించుటకును, సత్యమును గ్రహించుటకును, సంసిద్ధులమయియున్నారమనియు, లోఁబడుటకు మాత్రము కాదనియు మనము గుర్తింపక యున్నారము.

—టెన్నిసను.

ఆత్మవిశ్వాసమునకును, సఫలమనోరథత్వమునకును నవినాభావసంబంధ మనాదిసిద్ధమయియున్నది. ఆత్మవిశ్వాస మను నమూల్యపదార్థమే సృష్టియొక్క ఘనీభూతమగు సారమయి మహాపురుషులయం దావిర్భవించి, వారిచే మహత్తరములగు నద్భుతకార్యములఁ గావింపఁజేయుచు నిద్రావస్థయందుండు విశ్వహృదయమును మేల్కొలుపుచుండును.

ఆత్మవిశ్వాసశూన్యులయి నేఁటివఱకిలపై జనించియున్న మహాత్ము లెల్లరు భీరువులేయయి యుండినచో నీ సరికి సృష్టిప్రాథమికావస్థయొక్క సంకీర్ణ వాతావరణమునుండి వెలువడ నేరనిదయి రసాతలోన్ముఖమయి యుండెడిది.

ఉత్తమ మానవులందు గోచరించు ప్రకాశవికాసములకు హేతువాత్మవిశ్వాసమే కాని వేఱొండుకాదు. మానవుని నసభ్యతావస్థనుండి నాగరకదశకుఁ దెచ్చున దీయాత్మవిశ్వాసమను మహోత్కృష్ట జీవిత సంస్కరణసాధనమే యని గ్రహింపుఁడు.

మనంతట మన మేదియో యొక కార్యసంబంధమగు సాఫల్యమును వాంఛింపనిదే, తద్విజయమునకుఁ దగుయోగ్యతను సంపాదింపనిదే ప్రపంచమందలి యేశక్తియు మనల నుద్ధరింపఁజాల దనుట రూఢి. సఫలమనోరథుల మగుటకుఁ బూర్వము మనము వజ్రసమానమగు నాత్మవిశ్వాసమను నభేద్యకవచమును ధరింపకయే కర్తవ్యసంగ్రామరంగమునం దొదవు వివిధములగు నవరోధములను దూరమొనరించి, శత్రువులఁ బరాభూతులఁ గావించి విజయమను సామ్రాజ్యమును సంపాదింపఁ జాలము. కేవల మదృష్టముచే నెట్టి సామాన్యకార్యమును సఫలీభూతము కానేరదు.

"యథా హ్యేకేన చక్రేణ రథస్య చ గతి ర్భవేత్
ఏవం పురుషకారేణ వినా దైవం న సిద్ధ్యతి."

—నీతిశిక్ష.

"ఒంటిచక్రముతో రథము నడువఁజాలని విధంబుననే పురుషకారములేనిదే భాగ్యము(దైవానుగ్రహము)ను సిద్ధింప నేరదు."

విశ్వమందలి ప్రతికార్యమున కొక నిబంధనము సృష్ట్యాదియందే యేర్పడియున్నది. సాహసపూర్వకముగఁ దన్నిబంధనమును బాలించుటవలననే కార్యము సులభముగా సాధింపబడుచున్నది. ప్రతికార్యమున కొక కారణముసయితము కలదు. ఆ కారణమును గార్యమంతటి పరిమాణమందే వెలయుచుండును. ఇందువలన మహత్తరంబగు విజయోపలబ్ధి యపూర్వములగు విశ్వాసాశాదృఢ సంకల్పములమీఁదనే యాధారపడి యున్నదనుట వాస్తవము.

మనచెంత నెన్ని సద్గుణములు కుప్పలుతిప్పలై పడి యున్నను, మన మెంతటి విద్వద్వరేణ్యులమయి యున్నను, మన మెట్టి సద్వర్తనాసంశోభితులమయి యున్నను నాత్మవిశ్వాసము లేనిదే విజయలక్ష్మి మనల వరింపనేరదు. విజయలక్ష్మియొక్క హృదయము పాషాణ సదృశమైనది. అయ్యది దయను, కరుణను నెఱుంగదు. వినయ విధేయతాపూర్వకమగు విన్నపముచేతను, జోహారు లొసంగుటవలనను విజయలక్ష్మి మనలఁ గనికరించి వరింపఁజాలదు.

ఏ మానవుఁ డాత్మవిశ్వాస పరిపూర్ణహృదయుఁడయి వీరచూడామణివలె సాహసమను ఖడ్గమును హస్తమున ధరించి కర్మసంగ్రామక్షేత్రమున లంఘించి భయంకరముగ నాక్రమ

ణమును ఝళిపించునో, విజయలక్ష్మి వానికి భయప్రకంపిత చిత్తయయి సాష్టాంగదండప్రణామంబాచరించి వానితోడి నెయ్యమున కియ్యకొనును.

"విశుద్ధహృదయముకంటె దృఢమగు కవచము మనుష్యుని సంరక్షింపఁ జాలదు. న్యాయమునిమిత్తము పోరాడు వ్యక్తి సంగ్రామోచితములగు పరికరములఁ గలిగియుండని వాఁడై నప్పటికిని భద్రకవచధారివలె సురక్షితముగా నుండఁ గలఁడు. అన్యాయముచే దూషితమయినట్టి వివేకధురీణుఁడు వివిధాస్త్రములచే సుసజ్జితుఁడయి యుండియు రక్షింపఁబడఁ జాలఁడు.

అవివేక మొక భయంకరమగు పదార్థము. ఇది మనుష్యుని భీరువు నొనరించును. శపథస్వీకారమునుండి విచలితుని గావించును. లజ్జాజనకమగు కార్యమునకుఁ బ్రోత్సాహ మొసంగును. ఎవ్వాఁడు సాహసముచే నవివేకమును ఖండించివేయునో, వాఁడు నిర్దోషియగుటచే నాత్మబలసాహసములందు మిక్కిలి శ్రేష్ఠుఁడయి సకలాభీష్టసిద్ధుఁడు కాఁగలుగుచున్నాఁడు. అవివేకమే మానవుని యాత్మవిశ్వాసవినాశనమునకు ముఖ్యకారణము." —షేక్స్పియరు.

"మనుష్యుఁడు పవిత్రహృదయుఁడయి, సదుద్దేశ్యముతో సాహసించి యెట్టి ఘనకార్యాచరణ భారమునయిన నిజశీర్షమున వహించి, ఆత్మవిశ్వాసముచే దానిని విడువక సాధించుచున్న వానికిఁ బుణ్యాత్ములే కాదు, దేవతలును సాయ మొనరింతురు." —లార్డుబేకను.

"దోషులును, పాపచిత్తులును దమ్ము వెంటాడు శత్రువులు లేకపోయినను బిఱికిపందలవలెఁ గర్మక్షేత్రమును

వీక్షించి పిక్కబలమును జూపుచుందురు. నిర్దోషులు, పుణ్యాత్ములు తమ్ము భయంకరశాస్త్రవులు వెంబడించుచున్నను, సద్వివేక జన్యమగు నాత్మవిశ్వాసము తమయం దధికముగా వెలయుచుండుటచే సింహములవలె గర్జించుచు రిపుల నిరించి, తమ పవిత్రధర్మ పథముయొక్క ప్రతిబంధకముల నెల్ల విధ్వంసమొనరించి వేయుదురు. అంతరంగశుద్ధికిని, వివేకమునకును, ఆత్మవిశ్వాసముతోఁ బ్రగాఢమగు సంబంధమే కలదు. —బైబిలు.

యథార్థమగు విజయమునంద నభిలషించువ్యక్తి కేవల కల్పనా ప్రపంచవిహారమాత్రంబున సంతుష్టిఁ జెందక, ఆత్మవిశ్వాసపాఠము నభ్యసించు చుండవలయును. ఎట్టి ఘన కార్యముతనముందు నిలిచినను, ఈమహాకార్యము నవశ్యము నేను సాధింతునుగాకయని తలపోసి మానుజుఁడు తన్నిర్వహణమున కుపక్రమించుచో వానిచే నాకార్యము తప్పక సఫలీభూతము గావింపఁ బడఁగలదు.

ఏ మనుజుడు సామర్థ్యసంపన్నుఁడై యుండియు నాచే నీ కార్య మొనరింపఁబడఁజాలదను నవిశ్వాసమునకుఁ బాల్పడునో, వానిచే నవశ్య మా కార్యము గట్టెక్క నేరదు. దృఢభావనావిశ్వాససంకల్పముల ననుసరించియే ఫలాఫలములు ప్రాప్తించుచుండుటయుఁగలదు. ఆత్మవిశ్వాసముచే మూకుఁడు వాచాలుడు కాఁగా పంగువు పర్వతముల లంఘించు నంతటి సమర్థుఁడు కాఁగలఁడు.

ఆత్మవిశ్వాసప్రభావముచే నెంతటి వృద్ధుఁడయినను గొండలఁ బిండిగఁ గొట్టఁగలఁడు. ఆత్మవిశ్వాస రాహిత్య

ముచే నెంతటి ఘనుఁడయినను, వీరుఁడయినను, విద్వద్వరుఁడయినను, కూర్చుండిన స్థలమునుండి కాలుఁ గదల్పలేనట్టి హీను డగుచున్నాఁడు. ఈ నియమము సార్వదేశికము సార్వకాలికము.

ప్రజాసామాన్యము మనల నెంత పరిహసించినను, వాయుహర్మ్యనిర్మాతలని యెగతాళిసలుపుచున్నను మనము లోకముయొక్క వ్యర్థములగు హాస్యపరిహాసదూషణ తిరస్కారనిరసనములఁ బాటింపక కర్మపథమున ముందడుగిడుచున్నచో స్వల్పకాలముందే వాయుమండలమున భవనములనే నిర్మింపఁగలవారలమయి, ప్రపంచమునకుఁ దలవంపుఁ గలుగఁజేయు సమర్థుల మగుదుము.

మనయందు మనకే నమ్మిక లేనియెడల మన మింక నిలాతలంబునఁ జేయఁగలుగున దేమున్నది? మనయాత్మయందు మనకు విశ్వాసము లేకుండుట యన మనల మనము విధ్వంసమొనరించుకొనుటయే యని గుర్తెఱుంగుఁడు. ఆత్మవిశ్వాసము నశించిన కొలఁదియు మానవుని దైహికాత్మికశక్తులన్నియుఁ గ్రమక్రమముగ క్షీణించి వాని నొకజడమగు మృణ్మయమూర్తిని గావించివైచును. మన ధనధాన్యాదికములు నశించుచున్నను, జీవితసర్వస్వ మస్తమింపనున్నను శాశ్వతమును, బ్రహ్మానంద సంధాయకమును, సకలసౌభాగ్యప్రదాయకమును నగు నాత్మ విశ్వాస మనియెడి దైవిక సంపత్తినుండి చేతులు కడుగుకొనరాదు.

ఆత్మవిశ్వాసముచేఁ గార్యసాధకుఁడు—కర్మయోగి యెట్టి విషమస్థితిని గాంచియు నీషన్మాత్రమయిన విచలి

తుఁడు కాఁజాలఁడు. ఆతఁడు సదా యచలుఁడయి సమస్త ముును సహించుచుఁ గర్మ నాచరించుచు గమ్యస్థానమును జేరుటకయి యనేక విధముల యత్నించుచుండును. అట్టి కర్మయోగ పరాయణత్వమునే యువకులు నేఁడు పడయవలసి యున్నది. ఆత్మవిశ్వాసయుతుఁడగు కర్మవీరుఁ డెట్టివాఁడయి యుండవలయునో తిలకింపుఁడు:—

"క్వచిత్పృథ్వీశయ్యః క్వచిదపిచ పర్యంకశయనః
క్వచి చ్ఛాకాహారః క్వచిదపిచ శాల్యోదనరుచిః,
క్వచిత్కంథాధారీ క్వచిదపిచ దివ్యాంబరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖం."

మ॥ఒకచో నేలనుబవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజపై
నొకచో శాకములారగించునొకచో నుత్కృష్టశాల్యోదనం
బొకచోఁ బొంతధరించునొక్కొకతఱిన్ యోగ్యాంబరశ్రేణిలె
క్కకురానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్
మదిన్"

—భర్తృహరి.

ఒక్కసారి చలించినయాత్మవిశ్వాసమును దిరిగి సంపాదింపవచ్చునుగాని కర మది కష్టసాధ్యము. ఆత్మవిశ్వాస మొక గాజుపెంకువంటిది. పగిలిన దాని నతుకుట సులభసాధ్యముకాదు. ఆత్మవిశ్వాసప్రయోజనమును గుర్తెఱుంగని మనుష్యుఁ డీ వసుంధరపై జీవించుట వ్యర్థము. మనముస్వాయముగా నాత్మవిశ్వాసము నాధారముగాఁ జేసికొని కర్మక్షేత్రమున లంఘించి సఫలత నంది ధన్యులమగుచున్న మన సాటి సహోదరులెల్లరు సులభముగ ననుసరించి, స్వీయ

జీవితముల సంస్కరించుకొని తమ జన్మము సార్థక మొనరించుకొనగలరు.

ఒకతూరి సైనికుఁడొకఁడు లేఖ నొకదానిని గైకొని మహావీరుఁడగు నెపోలియను చక్రవర్తిదండ కరిగెను. ఆ యోధుఁ డేదో యొక యవసరకార్యముపై దనస్వామిచే వీరశ్రేష్ఠుఁడగు నెపోలియనుచేంత కరుగ నియమితుఁడగుటచేఁ దనసైంధవమును వాయుమనోవేగంబులఁ బర్విత్తించుకొని వచ్చెను. అశ్వారోహి నెపోలియను నివసించు స్థలమును సమీపించి, ఆలేఖ నా వీరవతంసుని చేతికందించుటయే తడవుగా వాని యశ్వము నేల కొరిగి యసువులఁ బాసెను.

నెపోలియ నాలేఖ నవలోకించి, అందలి రహస్యముల నెల్ల గ్రహించి, దాని కుచితమగు ప్రత్యుత్తరము లిఖించి యా భటుని కొసంగి యతనిని దనసైంధవము నధిరోహించి తత్క్షణమే వాయువేగముఁ బోయి యా కమ్మను దన స్వామి కందింప నాజ్ఞాపించెను.

అంతట నా సైనికుఁ డాయుత్తమాశ్వమును పదేపదే వీక్షించుచు మహావీరుని సంబోధించి యిట్లుత్తర మొసంగెను.

"మహాప్రభూ! నే నీవాజిరాజము నధిరోహింప నర్హుఁడను గాను. తమవంటి సకలలోకపూజ్యులగు రాజసింహము లధిరోహింపఁదగు నీయుత్తమాశ్వమును నావంటి సామాన్యుఁ డగు సైనికుఁ డారోహించుటకంటె దుష్టసాహసము మఱేమి కలదు? మహాప్రభూ! నాకుఁ దగిన యశ్వము లేకున్న దేవరయాజ్ఞను గాలినడకనే పోయి నిర్వహించెదను."

సైనికుని ప్రత్యుత్తరము నాలకించి నెపోలియను చిరునగవుతో "వీరుఁడా! ఫ్రాంసుదేశీయసైనికుని యోగ్యతను మించినట్టి పదార్థముసయితమొక టీ విశ్వమందుఁ గలదా? అయ్యో! ఆత్మవిశ్వాససంపన్నుఁడవగు నీవు మనుష్యత్వ మెంత మహోత్కృష్టమయినదియో గ్రహింపలేక పోయితివా?" అని వచించెను.

ప్రపంచమంతయు ఫ్రాంసుదేశీయుఁడగు యోధుని వలెనే మనయందుఁ గల శక్తిసామర్థ్యముల గుర్తింపలేక, అయోగ్యతనే వెల్లడించుకొనుచున్నది. ఆత్మ నొక క్షుద్ర వస్తువుగ భావించునట్టి దుర్బలులతో నేఁటి ప్రపంచము నిండియున్నది. అల్పజ్ఞులగు నిట్టివారు భువిపై జన్మించి, మానవాకృతియందుండియు సాటిమానవుల యాత్మవిశ్వాస సంజనితమగు ప్రజ్ఞావిశేషమును విలోకించుచుండియు హీనులవలెను, దీనులమాడ్కియు, అనాథుల రీతియు నిత్య దారిద్ర్యమునే జన్మహక్కుగ భావించి, అంధకారమయజీవితముఁ గడపుచున్నారు

సృష్టియందలి సర్వోత్కృష్టమగునట్టి పదార్థమును భోగింపఁ దన్ననర్హునిగా భావించునట్టి యీక్షణమందలి సామాన్యవ్యక్తియే, ఆత్మవిశ్వాస ప్రభావప్రేరితుఁడయి, కర్తవ్యానుష్ఠానమునకుఁ గడంగి, అత్యుత్తముఁడయి, సుప్రసిద్ధుఁడయి, అమూల్యములగు సమున్నత సౌఖ్యానందముల ననుభవింపఁ గలుగుటయం దాశ్చర్యము లేదు.

జడమతుల మయి, వివేకశూన్యుల మయి మనల మనమే యల్పులముగను, నీచులముగను భావించుకొనుచు

నిరాశాపీడితుల మగుచున్న మన మేరీతి దేవతాపురుషుల విధంబున నుత్తమ కార్యముల సాధించి యుత్తమగతుల నందఁగలము?

"నితరాం నీచోఽస్మీతి త్వం ఖేదం కూప మా కదాపి కృథాః
అత్యంతసరసహృదయో యతః పరేషాం గుణగ్రహీతాసి"
—భామినీవిలాసము.

"(అన్యాపదేశము) ఓ కూపమా! నేను నీచస్థితిలో నుంటినని విచారించుకొనకుము. నీ వత్యంతసరసము అనఁగా జలమయమయి యుండి, చేఁదాళ్ల నందుకొనుచుందువు. ఓ శిష్యా! నీవు నిన్నొక్క నీచునిగ భావించుకొని శోకింపకుము. నీవు స్నేహమయుఁడవును, అన్యుల గుణములను, ఉపదేశములను గ్రహించువాఁడవుగను నున్నాఁడవుకదా!"

గురువుగారు శిష్యునకు బోధించిన యీపద్ధతి మానవుఁడు తన్నల్పునిగను, అనాథునిగను లఘుదృష్టితోఁ జూచుకొనరాదను భావమును వెల్లడించుచున్నది. మనుష్యుఁడు నీచసంకల్పమును గలిగియున్న వాని మానసము నయిత మట్టిస్థితికే ప్రాపింపఁగలదు. ఒక మనుష్యుఁడు తన్ను సింహతుల్యునిగ భావించుకొనుచు దత్తదుచితక్రియాభ్యాసమునకుఁ గడంగుచున్నచో నిజముగా వాఁడు కొంత కాలమునకు సింహమే యగును. తన్నొక గ్రామసింహముగనో, సృగాలముగనో భావించుకొనుచుండు వ్యక్తి స్వల్పకాలమందే యట్టిహీనస్థితికిఁ బ్రాపింపఁగలఁడు.

"సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః"
—మనుస్మృతి.

"ఇచ్ఛాసిద్ధికి సంకల్పమే మూలము."

ఆపూతీం దేవీం సుభగాం పురోదధే చిత్తస్య మాతా.

—అథర్వణవేదము.

"సంకల్పమే చిత్తమునకు మాతవంటిది."

పై నుదహరింపఁబడిన ప్రమాణవాక్యములచే భావనయే మానవోన్నతికిని, అవనతికిని హేతుభూతమగుచున్నదని తేటపడుచున్నది. అల్పమగుభావనయే మనుజు నసమర్థునొనరించును. మానవునియందుఁ గల శక్తులు సర్వవ్యాపకమగు సామర్థ్యముతోఁగూడియున్న మానసమునుండియే యుద్భవము లగుచున్న కతన వాని నెంతగా నయిన నాత్మవిశ్వాసముచే వ్యాపింపఁజేయవచ్చును.

ఆత్మవిశ్వాస ప్రేరితుఁడయి, మనుజుఁ డాత్మీయాభ్యంతరికశక్తుల నుపయోగించుకొనుచున్నకొలఁదియు నవి నవీనమగు వికాసమును బడసి, అపూర్వకార్యసాధకములయి, అసమాన సౌఖ్యదాయకమగు సాఫల్యము నొడఁగూర్చును. ప్రపంచమందుఁ దమకుఁగల శక్తిసామర్థ్యములయం దర్ధభాగమునయిన నుపయోగించుకొనువారు నూటికి కిరువురయిన లభించు టరిది.

ఈశ్వరదత్తములగు శక్తులం దవిశ్వాసమును గలిగి పనికిమాలినవారలయి జీవచ్ఛవములవలె మనుచుండువారల సంఖ్యయే నేఁడు విశ్వమునం దధికముగాఁ గానవగుచున్నయది. దుష్టుఁడగు రావణాసురుని యసురకృత్యములకుఁ గినిసి, విభీషణునకుఁ దా నాశ్రయ మిచ్చినపుడు రాముఁడొనరించియున్న ప్రతిజ్ఞావాక్య మాధీరుని యాత్మవిశ్వాసమును జూటుచున్నయది.

"రసాతలం వా ప్రవిశ్యే త్పాతాలంవాపి రావణః
పితామహ సకాశం వా న మే జీవన్విమోక్ష్యతే."

"రావణుఁడు రసాతలమున కరిగినను, పాతాళముఁ జొచ్చినను, బ్రహ్మదేవుని యొద్ద కరిగి డాగినను నేను వానిని నిర్జింపక వదలను."

శక్తిసామర్థ్యాతిశయములచే రాణించుచుండియు నాత్మవిశ్వాసశూన్యతచేఁ దమ్ము శక్తిహీనులుగఁ దలంచు మూఢమానవు లనుదినము నితాంతానర్థులగుచు నొకానొక దివసము మనుష్యత్వమునే కోలుపోవుదు రనుట కేమియు సందియము లేదు. ఇట్టి మానవాధములచే వారి యవనతియే కాక లోకాభ్యుదయమార్గము సయిత మరికట్టఁబడుచున్న యది.

తన్నుఁ దా నొక మృణ్మయమూర్తిగఁ దలపోయు వాఁడు కొంతకాలము గతించినంతనే నిజముగనే చైతన్యమును దక్కి శిలావినిర్మితంబగు జడపదార్థమేయయిపోవును. వాస్తవ మరయ నయోగ్యత, దుర్బలత, అసమర్థత యను నీచపదార్థముల మానవులందు సర్వేశ్వరుఁడు సృజించియుండ లేదు. ప్రకృతి సదా మానవు నున్నతజీవిగ మనుటకే యుద్బోధించుచున్నయది.

ఆత్మవిశ్వాసముచే నుచ్చభావములను, సమున్నతాదర్శములను గలిగియుండు మానవుని జీవితవాతావరణమం దలి దుర్బలపరిస్థితులన్నియు సబలములయి వాని నుత్తమంబగు నున్నతమార్గానుగామిగ సిద్ధమొనరించియే తీరును. అనుకూలములగు పరిస్థితు లేర్పడినపిదప విజయము లభించు

టయం దబ్బుకము లేదు. తన్నొక యోగ్యునిగా భావించు కొని, నిర్భయచిత్తుఁడయి యుండు వ్యక్తియొక్క కర్తవ్య నిర్వహణ సంబంధమగు బాధ్యత సగము తీరిపోయినట్లే భావింపవచ్చును.

మన మెల్లపుడు పరుల యౌన్నత్యమును గాంచి, ఈర్ష్యను వహించుచు వారు భాగ్యవంతులనియు, అదృష్ట వంతులనియు ఈశ్వర కృపాపాత్రులనియు, మన కట్టి యోగము కలుగనేరదనియు విచారించుచు నాత్మశక్తిని లాఘవపరచు దురభ్యాసమున కలవడియున్నారము.

ఈ రీతి నాత్మశక్తుల ప్రభావ మెఱుంగక, ఆత్మ విశ్వాసశూన్యతచే మన మవ్వానిని జేతులార హత్యగావించి నిజ దౌర్భాగ్యమునకయి నెత్తి కొట్టుకొనుచున్నారము భాగ్యాభాగ్యము లాత్మవిశ్వాసముయొక్క కనుసయిగలే యను జ్ఞానము మనకుఁ గలుగునంతవఱకు మన మభివృద్ధి నందఁజాలము.

విచారశీలుండును, దృఢప్రతిజ్ఞాపాలకుండును, స్థిరసం కల్పచిత్తుండును, ఆత్మవిశ్వాసోపేతుండును నగు వ్యక్తి సకలలోక సంపూజ్యుఁడు.

"Who breaks his birth's invidious bar,
And grasps the skirts of happy chance
And treats the blows of circumstances;
And grapples with his evil star."—Tennyson.

"తన జన్మయొక్క ద్వేషోత్పాదకమగు ప్రతిబంధ కమును భగ్నమొనరించునట్టియు, సౌఖ్యముయొక్క యదృ ష్టమును బంధించివేయునట్టియు, బరిస్థితులయొక్క ప్రహార

ముల సహించునట్టియు, నిజశనిగ్రహముతో మల్లయుద్ధ మొనరించునట్టియుఁ గర్మయోగి సాహసికుఁడు; ధన్యుఁడు."

—టెన్నిసను.

ఆత్మవిశ్వాసముచేఁ గొండలఁ గన్నెత్తిచూచి వానిని బిండిపిండిగఁ గొట్టఁగలనను ధైర్యమును, విశ్వాసమును మది యందు ధరించువాఁడే దేవునిభూమండలమున కంతటికిని కిరీట ములేని సార్వభౌముఁడు. ఎన్ని సంపదలున్న నాత్మవిశ్వాస మొకటి కొఱవడిన వానిజీవితము వ్యర్థమే కాఁగలదు. కర్మ క్షేత్రమున స్వాభావికముగఁ దటస్థించుచుండు విపత్పరంపరఁ గాంచి, వాని నవలీలగఁ దునిమి వేయునట్టి యాత్మవిశ్వాస యుతున కిలాతలంబున లభింపని పదార్థమే యుండఁజాల దని ఘంటాపథముగ వక్కాణింప వచ్చును.

ఆత్మవిశ్వాససంపన్నుఁడగు శ్రీరాముఁడు ధీరుఁడయి సకల సౌభాగ్యసంపన్నమగు సామ్రాజ్యమును దృణప్రాయ ముగ విసర్జించి ఘోరారణ్యముల వాస మొనరించుచున్నపుడు శ్రీరామభక్తుఁడగు భరతుఁడే తెంచి యాగ్రహపూర్వకముగ రాజ్యమును స్వీకరింపఁ బ్రార్థింప గంభీరముగ నిట్లు వచించెను.

"లక్ష్మీ శ్చంద్రా దపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్,
అతీయా త్సాగరో వేలాం న ప్రతిజ్ఞా మహం పితుః."

—వా. రామాయణము.

"చంద్రుఁడు తన లక్ష్మిని విడనాడినను, హిమగిరి హిమమును బాసినను, సముద్రము తనమర్యాద నతిక్ర మించినను నేను పితృాజ్ఞాపాలన విముఖుఁడను గానొల్లను."

శ్రీరాముని యీ ప్రతిజ్ఞచే నతనియందుఁ గల యాత్మవిశ్వాసము తెల్లమగుచున్నయది. సఫలవిఫలముల యొక్క భావనలే కర్తవెనువెంటనే కార్యానుకూలానను కూల సామగ్రులఁ గొనివచ్చుచుండును. ఆత్మవిశ్వాసలబ్ధ మగు కర్తవ్యసాఫల్యముముందు బంధుమిత్రాదులచే లభ్య మగు సాహాయ్యము సాగరమందలిసలిలకణమువలె నుండును.

బాహ్యశక్తికంటె నాంతరికశక్తి యుత్కృష్టమైనది. ఆత్మవిశ్వాస మాంతరికసంపత్తి. మిత్రులసాహాయ్య సంపత్తి బాహ్యమయినది. దృఢవిశ్వాసప్రోక్తమగు కార్యాచరణ మభివృద్ధి జెందినకొలఁదియు మానవాత్మ వికసించుచు మను జునియోగ్యతను, శక్తిసామర్థ్యములను, తేజోబలములను ప్రవర్ధమాన మొనరించును.

మన మొక కార్య మాచరింపఁగడంగుటకుఁ దొలుత మన యావద్విచారశక్తిని, ధ్యానసామర్థ్యమును, సంకల్ప బలమును గేంద్రీకరింపఁ జేసి, ఆచరింపఁబోవు కార్యమందలి యాత్మవిశ్వాసముతోడ సమ్మిశ్రిత మొనరించివేయుట శ్రేయస్కరము. అట్టిచో కర్తయొక్క మనసునందుఁ గార్య సాధకంబగు నొక యపూర్వవిశ్వాసబల మేర్పడి వాని యోగ్యతను ద్విగుణితమొనరించివేయును. అట్టిస్థితియందతఁ డెట్టి ఘనకార్యమునయినఁ దృటిమాత్రకాలంబున సాధింప సమర్థుండగును. ఆత్మవిశ్వాసబలముచే మనుష్యుఁడెట్టి సంక టముల నెదుర్కొనుటకేని శంకింపనొల్లఁడు.

"Be ever bold and brave to face
the puzzles and ready to win the race."

—Sadhu Vaswani.

"విజయలక్ష్మిని వరించుటకు సర్వదా ధైర్యసాహసములతో విపత్తుల డీకొనుటకు సన్నద్ధులమయి యుండవలయును." —వాస్వానీ పండితుడు.

మానవునియొక్క సమస్త దైహికాత్మికశక్తులపై నాధిపత్యము వహించి వాని యుత్థానపతనములకుఁ గారణీభూతమగున దాత్మవిశ్వాసమే. ఆత్మవిశ్వాసమనియెడిచమూపతి లేనిదే శరీరాత్మనుశక్తులనియెడి భటులు ఘనకార్యమను దుర్గమును భేదింపఁజాలరు. మేల్కాంచినట్టి యాత్మవిశ్వాసము మానవునియం దణఁగి మణఁగియున్న శక్తుల నన్నింటి విజృంభింపఁజేసి సృగాలప్రాయుఁడగు భీరువును వీరకేసరిగ సిద్ధమొనరించును.

ఆత్మవిశ్వాస ముదయమగుటతోడనే మానవునియం దొకవిధమగు నపూర్వబలసంచారము కాఁదొడంగును. దాని వెంటనే యభేద్యమగు సాహసమును, దాని పిఱుందనే పరస్పరసాహాయ్యబద్ధములగు బాహ్యాభ్యంతరికశక్తులును నుద్దీపితములయి యథావిధి గార్యధర్మమును నిర్వహించుచుండఁ గలవు. అట్టి స్థితియందు మనుష్యునకు జయాపజయముల సందేహబాధ కలుగనేరదు.

ఏదోయొకవిధముగ విశ్వమందలి మానవులెల్ల రెవ్వియో కొన్నికార్యములయందు దత్తచిత్తులై యుండుచున్నటులనే గోచరించుచున్నయది. కాని వానిలో విజయశ్రీని వరించువారి సంఖ్య బహుస్వల్పము. దీనికి ముఖ్యకారణ మధికసంఖ్యాకు లాత్మవిశ్వాసమును విస్మరించుటయు,అద్దానిని యథోచితముగ నాదరింపకుండుటయే సుఁడీ!

విజయసంపాదనమే జీవితపరమావధియని త్రికరణం బుల విశ్వసించి తత్ప్రాప్తివిషయమున దృఢనిశ్చయమును, స్థిరసంకల్పమును గలిగియుండువాని కీభూతలమున నసాధ్యమగు కార్యమే లేకుండఁబోవును. కాని, నేఁటి మానవుఁ డైహికభోగవిలాసప్రియుఁడయి, విషయలంపటుఁడయి, జీవితాదర్శమహోత్తుంగ పర్వతమునుండి భూతలపతితుఁడయి, ఆత్మజ్ఞానబలస్థైర్యవిశ్వాసముల జొత్తిగా విస్మరించి భ్రష్టుఁ డయి పోవుచున్నాడు. దౌర్భాగ్యము, దారిద్ర్యము, నిరంతరదుఃఖము, నిరుత్సాహము, అసహనము, వ్యర్థక్రోధము. మొదలగునవియే యాత్మవిశ్వాస శూన్యుండగు జీవచ్ఛవము యొక్క మృతసంపదలు.

ఆత్మవిశ్వాసప్రభావంబుననే భారతయుగమున ధనంజయుఁడు దిగదిగంతములఁ దనకీర్తి వల్లరుల వ్యాపింపఁజేసి కొనుచు ధార్తరాష్ట్రులకును, పాండవులకును మాత్రమే గాక, లోకమందలి సమస్తరాజలోకమునకును దలమానికమయి, వెలింగి, వాంఛించినపుడెల్లవిజయలక్ష్మిని ముద్దాడఁ గలిగెను. సంపూర్ణమగు నాత్మవిశ్వాసముగల వ్యక్తియందు సాహసము మూర్తీభవించి, వానిని ధర్మోన్ముఖుని గావించి కర్మక్షేత్రము నుండి పలాయన మొనరింపనియ్యదు.

ఆత్మవిశ్వాసముయొక్క గతి సదా ముందునకే యుండునుగాని వెనుక కుండఁజాలదు. ఆత్మవిశ్వాసమునం దేవిధమగునట్టి దుర్బలత్వమునకును స్థానములేదు. ఆత్మవిశ్వాస జన్యమగు నపూర్వసాహసము మానవు నొక వీర వతంసునిఁ గావించి, ఎట్టి భయంకర కష్టపరంపరల నయిన

నిస్సందేహముగ డీకొన వాని నుద్రిక్తునిగావించుచుండును. అట్టి స్థితి యందు వానిహృదయము పిడుగుల వృష్టినిగాని, ఫిరంగి గుండుల వర్షమునుగాని సరకుఁగొననట్టి సుదృఢమయి సుస్థిరమయి, అంతమునకు సుఖదుఃఖాది ద్వంద్వముల సయితము సులభముగా జయింపఁగడంగును.

ఆత్మవిశ్వాససంపన్నుడు సర్వపదార్థముల లీలాప్రాయముగ సంపాదింప సమర్థుడగుచున్నాఁడు. ఆతఁడు తానవలంబించిన కార్యమునం దెన్నిపర్యాయము లపజయము తటస్థించినను విచారింపనొల్లఁడు. ఆతఁడు కర్తవ్యాచరణముయొక్క ఫలాఫలముల కేమాత్రమును ఖేదామోదములఁ బ్రకటింప నొల్లఁడు. భగవద్గీతయందుఁ బ్రతిపాదితమయి యున్న నిష్కామకర్మ పరతంత్రుని కర్థ మాత్మవిశ్వాస సంపన్నుఁడనియే.

నిష్కామకర్మయోగినే మహాత్ముఁ డందురు. నే నీ యాత్మవిశ్వాసపరిపూర్ణచిత్తునే యోగీశ్వరుండనియు, ద్వంద్వాతీతుఁడనియు, పురుషోత్తముండనియు నొక్కి వక్కాణించు చున్నాఁడను. ఆత్మవిశ్వాసము అను పదము చేరి మహానుభావత్వమును సృజించుచున్నది. ఆర్యవిజ్ఞానము నుడువు ధీరలక్షణము లన్నియు నాత్మవిశ్వాస సంపన్నుని యందుఁ గాననగును.

"సుఖంవా దుఃఖంవా కిమివ హి జగత్యస్తి నియతం
వివేకప్రధ్వంసా ద్భవతి సుఖదుఃఖవ్యతికరః
మనోవృత్తిః పుంసాం జగతి జయినీ కాపి మహతాం
యయా దుఃఖం దుఃఖం సుఖమపి సుఖం వా న భవతి.

—చండకౌశికము.

"సుఖదుఃఖములు ప్రపంచమున నియతములా ? వివేక నాశనముననే సుఖదుఃఖము లవశ్యభోక్తవ్యములగుచున్నవి. ప్రపంచమున మహాపురుషులయొక్క మానసికప్రవృత్తి యెంతటి విజయశాలిని ? దానికారణముననే వారు దుఃఖమును దుఃఖముగను, సుఖమును సుఖముగను జూడనొల్లరు.

ఇట్టి యచంచలమును, అనాసక్తమును, గంభీరమును, సుస్థిరమును నగు చిత్తప్రవృత్తి మానవున కాత్మవిశ్వాసముననే లభ్యమగుచున్నది. ఆత్మవిశ్వాసము నిశ్చయముగా నిహపరసంతరణమునకు మూలసాధనము. మానవునియందు భూరిబలమున్నను, సామర్థ్యాతిశయమున్నను, కర్మాచరణ సందర్భమునం దవ్వానిచిత్తము కించిన్మాత్రము చలించినను, భావము లస్థిరములయినను, ఇంచుక సందేహ ముప్పతిలినను సర్వసిద్ధమయిన నాటకమంతయు రసాభాసమయి పోవుట ధ్రువము.

సఫల విఫలములందును, జయాపజయములందును శాబ్దికదృష్టిచే భేదము స్వల్పముగనే గోచరించినను, పరిణామమందుం గల భేద మనంతము. కర్తవ్యసాఫల్యమును వాస్తవముగాం బడయ నభిలషించు వ్యక్తి ప్రప్రథమము తనభావములను, కల్పనలను, సంకల్పములను సుస్థిరములుగను, సుదృఢములుగను జేసికొనుట పరమావశ్యకము. ఆతఁడు తనచిత్తసీమనుండి సందేహమును, నిరుత్సాహమును, భయమును, చలనమును సమూలముగఁ బెఱికివేయు టవసరము.

అనంతరము వాఁ డాత్మవిశ్వాస బలసంపన్నుఁడయి, సంపూర్ణమగు నాశతోడ, దృఢసంకల్పముతోడ విజయ

మేనాఁడో కరగతమయి యుండినట్లుగఁ దలంచి, తదుచిత మగు నుత్సాహమును భావములందును, వచనములందును, కార్యములందును, గనఁబఱచుచుఁ గార్యాంగమున యోధాగ్రేసరునివలెఁ బ్రవేశించినచో విజయలక్ష్మి వాని పాదరాజీవముల మ్రోల నృత్యముసేయఁ గడంగును. అపుడతఁడా జయలక్ష్మీసందర్శన మహాభాగ్యమున కెంతేని విస్మయానందాబుధి నోలలాడఁ గలఁడు.

నాఁటగోలె వాని కాత్మవిశ్వాస మొకజీవిత మూలమంత్రమయి కాంక్షించినంతనే విజయమును బట్టి తెచ్చి వాని చరణ సన్నిధిని బడవేయుచుండఁగలదు. అట్టితఱి సందేహభయావిశ్వాసములు స్వప్నమందయిన వాని చెంత కేతెంచ నేరవు. మన మేదేని యొక మహాకార్యము నాచరించి ఫల మనుభవింప నభిలషించుటకుఁ బూర్వమా కార్యమును భావరూపమునం దావిర్భవింపఁ జేయు టుత్తమము.

మనచిత్తమునకు మనచే నభిలషింపఁబడు వస్తువుయొక్క సంపూర్ణపరిజ్ఞానము తొలుతనే లభించియున్నచో మన కర్తవ్యపథ మెంతయో పరిష్కృతమును, సుఖసంపన్నమును, నిష్కంటకమును గాఁగలదు. కార్యప్రారంభదశయందు మనయభిలాష నిస్సారంబుగను, దుర్బలముగను నున్నఁ గార్యపరిణామ మెట్లానంద దాయకము కాఁగలదు? నేఁటి దనుక విశ్వమందు సఫలీభూతములయియున్న సత్కార్యము లన్నియు బలవత్తరమును, ప్రగాఢంబును, సుస్థిరమును నగు నభిలాషావిశేషంబునను, పట్టుదల వలనను నెఱవేఱినవని వచించుట కెట్టి సందేహమును లేదు. కార్యారంభమునకుఁ

దొలుత నెవ్వాని చిత్తమందు విజయ సంపాదనాభిలాష గాఢముగ నెలకొనియుండునో, ఆతఁడు ధీరుఁడయి దైవలోప మున సుక్కియు భీతిల్లక నిజశౌర్యముచేఁ గార్యసాఫల్యము నందఁగలుగుచున్నాఁడు.

ఘనకార్యభార మొండు శిరమున ధరించి కర్మక్షేత్ర మునఁ బ్రవేశించు మనుష్యునకుఁ బ్రప్రథమము చతుర్దిశల గాఢాంధకారపటలమును, నిరాశాప్రాబల్యమును మిక్కుటముగాఁ గానవచ్చును. ఆత్మవిశ్వాస భానూదయముచే విఘ్నములను కాఱుమబ్బులును, కటికి చీకట్లును జటాపంచలయి పోవును. కర్తకుఁ గల ప్రగాఢవిజయ వాంఛ, అంధకార బంధురమగు కర్మక్షేత్రమున వాని కనుకూలములగు పరిస్థితులఁ గల్పించి నవ్యాశాప్రకాశపుంజములఁ జీటికి మాటికి లోచన గోచర మొనరించు చుండును.

మనవిశ్వాస విచార పటుత్వాపటుత్వముల ననుసరించియే మన జీవననికేతనము నిర్మాణమగుచుండును. విశ్వాసముయొక్క పరిస్థితులు మాఱుచున్నకొలఁదియు మనజీవిత గ్రంథాధ్యాయములును నిత్యపరివర్తనమునకుఁ బాల్పడుచుండఁగలవు. విశ్వాసాభావంబున వర్తించు వ్యక్తి కిలాతలంబునఁ బ్రాప్తించుఫలము స్వల్పపరిమితియందే యుండుట యథార్థము. సంపూర్ణాత్మవిశ్వాసయుక్తునికి సీమవిజయ ప్రాప్తియు, అపారానందైశ్వర్యములును జిరసంపదలయి, ఈలోకమున సద్యశస్సౌఖ్యములను, పరమందు శాంతిని బ్రసాదింపఁగలవు.

విశ్వాసపరిమితికిని, సఫలతాపరిమాణములకును మిక్కిలి సంబంధము కలదు. నేఁటివఱకు విశ్వమునం దాత్మీయపురుష

కారముచేతను, బాహుబలమువలనను మహాత్ములయినవారి జీవితచారిత్రములఁ బఠించినచో నందు నాత్మ విశ్వాస ప్రభావ సంజనితములగు నద్భుతకర్మపరంపరలు చిత్రింపఁబడి యుంటఁట గోచరింపఁగలదు. వారి జగద్విఖ్యాతికిని, అతుల సంపత్తికిని ముఖ్యముగా నాత్మవిశ్వాసమే ప్రథమ కారణ మని మన మపుడు గ్రహింపఁగలము.

వారియం దధ్యవసాయము సయిత మాత్మవిశ్వాస ముతోఁబాటు లేకపోలేదు. వారు తమ యభీష్టములందుఁ ద్రికరణములఁ దల్లీనులయి, చిత్తదఢిమచే నొప్పారుచు నిజయోగ్యతయందును, సామర్థ్యమందును నచలమగు విశ్వాసమును గలిగియుండి కర్మనాచరించి సంపూర్ణవిజయ మును గని ఘనులయిరి.

ఆత్మవిశ్వాసమే లేనిచో లోకమునం దనేకులు స్వోదర పోషణము గావించుకొనలేనట్టి యసమర్థులయి దుఃఖించు చుండ, మానవుఁ డొక్కఁడు సమస్తప్రపంచ జీవితసంస్కరణ మహోద్యమమున కెట్లు సూత్రధారియు, సంచాలకుండును గాఁగలఁడో విచారించుకొనుఁడు.

నేఁడు భారతభారతేతర రాష్ట్రములకన్నింటికి నాత్మ సందేశమును వినిపించుచు, విపక్షుల కార్య ప్రతిబంధకముల నెల్ల దూరమొనరించుకొనుచు, ఎట్టి కఠినసమస్యల నయిన సులభముగాఁ బరిష్కరించుకొనుచు, ధీరుఁడయి, మహావీరుఁ డయి, కర్మయోగియయి, సర్వసంగ పరిత్యాగియయి లోకో ద్ధారకుఁడను ఖ్యాతివహించిన జ్ఞానమూర్తియగు శ్రీ గాంధి మహాత్ముని కెల్లవిధములఁ దోడునీడగ నున్న దేదియో గ్రహింపుఁడు.

సామాన్యస్థితినుండి గాంధిమహాత్ముని నేఁడిట్టి మహోన్నతస్థితికిఁ గొనివచ్చిన దేదియోయని మీరు భ్రమపడ నవసరము లేదు. గాంధిగారిజీవితాభ్యుదయమునకు మూలమయిన సాధనములలో నాత్మవిశ్వాసమే తొల్లింటిది. మహాత్ముఁడు విదేశమందు విద్యాభ్యాసమును ముగించి స్వదేశమునకేతెంచినప్పటినుండియుఁ బ్రతిపదమునందు నతని కెన్నియో కష్టములు, నిష్ఠురములు వాటిల్లెను. కాని యతఁ డాత్మవిశ్వాసముచేఁ దన కర్తవ్యపథమునఁ దోఁచినట్టి యవాంతరముల నెల్లఁ దొలఁగఁ ద్రోయుచు నేఁటికి జగదాదర్శ ప్రాయుఁడగు పురుషోత్తముఁడు కాఁగలిగినాఁడు.

ఒక యాంగ్లకవీంద్రునివాక్య మొండు స్మృతికి వచ్చుచున్నయది:—

"The merchant, who towards spicy regions sails,
Smells their perfume far off, in adverse gales,
With blasts which thus against the faithful blow
Fresh odorous breathings of god's goodness flow."

"ఎవఁడేని యొక వ్యాపారి సుగంధద్రవ్యములు గల దేశమువైపునకు సముద్రముపైఁ బయన మొనరించుచున్నవాని కెదురుగా వీచునట్టి యీదరగాలియం దా దేశపు సుగంధము కలిసివచ్చుచుండఁగలదు. అదియేచందమున దృఢప్రతిజ్ఞా బద్ధుఁడయి కర్మనాచరించు వ్యక్తికి విరుద్ధమయియున్న పరిస్థితి యను వాయువునం దీశ్వరానుగ్రహమను సుగంధము నిండియుండును."

అనఁగా సత్కార్యాచరణమునం దెన్ని విఘ్నపరంపర లుదయించినను, విశ్వాసమును, పట్టును వీడనిచో ఫలము సిద్ధించితీరునని తాత్పర్యము.

మహాపురుషుల మానసిక ప్రవృత్తులన్నియు వారి ధ్యేయములందును, లక్ష్యములందును, గమ్యస్థానమందును విలీనములయి యుండును. నామమాత్రమునకయిన సందేహ భయావిశ్వాసాది చిత్తదుర్బలత్వములు వారియందు గోచరింపఁజాలవు. ఆత్మవిశ్వాసము వారియం దమితముగా నుండుటచే వా రెట్టిస్థితియందును ప్రజాదూషణభూషణ తిరస్కారపరిహాసముల సరకుఁగొనకుందురు.

ప్రపంచమందు ధ్యేయపదార్థమగు కర్తవ్యసాఫల్య మొక్కటియే యాత్మవిశ్వాసపూరితమగు వారి దృష్టికిఁ గాననగుచుండును. ఈకారణముననే వారు ప్రాపంచికములగు విపత్పరంపరలకును, సాధకబాధకములకును నతీతమగు దశకుఁ బ్రాపించి మహాత్ములయి, సకలప్రపంచము నాకర్షించి, మహోద్యమముల భువిఁ బ్రతిష్ఠింపఁ జేయఁగలిగియున్నారు.

అట్టి మహాపురుషుల దేహములు నశించినను వారి కీర్తి చిహ్నములగు జీవితచరిత్రములఁ బఠించి దుర్బలులగు యువకు లనేకు లుత్సాహావేశ పూరితులయి, ఆత్మవిశ్వాస బలవిభూషితులయి, ఘనకార్యములఁ జేపట్టి యాచరించి యాదర్శప్రాయులు కాఁగలుగుచున్నారు. ప్రపంచమం దపూర్వ విజయమును గడించువారలఁ గాంచి, ఎవ్వియో ప్రకృతి విరుద్ధములగు విషయముల వారి సఫలతా విషయమున ముఖ్యసాధనము లయ్యెనని దూరదృష్టిలేక మనము పేర్కొనుచున్నారమేకాని, సమస్తోన్నత విజయములకు యథార్థమగు కారణ మాత్మవిశ్వాసమే యని గ్రహింపఁ జాలకున్నారము.

విజయలక్ష్మీసంపన్నుల మనము భట్టులమై, వంది మాగధులమయి, సౌభాగ్యవంతులనియు, కార్యకుశలురని యు, తంత్రవాదులనియు, దైవకృపా పాత్రులనియు, మంత్రి శక్తియుతులనియు, ధనాఢ్యులగు బంధువుల తోడ్పాటు కల వారలనియు, రాజసన్మాన సంపన్నులనియుఁ గీర్తించుచుం దుమేకాని, వారి యపూర్వములగు విజయముల కన్నింటికి వారి ప్రతిరక్తరేణువునందు మూర్తీభవించియున్న యాత్మ విశ్వాసమే ముఖ్యహేతువనియు, తదితరకారణము లన్నియు నిమిత్తమాత్రములే యనియు గ్రహింపలేకున్నారము. ఆపద లయందు నాత్మవిశ్వాసమును గోల్పోవని వ్యక్తి కెట్టి ఘన కార్యముల నయినను సులభసాధ్యములే యగును.

"There is no education like adversity, sweet are the uses of adversity. Adversity makes men but prosperity makes monasters." —Bacon.

"Hope is the anchor of life, hope is the Poorman's bread, the miserable have no other medicine but only hope." —Shakespeare.

"ఆపదకంటె గొప్ప నీతిశిక్ష లేదు. విపదానుభవము యొక్క ప్రయోజనము లతిమధురములు. ఆపత్తి మనుష్యత్వ మును సృజించును. సంపత్తి రాక్షసత్వమును గలుగఁ జేయును."

—బేకను.

"విశ్వాసము జీవితనౌకకు లంగరువంటిది. విశ్వాసము పేదవానిపాలిటి యాహారము. దురదృష్టవంతులకును, నిష్ప్రయోజకులకును విశ్వాసముకంటె వేఱుమందు లేదు."

—షేక్స్పియరు.

మానవుని శరీరము దుర్బలమయి యున్నను, రూప విహీనమయి యున్నను, వాడు ధనాఢ్యుఁడు కాకపోయినను, భాషణమందు గాంభీర్యములేని వాఁడయి యున్నను, ఆడంబ రాట్టహాసములఁ జవిఁజూడని వాఁడయి యున్నను వానియం దపరిమితమగు నాత్మ విశ్వాసమును, తదుపాంగములును, ఉపకరణములును నగు విశ్వప్రయత్నము, స్థిరసంకల్పము, ప్రగాఢమగు నాశ మున్నగున వున్నచో సమ స్తవిషయ ముల విజయము వానికిఁ గరతలామలక మగుటయం దాశ్చ ర్యము లేదు.

విద్యార్థులారా ! నేఁడు మీరు దుర్బలులై, ఉత్సాహ శూన్యులయి, విద్యావివేకముల సంపూర్ణప్రతిభను బడయ కుండుటకును, ప్రతిపరీక్షయందును కృతార్థత నందకుండుట కును ముఖ్యకారణమేమియో గుర్తించితిరా? ఆత్మవిశ్వాస శూన్యతయే మీ సమ స్తపరాభవములకు ముఖ్య హేతువు.

మనుష్యుఁడు తన సమ స్త మానసికశక్తులఁ గార్యసం పాదనమందును, దృఢవిశ్వాసమునందును లీనమొనరించి వేయుచో వాని కెట్టి మహత్తర కార్యమందును విజయము నార్జింపఁ బరులసాహాయ్య మపేక్షింపవలసిన పనియే యుం డదు. కర్మయోగి తన మస్తిష్కమునందుఁ జిత్రించుకొని యున్న వస్తువాంఛను దృఢవిశ్వాసముచే మూర్తీభవింపఁ జేసికొనఁ గలుగుచున్నాఁడు. ఆతడు ప్రత్యక్షమగు నా యభీష్టాకృతిని స్థూలసూక్ష్మదృక్కుల నరయుచు, కేరింతలు కొట్టుచు ద్విగుణితోత్సాహముతో గమ్యస్థానమును జేరఁ గలుగుచున్నాఁడు.

విజయసంపాదనారహస్య మింతియే యని ప్రతి మనుష్యుఁడును గ్రహించుట శ్రేయస్కరము. విజయవిశ్వాసమును మనుజుఁడు కలిగియుండుట పరమావశ్యకమే యగుఁగాని, అయ్యది మృతప్రాయముగను, అర్ధవికసితముగనునున్నఁ బ్రయోజనము సుంతయుఁ గలుగనేరదు. హృదయపూర్వకమగు సంపూర్ణవిశ్వాసమే సార్థకమయినది. విజయోపలబ్ధి విషయమునఁ గలిగియుండు విశ్వాసమునందుఁ దిలమాత్రమగు సందేహమున్నను ఫలము గగనపుష్పమే యగును.

విజయవిశ్వాసమునందు సందేహోదయ మగుచున్న కొలఁదియుఁ బ్రయత్నాధ్యవసాయదార్ఢ్యము క్షీణించి విపరీత పరిణామదాయకము కాఁగలదు. సుదృఢవిశ్వాసము విజయముయొక్క ప్రాణపంచకము. భీషణమగు నగ్నితాపమే ధాతువుల నీరొనరించు విధంబున సంపూర్ణాధ్యవసాయమును, దృఢప్రయత్నమును, ఆత్మవిశ్వాసమును గూడి యెట్టి ఘనకార్యమునయిన సులభముగా సాధించును. చిత్తైకాగ్రతాశూన్యమగు కార్యము ఫలింపనేరదు. చిత్తమును లీన మొనరింపకయే యవసరములయొక్క నిర్బంధముచే సామాన్యు లనేకకార్యములఁ గావించి విఫలమనోరథులగుచుండుట మనము కనుచు వినుచున్నారము. నావకుఁ జుక్కానివలెఁ జిత్తము కార్యమునకుఁ బ్రధానోపకరణమయి చెన్నుమీరారుచున్నయది.

కర్మక్షేత్రమునఁ బిశాచములవలెఁ దమ భయంకరముఖగహ్వరములఁ దెఱచికొని కబళించివేయఁ బైపైకేతెంచు భయంకరకష్టములఁ గాంచి, భీతిఁ జెంది, కర్మరంగము నుండి

పరాఙ్ముఖము గానట్టియు, పలాయన మొనరింపనట్టియు దృఢవిశ్వాసమే విజయలక్ష్మిసంపాదనమున కత్యంతాపేక్షణీయమయి యున్నది. సంయోగభాగ్యములును, పరిభుక్తస్త్రీకటాక్షములును గార్యవిజయోపకరణము లను భ్రాంతి మానవుని మస్తిష్కము నావహించియున్నంత పర్యంతము వాఁడు కర్మక్షేత్రమును బ్రవేశించుటకయిన నర్హుఁడు కాఁజాలఁడు.

"నేఁడు ఇంగ్లాండు దేశముయొక్క యభ్యుదయస్థితికి మూలము కేవల విశ్వాసపూర్వకమగు నాత్మావలంబనమే. ఆదేశమందు ధనాఢ్యులు, నిర్ధనులు, యువకులు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు వీరు వారను భేదము లేక సమస్త జనులు క్షుద్రత్వమును, పరావలంబనమును, అవిశ్వాసమునువిసర్జించి, ఆత్మవిశ్వాససంపన్నులయి, దృఢసంకల్పముతోఁ గర్మరంగమున యోధులవలె వర్తించుచుందురు. ఆకారణముననే వారత్యధమస్థితినుండి యుద్ధరింపఁబడి, అనేకవిషయములయందపూర్వాభివృద్ధి నందఁగలిగియున్నారు."

—మిల్లను

"అభిలాష కలుగుచోటెల్ల మార్గమును గోచరించుచుండఁగలదు. ఏదేని యొకకార్యము నాచరింప సంకల్పించు మనుష్యుని కర్తవ్యపథమునుండి విఘ్నపరంపరలన్నియుఁ దొలఁగిపోవుట కాత్మవిశ్వాస మవసరమయియున్నది. 'నేను సర్వోత్తమంబగు నేకార్యమునయిన సాధింప సమర్థుఁడనయి యున్నాను.' అను విశ్వాసమును గార్యసిద్ధి నభిలషించి ప్రతి మనుజుఁడును గలిగియుండు టావశ్యకము. ఏ పదార్థమునయిన సంపాదింపఁ బ్రతిజ్ఞాబద్ధుఁడగు మనుష్యుఁడు విశ్వాస

బలముచే దాసిని నిక్కువముగనే పడయఁగలఁడు. విశ్వాస గతుఁడు విజయుఁడు.''
—డ్రైడెనుకవి.

"ఎవఁడేని యొక పదార్థమును వాంఛించియు సఫల మనోరథుఁడు కాఁడేని వాని యభిలాష విశ్వాసావలంబిత మును, ప్రగాఢమయినదియుఁ గాదని గుర్తెఱుంగఁదగును. ఆత్మవిశ్వాసపూర్వకమగు ప్రబలేచ్ఛాపరిణామమే సిద్ధి.''
—కే. రోమమహాత్ముఁడు.

జ్ఞానశూన్యులగు గ్రంథకర్త లనేకులు నిర్జీవమగు వంది మాగధకవిత్వమును నేర్చి మహాత్ముల జీవితవృత్తాంత ముల వ్రాయవలసివచ్చినపుడు వారి పుట్టుకలయందే ప్రకృతి విరుద్ధ మగు ఘనత నారోపించి, తజ్జీవిత చారిత్రపాఠకుల కర్మయోగ సాధనోత్సాహమును సడలఁజేసి లోకమునకు వచింపరాని యపకార మొనరించుచున్నారు. సామాన్య మానవుఁడే యాత్మవిశ్వాసప్రేరితుఁడై కృషిసలిపి మహాత్ముఁ డగుచుండ, మూఢులగు కవులు మహాత్ములు జన్మతోడనే పవిత్రులని వ్రాయుచుఁ బురోభివృద్ధికై యత్నించు మానవుల యుత్సాహమును భంగపఱచుచున్నారు.

కవులయొక్క-యిట్టి వ్రాఁతలు నిరుపయోగములును, మీఁదుమిక్కిలి హానికరములును నయి యున్నవి. ఇట్టి ప్రకృతి విరుద్ధములగు వ్రాఁతల యథార్థములని నమ్మి యువకు లనేకు లాత్మవిశ్వాస ప్రయోజనమును మఱచి, అదృష్టదైవానుగ్రహములకు దాసాధములై పోవుచున్నారు. ఆత్మవిశ్వాస సంపన్నుఁడే దైవానుగ్రహమునకుఁ బాత్రుఁ డనియు, భీరువునకును, దుర్బలునకును సర్వేశ్వరుఁడు ప్రబల

శత్రు వనియు గ్రంథకర్తలు లోకమునకు బోధించుచు హతశేషమయి యున్న యాత్మవిశ్వాసమును బునరుద్ధరించి ధన్యులగుదురుగాక !

ఆత్మ విశ్వాసపూర్వక మగు కర్మయోగసాధనము వాస్తవముగా సర్వేశ్వరుని గట్టితెచ్చు ననుటలో నావంతయు వింత లేదు.

సర్వజ్ఞుండును, లోకకల్యాణకరుండును, కరుణామయుండును నగు పరాత్పరుఁడు మానవు నదృష్టపిశాచము యొక్క కింకరునిగా సృజించియే యున్నచోఁ గార్యసాధనోపకరణము లగు నంతఃకరణమును, బుద్ధిని, చిత్తమును, జ్ఞానమును, కరచరణాద్యవయవములను మూఢుఁడయి వాని కేలఁ బ్రసాదించి యుండును? సర్వేశ్వరోద్దేశ్యము మానవుఁ డదృష్టము యొక్క హస్తమందలి తోలుబొమ్మ యయి, ప్రమత్తజీవిత నిర్వాహకుఁడయి మృగమువలెఁ జరింపవలెనని యుండఁ జాలఁడని మానవదేహనిర్మాణమును బరిశీలించు నెంతటి మందబుద్ధియు గ్రహింపకపోఁడు.

మహాధీశాలియు, అద్వితీయప్రజ్ఞావంతుఁడును నగు తిలకుభగవానుఁడు భాగ్యాభాగ్యములు దృఢాదృఢసంకల్ప లబ్ధములనియు, కర్మ సర్వలోకాధికారిణి యనియు నెలుఁగెత్తి లోకమునకుఁ జాటియున్నాఁడు. ఆ మహాత్మునిచే రచింపఁబడిన గీతారహస్యము కర్మయోగప్రభావమును, ఆత్మవిశ్వాసప్రశస్తిని, ప్రవృత్తియొక్క ప్రాశస్త్యమును దెల్లమొనరించుచున్నయది. అదృష్టదురదృష్టములకుఁ బ్రత్యేకాస్తిక్యము లేదు. మానవుఁడే స్వయంభాగ్య విధాతయయి

యుండ భాగ్యప్రదాతి వేఱొకండెట్లుండునను నభిమానముచే నున్నతమస్తకులమయి, సత్కార్యముల సాధింప సముచితోత్సాహ స్వాంతులమయి ముందున కరుగుచుండుట సముచితము.

"It is the prerogative of men to be in a great degree a creature of his own making."

—Burke.

"తన కర్మరూపమగు కారణముయొక్క కారణరూపమగు ప్రాణమగుటయందు మనుష్యులకే కర మధికారము గలదు." ——బర్కు.

మానవాభ్యంతరిక దృఢవిశ్వాస సామర్థ్యముయొక్క వేడి నిట్టూర్పులమ్రోల నదృష్టరేఖ రెప్పపాటు కాలమయిన నిలువనేరదు. ప్రతిమనుష్యుఁడును ప్రబలమగు నాత్మవిశ్వాసమును, దృఢసంకల్పబలమును, సంపూర్ణోద్యోగశక్తిని సంపాదించినచో మహాకార్యములంత స్వయంసిద్ధము లగును. అపూర్వ రాజనీతి కుశలతను, సచివత్వమును బడయుటకు దీనుఁడును, హీనుఁడును, బాలుఁడును నగు తిమ్మరుసున కేది తోడ్పడెను ?

విశాలాంధ్రసామ్రాజ్య నిర్మాణోద్యమమున శ్రీకృష్ణదేవరాయల కెయ్యది సాహాయ్యభూతమయ్యెను ? హరిహరరాయలు, బుక్కరాయలు దేనికృపచే విజయనగరమును నిర్మింపఁ గలిగిరి ? భర్తృపరిత్యక్తయగు నబలాగర్భమున జనించి యనాథుఁడుగఁ బెరిఁగిన శ్రీ శివాజీకి హైందవసామ్రాజ్యస్థాపనమునను, గోబ్రాహ్మణార్యధర్మ సంరక్షణమునను సహకారియయిన దేది ?

ప్రతిహైందవునిచేఁ బ్రాచీనకాలమాదిగ గర్హింపఁ బడుచు వచ్చిన యవనజాతీయుఁడగు నగ్బరు సార్వభౌమునకు హిందూమహమ్మదీయ మైత్రిస్థాపనమందును, ఏకచ్ఛత్రాధిపత్యముగ యావద్భారతవర్ష సామ్రాజ్య పరిపాలనమందును ముఖ్యముగఁ దోడ్పడిన మహత్సాధన మేది? అచంచలమును, గంభీరమును నగు నాత్మవిశ్వాసమే యని వేఱుగ నుడువవలయునా?

మనము మన కార్యసిద్ధికొఱకు సర్వమును త్యజించుటకును, ప్రాణము లొడ్డుటకును సంసిద్ధులమయి యుండవలయును. మనము తన్మయులమయి సాధక బాధకముల నెల్ల విజయలక్ష్మియొక్క యాశీర్వాదములుగ భావించుచు ముందంజవేయు పద్ధతి నభ్యసింపవలయును. మన భావములు, వాంఛలు, కార్యములు, ప్రయత్నములు యివియవి యననేల? కర్తవ్యనిర్వహణమునకు వలయు సమస్తోపకరణములు, సకలప్రవృత్తులు మన యున్నతి నిమిత్తము పాటుపడవలసియున్నది.

నోరు తెఱచుకొని క్షుద్బాధచే భూమ్యాకాశములు బ్రద్దలగునట్లు గర్జించుచు వచ్చు సింహము మన కర్తవ్యపథమున కడ్డుతగిలినను భీతిల్లక, విజయరహస్యమును గ్రహించి ముందంజవేయుఁ గటిబద్ధులమయి యుండవలయును. పర్వతములను, సముద్రములను, అగ్నికుండములను భయంకరాటవులను, భూమ్యాకాశములను, శ్మశానవాటికలను, రసాతలంబును సంపూర్ణమగు నాత్మవిశ్వాసముతోఁ గాలించివైతము. అపుడే గుండెలో విజయలక్ష్మి మనలఁ బాసి యుండఁ గలదో చూతము! ఆత్మవిశ్వాసమే విజయప్రకాశమయి

జాజ్వల్యమానముగ వెలుఁగుచోట నపజయాంధకారపటల మెట్లు రాజ్యమేలును? ఈ నిముసమందు మనల కసంభవముగఁ దోఁచినకార్యమే సాహసించి యత్నింతుమేని మఱు నిముసమందే బహుసులభసాధ్యము కాఁగలదు. మనుష్యుఁడయి భూతలంబున జన్మించిన ప్రతిజీవియు నార్జింపవలసినది ధనధాన్యాదులు కావు. ఆత్మవిశ్వాససాహసాదులే.

ఆత్మవిశ్వాస సాహసప్రయత్నశూన్యుఁడగు వ్యక్తికి క్షణమందుఁబిత్రార్జితములగు సంపదలు మిక్కుటముగ లభించినను, అనుక్షణ పరివర్తనశీలమగు నీ ప్రపంచమం దేదియో యవాంతర మొందు వాటిల్ల నా ధనాఢ్యభీరువు దరిద్రుఁడయి ఆత్మవిశ్వాసము లేనివాఁ డగుటచే స్వతంత్రశక్తిచే నాహారమునయిన సంపాదించుకొనలేక గంజికయిన నోఁచక నిరాహారియయి దుర్మరణము నందవలసి వచ్చును.

పిత్రార్జితములగు సంపదలు మందునకయిన లేకపోయినను, నేఁడు కట్టగుడ్డయు, త్రావ గంజియు లభింపకున్నను, ఆత్మవిశ్వాసప్రయత్నములను గలిగియున్న వీరవరేణ్యుఁడు భూధరంబులఁ బెకలించివైచి, భూదేవిని విచలిత మొనరించి, సప్తసముద్రములఁ గలంచివైచి, ఆకాశమును గాళ్ళఁదన్ని, త్రిలోకములఁ దన ముష్టియందు బంధించివైచి పీయూషరసమును బాన మొనరింపఁగలఁడు.'

కావుననే మహాభారతము విత్తవంతునికంటె వృత్తవంతు నధికుఁడనియె. తల్లిదండ్రులును, బంధుబాంధవులును, దైవమును దనకెట్టి సంపదల నొసంగకపోయినను, ధీరుఁడాత్మవిశ్వాసముచేఁ బొంగిపొరలి వచ్చుచున్న కష్టసముద్ర

మును దాటుచు ప్రయోజనమను తీరమును జేరుచుండఁ గలఁడు. ఒకటికి రెండు పర్యాయములు విపత్పరంపరలకు గుఱియయి చలింపని స్థైర్యముతోఁ గర్తవ్యసాధనమునకుఁ గడంగువాఁడు భాగ్యశాలి

"We learn wisdom from failure much more than from success. He that fails to-day may be up again to-morrow by hope and attempt." —Smiles.

"మనము జయమునుండి కంటె నపజయమునుండియే విశేషమగు తెలివిని నేర్చుకొందుము. నేఁడు క్రిందఁబడువాఁడు రేపు యత్నముచేతను, విశ్వాసమువలనను లేవఁగలఁడు."

—స్మైల్సు.

తనయాత్మయందపూర్వవిశ్వాసానుభవమును, అచంచలభావానందభోగమును, ప్రవిమలశాంతిని బడయుటకే బ్రహ్మసాక్షాత్కార మని పేరు. నేఁడు దైవికసామర్థ్యమును భావమందుఁ గల్పనచే ననుభవించుమనుజుఁడు రేపు సర్వేశ్వరతుల్యుఁడయి, మహాబలాఢ్యుఁడయి, ప్రజ్ఞావంతుడయి సకలలోకము నధ్యక్షించునంతటి యోగ్యుఁడు కాఁగలఁడు.

ఆత్మవిశ్వాసమే లేనిచో నబలయగు సత్యభామ నరకాసురునిబోలు చండప్రచండుని పీచ మడంచు టెట్లు పొసఁగియుండును? ఆయమ సంగ్రామప్రయాణోన్ముఖయగు తన్ను శ్రీ పురుషాదు లెందఱు పరిహసించినను, భయపెట్టినను, బంధు బాంధవు లెంతగా వలదని నివారించినను మేటిమగఁటిమిఁ బూని నిండు నమ్మకముతో నా దైత్యభూపాలునిపై దండెత్తి వానిని సంహరించెను.

ముగుదయే యాత్మవిశ్వాసప్రభావంబున వీరులకేని శక్యముకాని యసురమారణ క్రియయు నం దపూర్వవిజయమును సంపాదించియుండఁ బురుషులు భీరువులయి పడియుండి తమ యాత్మోన్నతికయి కృషి సలుపకుండుటకెంతయు లజ్జ పడవలసియున్నది.

అట్టివారి మృతప్రాయములగు జీవితములకుఁ గోటి ధిక్కారములు. మనుష్యులమగు మనకు —వీరకేసరులమగు మనకు—విజ్ఞానమయజీవులమగు మనకు — వసుంధరపైఁ బేదఱికమును, దౌర్భాగ్యమును, దుఃఖమును, అపజయమును విధించువాఁ డెవఁడు ?

మనయందుఁ బౌరుషమేయున్న, ఆత్మజ్ఞానమేయున్న, విశ్వాసాధ్యవసాయబలములేయున్న సంపదలు, సౌఖ్యములు, సామ్రాజ్యములు, మోక్షములు మన పాదములకడఁ బడి యుండవా ?

"న సంశయ మనారుహ్య నరో భద్రాణి పశ్యతి,
సంశయం పునరారుహ్య యది జీవతి పశ్యతి."

"సంశయగ్రస్తునకు ననఁగా సాహసశూన్యునకు కల్యాణమెప్పుడును గలుగనేరదు. సందేహమును నశింపఁజేసి వీరుఁడై కార్యమును సాధింపఁబూను మనుష్యుఁ డవశ్యము విజయుండగును ప్రతి యుత్తమకార్యమందును గష్టనష్టములు వాటిల్లుచుండును. కాని మనుష్యుఁడు క్లేశముల ననుభవించుచుండియు వానిని లెక్కఁజేయకున్నచోఁ గృతకార్యుఁడగును."

షోడశ వర్షప్రాయుఁడగు నభిమన్యుకుమారుని యుద్ధ విద్యాప్రదర్శనమును మహాభారతమందలి పద్మవ్యూహభంగ

సందర్భమున విలోకింపవచ్చును. ఆత్మవిశ్వాసమే లేనిచో నల్పవయస్కుఁడును, ఏకాకియు నగు సౌభద్రుఁడు సింహపరాక్రమ సంపన్నులును, మహాబలులును నగు కౌరవ యోధులఁ బరాభవించి, కురుసేనావాహినిని గల్లోలపఱచఁ గలిగియుండునా ?

విద్యార్థులారా ! అంబరచుంబితశైలరాజముల ధూళిఁ గాంచిన దెద్ది ? భయంకరారణ్యములఁ బుష్పవాటికలఁ జేసిన దేది ? జడమగు నయోమార్గమును నడిపించినదేది? విహంగ గమనమును గేరు వాయుయానవిహారసౌఖ్యమును మనకుఁ గలిగించిన దెయ్యది ? స్థూలశ్రవణములకు దూరస్థములగు వార్తల నాకర్ణించుభాగ్యమును గలిగించినదేది? చిత్రవిచిత్ర యంత్రతంత్రమంత్ర నిర్మాణమునకు హేతువేది ? అగోచరంబును అస్వాభావికంబును, విజ్ఞానగౌరవభంజకంబును నగు నదృష్టమా ? లేక కృషిపూర్వకమగు నాత్మవిశ్వాసమా ?

వాస్తవ మాలోచింప నొకవిధముగ నీశ్వరదృష్టియు వివిధకళా వికాసశూన్యమగు నొక జడపదార్థమే. అద్దానికి నవీన వికాస ప్రకాశములఁ గలిగించి, అపూర్వలావణ్యమయంబుగఁ జేసినదియు విజ్ఞానపూర్వకమగు నాత్మవిశ్వాసమేయన్న నతిశయోక్తి లేదు. ఆత్మవిశ్వాసము, దృఢనిశ్చయము, అవిరళప్రయత్నము, ప్రగాఢవాంఛ, నిరంతరకృషి మున్నగు శక్తులు కడు దివ్యతమములు.

అభేద్యములగు దుర్గప్రాకారములభేదించునవి శతఘ్నిగోళములని భావించుట భ్రమించుటయే. ఆత్మవిశ్వాసప్రయత్నములే జడమగు లోహమును శతఘ్నిగ నిర్మింపఁజేసి, దాని

నామమునరిభయంకరముగఁజేసివైచెనని గ్రహించువారరిది. ఏమహాపురుషుఁడును,ధర్మప్రవర్తయుఁబండితప్రకాండుఁడును సామ్రాజ్యస్థాపకుండును,ధీరవీరాగ్రేసరుండును నాత్మవిశ్వాస ప్రయత్నాధ్యవసాయముల యనుగ్రహము లేకనే యున్నతి నందినా రనుమాట కల్లమాట.

ఈమహద్గుణములులేని మనుజునం దెట్టి మహిమయు నుండనేరదు. వాస్తవముగ మన కెల్లవిధముల హితైషియగు దేవుఁడే విజయోత్పాదకములగుసకలసాధనముల జన్మతోడనే ప్రసాదించియున్నాఁడు. అజ్ఞానులమగు మన మా భగవ ద్దత్తములగు గూఢశక్తుల మన హృదయాంతరాళమునం దున్నటులే గ్రహింపకున్నారము.

జన్మానంతరమే మానవుఁడు మూర్ఖుడయి, తనయాత్మ యందు విశ్వాసములేనివాఁడై దుర్బలత్వము, లాఘవత్వము కృపణత్వము మున్నగు మానసికదారిద్ర్యములఁ గొనితెచ్చు కొనుచున్నాఁడు. ఏ మనుజుఁడును జన్మచే నిరుపేద కాఁడు. ఈశ్వరుఁ డెల్లమానవుల భాగ్యవంతులుగనే సృజించు చున్నాఁడు.

మన యల్పభావములే, మన దుర్బలసంకల్పములే, మనవిశ్వాసశూన్యతయే మనదుస్థితికిని, క్షీణదశకును ముఖ్య కారణము లని గ్రహించునంతవఱకు మనకు జీవితౌన్నత్య పథమే గోచరింపఁజాలదు. మన యున్నతికిని, అవనతికిని మనమే కారకులమని గ్రహింపవలసి యున్నది. మన మీ రహస్యమును గుర్తించినంత స్వాభావికముగనే మనహృద యము విస్తీర్ణముగను, భావము లున్నతములుగను, చేష్టిత

ములు వికాసావేశపూరితములుగను, వర్తనము సాధుతమంబుగను, దృష్టి విశాలముగను, కార్యాసక్తి విస్తృతంబుగను నేర్పడ నారంభించును.

ప్రతి యువకుఁడు నాత్మవిశ్వాసప్రభావ మనంతము కదాయని భావించి దుష్టములును, పరతంత్రములును ఆత్మాభ్యుదయ ప్రతికూలములును నగు కర్మల నాచరింపరాదు. ఆత్మ పవిత్రమయినదియు, జ్ఞానయుక్తమయినదియు నగుటనయ్యది సత్కర్మలయందే విశ్వాసము కలదయి యాచరణోన్ముఖమయిన ఫలము సిద్ధించును. కాని నీచమును, అస్వతంత్రమునునగు కర్మయం దాత్మవిశ్వాసమును గలిగి, తదనుష్ఠానమునకుఁ గడంగిన ప్రయోజనమునకుమాఱు హానియే వాటిల్లఁగలదు. ఆత్మవిశ్వాసముచే నుత్సహితుఁడయి ప్రతి వ్యక్తియుఁ బవిత్రములగు స్వతంత్రకర్మలనే సాధింపవలయును. ఆత్మకు స్వాతంత్ర్యముకంటెఁ బ్రియతమంబును, మధురమునునగు పదార్థ మేదియు లేదు.

యద్యత్పరవశం కర్మ తత్తద్యత్నేన వర్జయేత్
యద్యదాత్మవశం తు స్యా త్తత్తత్సేవేత యత్నతః
సర్వం పరవశం దుఃఖం సర్వ మాత్మవశం సుఖం
ఏతద్విద్యా త్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః
యత్కర్మ కుర్వతోఽస్య స్యాత్ పరితోషం తదాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతం తు వర్జయేత్.

—మనుస్మృతి.

“సత్పురుషులు పరాధీనములగు కర్మల యత్నపూర్వకముగ విసర్జింపవలయును. స్వాధీనములగు వానిని యత్నపూర్వకముగా ననుష్ఠింపఁదగును. కారణ మేమనఁ బరాధీనము

లగు కార్యములు దుఃఖరూపములు. స్వాధీనములు సుఖరూపములు. ఈచందమునఁ గర్మల విభజించి మనుష్యుఁడు సుఖదుఃఖములం దీలక్షణములనే గుర్తెఱుంగుచుండవలయును. అంతరాత్మ కామోదకరములగు కార్యముల భూరిప్రయత్నముచే సాధింపవలయును. అంతరాత్మయొక్క యానందమును నశింపఁజేయునట్టి పనులను శీఘ్రమే బహిష్కరించి వేయవలయును."

ఆత్మవిశ్వాసముచే నభ్యుదయము నందిన మహాపురుషులఁ గాంచి వారల నభినందించుచుఁ గూర్చుండుట మనవిధి కాదు. ఆత్మవిశ్వాసముచేఁ బ్రేరితులమయి, ప్రయత్నించి వారి ముత్తాతల మగుటకై మనము యత్నింపవలసియున్నది. ఆత్మవిశ్వాససంపన్నుఁడగు ధీరునకుఁ బంచభూతములును, ప్రకృతియు, సృష్టియందలి స్థావరజంగమపదార్థము లన్నియు దాస్య మొనరింప సన్నద్ధింపఁగలవు.

ఆత్మవిశ్వాసి స్వప్రయత్నముచే శైలశిఖరము నారోహింపఁగలుగ, విశ్వాసశూన్యుఁ డెటులో కొండనెక్కియుండియు భీతుఁడై దానిపైనుండి క్రిందఁబడి మృతిఁ జెందును. నేఁడు భారతీయ విద్యార్థులు మనుష్యత్వమును దూషిత మొనరించు హీనకర్మలఁ దగిలి, ఆత్మవిశ్వాసమును గోల్పోయి హతభాగ్యులయి రోదనములతోఁ గాలహరణ మొనరించుచుండుట యెంతయు శోచనీయము.

నేఁడు మానవజాతి నావహించియున్న దుర్భరదారిద్ర్యమునకుఁ బ్రబలమగు హేతువు నమ్మిక, పూనిక, గుండె మున్నగునవి లేకుండుటయే యని తెలియనగును. తోలు

గ్రుడ్లతోఁ జూచువారికిని, ఆత్మవిశ్వాసశూన్యులగు పిఱికి పందలకును మనుజుఁడు విశ్వమం దొక కణముగనే గోచరించును. కాని యాత్మవిశ్వాసము గల ధీరుని విశాలమగు దృష్టిలో నీ విశాలమగు విశ్వము మానవుని యాభ్యంతరిక శక్తియుతమగు హృన్మండలమునం దొక రేణుసదృశముగ గోచరింపఁగలదు.

ప్రతికార్యాచరణమునకు ముందు మనుష్యుఁ డాత్మవిశ్వాసమును సుదృఢ మొనరించుకొను టావశ్యకము. అనంతర మద్దానికి లోఁబడియున్న దైహికాత్మిక శక్తులన్నియుఁ బూర్ణముగా వికసితములయి, విజృంభితములయి, కార్యనిర్వహణాయత్తము లయి విజయలక్ష్మిని సాహసబంధనముల బంధించి తెచ్చి మానవుని పాదములపైఁ బడయవేయఁగలవు.

మనుజుఁడు సర్వదా తన్నుఁ దా నొక యధికునిగను, ఉత్తమునిగను భావించుకొనుచు నున్నతాదర్శశీలములను, విశాలములగు భావములను సంపాదించుచు వానిని మూర్తీభవింపజేసి యపుడపుడు నేత్రములతో విలోకించుచుండుటయు శ్రేయస్కరము. ఈ రీతి భావనామాత్రంబుననే సంతుష్టాంతరంగుఁడయి, క్రియాశూన్యుఁ డయి, మిథ్యాహంకారాభిమానయుతుఁడయి యుండు మానవుఁడు విజయశీలుఁడు కానేరఁడు.

"Man is his own star; and the soul that can,
Render an honest and a perfect man,
Commands all light, all influence; all fate:
Nothing to him falls early or too late
Our acts our angels are, good or ill,
Our fatal shadows that walk by us still."

—Beaumont & Fletcher.

"మనుష్యుఁడు తనభాగ్యమునకుఁ దానే కర్త. వానిని సదాచారసంపన్నునిగను, సమగ్రస్వరూపునిగను జేయు జీవాత్మకు సకలప్రకాశమును, సమస్తప్రభుత్వమును, సర్వసౌభాగ్యములును లభించఁగలవు. ఆత్మకుఁ గొంచెమేని యేదియు నతిత్వరితముగాఁగాని అత్యాలస్యముగాఁగానిలభింపఁజాలదు. యథాసమయమునం దాత్మ సమస్తమును బడయఁగలదు. మన మొనరించు కర్మలే మనయొక్క మంచిచెడ్డ దేవదూతలు. అవియే మనవెంట సంచరించుచుండును. అవి దైవముయొక్క ఛాయలు." —బీమాంటు అండ్ ఫ్లెచ్చర్.

విజయమందిరారోహణమునకు విశాలోన్నతభావమే ప్రథమసోపాన మనుట యాఢి. ఉన్నతములగు భావముల నిత్యము సంపాదించుటయు, వాని నెల్లఁ గ్రమక్రమముగాఁ గార్యరూపంబునఁ బరిణమింపఁ జేయుటయు మనముఖ్యవిధి యయి యున్నది. ఇట్లొనరించుచుండుటచే మనయోగ్యత నిత్య మభివృద్ధి జెందుచుండ, మన కద్దానిపై విశ్వాసము జనించి మనలఁ గర్మయోగులుగ సిద్ధ మొనరించివేయును.

మనుజుఁ డున్నతాభిలాషియగుటయు, సాధువర్తనుఁడయి వెనువెంటనే తద్వాంఛాపూర్తికయి కార్యాచరణమునకుఁ గడంగుటయుఁ బరమధర్మమయి యున్నది. పరమేశ్వరుఁడు మన కున్నతాభిలాషల మానసమునం దుదయింపఁ జేసికొనుశక్తిని బ్రసాదించి యంతటితో నూరకుండలేదు. వానిని సాధించుట కర్హమగు శక్తిని సయితము దయచేసి యున్నాఁడు.

జ్ఞానమయుఁడగు జగన్నియంత మనల వ్యర్థముగా జీవించుటకును, సూకరాదులవలె నుదరపోషణమాత్రోప

జీవులమయి మనుటకును, వన్యగార్దభముల చందమున వ్యర్థ సంచారమొనరించుటకును సృజించియుండలేదు. ప్రతిమానవునిచే నేదియో యొక ఘనకార్యమును భువిపై నాచరింపజేయుటకే మనుష్యుల నీశ్వరుడు సృజించియున్నటుల విజ్ఞానముద్బోధించుచున్నది.

మానవుని జీవితపరమావధి, ఆహారనిద్రాభయమైథునముల నాచరించుట కాదు. పశుపక్ష్య సామాన్యములగు నీ ధర్మముల కతీతమగునట్టి విజ్ఞానసంపన్నములగు చతుర్విధపురుషార్థముల సంపాదించుటయే మానవజీవితలక్ష్యము. అట్టి పరమోత్కృష్టమగు జీవితలక్ష్యములు సాధింప మనము నవీనమగు యోగ్యతకొఱకును, నూతనమగు శక్తికొఱకును దేశదేశముల నన్వేషింపవలసిన పనిలేదు. సర్వజ్ఞుండగు నా దేవదేవుడు మన జీవితాభ్యుదయమునకు వలయు లోకోత్తరమగు సామర్థ్యమును, అనూనంబగు స్థిరశక్తిని, అపూర్వమగు ప్రతిభను మనయందే భద్రపఱచియున్నాడు.

మన మా శక్తిసామర్థ్యముల గుర్తెఱింగి, వానియందు విశ్వాసము గలవారలమయి, కర్మయోగులమయి ధీరవీరులమయి, సాహసిక శిఖామణులమయి, గంభీరసత్సంకల్పవ్రతపరాయణులమయి, నిరుద్యోగమును బాసి, అలసతను రోసి, నిరుత్సాహమును ద్రోసి కార్మికప్రపంచమున గాళ్లుసేతులు గదల్చువిధమును నేర్వవలసి యున్నది. ఇదియే జీవితోత్థానముయొక్క పరమరహస్య మని గ్రహింపవలయును.

మనజీవితమునందు దొరదవు సమస్త కార్యములకును, ప్రాయికముగా సంభవించుచుండు సకలఘటనాపరంపరలకును

ముఖ్యకారణము మనకు బాహ్యముగా నెచ్చటనో దాగి యుండలేదు. తన్మూలము కారణస్థలమగు చిత్తసీమయందే నెలకొనియున్నది. సమస్తకార్యములును మానసమునుండియే తొలుతఁ బ్రారంభమగుచున్నవి. మన చిత్తమందే భావన యే కార్యమునందు సంఘటితమగునో, ఆ ప్రతిక్షణమందే దాని కనురూపమగు కార్యము మనచే నాచరింపఁబడుచుం డుట నిత్యము మనదృష్టియందు నైసర్గికముగ గోచరించుచునే యున్నది.

మానవుఁ డొక యత్యద్భుతమును, మధురమును నగు విజయఫలమును సంప్రాప్తింపఁ జేసికొనియుండినచో మొదట నతఁ డట్టిభావమునే మదియందుఁ గలిగియున్నాఁ డనియు, అట్టి ప్రయత్నమునే యవిరామముగ నాచరించి యున్నాఁడనియు, దాని కనువగు యోగ్యత తనయందుఁ గల దను ప్రబలవిశ్వాసమును గలిగి యున్నాఁడనియు, తత్కార్యముయొక్క సత్ఫలము నేనాఁడో కబళించియున్నవాని చందమున నిర్భయముగ, నిమిత్తమాత్రునివలె గర్మక్షేత్ర మునఁ బ్రవేశించియున్నాడనియు మనము స్పష్టముగా గ్రహిం పవలసియున్నది.

మనుష్యునకు లభించునట్టి సమస్తవిధములగు విజయ ములు వాని మానసముయొక్కయు, భావములయొక్కయు చిత్తప్రవృత్తులయొక్కయు వికాసస్వరూపమగు పరిణామ ములే కాని మఱేమియుఁ గావనియు గ్రహించుటావశ్యకము. ఆత్మవిశ్వాసముచేమానవునిచిత్తమునఁబ్రవేశించుసామాన్య భావమే యొకనాఁడు వానిచే మహోత్కృష్టమగు ఘన కార్యమును సాధింపఁజేయఁగలదు. విజయము నపేక్షించు

వ్యక్తికి విఘ్నములు, పరాజయములు, తపనములు వాటిల్లు చున్నను వాని నన్నింటి విజయసూచనలుగనే భావించవలసి యుండును.

"One who never turned his back, but marched breast forward;
Never doubted clouds would break;
Never dreamed, though right were worsted, wrong would triumph
Held, we fall to rise, are baffed to fight better, sleep to wake." —Browning.

"కర్తవ్యమునుండి విముఖుఁడు కానట్టియు, సదా ముందంజ వేయుచుండునట్టియు వ్యక్తియే యుత్తమ పురుషుఁడు. ఆతఁడు మేఘములు విచ్ఛిన్నములగునని యెపుడును సందేహింపఁడు. ధర్మమును, సత్యమును శిథిలము లయినను, అధర్మమునకు, అసత్యమునకును విజయముకలుగునని స్వప్నమందును భావింపనట్టియు, నిద్రించునది మేల్కాంచుట కనియు, ఓడుట జయించుట కనియు, పడుట లేచుటకనియుఁ దలంచు నట్టియు వ్యక్తియే యథార్థమగు మానవుఁడు."
—బ్రౌనింగు.

కర్మయోగ రహస్యముల నెఱుంగని దుర్బలహృదయు లగు యువకులు కొందఱు ప్రబలోత్సాహముతో నేదేని యొక కార్యమును ప్రారంభింతురు. ఏవిధమగు సామాన్యావబోధమును గలుగకున్నంత పర్యంతము వా రా కార్యము నాచరించుచు నెట్టి సామాన్యవిఘ్నము తటస్థించినను నిరుత్సాహులయి, ఆత్మ విశ్వాసమును గోల్పోయి, కార్యక్షేత్రము నుండి విముఖత్వమును వహించు చున్నారు. సంపూర్ణమగు నాత్మ విశ్వాసమును సేకరింపకయే ఫలాపేక్ష

చేఁగాని, పరుల యభివృద్ధిని విలోకించికాని తత్క్షణమే శంకించుచు నొక కార్యమును బ్రారంభించినచో వెంటనే పరాజితులయి విచారింపవలసినవార లగుదురు.

నేఁడు భరతవర్షమందలి యువకులగు విద్యార్థులెల్లరు వాస్తవికమగు జీవితాభ్యుదయమును బడయ స్వాతంత్ర్యమును, స్వావలంబనమును,ఆత్మవిశ్వాసమును,ఆత్మసమర్పణమును, స్వయంకృషినిఁ జేయుటకు మాఱుగా నాత్మజ్ఞానప్రతిబంధకమగు పాశ్చాత్యవిలాసమయ సభ్యతకు దాసులయి యనుదినము దైహికమానసికాత్మికశక్తులఁ గోల్పోవుచుభీరువులగుచు గొప్పకార్యముల నాచరింపవలసివచ్చినపుడు సాహసము లేనివారయి జడమూర్తులవలె నుండిపోవలసిన వారలగుచున్నారు.

నేఁడు విలాసప్రియత్వము మన యాత్మవిశ్వాసబలముల హరించివైచినది. ఆత్మవిశ్వాసశూన్యతయే మనల మనశక్తిని గ్రహింపలేనంతటి జ్ఞానాంధులనుగఁ జేసివైచినది. ఆత్మవిశ్వాసప్రభావముననే ప్రపంచమందలి సమస్తదేశములును,జాతులును బానిసతనమునుండి విడివడి సంపూర్ణస్వాతంత్ర్యమును సంపాదించుకొని సుఖించుచుండ నాత్మవిశ్వాసరాహిత్యముచే ముప్పదిమూఁడు కోట్ల సంఖ్య గల మనము నిన్న, మొన్నటివరకు స్వల్పసంఖ్యాకుల శాసనము క్రింద నణఁగిపోవలసినవారల మయితిమి.

ప్రాచీనకాలమున మనదేశమందు జన్మించి సాంఘికోద్యమములను, సంస్కరణోద్యమములను, ధార్మికోద్యమములను స్థాపించి, తన్మూలమున దేశమునకు గొప్ప

మేలొనరించియున్న మహాత్ముల కెల్లర కాత్మవిశ్వాసమే కర్మక్షేత్రమున మిక్కిలి సహకారి యయ్యెను.

అనేకవేల సంవత్సరములకుం దొలుత స్థాపింపంబడిన సనాతన ధర్మముల సంస్కరింపం గంకణబద్ధులయి యుండిన శ్రీ బుద్ధ రామమోహనాది మహానుభావుల జీవితచర్య లన్నింట విశేషముగాం బ్రత్యక్షమగున దీ యాత్మ విశ్వాసమే. ఆత్మవిశ్వాసము లేనిచో మనుష్యులు విశ్వప్రయత్న మొనరించియు సామాన్యకార్యమునైన నిర్వహింపంజాలరు.

ఆత్మవిశ్వాసమునకును, విజయమునకును గాఢమగు సంబంధము కలదు. ఒక మనుష్యుం డొక కార్యమును బ్రారంభించి, నిర్విఘ్నముగా దానిని గొనసాగింపజాలండు. విఘ్నములు కలుగుచుండుట నైజము. విఘ్నములందును, సాహస విశ్వాసముల నోడకుండుట ధీరునకు సహజము. ఆత్మవిశ్వాసము నత్యధికముగం గలిగియున్నను మనుష్యుండు ఫలాపేక్షాతురుండయి కార్యసాధనమునకుం దగినంత కృషి సలుపకున్న విజయప్రాప్తి విషయమున సందేహము కలుగవచ్చును. ఏ కార్యమయినను దగిన కృషి, ఓపిక, పూనిక, నమ్మిక వ్యవధి మున్నగు పరికరములన్నియు నున్నంగాని సఫలీభూతము కానేరదు.

" The heights by great man reached and kept.
Where not attained by sudden flight;
But, they, while their companions slept ;
Where toiling upwards in the night."

"మహాపురుషులకు లభ్యమై వారిచే సురక్షిత మొనరింపంబడునట్టి యున్నతపదవి కేవల మొక్కసారిగ నెగురుటచే లభింపంజాలదు. మహాపురుషులు తమ మిత్రులెల్లరు నిద్రించు

చుండ నారాత్రియందే యున్నతస్థానమును జేర యత్నించు చుందురు.''

"తనయందు గోప్యముగనున్న స్వాభావికమగు శక్తిని వికసింపఁజేయు క్షమనే ప్రతిభయని నుడువుదురు. అట్టి ప్రతిభయందుఁ గృషి, సహన మను రెండు సద్గుణములు మూర్తీభవించియుండి మనుష్యుని సఫలమనోరథుని గావించు చుండును.'' —జాన్ ఫోష్టరు.

"ధైర్యమే ప్రతిభ. దృఢసంకల్పమే జయము. కృషియే మోక్షపథము.'' —కార్లాయిలు.

"మానవసంఘ శ్రేయోదాయకములగు సత్కార్యము లేవేని నాచేఁ గావింపఁబడి యున్నచో నవియన్నియుఁ బరిశ్రమ, ధైర్యము, క్షమ, విశ్వాసము మున్నగు సద్గుణముల మూలముననే యాచరింపఁబడినవి. ఆత్మవిశ్వాసపూర్వకముగఁ గావింపఁబడు కృషి విశ్వాసశూన్యతచేఁ గావింపఁబడు కృషికంటె సహస్రగుణము లధికమయినది. కావున సమస్త ప్రయోజనసిద్ధి కాత్మవిశ్వాసమే ముఖ్యమగు నని నేను సిద్ధాంతీకరించుచున్నాఁడను'' —డాక్టరు వెంటిక్.

"ప్రకృతి సౌభాగ్యముచేఁ బరిపూర్ణమయి యున్న కుబేరుని యొక్క విశాలమగు ధనభండారమువంటిది. ఆత్మవిశ్వాససంపన్నులును, పవిత్రసంకల్పయుతులును, ధీరులును నగు వారీ భండారమును స్వయంశక్తిచే స్వాధీనమొనరించు కొనఁగలరు.'' —ఎమర్సను.

"ఆత్మవిశ్వాసముచే దృఢప్రతిజ్ఞాబద్ధులయి యున్నత పథము నన్వేషించువారే సౌభాగ్యవంతులు.''

—స్మైలుస.

సర్వతోముఖ మగు లోకాభ్యుదయమున కాత్మ విశ్వాస మత్యంతావశ్యక మను ప్రమాణముల నొసంగఁగల మహాత్ముల జీవితవృత్తాంతము లెన్నియో కలవు. కాని వాని నన్నింటి నిటఁ జేర్చుటకు వలనుపడదు. యువ జనులు తాము కోరుకొనుచున్నంత యున్నతస్థితికిఁ బ్రాపింప కుండుటకు ముఖ్యముగా నాత్మవిశ్వాసము లోపించి యుండుటయే కారణమని గ్రహింపవలసియున్నది.

సృష్టియందలి సకల కార్యవిజేత లాత్మవిశ్వాసమును ధనధాన్యములకంటె మిక్కిలి గౌరవానురాగములతో వృద్ధిఁ గావింపఁ జూచుచుందురు. భారతీయ యువకులమగు మనము భాగ్యవిధాతయు, నిర్మాతయుఁ గేవలము మానవుఁడేయను సంపూర్ణ విశ్వాసము నిపుడు క్రియారూపంబునఁ బ్రదర్శింపవలసియున్నది. సమస్తకార్యసిద్ధిప్రదమగు మహాశక్తి యొకటి సర్వేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడి మనయందు వెలయుచున్నదనియు, అయ్యది కుంభకర్ణనిద్రయందు లీనమయి యుండుటవలననే మన మిట్టి దీనహీనస్థితియందున్నారమనియు, మన మా మహాశక్తిని మేల్కొల్పుటయే తడవుగా లోకమందలి సమస్తోత్తమకార్యముల సులభముగా సాధింపఁగలమనియు గ్రహింపవలసియున్నది.

విజయమును, యశస్సును, సౌఖ్యమును, సంపదలను, పరమశాంతిని సంపాదింపఁగల పరమయోగ్యత కేవలమొక్క యాత్మవిశ్వాసమందే కలదని జెప్పక తప్పదు. అజేయములగు బలపరాక్రమము లాత్మవిశ్వాసమునుండియే మనకు లభించుచున్నవి. ఆత్మవిశ్వాససంపన్నుఁడు పట్టినదెల్ల బంగారమగును. ఆత్మవిశ్వాస స్వీకారముచే మానవుని హృద

యాంతరాళమునం దొక విధమగు దివ్యప్రకాశ ముద యించి, వానికి నలుదెసల వ్యాపించియున్న యక ర్తవ్యాంధ కారమును, నిరాశాంధకారమును రూపుమాపి సమున్నత మగు జీవితాభ్యుదయ రాజమార్గమును దృగ్గోచర మొనరిం చును.

ఆత్మవిశ్వాస ప్రభావంబుననే మనుష్యుని కొక దివ్య దృష్టి సంప్రాప్తమయి, చర్మచక్షువుల కెంత యన్వేషించి నను గోచరింపనట్టి సూక్ష్మాతిసూక్ష్మములగు తాంత్రిక పదా ర్థములఁ బ్రత్యక్ష మొనరించును. అపుడు మానవుడావస్తువుల సులభముగా సంపాదించి, అనుభవించి సుఖింపఁగలడు. మానవుఁ డీరీతి సౌఖ్యములనందుచు నంతటితోఁ దృప్తుఁడై కూర్చుండక, తా నింతవఱకుఁ బడసియుండిన విజయముల కంటె మహత్తరములగు విజయముల సంపాదింప నభిలషించి ఘనకార్యముల నాచరించుచు, ననుదిన మాత్మశ క్తిని వృద్ధిఁగావించుకొనుచు స్వల్పకాలమునందే మనోభీష్టపదార్థ నిర్మాత యే కాఁగలుగుచున్నాఁడు

"విహాయ పౌరుషం యో హి దైవమేవావలంబతే,
ప్రాసాదసింహవ త్తస్య మూర్ధ్ని తిష్ఠంతి వాయసాః
కా మపి శ్రియ మాసాద్య య సద్వృద్ధౌ న చేష్టతే,
తస్యాయతి ఘన శ్రేయో బీజభోజికుటుంబవత్."

"అధ్యవసాయమును బరిత్యజించి, అదృష్టముపైనమ్మికఁ బూని కూర్చుండువ్యక్తియొక్క స్థితి, తనతలపై వాయస ములకుఁ గూర్చుండుటకుస్థానమిచ్చు ప్రాసాదముపై నిర్మింపఁ బడిన సింహముయొక్క దశవలె నుండును. కల్యాణమును బడసియుఁ దదభివృద్ధికయి కృషిసలుపనట్టి వ్యక్తియొక్క

కుటుంబస్థితి విత్తనములనే భక్షించు కృషీవలుని దుర్దశ ననుసరించి యుండఁగలదు.”

యువకు లీ రహస్యము నెఱింగి, ఆత్మవిశ్వాసముచేఁ దా మభివృద్ధిని సంపాదించినను, అంతటితో మౌనము వహింపక దానికంటె ను త్తమస్థితిని బడయ యత్న మొనరింపవలసియుం డును. ఇదియే మానవజీవిత కర్తవ్యపథము. ఈ మార్గము ననుసరించు మనుష్యున కక్షయానందసంపద్భండారము లభిం పఁగలదు. ఆత్మవిశ్వాసము ప్రబలప్రభావోత్పాదకమయిన దైవికశక్తి యగుటచే దైవమును సాక్షాత్కరింపఁ జేసికొన వాంఛించు ముముక్షువులును, భాగవతులును నీ శక్తి నవ శ్యము సంపాదింప బాధ్యులయి యున్నారు.

యువజనులారా! మీరెల్ల రాలసింపక సకలసౌభాగ్య దాయకంబును, నిఖిలసంపత్కరంబును, అఖిలానందసౌఖ్య కారణమును, ఐహికాముష్మిక శాంతిదాయకమును నగు నాత్మవిశ్వాసమును సంపాదింపుఁడు. ఆరాధింపుఁడు. అపుడే మీరు మానవులనిపించుకొని, ధరణి జన్మించినందులకు ఘన కార్యముల నాచరించి, ధీరులయి, లోకైక పూజ్యులయి, మహాపురుషులయి సుఖించి లోకమునకును సౌఖ్యానందపథ మును జూపి ధన్యులగుదురు.

నాయనలారా! మీరెల్ల రొక్కసారి యేకగ్రీవముగ నైక్యకంఠముతో మే మెల్లర మాత్మవిశ్వాసమును సన్మానించె దము. ఆత్మవిశ్వాసము నేసకలధర్మసాధనముగ భావించెదము. దానినే మేము సర్వస్వము నోడియయిన సంపాదించెదము. ఇది మా హృదయపూర్వకమగు ప్రతిజ్ఞ. ఆత్మవిశ్వాసము

లేక, బానిసలయి, జీవచ్ఛవములయి నికృష్టముగ వేలసంవత్స రములు జీవించుటకంటె, ఆత్మవిశ్వాససంపన్నులయి, స్వతం త్రులయి, విజయులయి, యొక్కసంవత్సరము మనినను వేయి మడుంగు లుత్తమము.

"Trust thyself; every heart will vibrate to that iron string." —Emerson.

"నీవు నీయందు విశ్వాసమునుగలిగియుండుము. అపు డెల్లరి హృదయములా లోహదండమువైపున కాకర్షింపఁబడి చుట్టు తిరిగి రాఁగలవు." --ఎమర్సను.

ఎమర్సను కవీంద్రుఁడు నుడివినరీతిగనే మనుష్యుఁడు తొలుతఁ దనయందు విశ్వాసమును గలిగియున్న సకలహృద యములఁ దనహృదయమే యాకర్షింపఁగలదనుటలో నెంతేని సత్యము కలదు. ఆత్మవిశ్వాసశూన్యుఁ డెవరి నాకర్షింపఁజాలఁ డనుట రూఢి. విద్యార్థులారా! మీ యాత్మవిశ్వాససంపా దనాప్రయత్నమున దయామయుండగు నట్టి జగదీశ్వరుఁడు తోడగుఁగాక!

శుభమస్తు!



# ఏబదియొకటవ ప్రకరణము



## పరోపకారము

పశ్యైతాన్ మహాభాగాన్ పరార్థైకాంత జీవితాన్,
వాతవర్షాతప హిమాన్ సహన్తో వారయ న్తి నః.
అహో ఏషాం వరం జన్మ సర్వప్రాణ్యుపజీవనం,
సుజనస్యేవ యేషాం వై విముఖా యా న్తి నార్థినః.
పత్రపుష్పఫలచ్ఛాయా మూలవల్కలదారుభిః,
గన్ధనిర్యాస భస్మాస్థి బీజైః కామా న్వితన్వతే.
ఏతావజ్జన్మసాఫల్యం దేహినా మిహ దేహిషు,
ప్రాణై రర్థై ర్ధియా వాచా శ్రేయ ఏవాచరే త్సదా.

—భాగవతము

(ఈ శ్లోకములు శ్రీకృష్ణునిచే ధనంజయు నుద్దేశించి నుడువఁబడినవి)

"పరోపకారార్థమే కేవలము జీవించుచున్న వృక్షములవిగో! చూడుము. అవి యెట్టిమహిమగలవి! వృక్షములు సదా ప్రచండమగు వాయువును, వర్షమును, ఆతపమును, హిమమును సహించుచు జీవరాసుల కాశ్రయ మొసంగుచున్నవి. సమస్తప్రాణులకు హితదాయకములైన వృక్షముల జన్మమెంతయు శ్రేష్ఠమయినది. సత్పురుషుల యాచించు భిక్షుకుఁడు విఫలమనోరథుఁడు కానిచందమున నే భూరుహాముల

నాశ్రయించునట్టి యేజీవియు నిరుత్సాహమునందుటతటస్థింప నేరదు.

వృక్షము నాశ్రయించు ప్రతిప్రాణియు నేదియో యొక ప్రయోజనము నవశ్యము నందగలదు. పాదపములు మనకుఁ బత్రములను, పుష్పములను, ఫలములను ఛాయను, మూలములను, వల్కలములను, ఇంధనములను నుచితముగా నొసంగుచున్నవి. ఇంతేగాక రసమును, దుగ్ధమును, జిగురును, భస్మమును, అస్థిని, (అరఁటి మున్నగువానియూచ) బీజములను నొసంగుచు మన యనేకములగు నవసరములఁ దీర్చుచున్నవి. మనుష్యులుత్తమజన్మధారులై నందులకుఁ దమ దేహ మనో ధన వచనాదికములమూలమున లోకముయొక్క హితము నాచరించుచుఁ బరోపకారపారీణు లగుట సమంజసము."

శ్రీకృష్ణభగవానుఁడు వచించియున్న యీవాక్యము లెంతయు గంభీరార్థబోధకములయి యున్నవి. అన్నమయ, ప్రాణమయకోశములఁ గలిగియున్న వృక్షాదులే లోకకల్యాణమునిమిత్తము తమయావజ్జీవితముల ధారవోయుచుఁ బ్రపంచమునకుఁ బరోపకారపాఠమును బోధించుచుండ సమస్తజీవరాసులకంటె విజ్ఞానమునం దున్నతస్థాన మలంకరించియున్న మానవులు పరోపకారమహిమను గుర్తింపకుండుట కడు శోచనీయము.

సృష్టియందలి రేణువుమొదలుకొని బ్రహ్మపర్యంతముఁ గల యేపదార్థమును బరీక్షించిచూచినను నది లోకోపకార పరతంత్రమైయున్నటులే గోచరింపఁగలదు. అట్టిస్థితియందు

విజ్ఞానసంపన్నులమును, మనుష్యులమును నగు మనము పరస్పరము ద్వేషించుకొనుచు, సంఘీభావమన నెట్టిదో యెఱుంగక, ఈర్ష్యాంధుల మయి, పరోపకారజ్ఞానశూన్యుల మయి మూఢులవలె జీవించుచుండు టెంతయు లజ్జాకరము.

ఈశ్వరుని బడయ నభిలషించువారిసంఖ్య కీభూమండలమునఁ గొదువలేదు. కాని జగదీశ్వరుఁ డెట్టివాఁడో విచారించువారిసంఖ్య మిక్కిలి స్వల్పముగనున్నది. ఈశ్వరసాక్షాత్కారమును బడయఁగోరు భక్తులు రామనామస్మరణ సేయుటకంటె నీశ్వరుఁ డెంతటి పరోపకారశీలుఁడో, స్వార్థత్యాగియో గ్రహించి, తమ జీవితములఁ బరోపకారార్థము సద్వినియోగపఱచినచోఁ బరోపకారమూర్తియగు సర్వేశ్వరుని సులభముగాఁ బడయవచ్చును.

నేఁటివఱకు విశ్వమం దవతరించియున్న మహాపురుషులెల్లరు పరోపకార మార్గావలంబనముననే మోక్షమునందియున్నారు. మనుష్యజీవితమునకు సర్వోత్కృష్టాక్షయాలంకారమగు పరోపకారమునకు నేఁడు మానవ జాతి ఘనమగు స్వాగత మొసంగకుండు టెంతయు సంతాపకరము.

పరోపకారమును మనుష్యుఁడు తన కవశ్యాచరణీయమగు ధర్మమని భావించినంతనే వాని వర్తనమందలి తామసిక, రాజసిక లక్షణము లన్నియు నశించిపోవ, వాఁడొక ప్రతిష్ఠాపాత్రుఁడగు సాధుసత్తముఁడు కాఁగలఁడు.

ఏనాఁడు మానవుఁడు సమస్తలోకమును ప్రేమించుచు, సన్మానించుచు హృదయపూర్వకమగు శ్రద్ధతోఁ దన జీవితమును విశ్వకల్యాణమున కయి సమర్పించునో,

నాఁడే వాని మానసమందుఁ గల దుర్గుణములును, వికారములును నశించిపోవ, వాఁ డొక యాదర్శ పురుషోత్తముఁడు కాఁగలఁడు. ఈ రహస్యము నెఱింగియే స్వానుభవసిద్ధజ్ఞాన సంపన్నుఁడగు భర్తృహరి పరోపకారపరాయణుండగు వ్యక్తి సత్తముని స్వభావమును, లక్షణములను నీరీతి వర్ణించి యున్నాఁడు.

"భవంతి నమ్రా స్తరవః ఫలోద్గమై
ర్నవాంబుభిః ర్దూరవిలంబినో ఘనాః,
అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణాం."

"పాదపములు ఫలించు సమయమున నమ్రములయి యుండును. నూతన జలముగల ధారాధరములు క్రిందుగనే ప్రాకుచుండును. సత్పురుషులు సంపదలు లభించినను గర్వింప నొల్లరు. ఇది పరోపకారపారీణులగువారి స్వభావము."

పరోపకారబుద్ధిశూన్యుఁడగు వ్యక్తి యిహమందుఁగాని, పరమందుఁగాని ప్రశాంతమగు సౌఖ్యము ననుభవింపఁజాలడు. పరోపకారశూన్యత మానవుని స్వార్థాంధుని గావించును. స్వార్థము విషయప్రవృత్తుల విజృంభింపఁజేయును. విషయప్రవృత్తులు మానవుని బుద్ధిని, జ్ఞానమును హరించి వాని ననుచిత కర్మాచరణమునకుఁ బాల్పడఁజేయును. దుష్కర్మాచరణము మానవుని ధర్మచ్యుతుని గావించి, తత్ఫలముగ దుర్భర దుఃఖముల ననుభవింపఁజేయును.

సృష్టియందలి ప్రతిప్రాణియు సహజముగ సౌఖ్యమునే వాంఛించుచుండును. కాని సమస్త జీవలోకవాంఛితమగు

నీ సౌఖ్యమును మనుష్యులెల్లరుఁ బడయఁజాలరు. లోకానుభవమును సంపాదించియున్న మనుష్యుఁడే యుక్తధర్మమార్గానుసరణమున సౌఖ్యము ననుభవింపఁ గలుగుచున్నాఁడు.

పరోపకారశీలుఁడు నిత్యము ప్రపంచహితమునకయి పాటుపడుచుండుటచే విశ్వమందలి సమస్తమానవులు వానిని సమస్త విధముల సన్మానించుచు, వాని సౌఖ్యమునకయి యథాశక్తిఁ దోడ్పడుచుండఁగలరు. పరోపకారతత్వమునకు దూరుఁడయియుండు వ్యక్తియొక్క సౌఖ్యసంపాదనామార్గమున కనేకములగు ప్రతిబంధకములఁ గల్పించునిమిత్తము దుష్టు లనేకులు సదా ప్రయత్నించుచుండఁ గలరు.

ప్రకృతి మనుష్యలోకమునకు సదా పరోపకారపాఠమునే బోధించుచున్న యది. నేఁటి స్వార్థాంధుఁడగు మానవునివలెనే సర్వేశ్వరుఁడును, ప్రకృతియుఁ బరోపకారశీలతను బరిత్యజించినచో క్షణమాత్ర కాలనుందే మహాప్రళయముద్భూతమయి, సమస్తలోక వినాశన మొనరింపఁగలదు. స్వచ్ఛందమగు స్వాభావిక మనుష్యజీవితమునకును, పరోపకారమునకును నవినాభావసంబంధము కలదు.

కేవల మిది ప్రాజ్ఞులదృష్టికే గోచరింపఁగలదు. పరోపకారబుద్ధి సమస్తమానవజాతినుండి సంపూర్ణముగా నదృశ్యమయిపోయినచో ప్రపంచవ్యవహారమే సాగనేరదు. పరోపకారముచే లభ్యమగు నుత్తమ స్వార్థపరమార్థముల కంటెఁ ప్రశస్తమగు సౌఖ్యము మఱి యేపద్ధతి నవలంబించుటవలనను లభింపఁజాలదు.

"పరోపకరణం యేషాం జాగర్తి హృదయే సతాం
నశ్యంతి విపద స్తేషాం సంపదః స్యుః పదేపదే."
—చాణక్యనీతి.

"సదా పరోపకార బుద్ధి యెవ్వానిహృదయమున జాగరితమయి యుండునో వాని కెట్టి విపత్పరంపరలును సంభవింప నేరవు. అడుగడుగునకు వాని సంపదలభివృద్ధి జెందుచుండఁ గలవు.

విశ్వమందుఁ బ్రతిమానవుఁడు తన కావశ్యకమయిన ప్రతివస్తువును సంపాదించు నిమిత్తము పరకృపావలంబితుఁడయి యుండుట యుచితము కాదు. స్వావలంబనము సంతతానంద సంధాయకంబను కోవిదోక్తి సంపూజ్యము. ఏతత్సిద్ధాంతము సత్యమయియున్నను దయామయుండగు సర్వేశ్వరుఁడు లోకకార్యనిర్వహణ సౌకర్యార్థము మనుష్యులయందుఁ బరస్పరసాహాయ్యావశ్యకతను సృజించియున్నాఁడు.

మానవ సంఘమునందుఁ బరస్పర సాహాయ్యము నశించునేని సృష్టికార్యక్రమమునకు భంగము కలుగుటలో నెట్టి సందియమును లేదు. సర్వకాల సర్వావస్థలయందు మనుష్యుఁడెంత భద్రమానవోచిత లక్షణ పరీతుఁడయి, సావధాన చిత్తుఁడయి సంచరించుచున్నను నపుడపుడు సంకటములచే బాధింపఁబడుచుండఁగలఁడు. తలవని తలంపుగా వచ్చుచుండు విపత్తులనుండి విమోచనము నందుటకు మనుజుఁ డెట్టి స్వాతంత్ర్యప్రియుఁడయినను, తన సాటి సహోదరుని కరావలంబనము ననశ్యము పడయవలసియే యుండుచుండును.

పరజన సాహాయ్యవాంఛ యాపద్ధర్మము విపద్గ్రస్త మానవోద్ధరణము ధీరుని సర్వోత్తమంబగు ధర్మము. మను

డొకప్పుడు దుష్టులచే బాధింపఁబడవచ్చును. ఒకప్పుడు దారిద్ర్య దుఃఖమునకు గుఱికావలసివచ్చును. ఇంకొకప్పుడు వ్యాధి పీడితుఁ డగుట తటస్థించును. ఒకప్పుడు మృత్యుశయ్యపై ననాథునివలెఁ బడియుండి యగతికునివలె విలాప మొనరింపవలసివచ్చును.

ఈరీతి ననేకవిధములగు కష్టపరంపరలు తరంగప్రాయముగ మానవుని బాధించుచుండుట మనము లోకమందుఁ బ్రత్యక్షముగఁ జూచుచునే యున్నారము. ఇట్టి యవసరములందు జ్ఞానసంపన్నుఁడగు మనుష్యుఁ డవశ్యముఁ బరోపకారభావప్రేరితుఁడయి, దైన్యస్థితియందున్న తన సహోదరులకు యథాశక్తిఁ దోడ్పడుట పరమధర్మము.

ఆ॥ వె॥ పరుల కుపకరింపఁ ♦ బాపక్షయంబగుఁ
బరుల కుపకరింపఁ ♦ బట్టుగొమ్మ
పరుల కుపకరింపఁ ♦ బరలోకసాధన
పరుల కుపకరింప ♦ బలిమి వేమ.

ఆపద్దశయందు దీనులగు సహోదరులకు సాహాయ్య మొనరించుచుండుటచే సంకటగ్రస్తు లుద్ధరింపఁబడి తమ కాపత్కాలమునఁ దోడ్పడిన మనుష్యులకుఁ జిరకృతజ్ఞు లయి యుండగలరు. సాహాయ్యము నందిన వ్యక్తి స్వయముగా హర్షించుటయే కాక, సాహాయ్య మొనరించిన పరోపకారియుఁ దన పవిత్రధర్మబుద్ధి కయి లోలోన నమందానంద కందళితుఁ డగుచుండగలఁడు. తనసంతాన మెట్టివ్యాధులు లేక హాయిగ జీవించుచున్న జననీజనకు లెట్లు ప్రసన్నులగుదురో, అదియే చందమునఁ బరోపకారపారీణుఁడు, ఉదారచరి

త్రుఁడు లోకసేవచేఁ దనజన్మ సార్థకమయినదికదా యని సదా సంతోషించుచుండఁగలఁడు.

జీవునకుఁదోడ్పడ జీవుఁ డుత్సహించుచుండుటస్వాభావ సిద్ధము. మహాపురుషుల వాక్యమగు "ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం" "ఉదారచరిత్రునకు విశ్వమంతయు గుటుంబసమానము." మానవకోటికిఁ బరోపకారధర్మమునే చాటుచున్నయది.

కేవలము స్వోదరపోషణము నిమిత్తము జీవించుచు ఛాౖపంచిక నింద్యసౌఖ్యములయందే తమ జీవితకాలమును ధనధాన్యములను వినియోగించు మూఢుఁడు మానవాకృతి యందున్న సూకరమువంటివాఁడు. ఎవ్వాని శరీరము, విజ్ఞానము, సంపదలు లోకోపకారనిమిత్తమయి వినియోగింపఁ బడునో, వాఁడు భువినవతరించిన దేవతాపురుషుఁడు. లోకోపకారైకజీవి కడు ధన్యుఁడు. వాని జీవిత మతిపవిత్రమయినది. వానికి మరణము లేదు. వానికీర్తిచంద్రిక సూర్య చంద్రతారకస్థాయి యయి, దిగ్దిగంతముల వ్యాపించగలదు.

ఉత్తమపురుషుని యంతఃకరణపద్మము పరోపకార భానురశ్మిచేఁ బ్రఫుల్లితమగును. సత్పురుషులు తా మెన్ని కష్టముల నయిన సహించి పరుల కుపకారమొనరింతురు. పరమేశ్వరుని సృష్టియందు మనుష్యులందఱు నేకరీతిగనుండు టసంభవము. కొందఱి శరీరములు దృఢములయియుండ, మఱి కొందఱి దేహములు దుర్బలములయి యున్నవి.

ఈలోకమునఁ గొందఱు పండితులు, మఱికొందఱు పామరులు, కొందఱు ధనాఢ్యులు, మఱికొందఱు గర్భదరి

దుర్జులు. కొందఱు విద్యావివేక సంపన్నులు, మఱికొందఱు వివేకములేని మూఢులు.

ఇట్టి స్థితియందు బుద్ధిమంతులు బుద్ధిహీనులకు బుద్ధిని, ధనాఢ్యులు దరిద్రులకు ధనమును గడు ప్రేమతో నొసంగి పుణ్యాత్ములు గావలసియున్నది. అగ్రజుఁ డనుజునకు సమస్త విషయములఁ దోడ్పడుచుండువిధంబున నున్నత శ్రేణియందున్న మానవులు నిమ్న శ్రేణియందున్న దీనులకు సాయ మొనరించుట ప్రశస్తమగు ధర్మము.

"తల్లిదండ్రులభంగి ♦ ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జిం♦తించువాఁడు."

అను ప్రహ్లాద గుణబోధకమగు వాక్యము దీనస్థితియం దున్నవారి నుద్ధరించుట మానవుని ధర్మమను భావమును సమర్థించుచున్నయది. ప్రపంచమంతయుఁ బ్రశాంతమగు జీవితమును గడపుచున్నపుడే మానవు లెల్లరు సౌఖ్యవంతు లయి యుండగలరు. ఒక కుటుంబమున నిరువురు సోదరులు విపద్గ్రస్తులయి హాహాకార మొనరించుచుండ నా కుటుంబ మందలి యితరు లెట్లు సకలసంపదలఁ గలిగియుండియుఁ బ్రశాంతజీవిత సౌఖ్యసుధారసమును బాన మొనరింపఁగలరు?

లోకమునఁ గొందఱు దుఃఖితులును, మఱికొందఱు సౌఖ్యవంతులును నయియుండుటవలననే నేఁడు ప్రపంచ జీవితము నరకవేదనాభూయిష్ఠమయి యున్నది. లోకమం దలి ప్రతిమానవుఁడు వివేకవంతుఁడయి పరోపకారమును దన ముఖ్యధర్మముగ భావించి, తదనుష్ఠానమునకుఁ గడంగు చున్నచో నేఁడు విశ్వమునఁ గానఁగుచున్న దుఃఖములో దశసహస్రాంశ మయిన నుండనేరదనుట వాస్తవము.

సకల ప్రపంచ విఖ్యాతుఁడును, అహింసామూర్తియు నగు శ్రీ గాంధిభగవానుఁడు తనయాత్మకథయందలి "మతములలో స్వల్పప్రవేశము" అను ప్రకరణమున సకలమత విజ్ఞానసారమగు నొక పద్యము నుదహరించుచు నంతకంటె మతముల రహస్యమేమియు లేదనియు వచించియున్నాఁడు.

సీ॥ జలమును నీకీయఁ ♦ గలవాని కెందేని
నొసఁగుమీ కడుపార ♦ నోగిరంబు
వందనంబును జేయు ♦ వానికిఁ జేయుమీ
భక్తిమై సాష్టాంగ ♦ వందనంబు
దమ్మిడి నీకిచ్చు ♦ ధన్యాత్మునకు మాఱు
గా నిమ్ము మేల్మి బం♦గారుకాసు
కష్టంబులందు న ♦ క్కఱవచ్చు వానికి
నిమ్ము నీనెమ్మేని ♦ నేని కోసి
తే. గీ. ఒకటి యొసఁగిన బదిరెట్టు ♦ లొసఁగవలయు
జెట్టచేసిన మేలును ♦ జేయవలయు
ప్రాతఃకాలమునాటి యీ ♦ చేఁతలెల్ల
నానుపూర్విగ సత్యర♦హస్య మరయ.

—ఘూర్జర పద్యానువాదము.

విజ్ఞానధనుఁడగు ప్రతి మానవుఁడు తన జీవితక్షణ భంగురత్వమును స్మరించి, పరమార్థమును, దయామూర్తియగు పరమేశ్వరుని మది నెంచి పరోపకారము నవశ్యానుష్ఠేయమగు ధర్మముగఁ బరిగ్రహించుట మిక్కిలియగత్యము. 'ఆత్మవత్సర్వభూతాని' యను వాక్య మాచరణరూపము నందఁగలిగినపుడే మానవజాతి యచంచల సౌఖ్యాంబుధి

నోలలాడఁ గలదు. పరోపకారమహిమ నెఱింగినవార లగుటచే మహాత్ములగు కవులు దాని నెన్నియో విధంబులఁ గవితారూపంబున స్తుతించియున్నారు:—

"అపకారికినుపకారము నెపమెన్నక సేయువాఁడె నేర్పరి సుమతీ!, కర మపకారము౦ది యుపకారముసేయుచునుండ్రు సజ్జనుల్" అను నీ కవితాఖండములచేఁ బరోపకారము కవుల దృష్టియందు సయితఁ మేరీతి నున్నతస్థానమును గడించియున్నదియు స్పష్టపడుచున్నది.

మనుష్యజాతి కలంకారప్రాయులగు విద్యార్థు లీ పరమపావన ధర్మమగు పరోపకారమునకుఁ దమహృదయములందు ముఖ్యస్థానమునొసంగుటావశ్యకము. శక్తిసంపన్నులు దుర్బలులకును, సద్గుణసంపన్నులు దుర్గుణ దురాచార దుర్వ్యసనపరతంత్రులకును, సభ్యు లసభ్యులకును, సదా ధార్మికభావముతోఁ దోడ్పడుచున్న భూతలము స్వర్గసదృశమయి తనరారఁగలదు. విద్యార్థుల కీ సందర్భమున భర్తృహరివచించిన యొక శ్లోకము ధర్మబోధకము కాఁగలదు.

> "శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన దానేన పాణి ర్న తు కంకణేన
> విభాతి కాయః కరుణాపరాణాం పరోపకారేణ న చందనేన"

"దయార్ద్రహృదయు లగు సత్పురుషుల కర్ణములకు సద్గ్రంథశ్రవణము లలంకారములుగాని కుండలములు గావు. కరముల కలంకారము సత్పాత్రదానము కాని సువర్ణకంకణములు కావు. శరీరమునకాభూషణము పరోపకారముగాని చందనవిలేపనము గాదు."

పరోపకార పరాయణుఁడగు పురుషుఁడు సమస్త మానవహృదయముల కధపతి. వాఁడు జగన్మోహనుఁడు. అతని

కీర్తికుసుమసౌరభము సులభముగా దేశదేశముల వ్యాపించి సత్పురుషుల కాహ్లాదమును గొలుపుచుండఁగలదు. కరుణాశీలుని శరీరశోభ కోటిసూర్యప్రభాభాసమానమై వెలుఁగుచుండునని బుద్ధ ప్రభువు సెలవిచ్చియున్నాఁడు.

పరోపకారి కారుణ్యరసార్ద్రచిత్తుఁ డగుటచే దయాసింధువగు పరాత్పరునివలె సకలజనవంద్యుఁడు కాఁగలుగును. పరులయొక్క దుఃఖమును తనదుఃఖముకంటె నధికముగా భావించుకొనుచు నిజదుఃఖమును తృణప్రాయముగఁ జూచుచు లోకముయొక్క హితమందును, కల్యాణమందును నిరంతరము నిరతుఁడయి యుండువాఁడే యథార్థమగు పరోపకారి.

మహాపురుషులు పరోపకార మనేకవిధములుగనుండునని వచించియున్నారు. దేహవాగ్విత్తములచేఁ బరుల కుపకారము కలుగుచుండుట మన మవలోకించుచునే యున్నారము. శారీరక పరిశ్రమచేఁ గొందఱకు సాహాయ్యము కలుగుచున్నది. మనసాటి సహోదరుఁడు దుర్బలుఁడై తన కర్తవ్యమును నిర్వహించుకొనఁజాలనట్టి దుస్థితియందుండి బాధపడుచున్నపుడు మన మతనికి యథాశక్తిఁ బ్రయాసమనక సాహాయ్య మొనరించుట ధర్మము.

ఒక్కొక్కప్పుడు వాక్సాహాయ్యముచే విప దావస్థ యందున్న మనుష్యుఁ డుద్ధరింపఁబడఁగలఁడు. దుష్టుఁడేవఁడేని సాధువు నొకని బాధించుచున్నపుడు బలాఢ్యుఁ డట్టియన్యాయమును విలోకించి మౌనమునువహింపక దుష్టుని భయపెట్టినచో సాధురక్షణము కాఁగలదు. సత్పురుషుని నిరంతరలోకసేవాధురీణులై యుండుటచేఁ దమ కుటుంబమును బోషించు

కొనజాలనపుడును, దైవికముగ భయంకర జాడ్యగ్రస్తులై స్వసంతానమును బోషించుకొనఁజాలనట్టి దుర్దశాపీడితులై యున్నపుడును ధనాఢ్యులు వారికి యథాశక్తి సాహాయ్యమొనరించు టావశ్యకము.

"పరోపకారశూన్యస్య ధిఙ్ మనుష్యస్య జీవితం,
జీవంతు పశవో యేషాం చర్మాప్యుపకరిష్యతి."

"మనుష్యుని జీవితము పరోపకార శూన్యమయిన దగునేని దానికి ధిక్కారము. అట్టితఱిఁ బశువులజీవితమే యుత్తమము. మరణించినపిదప వానిచర్మ ముపయోగకర మగుచున్నయది."

మనుష్యుఁడు ప్రత్యవస్థయందును యథాశక్తిఁ బరోపకారమును తన ధర్మముగ భావించియే యాచరింపవలయుఁ గాని, కేవలాడంబరము నిమిత్తమును, లోకమునఁ గీర్తి నపేక్షించియు నొనరింపరాదు. నేఁడు పరోపకారము మనుష్య సంఘమునం దెచ్చోటను గానరాకున్నయది. మానవులు విషయతృష్ణాపీడితు లయి ధనధాన్యములను, సంపదలను, విద్యావివేకములను, దేహాత్మబలములను, భోగవిలాసముల నిమిత్తము దుర్వినియోగ మొనరించుచున్నారేకాని, లోకోపకారార్థము కాసువీసమేని వినియోగించుచుండుటలేదు.

మనుష్యుఁడు దయకును, దాక్షిణ్యమునకును మానసమునం దగ్రస్థానము నొసంగి, పరోపకారబుద్ధిని వహించుటతోడనే వాని సమస్తదుర్విషయవాంఛలు క్రమక్రమముగ నశించిపోఁగలవు. పరోపకారము మానవున కార్షజీవిత విధానము నుద్బోధింపఁగలదు. పరోపకారముచే మనుజుఁడు సకల సద్గుణసిద్ధి నందఁగలుగుచున్నాఁడు.

లోకమున విశేషముగ జీవసంరక్షణసాహాయ్యములకు ఘనమావశ్యకమగుచున్నది. మానవునకు భువిపైఁ దటస్థించు జీవితసమస్యలలోనికెల్ల భుక్తిసమస్య తొల్లింటిది. మనుజుఁడీసమస్యను బరిష్కరించుకొనఁ గలిగినపుడే తదితరములగు సమస్త సమస్యాపరిష్కారముల కర్హుఁడగుచున్నాఁడు. క్షుధార్తునకు భోజనము నొసంగుటయు బిపాసాపీడితునకు శీతల జలము నిచ్చుటయు, సూర్యాతప వ్యథితునకు భవనమున విశ్రాంతి నొసంగుటయు, గర్భదరిద్రుఁడగు దుర్బలునకు యథోచితముగ ధనదానమొనరించుటయు, చలిచే బాధపడుచున్నవానికి వస్త్రము నిచ్చుటయు, వ్యాధిపీడితునకుఁ జికిత్సా విషయమునఁ దోడ్పడుటయు మున్నగున వన్నియుఁ బరోపకారముయొక్క స్థూలభాగమునకు వర్తించును. ఆత్మసంబంధమగు పరోపకారమన మానవసంఘాభ్యుదయమున కత్యంతావశ్యకమయి యున్నది. ఆత్మసంబంధమగు పరోపకారమన నీచదశయందున్న మానవాత్మకు బాగుపడు మార్గమును సూచించుట యనియే తాత్పర్యము.

అన్నవస్త్రాదుల దానము తాత్కాలికముగా మానవుని బాధను నివారించుచుండ, జ్ఞానదానముచే మానవుఁడు యుక్తాయుక్తముల విచారింపఁ గలవాఁడయి, కర్తవ్యమును గ్రహించి శాశ్వతజీవితోద్ధరణమును బడయఁగలడు. కావున జ్ఞానదానము పరోపకారాంగములలో ముఖ్యమైనది.

"అజ్ఞానాంచైవ యో జ్ఞానం దద్యా ద్ధర్మోపదేశతః
కృత్స్నాం వా పృథివీం దద్యా త్తేన తుల్యం న తత్ఫలం."

—మహాభారతము.

"ఏ మనుష్యుఁడయిన ధర్మోపదేశముచేనను, కర్తవ్య ప్రబోధమువలనను అజ్ఞానులకు జ్ఞానమొసఁగించిన నయ్యది సమస్త భూవలయదానముకంటె విశేషఫలదాయకము.

వేశ్యాగమనము, మద్యపానము, చౌర్యము, ప్రాణిహింస, సాధుపీడనము, అన్యాయమార్గమున ధనసంపాదనము మున్నగు దుర్వ్యసన, దుర్గుణ దురాచారములకు దాసాధములయియున్న మూఢులకు జ్ఞానోపదేశము నొసంగి, వారికి హితాహితములను, కర్తవ్యాకర్తవ్యములను బోధించి వారి జీవితముల సంస్కరించుచుండుట, విద్యాశూన్యులకు విద్యాదానముచేయుట, ప్రమత్తులకును, నిరుద్యోగులకును గర్మయోగావశ్యకతను దెలుపుట, దుష్టులయి, ధూర్తులయి, క్రూరులయి, నాస్తికులయి సంచరించు రాక్షసాధముల హృదయముల దైవభక్తిభావబీజముల నాటుట, సత్యము, శౌచము, న్యాయము, దయ, శాంతము, ప్రేమ, వినయము సంయమము మొదలగు సద్గుణములఁ ద్రోసిపుచ్చి, శమదమాదిశీలముల విసర్జించి, పాపవర్తనులయి దూషితకర్మల నాచరించుచుండు యువకులకు నీతిశిక్షను గఱపి, వారిని సదాచారసంపన్నులుగఁ జేయుట మున్నగునవియే వాని మూలమున సలుపఁబడునట్టి యాత్మసంబంధమగు పరోపకార మనఁబడుచున్నది.

పరోపకారముచే మనుష్యునియొక్క దేహాత్మమానసములు మూఁడును సుద్ధరింపఁబడవలయును. మానవుని స్వాభావికమును, నైతికమును, ఆధ్యాత్మికమును నగు జీవిత విధానమును భంగపఱచునట్టి సాహాయ్యమపకారమగును గాని యుపకారము కానేరదు. అలసుఁడయి, నిరుద్యోగివై,

సదా పరావలంబనుఁడయి జీవించు దృఢగాత్రుని కొసంగఁబడు దానము పరోపకారమునకుఁ జెందదు.

వేశ్యావృత్తియందున్న కామాంధునకుఁగాని, జారునకుఁగాని చేయఁబడు వాగ్ధనసాహాయ్యమును బరోపకారమనబడదు. నైతికజీవితాభ్యుదయమునకుఁ బ్రతిబంధకము కాని వాగ్ధనదేహసాహాయ్యమే యథార్థమగు పరోపకారమనఁబడుచున్నది.

ఎన్నియో దినములనుండి భుజింప నాహారము లేక, శీతాతపవాతములనుండి దేహమును సంరక్షించుకొన వస్త్రములేక మూర్తీభవించిన దైన్యమువలె గృహద్వారమువద్దఁ జతికిలఁబడి 'భిక్షాందేహి' యని దుఃఖాతిరేకముచే గుద్ధమయిన కంఠముతోఁ బాషాణములు సయితము ద్రవీభూతమగునట్లు ప్రార్థించు వృద్ధుని, వ్యాధిపీడితుని, వికలాంగుని మొ॥ తాలకింపక మీఁదుమిక్కిలి వారలఁ గాళ్ళ దన్నుచు, ధిక్కరించుచు నుండు గృహస్థు లనేకులు ప్రాతఃకాలముననే లేచి సుస్నాతులయి, దేవళములందలి దయాళుత్వమును బోధింపలేని జడమూర్తికి నమస్కరించి దృఢగాత్రులును, స్తుతిపరాయణులును, వంచకులును నగు భట్టుల రావించి పరోపకారమనియు, పుణ్యమనియు భావించి, గో వస్త్ర సువర్ణ భూ దాన మొసరించుచున్నారు. ఇయ్యది యెట్టి పుణ్యమో, పరోపకారమో, దైవభక్తియో, సాధుజన సేవయో గ్రహింప శక్యము కాకున్నది.

పరోపకార శీలతయందు భక్తివిశ్వాసములు గలట్టియు, పరోపకారమునే మానవుని యున్నతధర్మముగ

భావించు నట్టియుఁ గోటీశ్వరు లెందఱో నేఁడనేక విద్యాలయములను, అనాథశరణాలయములను, ధర్మశాలలను, దేవాలయములను ప్రతిష్ఠింపఁ జేయుచున్నందుల కెంతయు సంతోషింపవలసినదే కాని, యీ ధర్మసంస్థ లన్నింట సహర్థులును, విద్యార్థులును నగు వారికే స్థానము లభించుచున్నది కాని దైన్యమూర్తు లనఁదగు దరిద్రులకును, దీనులకును, వికలాంగులకును, పశువుల కంటె హీనముగఁ జూడఁబడుచున్న పంచమసహోదరులకును స్థానము లభింపకున్నది.

అపాత్రమును, అన్యాయసంగతమును, పాక్షికభావయుక్తమును, రాక్షసమును నగు నీ యుపకారము సర్వజనీనము కాకపోవుటచే లోకమున కంత ప్రయోజనకరము కాఁజాలదు. ఇట్టి నీతిదూరమగు పరోపకారముచే మానవలోకమున కెంతయు దీఱనిహాని నాటిల్లుచున్నయది. సమస్త విధముల నున్నత స్థితియందున్న మనుష్యుఁడు దీనులకే సాహాయ్య మొనరింపవలయును గాని, తన్నుఁ బోలియున్న మఱియొక శక్తిసంపన్నునకుఁ దనకుగల సమస్తమును ధారవోయుట ఘోరపాపమేయగుఁగాని పుణ్యము కాఁజాలదు. క్షుధార్తున కొసంగవలసిన యాహారము నమితభోజనముచే నజీర్ణవ్యాధికి గుఱియయినవాని కొసంగిన నెట్లుండునో, దీనునకుఁగాని పరోపకారము నయిత మదియే చందమున నుండఁగలదు.

"Heip the poor, Good helps you."

"దీనులకు సాయమొనరింపుము. దేవుఁడు నీకు దోడ్పడును."

హృదయపూర్వకమగు ననుకంపచేఁ బ్రేరితుఁడు కాక, లోకాడంబరమువలనను, ముఖస్తుతులచేతను బ్రోత్సహింపఁ బడి మనుష్యులుచేయు దానములు దానవదానము లనఁబడు చున్నవి. ఇట్టి కరుణాశూన్యములగు దానములచే సమస్త జీవదయాకరుండగు సర్వేశ్వరుని నిష్కళంకమగు నియమమునుల్లంఘించినవాఁ డగుచున్నాఁడు. నేఁడుమనుష్యుఁడు యుక్తాయుక్త విచక్షణచేఁ బాత్రాపాత్రముల విచారించి దాన మొసంగవలసియున్నది. లోకమునకు జడములే యుపయోగకరము లగుచున్నపుడు విజ్ఞానసంపన్నులగు మనుష్యులేవిధముగను నుపకరింపకుండుట కడు శోచనీయము.

ఆర్యఋషుల నివాసముచేఁ బవిత్రీభూతమయిన యీ భరతఖండము ప్రపంచమందలి సమస్తదేశములకంటె సద్గుణములందుఁ దొల్లింటిదిగా భాసిల్లియుండినది. రూపొందిన పరోపకార మనఁదగు మహాపురుషులును, సతీమణులును, నెందఱో యీ భారతమాతృపవిత్రాంకసీమయందు బాల్యక్రీడలు సలిపియున్న నాఁటి హైందవజాతీయవికాసము నెన్న బ్రహ్మకును దరము గాకుండెను.

నాఁడు ప్రతిభారతీయుఁడును యథాశక్తి లోకోపకార మొనరించుటయందుఁ బ్రబలోత్సాహముతో ముందంజ వేయుచుండెడివాఁడు. నాఁటి భారతీయునకుఁ బరోపకారము నేఁటి మానవులకు విషయభోగ మెంత ప్రీతికరముగ నున్నదో అంతకంటెఁ బ్రేమపాత్రముగ నుండెను. నాఁటి భారతీయుని పరోపకార పరతంత్ర జీవిత విధానము శ్లాఘనీయమయి యుండెను.

నేటిదనుక భరతఖండమందును, విదేశములందును, జన్మించి స్వార్థత్యాగులయి, దానశౌండులయి, పరోపకార పారీణులయి లోకకల్యాణమునకుఁ దోడ్పడియుండినట్టియు, తోడ్పడుచున్నట్టియు మహాపురుషులయొక్కయు, పండితుల యొక్కయు, భూపాలురయొక్కయుఁ జరిత్రల వ్రాయఁ బూనుచో బ్రహ్మాండమగు నొక గ్రంథమే సిద్ధము కాఁ గలదు. కాన నా మహా పురుషులలోఁ గొందఱినామంబుల మాత్ర మిట నుదహరించుచు గ్రంథవిస్తరభీతిచే వారి పరోపకార పారీణతాద్యోతకములగు సత్కార్యముల నిట వివరింపక సంక్షేపించుచున్నాఁడను.

లోకోపకారమును మానవ జీవితధర్మములలోని కెల్ల నుత్కృష్టధర్మముగ విశ్వసించి, తనూ్మలమున లోకహిత మొనరించిన మహాపురుషులలో రఘువు, దధీచి, శిబి, రంతిదేవుఁడు, బలి, కర్ణుఁడు, బుద్ధుఁడు, అశోకుఁడు, కుణాలుఁడు, శ్రీహర్షుఁడు, అగ్బరు, శివాజీ, రంజితసింగు మొదలగు భూపాలురును,-శంకరుఁడు, మధ్వుఁడు, రామానుజుఁడు, బసవుఁడు, కబీరు, రామదాసు, చైతన్యుఁడు, రామకృష్ణుఁడు, రామమోహనుఁడు, శ్రద్ధానందుఁడు, విద్యాసాగరుఁడు, దయానందుఁడు, కేశవచంద్రుఁడు, చిత్తరంజనుఁడు, బాలగంగాధరుఁడు, వివేకానందుఁడు, రామతీర్థ, మవులానా, సర్ సయ్యదు గాంధి, లజపతిరాయి, మాళవ్యా, ఆండ్రూసు, బిసెంటు, సరోజిని, వాస్వానీ, పి. సి. రే. వీరేశలింగము మున్నగు మహాపురుషులును, విద్వద్వరేణ్యులును, - జీసను, మహమ్మదు, లూథరు, టాలస్టాయి, లెనిను, సుకరాత్తు,

సన్‌యాంట్సేను, వాషింగుటను, అబ్రహాము లింకను మున్నగు విదేశీయ మహనీయులును జిరస్మరణీయు లయి యున్నారు.

పరోపకారమూర్తు లగు నా దివ్యపురుషులలో ననేకులు భౌతిక దేహమును బాసి చనినను నేటికిని యావత్ప్రపంచమునకుఁదమయుపదేశములచేఁబరోపకార ధర్మమును గూర్చి బోధించుచునేయున్నారు. మనుష్యులమగు మనము విజ్ఞానమును ద్రోసిపుచ్చి, ఆత్మప్రబోధముల నాలింపక భోగాంధులమై, నింద్యములగువిలాసములఁ దగిలియుండుటచే నా మహాపురుషుల పుణ్యచరిత్రములను, సదుపదేశములను నిత్యము పారాయణ మొనరించుచుఁ బరోపకారా ద్వైహికాముష్మిక సౌఖ్యసాధనముల సంపాదింపజాలకున్నారము. భారతవర్షమున నేటిదనుక జన్మించియున్న పరోపకారపారీణులగు మహాత్ములయెడ భర్తృహరికవీంద్రుని యీశ్లోక మెంతయు సార్థకమగుచున్నది.

"పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవచక్రవాకం
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి
సంతః స్వయం పరహితే విహితాభియోగాః."

"దినకరుఁడు పద్మాకరమును ప్రార్థింపఁబడకయే వికసింపఁ జేయుచున్నాఁడు. సుధాకరుఁ డర్థింపఁబడకయే కలువల వికసింపఁ జేయుచున్నాఁడు. మేఘుఁడు యాచింపఁబడకయే జలము నొసంగుచున్నాఁడు. అదియేరీతిగ సదా సత్పురుషులు స్వాభావికముగ పరహితాచరణమతులయి వెలయుచున్నారు."

బుద్ధుఁడు జీససు మున్నగు మహాపురుషులు భర్తృహరి వచించిన సత్పురుషులకంటె మాన్యులయియున్నారు. ఆ మహాపురుషులు భర్తృహరికవీంద్రుని "ఏతే సత్పురుషాః పరార్థ ఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే" అను వాక్యాను సారముగఁ దమ సర్వస్వమును లోకమునకు సమర్పించి, సర్వ సంగపరిత్యాగులయి మానవలోకము నుద్ధరించి యున్నారు. వారి యపూర్వ త్యాగము, లోకోత్తర లోకసేవావిధానము విశ్వజీవ వాత్సల్యము చిరస్మరణీయములు.

సదా మానవులట్టి పూతచారిత్రుల పుణ్యచారిత్రాంశముల లక్ష్యమునం దిడుకొని యుండుటచేఁ బరోపకారమం దాసక్తులయి, దయార్ద్రహృదయులయి లోకసేవావ్రతదీక్షితులు కాఁగలుగుదురు. మానవుని జీవితములోని కెల్ల నిష్కల్మషమయినది, పరమపవిత్రమయినది, వ్యామోహశూన్యమయినది కేవల మొక్క బాల్యదశయే. ఈ నిర్మలమగుస్థితి యందు నాటఁబడిన జ్ఞానబీజములే మానవుని యుత్తరజీవితాభ్యుదయమునకుఁ దోడ్పడుచున్నవి.

మానవుఁడు సుజ్ఞానప్రేరేపితుఁడయి తన చిత్తసీమ యందు సద్భావబీజముల విత్తుచో నుత్తరకాలమందుత్తమ ఫలము ననుభవించి ధన్యుఁడగును. సుకృత మొనరించుచుఁ బరులహితమునకయి పాటుబడువ్యక్తి పరులచే నుపకారము నందుటయు రూఢియె.

"యథాచారీ యథా కారీ తథాభవతి
సాధుకారీ సాధుర్భవతి పాపకారీ
పాపో భవతి పుణ్యః పుణ్యేన
కర్మణా భవతి పాపః పాపేన."

ఏ వ్యక్తి యెట్టికర్మ నాచరించునో యట్టిఫలితమునే పడయును. సాధువర్తనముచే సాధువగును. పాపాచరణముచే బాపియగును. సుకృతాచరణముచేఁ బుణ్యాత్ముఁడగును.

బాల్యదశకుఁ బిదపవచ్చునది యౌవనదశ. ఈయవస్థయందు యువకులు కడు జాగరూకులయి, సావధానులయి యుండవలసి యున్నది. కారణమేమన నీదశయందు మానవునకును, ప్రపంచమునకును విశేషమగు బాంధవ్య మేర్పడఁ బ్రాపంచికములగు వికారములెన్నియో వాని చిత్తసీమయందుదయింప నారంభించుచున్నవి. ఈ రహస్యము నెఱింగి విద్యార్థులు స్వార్థాది దుష్ప్రవృత్తుల మదిఁ జొరనీయక, పరోపకారాది సద్గుణములఁ దమ చిత్తసీమల సుస్థిరముగా నాటఁ జేయుట శ్రేయస్కరము.

దైవసృష్టియందలి ప్రతిరేణువు లోకోపకారమునకయి పాటుపడుచుండ మానవులు పరోపకారమువంటి స్వర్గీయ ధర్మమునెడ నుపేక్షాభావమును వహించియుండుట కేవలము మౌఢ్యమే యగును. విద్యార్థులారా! వసుంధరను దిలకించుఁడు. మనము దానికిఁ గావించు సేవ లేకున్నను నది పరమ కరుణాళుత్వముతో మనకు సకలసస్యముల నొసంగుచున్నది వృక్షములఁ దిలకించుఁడు. వాయువునుగూర్చివిచారించుఁడు. జలము నవలోకించుఁడు గోవృషభాది పశువుల వీక్షించుఁడు.

లోకమందలి సమస్త జడ చేతన పదార్థములును మానవ జీవితమున కుపకరించుచుండ విజ్ఞానసంపన్నుఁడ నని విఱ్ఱవీగు మనుష్యుఁడు దీనులగు తన సాటిసహోదరుల కుప

కార మొనరింపలేని స్వార్థమయస్థితికి వశుఁడయియున్నందుల కెంతయు లజ్జాపవలసియున్నది. ప్రేమాస్పదులగు విద్యార్థులారా! పరోపకారమును ఉత్తమమానవ జీవితధర్మములలో ముఖ్యధర్మముగ భావింపుఁడు. అనుష్ఠింపుఁడు.

"పరోపకారాయ స్రవంతి నద్యః
పరోపకారాయ ఫలంతి వృక్షాః
పరోపకారాయ ప్రసవంతి గావః
పరోపకారార్థ మిదం శరీరం."

"పరోపకారార్థమే నదులు ప్రవహించుచున్నవి. పరోపకారనిమిత్తమే వృక్షములు ఫలించుచున్నవి. పరోపకారము కొఱకే గోవు లీనుచున్నవి. పరోపకారము నిమిత్తమే మన శరీరము సృజింపఁబడినది."

ఈ. పరోపకార మహిమాబోధకమగు శ్లోకమును విద్యార్థులు నిత్యము స్మరించుచు యథాశక్తి లోకోపకారమునకయి పాటుపడుచు ధన్యులగుదురుగాక!

## బౌద్ధ పరోపకారసూత్రములు

పరోపకారమూర్తియు, కరుణానిధియు నగు బుద్ధదేవుఁడు లోకకల్యాణము నిమిత్తము తన సర్వస్వమును సమర్పించివైచి పరోపకారధర్మప్రశస్తిని జగద్విఖ్యాత మొనరించివైచినాఁడు. ఆ మహనీయుని దీక్షను, ఉదారసంకల్పమును, త్యాగబుద్ధిని జాటు శపథము ప్రశంసనీయము.

"న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నా పునర్భవం,
కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తినాశనం."

"నేను రాజ్యము నభిలషించుట లేదు. స్వర్గమును వాంఛించుట లేదు. జన్మరాహిత్యమును గాంక్షించుట

లేదు. సదా దుఃఖితులును, దీనులు నగు ప్రాణుల దుఃఖమును నిర్మూలింపఁ గోరుచున్నాఁడను."

బౌద్ధధర్మము సాంఘిక నీతులందును, శీలములందును బరోపకారమున కున్నతస్థానమును బ్రసాదించియున్నది. బౌద్ధమతమందలి సాంఘికగ్రంథములు గృహస్థప్రపంచమున కీరీతిఁ బరోపకారమునుగూర్చి బోధించుచున్నవి: —

ఓ దయార్ద్రహృదయుఁడవగు మానవుఁడా! నేఁడు నీవు మందమతివయి, స్వార్థమున మునిఁగి నీ జీవితమున కలంకారప్రాయమగు పరోపకారమును విస్మరించితి వేల? నీ జీవితముయొక్క ప్రయోజనములను నీ కొసంగిన దెవఁడు? ధర్మాధర్మముల విచారించు శక్తి నీ కెవఁడు ప్రసాదించెను? జీవరాసులలోని కెల్ల నిన్నుత్తమునిగ సృజించినవాఁ డెవఁడు? అట్టి దయామయుండగు పరాత్పరునియందుఁ బరోపకారబుద్ధియే లేకున్న నీగతి యేమయ్యెడిది?

మనుష్యుఁడా! నీ జీవిత నిర్మాణ భరముల కన్యసాహాయ్య మపేక్షితమయియున్న విధముననే నీసాటి సహోదరులకును నీ కరావలంబన నువసరమగుచున్నది. కావున నీవు సయిత్తము సాంఘికధర్మపాలన నిరతుఁడవయియుండి యథాశక్తిఁ బరోపకార మొనరించుచుండుము.

మానవుఁడా! నీకు భోజనము, వస్త్రములు, నివాస గృహము, రక్షణము, జీవిత సౌఖ్యానందోపభోగము మున్నగునవన్నియుఁ బరుల సాహాయ్యముననే లభించుచున్నవి. సంఘమునం దుండుటవలననే నీవు ప్రశాంతమగు సౌఖ్యము

ననుభవింపఁ గలుగుచున్నాఁడవు. కావున సంఘముయొక్క ప్రథమనిబంధనయగు పరోపకారమును గలిగియుండి కృతజ్ఞుఁడ వగుము.

మనుజుఁడా! నీవు సాంఘికప్రాణి వనుట నెఱింగి నీపాటి సహోదరసహోదరీమణులయొక్క మిత్రుఁడ వగుము. సమస్తమానవుల నీ యాత్మబంధువులుగ భావించి వారి హితమునకయి కృషిఁ గావించుము. పరోపకారముచే సమస్త మానవుల నీవు నీమిత్రులుగఁ జేసికొనఁ గలిగినపుడే ధన్యుఁడవై యథార్థమగు శాంతి ననుభవింపఁగలవు.

గులాబిపుష్పము తన మధురసౌరభమును స్వాభావికముగ యాచింపఁబడకయే మానవలోకమున కాఘ్రాణింప నొసంగుచు, సమస్తలోకప్రేమభాజనంబగు చందముననే సత్పురుషుఁడును బరోపకారశీలుఁడయి విశ్వప్రీతిభాజనుఁడగుచున్నాఁడు. అట్టివానిజన్మ కడు శ్రేష్ఠమయినది.

పరోపకారశీలుఁడు హృదయపూర్వకమగు శాంతిని సౌఖ్యమును ననుభవించుచు, సాటివారగు తన మానవ సహోదరుల సౌఖ్యానందములను, సంపదలను, సమస్తవిధాభ్యుదయమును గాంచి ప్రసన్నుఁడగుచుండును. పరోపకారశీలుఁడు పరుల నిందింపఁజాలఁడు. ద్వేషింప నొల్లఁడు. హింసింపఁ గోరఁడు. సదా ప్రేమించుచుండును. లోకముయొక్క దుస్థితికయి కడుఁ గుందుచుండును.

సాంఘికజ్ఞానసంపన్నుఁడగు సత్పురుషుఁడు సదా పరోపకార మొనరించుటకయి యువ్విళ్ళూరుచుండఁగలఁడు.

పరోపకారము నొక సౌభాగ్యముగ నెంచి అతఁడనారతము దాని నన్వేషించుచుండును. అన్యుల కష్టముల నివారించుట యందుఁ బరోపకారపరాయణుఁ డపారమగు నాత్మానందము ననుభవించుచుండఁగలఁడు.

పరోపకారశీలుని హృదయ మతి విశాలమగుటచే నతఁడు సమగ్రవిశ్వకల్యాణము నపేక్షించుచుండును. ఆతని హృదయము సహజౌదార్య సమన్వితమగుటచే సదా విశ్వముయొక్క సౌఖ్యానందము లభివృద్ధిగావింపఁ గృషి సలుపు చుండఁగలఁడు.

సమస్తలోకాంధకార నాశకుండగు దివాకరునివలెఁ బరోపకారశీలుని జీవితము నిరంతరలోకోద్ధరణప్రక్రియచే భువిఁ బ్రకాశించుచుండఁగలదు.

విద్యార్థులు బౌద్ధధర్మోపదేశితములగు నీ పరోప కారసూత్రముల సాదరముగఁ బఠించి సముచితరీతి నాచరిం తురుగాక !

"తం వేధా విదధే నూనం మహాభూతసమాధినా,
తథాహి సర్వే తస్యాఽసన్ పరార్థైకఫలా గుణాః."

—రఘువంశము.

"బ్రహ్మ యే కారణసామగ్రితోఁ బృథివ్యాదిపంచ భూతములను సృజించెనో నిశ్చయముగ నా సామగ్రి యొక్క సారముతోడనే యా దిలీప మహారాజును సృజిం చెను. కావుననే యా పృథివ్యాది పంచభూతములయొక్క రూపరసాదిగుణము లెట్లు పరులకే యుపయోగపడుచుం

డునో, అట్లే యతనిగుణ లన్నియుఁ బరులకే మేలు సమకూర్చుచుండును."

ఈశ్లోకమందలి నీతిశిక్షను గ్రహించి తనజీవితమందును, ధనమందును, విద్యయందును విశేషభాగము లోకోపకారార్థము వినియోగించు వ్యక్తి సమస్తవిధముల సార్థకజన్ముఁడు కాఁగలఁడు.



# ఏబదిరెండవ ప్రకరణము

## అహింస

"అహింసా పరమో ధర్మః అహింసా పరమం తపః,
అహింసా పరమం దాన మిత్యాహు ర్మునయ స్తథా."

"అహింసకు సమమగు ధర్మము లేదు. తత్తుల్యమగు తపమూ శూన్యము. తత్సదృశమగు భూరిదాన మసలే లేదు. మునిశ్రేష్ఠు లిదియే నుడివియున్నారు."

విశాలమగు నీ సర్వంసహాచక్రమున మనుచుండు ప్రాణిచయమునకెల్ల మనుష్యుఁ డుత్తమోత్తముఁడు. మనుష్యుఁడు సకలసృష్టికిఁ దలమానికమువంటివాఁడు. అతఁడు సంకల్పించినంతమాత్రమున దైవదత్తమగు స్వీయాంతఃకరణ మహిమా విశేషంబున విశ్వముయొక్క బహిరంతర ప్రకృతుల నిగూఢ రహస్యముల గ్రహింప సమర్థుఁడయి యున్నాఁడు.

వానికి సంప్రాప్తమయియున్న మహత్తరమగు నీ సామర్థ్యము స్వతస్సిద్ధముగఁ గొంత లభించిన దన్నమాట వాస్తవమే యయినను దైవికము లగు నిబంధనలఁ గొన్నింటిఁ బాలించుట వలననే యాశక్తి వికసించుచున్న దని నుడువక తప్పదు. మానవజీవితమును జీవింపఁజేయఁగలట్టి యమూల్యమగు నంతరాత్మ నుత్థానపథము ననుసరింపఁజేయు భగవంతుని శాసనములే యట్టి నిబంధనలు.

ఆ నిబంధనలు మనుష్యజీవితమునకు జడత్వమునుండి సంరక్షించి చైతన్యమయమగు ప్రకృతియొక్క విజ్ఞానమయ

రసప్రవాహమునఁ దేలియాడఁజేయుచుండును. అట్టిలోకో త్తరంబగు సువ్యవస్థకుఁ బాల్పడిన మనుష్యుఁ డిహపరసౌఖ్య భాజనుఁ డగుచున్నాఁడు. ఈశ్వరశాసనములు మానవాత్మ యొక్క సహజవికాసమును జరమసీమ నధిష్ఠింపఁజేయుట యందు సాహాయ్య భూతము లగునట్లు క్షణకాలపటాటోప యుక్తములును, చంచలములును నగు భౌతికోపకరణములు సహకారదాయకములు కాఁజాలవు.

ఈశ్వరశాసనమునకే పరిభాషయందు ధర్మమనియు, కర్తవ్యమనియు నామాంతరములు కలవు. పవిత్రము లగునట్టి మానవధర్మము లన్నింట నహింస ప్రథమస్థాన మలంకరించుచున్నది. విజ్ఞానధనులగు భారతీయఋష్యాదు లెల్లరు నహింసా వ్రతప్రభావమును సహస్రముఖముల స్తుతించి యున్నారు.

ఆ॥ దంతియడుగులోనఁ ♦ దక్కిన జంతు చ
యంబు నడుగులెల్ల ♦ నడఁగియుండు
నట్లు ధర్మకోటు ♦ లన్నియు లోనగు
నిర్గుణ యహింస ♦ కింతనిజము. —భారతము.

సృష్టిక్రమమును, జీవితధర్మములను, బ్రహ్మదర్శన మును మనుష్యజాతికిఁ దేటతెల్ల మొనరింప నానాయుగం బుల, వివిధ ప్రవక్తలచే సంస్థాపింపఁబడిన సమస్తధర్మము లహింసయే జీవితోత్థానకరంబును, పరమపవిత్రమును మహో త్తమంబును నగు ధర్మమని యెలుఁగెత్తి చాటియుండినవి. నేటికిని చాటుచున్నయవి.

అహింసాధర్మప్రతిపాదకమగు మతమే భగవత్ప్రీతి పాత్రమగు మతమనియు, తద్బాహ్యమగు మత మసురమత

మనియుఁ బ్రాజ్ఞప్రపంచము నాఁటికిని, నేఁటికిని నేకరీతిగ నొక్కి వక్కాణించుచున్నయది. లోకమునం దనాదికారణమగు భగవత్పదార్థమునందు విశ్వాసములేనట్టి చార్వాకము వంటి వేదబాహ్యమగు నాస్తికమతమును, లోకకల్యాణమును, అభంగశాంతిని, అనంతసౌఖ్యమును గాంక్షించి యహింసాధర్మమును సన్మానించియున్నది.

పారకప్రపంచముయొక్క కరకమలముల నలంకరించి హృదయముల నాకర్షించుచున్న మహాపురుషుల చారిత్రగ్రంథము లన్నియు సాధారణమానవు లెట్లు, అహింసావ్రతానుష్ఠానముచే లోకవంద్యులయినదియు నగ్గలముగ నుగ్గడించుచున్నయవి. మానవహృదయ మహింసాభావమునం దైక్యముఁ జెందినపుడే విశ్వముయొక్క దైవికసంపద్భండారముయొక్క సారభూతమగు పదార్థము ననుభవింప సమర్థమగును.

ఏకత్వభిన్నత్వముల యభేద్యసూత్రముచే బంధింపఁబడియున్న భౌతికప్రపంచమునం దహింసాధర్మము ప్రశాంతమనుష్యజీవిత నిర్మాణమునకు వలయు ప్రశస్త సాధనసామగ్రినెల్ల సమకూర్చుచుండఁ గలదు. అహింసయొక్క సమస్త సౌఖ్యానందప్రదాయక సామర్థ్యము నెఱింగియే ప్రాజ్ఞులగు నార్యులు: —

"అహింసా పరమో ధర్మః
విను మహింస ధర్మవితతికెల్లను మేటి." —భారతము.

అని వచించియున్నారు. గంభీరమగు నహింసాధర్మమునుగూర్చి సంస్తుతించియుంటిని. కాని అహింసయన

నెట్టిదో, తల్లక్షణము లెట్టివో సాకల్యముగ నుడువనయితిని. ఇంక శ్రద్ధతో నవధరింపుఁడు. అహింసయొక్క గంభీరార్థమంతయు నీ ప్రకరణమందే వివరింపఁబడును.

ప్రస్తుతము సమస్తప్రపంచ మహింసాధర్మ విషయమున భిన్నాభిప్రాయములఁ గలిగియున్నది. ఏతద్విషయమునఁ బ్రాచీనులకును, అర్వాచీనులకును భేదాభిప్రాయ మెంతేని కలదు. నేఁడు ప్రపంచమున సజీవములయియున్న మతములలో హిందూబౌద్ధజైనములు ధర్మవితతికెల్ల నహింసకే విశేషమగు ప్రాధాన్యము నొసంగుచున్నవి.

ఈప్రాధాన్యము, ప్రాముఖ్యము, గౌరవసన్మానములు వాగ్రూపమునం దున్నంతఁ గార్యరూపమున గోచరింపకుండుట కడు శోచనీయము. నేఁటి ప్రపంచముయొక్క యహింసా సంబంధములగు సూత్రములలో ముఖ్యములును, నాయంతరాత్మయందు ధర్మసంగతము లని తోఁచినవియును నగు సిద్ధాంతములఁ గొన్నింటి నిట వివరించెదను.

విశేషసంఖ్యాకులగు నహింసాప్రచారకులు నేఁడు వివిధాభిప్రాయములచేఁ గఠినహృదయులగు దుష్టమానవుల తీక్ష్ణఖడ్గముల కెరయగు పశుపక్ష్యాదుల సంరక్షించుటయందే సమగ్రమగు నహింసాతత్త్వము గర్భితమయి యున్నదని భావించుచున్నారు. నేఁటి యహింసాప్రచారకులు భావించునంతటి సులభానుష్ఠేయముగ నహింసాధర్మము వెలయుచుండుటలేదు. స్థూలదృష్టితోఁ జూచువారికి బుద్ధిపూర్వకముగ నొక ప్రాణిని హింసించుటయు, సంహరించుటయు హింసయగుననియు, నట్లొనరింపకుండుటయే యహింస

యనియు స్ఫురింపవచ్చును. జీవుల బాధింపక, వానిని సంరక్షించుకార్యము కేవలము జీవకారుణ్యమే యనఁబడునుగాని, సంపూర్ణమగు నహింసాధర్మ మనఁబడ నేరదు. జీవకారుణ్యము కేవల మహింసయందలి యొక ముఖ్యభాగము మాత్రమే యయియున్నది.

విశాలమగు నాధ్యాత్మికదృష్టితో విచారించిన సర్వవ్యాపకుండగు నీశ్వరుని సర్వవ్యాపకత్వమువలె నతివిశాలమగు నహింసాధర్మమునకు వ్యాఖ్యాన మొనరింపఁబూనుట సాహసమే యగును. ప్రశాంతమగు మానవజీవితనిర్వాహణమున కనుష్ఠేయ మగునంతవఱకు నహింసాధర్మమునుగూర్చి ప్రసంగించుట సమంజసమే యగును.

అహింస ముఖ్యముగా నాలుగుభాగముల నొప్పారుచున్నయది. పరిపూర్ణమగు నీధర్మము నొక కామధేనువునకుఁ బోల్చిన దీనిని నాలుగువిభాగములు పొదుగునందలి నాలుగు స్తనములుగ సంభావింపఁబడవచ్చును. ఈ నాలుగు స్తనముల నుండి లభించు దుగ్ధసుధారసపానముచేఁ బురుషార్థచతుష్టయమగు ధర్మార్థకామమోక్షములు సిద్ధించును.

అహింసాకామధేనువుయొక్క ప్రథమ స్తన మాత్మహింసాదమనము. ద్వితీయ స్తనము సూక్ష్మహింసానివారణము. తృతీయ స్తనము జీవహింసోత్పాటనము. చతుర్థ స్తన మనివార్యమగు హింస హింస కాదు. పరిపూర్ణమగు నహింసాతత్త్వ మీరీతిగ నాలుగువిధముల విభజింపఁబడి విద్యార్థుల సౌకర్యార్థ మిచ్చోట వర్ణింపఁబడఁగలదు.



# ఏబదిమూఁడవ ప్రకరణము



## ఆత్మహింసా దమనము

"శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
దయాసమం నాస్తి పుణ్యం, పాపం హింసా సమం నహి."

"అసంఖ్యాకములగు వేదాదిగ్రంథముల సారము నీ యర్ధశ్లోకమునందే వచించుచున్నాఁడను దయ కీడగు పుణ్యమును, హింసకుఁ దుల్యమగు పాపమును లేదు."

దయామయుండగు జగదీశ్వరుఁడు తన ప్రియసంతానమగు మనుష్యజాతియొక్క కల్యాణము నపేక్షించి యనేకవస్తు సముదాయములను, సాధనసామగ్రులను, సంపన్నిధులను బ్రసాదించియున్నాఁడు. ఈశ్వరప్రదత్తములగు సమస్తదానములలో మనుష్యజన్మ యుత్కృష్టమయినది మనుష్యజీవితమునకు ముఖ్యమును, కాంతిదాయకమును నగు పదార్థ మంతరాత్మ.

ఈయాంతరాత్మ పశుపక్షిక్రిమికీటాదుల యంతరాత్మలవలె మూఢదశయం దుండదు. ఇయ్యది వాని యన్నింటి కతీతంబగు నద్భుతవికాసభాసురంబును, అనన్యచైతన్యపరిపూర్ణంబును, లోకోత్తరవిజ్ఞానశక్తి సమన్వితంబును నయి యెట్టి నిగూఢతత్త్వము నయిన గుర్తింప నర్హతను గలిగి యున్నది. ఇయ్య దజ్ఞానమును, అజ్ఞాన సంభూతములగు కామ క్రోధ మద మాత్సర్యాది దుర్గుణములను స్పృశింపనొల్లదు.

అంతరాత్మ యొక పద్మమువంటిది. ఇయ్యది నిరంత రము దివాకర కిరణరశ్మిస్పర్శమాత్రంబున వికసించు సరో జంబుమాడ్కి జ్ఞానప్రభాస్పర్శచే వికాసముయొక్క చరమ సీమ నధిష్ఠించును. నిశాకరుని శీతలకిరణస్పర్శచేఁ గమలము ముకుళీభూతమగు విధంబుననే యజ్ఞానాచ్ఛాదనముచే నంత రాత్మయుఁ, గ్రమక్రమంబుగ సహజచైతన్యమును దక్కి, జడత్వమునకుఁ బాల్పడి నిరుపయోగం బగును.

కరుణాసింధువగు పరమపిత పశుపక్ష్యాదులకంటె మనుష్యునకు మహోద్దేశ్యముతో నంతరాత్మను, తదాజ్ఞా పాలకములగు జ్ఞానకర్మేంద్రియములను బ్రసాదించియుండ, వాఁడు దేవుని పవిత్రసంకల్పమునకు విరుద్ధముగ మూర్తీభ వించిన జ్ఞానమును, కేంద్రీకృతమయిన జీవమును నగు నంత రాత్మను దుర్గుణములచేతను, దుర్వ్యసనములచేతను భ్రష్ట మొనరించు నెంతటిపాపమో గుర్తెఱుంగకున్నాఁడు.

విజ్ఞానధనుఁడయి జీవింపవలసిన మనుష్యుఁడు జ్ఞానా చరణమున కనుకూలమగు దేహయంత్రము నందియుం డియు, నింద్యాతినింద్యములగు పాశవికవృత్తుల నవలంబించి, నైతికపథచ్యుతుఁడయి వర్తించుచు దేవుని హితబోధనే విస్మరించుచున్నాఁడు. నిశ్చయముగ వానికంటె ఘోర హంతకుఁడును, ఆత్మద్రోహియు, భగవద్ద్వేషియు, హింసా త్మకజీవియు మఱొక్కఁ డుండఁబోఁడు.

ఈశ్వరోద్దేశ్యమునకు విరుద్ధముగా నంతరాత్మను దుర్విషయములకయి నష్టపఱచు వ్యక్తియే యాత్మహింసా పరాయణుఁడు ఒకానొక మనుష్యుఁడు జీవితమం దభిలాష

లేని వాడయి, తీక్ష్ణఖడ్గాఘాతంబునఁ దనకంఠమును నుత్తరించుకొనిన వానిని జనసామాన్య మాత్మహంతకునిగ నిశ్చయించుచున్నది. కాని, ఎవడేని యొక వ్యక్తి దూషితవర్తనుఁడయి, మద్యపాయియయి, పరదారాభిలాషియయి నిరంతర మాత్మస్తుతిపరాయణుఁడయి, లోకనిందకుఁడయి, స్వార్థాంధుఁడయి, అమితాహారియయి మనుచున్నను వానిని హింసయొనరించినవారి గణనయందుఁ జేర్చుచుండుటలేదు. దేవుని సంపదయగు పవిత్రాంతరాత్మను కామాద్యపవిత్ర చర్యలచేఁ గలుషిత మొనరించి, అద్దాని చైతన్యమును, జీవశక్తిని నశింపఁజేయుటసయిత మొక తీవ్రమగు హింసయే.

క్షణికమును, అల్పమును నగు నొక ప్రాపంచిక వస్తువును దొంగిలించిన వ్యక్తియే చోరుఁడన వ్యవహరింపఁబడి రాజదండనకును, లోకధిక్కారమునకును బాత్రుఁడగుచుండ పరాత్పరుని స్వకీయము నగు దేహమును, అంతరాత్మను దుష్ప్రవృత్తులచే క్షీణింపఁజేయుచు, హింసించుచుండు మానవు లెట్టి భయంకరాపరాధులో, వారి కెట్టి దండన విధింపఁదగునో ప్రాజ్ఞులు విచారింపకుండుట కడు శోచనీయము.

"Each soul is potentially divine."

—Vivekananda.

"ప్రతిజీవాత్మయందును బరమాత్మశక్తి యంతర్భూతమయి యున్నది. మనుష్యుఁడు జ్ఞానమాత్రోప జీవియయి యుండియు నిరంతరాక్రమచర్యలకుఁ బాల్పడి పశుపక్ష్యాదులకు వలె దూరదృష్టియు, విశాలభావములును, నిర్మలవర్తనమును లేక హీనమతిచేఁ దృష్ణాప్రవాహమునఁ

దేలియాడుచు నేఁడు తన యంతరాత్మ కెట్టి యుపకార మొనరించుచున్నదియు గ్రహింపలేనంతటి జడమతియు, పాషండుఁడును నయిపోయినాఁడు.

కేవలము భువిపై మనుచుండు టొక ధర్మముకాదు. క్షుత్పిపాసలఁ దీర్చికొనలేక చచ్చుజీవి లేదు.

> "తరవోఽపి చ జీవంతి జీవంతి మృగపక్షిణః
> స జీవతి మనో యస్య మననే నోపజీవతి."
>
> —మహోపనిషత్తు.

"వృక్షములు, మృగములు, విహంగములు, జీవించు చందమున మనునతఁడొక మానవుఁడు కాఁడు. తన నిజ స్థితిని విచారించు వ్యక్తియే మనుష్యుఁడు."

హఠముచేఁగాని అహంకారముచేఁగాని మనుష్యుఁడు యుక్తాయుక్తములను, సత్యాసత్యములను గ్రహింపక దేహాత్మలు రెండును దనవస్తువులే యనియు, వానిపైఁ దనకు సంపూర్ణాధికారము కలదుగావున వానిని యథేచ్ఛగా వినియోగించుకొనఁ దన కధికారము కలదనియు గర్వాంధుఁడయి నుడువవచ్చును. దీర్ఘముగా విచారింప వాని నిర్ణయము ఝంఝామారుతాహతిచే నెగిరిపోవు దూదిపింజముయొక్క స్థితి ననుసరించును.

మనుష్యుఁడు సజీవుఁడయి యుండుటకు వాయువు ప్రథమావసర మయియున్నది. నిమేషమాత్ర కాలము మారుతము స్తంభించిన మానవుని దర్ప మడంగును. పిపాసానివృత్తికి జల మావశ్యకము. సలిలము లేకున్న మనుష్యుఁడు హతుఁడగును. క్షున్నివారణార్థమును, దేహాపోషణనిమిత్తమును భోజనము వసుంధరనుండి లభింపవల

వలయును. నిరాహారియయి మనుష్యుఁడు బ్రతుకఁజాలఁడు. శరీరము సజీవస్థితియం దుండుట కుష్ణమును, భూమినుండి దశదిశలకును వ్యాపించు నిమిత్త మాకాశమును నవసరము లయి యున్నవి. ఈ పంచభూతముల యొక్క సంయోగమే దేహము.

పంచభూతములు భగవదంశ సంభూతములు. దేహ మందిర మంధకారప్రాయమయియుండ నిద్దానిని ప్రకాశ వంత మొనరించిన యంతరాత్మయను విద్యుద్దీపిక స్వయం జ్యోతియగు పరాత్పరుని నుండియే మనకు సంప్రాప్త మయి నది. పంచభూతములు మానవుని సంపదకాదు. జడమగు దేహమే మానవుని సొత్తు కానపుడు చేతనమగు నంతరా త్మనుగూర్చి వేఱుగ నడుగనేల?

మానవుని జీవితము కేవల మీశ్వరుని సంపదయే యని గ్రహింపనగును. అట్లు గ్రహించి దయామయుం డగు పరాత్పరుఁ డే యుద్దేశ్యముతో మన కీ దేహాత్మలఁ బ్రసాదించి యున్నాఁడో, ఆయుద్దేశ్యపూర్తి కే వీనిని సద్వి నియోగ మొనరించు టహింసావ్రతపరాయణుని ముఖ్య ధర్మమయియున్నది. ఈశ్వరోద్దేశ్యమునకు భిన్నముగా మను ష్యుఁడు తన జీవితమును దుర్వ్యసనములకయి వినియోగించి నచో వాఁ డవశ్యము భగవద్ధనాపహరణకర్తయు, ఈశ్వర ద్రోహియు, దైవహత్యాపరాధియు నగుచున్నాఁడు.

"సర్వయజ్ఞేషు యద్దానం సర్వతీర్థేషు యత్ఫలం
సర్వదానఫలం వాపి తన్నతుల్య మహింసయా."

సర్వయజ్ఞముల (ఇంద్రియాదుల జయము, అథవా మాతాపితృ గురుదేవతాప్రభృతుల సేవ) ఫలమును, సర్వ

తీర్థముల (అంతఃకరణశుద్ధి) ఫలమును, సమ స్తవిధదాన ముల (గోదాన, భూదాన, సువర్ణదాన, వస్త్రదాన జ్ఞానా న్నదానములు మున్నగునవి) ఫలమును నహింసాప్రతా నుష్ఠానలబ్ధమగు ఫలమున కీడు రావు."

కావున విద్యార్థులారా! మీ రీ యాత్మహింసయొక్క సూక్ష్మములగు రహస్యముల గ్రహించి, తదనుష్ఠానపాపము నుండి విమోచనమునంద సద్వర్తనులయి, శమదమశీలురయి, నిగ్రహాయుక్తులయి సాధుమార్గమున జీవయాత్రఁ జేయుచు, క్రోధాహంకారదర్పకౌటిల్యాది దుర్గుణముల దరిజేరనీయక దైవసృష్టి కలంకారప్రాయులయి మనుఁడు. అపుడే మీరాత్మ హింసాదమనమున సఫలీభూతులయి, అహింసావ్రతము యొక్క ప్రథమసూత్రము ననుష్ఠించిన సుకృతమునకుఁ బాత్రులయ్యెదరు.



# ఏబదినాలుగవ ప్రకరణము

## సూక్ష్మహింసా నివారణము

"కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా,
అక్లేశజననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః."

"మనోవాక్కర్మల సర్వకాలసర్వావస్థలయందు నే ప్రాణికిఁ గ్లేశము నొదవఁజేయరాదు. ఇదియే అహింసయని మహర్షులు వాకొనియున్నారు.

నేఁడు మానవజాతి ప్రత్యక్షమునఁ గావించు హింసను గూర్చియే చింతించుచున్నది గాని, పరోక్షమున సంభవించుచున్న హింసనుగూర్చి విచారించుటయే లేదు. నిశితకరవాలమును హస్తమునం గొని యద్దానిచే నేదేని యొకజీవము ఖండింపబడుచున్న నది హింసయే యను భావ మెట్టి స్థూలబుద్ధులును, జడమతులును నగువారికయినఁ గలుగఁగలదు. కాని యవ్యక్తముగా మనచే నొనరింపబడుచున్న హింసయు లోక శాంతికి భంగకరమగు రాక్షసప్రవృత్తియే యగుచున్నయది.

అహింసాతత్త్వపరిజ్ఞానమున సంపూర్ణానుభవసంపన్నులయియుండిన ఋష్యాదులు దేహమును హింసించుటకంటె మృదులమగు చిత్తమును బాధించుటయే ఘోరమగు పాపమనియు, కఠినమగు హింసయనియు నుడివియున్నారు. శర

ముచే దేహముపై నాఘాత మొనరించుటచే సంభవించు బాధకంటె కఠోరవాక్యప్రయోగమున మనస్సు నొవ్వ మనుష్యుఁ డధికమగు వ్యథకుఁ బాల్పడి కరము విచారము నందుచుండఁగలడు.

క్రోధాంధుని హృదయభాండము విషపూరిత మగుటచే నతని దూషితముఖమునుండి బహిర్గతమగు ప్రతి కటు వచనము సాధుపురుషుల కోమలహృదయముల మిక్కిలి బాధించుచుండును. ఇట్టి భయంకరమగు హింసనుగూర్చి నేఁ డహింసాధర్మోపదేష్టలును, ప్రచారకులును జింతింపకున్నారు.

బుద్ధిగుంతు లేమరియేని పరుషవాక్యములచే నొరుల మనముల నొవ్వఁజేయనొల్లరు.

కం॥ బెడిదముగఁ గత్తి గొడ్డట
బొడువఁ దెగిన క్రమ్మనఁ జిగురు ♦ వాడము బలుకులం
జెడఁ దునిసిన కార్యంబు ని
గుడ నేరదు పిదపనెట్టు ♦ గురువంశనిధీ!

—మహాభారతము.

జీవకోటుల వధించి భక్షించు రాక్షసవృత్తినుండి నివృత్తిఁ జెంది తమ్మహింసాపరులుగ భావించుకొనువారియం దెందఱో కోవిదు లకారణముగఁ, బరుల మదుల నొవ్వఁ జేయుచుండుట నేఁడు గోచరించుచున్నది. వాగ్బాణప్రయోగము తీవ్రహింసాకరము. ఇట్టి మనస్సంక్షోభకరమును, కోమల హృదయవిదారకమును నగు హింస నివారింపఁబడ నిదే లోకమున సమస్తమానవహృదయముల శాంతి నెల కొనఁజాలదు.

నేఁడు ప్రపంచమున సంభవించుచున్న సమస్తకలహములకును, పోరాటములకును ముఖ్యముగాఁ గటువచన ప్రయోగమే కారణమగుచున్నది. కటువచన ప్రయోగము సంపూర్ణముగా నిషేధింపఁబడినచోఁ గలహోదయమునకే యవకాశము కలుగనేరదు.

"యస్య వాణ్యాస్తి మధురా తస్యైవ సఫలం తపః
నోచే జ్జీవంతి పశవో ఉప్యనిశం పుష్టిశాలినః,
ప్రియవాక్యప్రదానేన సర్వే తుష్యంతి జంతవః
తస్మాత్తదేవ వక్తవ్యం వచనే కా దరిద్రతా?"

"ఎవ్వాని వాక్కు మధురముగనుండునో, వాని తపము సఫలము. పుష్టిశాలిగ నున్నవాని జీవిత మేమి సఫలము? పశువులు పుష్టిగ నుండుటలేదా? ప్రియవాక్యప్రదానముచే సమస్త జంతువులు హర్షించును. కావున మధురవాణినే యుపయోగించుచుండవలయును. మాట కేమి పేదఱికము?

ఈ రహస్యము నెఱింగియే కరుణామూర్తియు, అహింసావతారంబును నగు శ్రీ బుద్ధభగవానుఁ డీరీతి నుపదేశించియున్నాఁడు:—

"నాయనా! నీవు తొలుదొల్త వాణిని స్వాధీన మొనరించుకొనుము. నీకుఁ గీర్త్యపకీర్తులను, ధర్మాధర్మములను, పాపపుణ్యములను, సుఖదుఃఖములను కలిగించునది వాణియేయని స్పష్టముగా గ్రహించుము."

కం॥ తనువున విరిగిన యలుఁగుల
నను వునఁ బుచ్చంగవచ్చు • నతినిష్ఠురతన్
మనమున నాఁటిన మాటలు
విను మెన్నియుపాయములను • వెడలునె యధిపా.

—మహాభారతము.

కావున, దివారాత్రములం దెప్పుడైనను నీవు వచింప నెంచు ప్రతివచనమును నాచితూచి మఱి నుడువుము. నీవాక్యమునం దెట్టికాఠిన్య భావలేశమున్నను హత్యాసమానమగు దోషము నీపై నారోపితము కాఁగలదు. వాక్కుచే నెట్టి హింసయు నొనరింపఁ గోరవేని ప్రశాంతమనస్కుఁడవయి, కడు శీతలములును, మృదుమధురములును వినయవిధేయతా పురస్సరంబులును నగు మాటలనే నుడువుచుండుము. తీక్ష్ణమగు ఖడ్గము కేవలము దేహమునకే క్షతి నొడఁగూర్చుచుండఁ గఠినవాక్యము దేహమునకుఁ బ్రధాన వస్తువగు మానసమునే తుత్తునియలు గావించివైచును.

"నారుంతుదః స్యా ద్వేత్తో౽పి న పరద్రోహకర్మధీః,
యయాఽస్యోద్విజతే వాచా నాలోక్యాం తాముదీరయేత్.
—మనుస్మృతి.

పండితుఁడవయి యుండియు నెవ్వానిని మర్మాహతములగు కటువచనములచే నొప్పింపకుము. మదియం దెవ్వానికిని ద్రోహమును జింతింపకుము. అన్యుల హృదయమునం దుద్వేగము నొదవించునట్టి శ్రేయశ్శూన్యమగువాణి నెపుడును బ్రయోగింపకుము."

ఒకతూరి వాగ్బాణప్రయోగక్షతమయిన మానసము తిరిగి తననిజస్థితికిఁ బ్రాపించుట బహు కష్టసాధ్యము. నేఁడు దూరదృష్టిలేని ప్రాపంచకులు సూక్ష్మాతిసూక్ష్మ మయి వాగ్రూపమున నొప్పు హింస నపరిమితముగాఁ గావించుచుచున్నారు. తాడనహత్యాదులచే స్థూలదేహమునకుఁ గావింపఁబడు హింసకంటె నేఁడు వాక్పారుష్యముచే సూక్ష్మదేహమును బాధించి మిక్కిలి హింస నాచరించుచున్నారు.

నేఁడు నాగరికప్రపంచముయొక్క పరిష్కృతమగు దృష్టిలో స్థూలదేహపీడనము ఘోరపాపమయినట్లు సూక్ష్మదేహపీడన మఘముగ సంభావింపఁబడుచుండుటలేదు. విద్యార్థులారా! మీరహింసాత్మకమగుజీవితయాత్ర నేమనఃపూర్వకముగా వాంఛింతురేని సత్వరము వచఃపారుష్యమును విసర్జింపుఁడు. అహింసామూర్తియగు బుద్ధప్రభువు తన జీవితకాలమునందుఁ దాను రాజరాజేశ్వరుఁడయి యుండియు, సకలలోకోపదేష్ట యైయుండియు సదా కడు శాంతముతో 'నాయనా' యని ప్రతివ్యక్తిని సంబోధించుచు మృదులభాషణముచే నెట్టి కఠినచిత్తులనయిన నాకర్షించి వారి హృదయముల నాహ్లాదపరవశములుగఁ జేసి తదనంతరము జ్ఞానోపదేశ మొనరించుచుండెడివాఁడు.

ఆలకించుటకుఁ గోమలములయి యొప్పుచుండియు, శ్రావ్యములయియుండియు సపవిత్రహృదయులగు కొందఱి ముఖములనుండి వెలువడు వాక్యములు కడుదూషితములయి యుండుచుండును. ఎవ్వాని హృదయమున ద్వేషమాత్సర్యములు నెలకొనియుండునో, వాని ముఖమునుండి సదా పరోన్నతిని సహింపనట్టి నిగూఢ దూషణభావ ద్యోతకములగు వాక్యములు వెలువడి క్రమముగా వినువారి మానసవీథుల కెక్కి వారి కొకవిధమగు వేదన నొదవించుచుండును. పరదూషణ బుద్ధియు హింసకు మూలకారణమే కావున సత్వర పరిత్యాజ్యము.

"వాక్సాయకానివదనా ద్యది నిష్పతంతి
యై రాహతః శోచతి రాత్ర్యహాని

పరస్య నామర్మసుతే పతంతి
తా న్పండితో నావసృజేత్పరేషు."

"కటువచనము లను బాణములు గ్రుచ్చుకొనుటచే మనుష్యు లహర్యాతము దుఃఖితులై దివారాత్రములు శోకించు చుందురు. కావున, విద్వాంసులు పరహృదయవిదారకము లగు వాక్కుల నుపయోగింపకుండు టుచితము."

సంతతానందప్రఫుల్లచిత్తులయి, అధరముల మృదుల హాసము లాస్యమొనరించుచుండ మూర్తీభవించిన ప్రసన్నత యాయన మూఢజనావళికి నీతిధర్మజ్ఞానముల బోధించు సత్పురుషులు కొందఱుందురు. అట్టివారు సత్యసందర్శన వాంఛా ప్రపీడితచిత్తులయియుంట మన మాత్మజ్ఞానములేని వారలమై స్వయంకృతములగు నల్పకార్యములఁగూర్చి వారి కట్టెదుట శ్లాఘింతుమేని సత్యాన్వేషణమందున్న వారి చిత్తములనుచిత స్తుతిశ్రవణముచే వ్యథితములగును. తత్కారణమున ఘోరమగు హింసాదోషము మనకు వాటిల్లఁగలదు. కావున ఆత్మస్తుతి కడు నింద్యమగు క్షుద్రవృత్తి.

అనంతమగు నీ జగతీతలమున వివిధప్రకృతులచేఁ జెన్నొందునట్టియు నానాదశలకుఁ బ్రాపించి యున్నట్టియు మనుష్యులు కలరు. దేవుని సృష్టియం దొక్క మనుష్యజాతి యందే రూపవంతులును, రూపవిహీనులును, ధనాఢ్యులును నిర్ధనులును, పండితులును, పామరులును, అంధులు, బధిరులు, మూకులు మున్నగు వికలాంగులును, వృద్ధులును, రుజాపీడితులును వెలయుచుండుట సర్వజనవిదితము.

ధనాఢ్యు లనేకులు లుబ్ధాగ్రేసరులయి, పాశవిక భావనాప్రేరితులయి నిరంతర భోగవిలాసములఁ గాలముఁ

బుచ్చుచు నిర్దయులయి తమగృహముల కేతెంచు కరుణింపఁ దగిన భిక్షుకుల యథాశక్తి సన్మానింపకున్నారు. శక్తిసంపన్నులయి యుండియు సోమరులుగాక యంగవైకల్యము చేతను, భయంకర వ్యాధిపీడనమునను, జరాభారంబునను స్వయంకృషిచే నాహారమును సంపాదించుకొనలేనివారయి తమ్మాశ్రయించు దీనుల నాదరింపకుండుటచే దుర్భరమును, దురంతమును నగు హింస తటస్థించుచున్నయది.

విపులసంపదల కధికారియయియుండియు మృత్యువును విస్మరించి వానినన్నింటి నంటిపట్టుకొనియుండి దుర్బలజీవుల సుఖదుఃఖములఁ బొల్గొనుటయం దశ్రద్ధను, అనాసక్తిని వహించియుండు మనుష్యుఁడు భయంకరహింసాపరతంత్రుడగుచున్నాఁడు.

> "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యో ఽర్జున,
> సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః."
>
> —భగవద్గీత.

"ఓ అర్జునా! సకలభూతములయొక్క సుఖదుఃఖములఁ దనవిగాఁ జూచుకొనునట్టి పరమయోగీంద్రుఁడే నాకుఁ బ్రియుఁడు."

పుష్పవాటికను జేరు భ్రమరసముదాయములరీతి, తండులములు పడియున్నస్థలమును జేరు పిపీలికా సమూహము మాడ్కి, ఫలవృక్షవిరాజిత రమణీయవనములఁ జేరు విహంగబృందముల చందమున దేశదేశములనుండి బయల్వెడలి ప్రయాణ మొనరించుచు, రాత్రి యగునంత నొక ధర్మశాలయందు సమావేశమగు పాంథులకరణి, అయోమార్గమునఁ గూర్చుండి పయనముసలుపు ప్రయాణీకులభాతి, విశాలమగు

నొక పుష్కరిణియందు గ్రీష్మఋతువులోఁ బిపాసార్తిచే శీతలమధురోదకమును బాన మొనరింప నేతెంచు పశుపక్ష్యాదుల వడువున మనుష్యులమగు మన మెల్లరము దయానిధియగు సర్వేశ్వరుని సృష్టి సామ్రాజ్యమును విలోకించు యాత్రికులవలె విశ్వరంగమునకు వచ్చియున్నారము. మన మెల్లర మిచ్చోట స్థిరముగా నుండువారముగామని గుర్తించి, ఒక్క చోటనుండి యొక్కసారిగ, నొక్క స్థలమునకు, నేకోద్దేశ్యముతో, ఏకరూపులమయి వచ్చియున్న బాంధవ్యమును స్మరించుకొని పరస్పరము దయార్ద్రహృదయులమయి వర్తించుట ముఖ్యమును, శ్రేయస్కరమును నయి యున్నది.

"ప్రాణా యథాత్మనో ఽభీష్టా భూతానా మపి తే తథా,
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వంతి సాధవః."

"మన ప్రాణములు మన కెట్లు మధురము లయి యున్నవో అదియేచందమున సకలజీవరాసులకు వానివాని ప్రాణములు తీపిగనే యుండుచుండును. కావున సాధూత్తము లీ మర్మము నెఱింగి భూతకోటిని దయాబ్ధి నోలలాడింప వలయును."

నేఁడు మనుష్యప్రపంచమందు విలాసములయం దను రక్తి పెచ్చుపెరుఁగుట వలననే దీనులపట్ల దయను గలిగి యుండు స్వభావము బొత్తిగా లోపించిపోయినది. మానవుని యాహారవిహార భాషావేషాదు లన్నింటియందు నియమశూన్యత, నిగ్రహవిహీనత మిక్కుటముగుటచేతనే యొక్కొక మానవునకు లోకమందున్న సంపదలన్నియుఁ దనకే కావలయు నను తృష్ణ జనించినది.

మనుష్యుఁడు స్వాభావికమగు సాత్త్విక జీవితపద్ధతి నవలంబించుచో వేషధారణమందును, భోజన,శయన,మజ్జన పానములందును మితమేర్పడి జీవితావసరము లన్నియు స్వల్ప ములై జీవనోపాధికి మిక్కిలి స్వల్పమగు ధనమే యావశ్యక మగుచు మానవునియం దొక విధమగు త్యాగబుద్ధి నొదవించును. స్వార్థత్యాగి సహకారబుద్ధియుతుఁడయి లోక శాంతి నిమిత్తము కృషి సలుపఁగలఁడు. విలాసముల మూలమున మానవునియందు జనించు బరసౌఖ్యావరోధకమగు క్రూరబుద్ధి హింసాత్మకమయిన దగుటచే సత్వరపరిత్యాజ్యము.

విశ్వసోదరప్రేమయు, సహానుభూతియు, కరుణయు, అనుకంపయు, దయయు, దాక్షిణ్యమును, క్షమయు, లేని స్థలము ఘోరహింసాసంకులమయి యుండుననుట నిర్వివాదాంశము. సుజ్ఞాననిధియగు బుద్ధప్రభుప్రమత్తతచే మనుజుని చిత్తమునం దనేకములగు వక్రభావము లుదయించి వానిని హింసారంగమున కాకర్షించుచుండుననియుఁ గావున నలసతవంటి దుష్టజాడ్యమునకు సత్వరమే చికిత్స సలుపకున్న భయంకరమగు విపత్తు వాటిల్లుట స్థిరమనియు నుడివి యున్నాఁడు. విద్యార్థులు ముఖ్యముగా నహింసావ్రతావలంబన సౌకర్యమునకీ జాడ్యమునుండి దూరముగా నుండ వలసి యున్నది.

" Idleness offers up the soul, as a blank to the devil for him to write what he will upon it."

—Dr. South

"ప్రమత్తత (అలసత) మన యాత్మను దయ్యమునకు వశమొనరింప నయ్యది యథేచ్ఛగా దానిని విధ్వంస మొన రించివేయును."

—డా. సౌతు.

ఈ కారణముననే హత్యాపాపము మనుష్యునకు సంప్రాప్తమగుచున్నయది. అహింసా వ్రతానుష్ఠానమునకు సోమరితనము ప్రతిబంధక మగునని ధమ్మపదము నుడువు చున్నయది.

భారతవర్షమున సర్వత్ర నేఁడు మిక్కుటముగా వ్యాపించియున్న జాతిభేదసమస్య మానవోచితమగు సహజ ప్రేమను నశింపఁజేసి, దేవుని సంతానమగు మనుష్యజాతి యందు నిమ్నోన్నతభావములఁ గలిగించినది. ఈ జాతిభేద ముచే నొకరియం దొకరికి ద్వేషభావ ముదయించి పరస్పర పీడనమునకుఁ గారణమగుచున్నయది.

ఉన్నతజాతీయుఁడు తన నిమ్నజాతీయసోదరు నంట రానివానిగ భావించి స్పృశింపక, నిరసించుచుండుటచే నిమ్నజాతీయసోదరుని జీవితమునకుఁ గలుగుచున్నహింస మితిమీఱిపోయినది. మనుష్యత్వము లాఘవపరచఁబడినది. మనుష్యుఁడు తనసాటి సహోదరుఁడగు మానవుని జంతువు కంటె హీనముగఁ జూచి పాపియయి, నిర్దయుఁడయి సమత్వ శూన్యుఁడయి, పాక్షికభావయుతుఁడయి సత్యవిరుద్ధాచరణ ముచే హింసకుఁ గారకుఁ డగుచున్నాఁడు.

సత్య మహింసకుఁ బునాది. అసత్యము హింసకూఁత. ఒకమానవుఁడు జన్మచే నొకమానవునికంటె హీనుఁడనుట

సత్యము కానేరదు. కావున నియ్యది యెనలేని హింసకు మూలమగుచున్నయది.

"అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"

—పాతంజలి.

"అహింసావ్రతపరాయణునితోడ నెల్ల జీవులు వైరము త్యజించును."

పాతంజలిసూత్రముయొక్క భావార్థమును గ్రహించి నచో మానవులొండొరుల నిమ్నోన్నత భావములఁ జూచు కొనుచుండుటవలననే వైరముకలిగి హింసకుఁ గారణమగుచు న్నదనియు సమస్తజాతీయులు సమత్వమును గలిగియున్నచో జిరశాంతిప్రదమగు మైత్రి లోకమునం దంతట స్థిరముగా నెలకొనుననియు గ్రహింపవలసియున్నది. విశుద్ధవిశ్వప్రేమ భంజకమగు జాతిభేదద్వేషదూషణములు నిర్మూలమయి పోవునందాక మానవసమాజమునుండి హింస సంపూర్ణముగా దొలఁగిపోవఁజాలదు.

ప్రేమాస్పదులగు విద్యార్థులారా! మన జడమతుల కును, దయావిహీనమగు సంకుచితదృష్టికిని గోచరింపకయే నివారింపఁబడఁదగు సూక్ష్మమగు హింస యెన్నియో విధ ముల నిత్యము సంభవించుచున్నది. వాయువు నాఘ్రాణించు చుండుటచే నా మారుతమునం దుండు సూక్ష్మములగు జీవ ములు హతమగుచున్న వను సమస్యాపరిష్కారము మన కసాధ్యము.

అట్టిహింసయు ననివార్యము. కాని, మనయం దట్టి యనివార్యమగు హింసకాక సహస్రవిధముల ననుక్షణము

మన యవివేకముచే నపారమగు హింస వాటిల్లుచున్నయది. మనయందుండి యట్టి హింస దూరమయిపోయిన గాని మనము పవిత్రులమయి, ప్రశాంతులమయి, పుణ్యాత్ములమై సుస్థిరసౌఖ్యానందముల ననుభవింప సమర్థులమును, యోగ్యులమును కాఁజాలము.

ప్రతివిద్యార్థియు విచక్షణపూర్వకముగ వర్తించుచు యథాశక్తి నిరంతరము సూక్ష్మహింసా నివారణమునకయి యత్నించుచున్నచో శీఘ్రకాలమందే విశుద్ధమగు నహింసా వ్రతానుష్ఠానమునకు వలయు విపులమగుశక్తిని, విశాలమగు విజ్ఞానమును సముపార్జించుటయందు విజయరమానుగ్రహమునకుఁ బాత్రులు కాఁగలరు.



# ఏబదియైదవ ప్రకరణము



## జీవహింసోత్పాటనము

ఆ॥ వె॥ జీవిజీవిఁజంపి ♦ జీవికి వేయఁగా
జీవివలన యేమి ♦ చిక్కియుండు
జీవహింసకులకు ♦ జిక్కునా మోక్షంబు
విశ్వదాభిరామ ♦ వినురవేమ.

దయామయుండును, సర్వజ్ఞుండును నగు పరాత్పరుని విశాలమగు సృష్టిలోఁగల జీవరాసులలెక్కింప నేరికిని సాధ్య పడదు. భిన్నభిన్నరూపములతో, నానాశక్తులతో, వివిధము లగు ధ్వనులతో భాషలతో, నాహారవిహార వ్యవహారము లతోఁ గూడియున్న జీవరాసు లన్నింటిని గూర్చి విచారింప దేవుఁ డెంతటి శక్తిసంపన్నుఁడై నదియు నెట్టి మూఢహృదయు మునకయిన గోచరింపఁగలదు.

జీవరాసు లన్నింట మనుష్యుఁడు విజ్ఞానమాత్రంబున ఘనత వహించియున్నాఁ డను విషయము గ్రంథాది నుండియుఁ జదువరులకు బోధింపఁబడుచునే వచ్చియున్నది. విజ్ఞానమునందు వెనుకఁబడి యుండుటవలననే పశుపక్ష్యా దులు మనుష్యులవలె విశ్వమునం దున్నతస్థానము నాక్ర మింప నసమర్థము లయియున్నవి. ఈ కారణముననే సృష్టి యందలి సమస్తజీవరాసులును, స్థావరజంగమపదార్థములును

భగవదాజ్ఞ ననుసరించి సదా మానవజాతీయకల్యాణోద్యమ మునకు మిక్కిలి సాహాయ్యభూతము లగుచున్నవి.

సత్యప్రభాభాసురంబగు మానవుని స్వేచ్ఛాజీవితానం దమునకు లోకమందుఁగల సకలజీవసముదాయములు సాహాయ్యభూతములగుచున్న వేకాని విఘ్నకారకము లగుచుండుట లేదు. పశుపక్ష్యాదులు పరాత్పరుని విశ్వసామ్రాజ్యమున స్వేచ్ఛగా విహరించుచు స్వల్పాహారమాత్రంబునఁ దృప్తి పడుచు యథాశక్తి దమదేహమును, సమయమును, సర్వస్వ మును మానవజీవితోపయోగమున కయి వినియోగించు చుండుట సకలజనవిదితము.

విజ్ఞాన సముపేత మగు మానవాంతరాత్మ కలుషిత మయి స్వార్థమును, తృష్ణను, విలాసములను, కామక్రోధాది దుర్గుణములను సన్మానించువిధంబున, పశుపక్ష్యాదుల మూఢహృదయ మస్వాభావికములగు దుశ్చేష్టల నాదరిం చుట లేదు. నేఁడు మనుష్యజీవితమును పశుజీవితముతోఁ బోల్చి చూచిన న్యాయశీలుఁడగు మనుష్యుని విశాల దృష్టికి వర్తమానకాలమందలి మానవజీవిత మెంత యధః పతితమయినదియు స్పష్టపడఁగలదు.

నేఁడు మనుష్యులు స్వప్నమందేని లోకమున కేవిధ మగు హాని నొడవింపని సాధుజంతువులఁబట్టి హింసించుపద్ధతి నవలోకింప మానవులకంటె రాక్షసు లను క్రూరులు వేరుగ లేరని తెల్లము కాఁగలదు. మనుష్యులకంటె ననేకవిధముల సాధుత్వమునను, లోకోపకారపారీణతయందును శ్రేష్ఠము లగు జంతువులు వధింపఁబడు విధానము జూడ మానవు లెంతటి నిర్దయులో కఠినచిత్తులో తేటపడఁగలదు.

**"Animals are such agreeable friends-they ask no questions, they pass no critisims."**

**—George Elist.**

"పశువులు చాల సమ్మతింపఁదగిన మిత్రులు. అవి మన కడ్డుప్రశ్నలను వేయవు. ఎప్పుడును విమర్శింపఁబోవు."

—జార్జి ఎలిస్టు.

విజ్ఞానజీవు లగు మానవులు నేఁడాకారమాత్ర మానవులయి, దూషిత స్వభావు లయియున్న వారిని వధించినను మహాపాప మొనఁగూడునని సంభావించుచున్నారు. అధముఁ డగు నొక్క మానవుని వాని ఘోరాపరాధమునకయి వధించిన మహాపాపము వాటిల్లి కర్తకు రౌరవాది నరక ప్రాప్తి కలుగునని మానవులే పాపమెఱుంగనట్టియు, నిరంతర లోకసేవావ్రతమున నిరతమయియున్నట్టియు, నోరులేనట్టియు, సాధుజంతువుల రాక్షసులవలె భయంకర ఖడ్గాఘాతముల ఖండించు క్రూరుల నిర్దాక్షిణ్యమును గూర్చి మేధావంతు లగు మనుష్యులు చింతింపకుండు టెంతయు శోచనీయము !

సుఖదుఃఖముల ననుభవించుటయందు జీవముగల పశుపక్ష్యాదులును మనకుఁ దుల్యములే యను జ్ఞానము నేఁడు మనయందు నశించినది. సహోదరులారా ! వ్యామోహము విడిచిపుచ్చి, అజ్ఞానమును బాఱద్రోలి, నిష్పాక్షిక బుద్ధితో, సత్యపరిశీలనాసక్తితో నొక్క నిమేషకాలము మీరు విచారింతురేని జ్ఞానవిషయమునఁ దక్క పశుపక్ష్యాదులు సమస్త విషయముల నేఁటి మానవులకంటె నున్నత స్థితియందే యున్నవని వ్యక్తము కాఁగలదు.

ఆహారనిద్రా భయమైథునములందును, జననమరణ ములందును, సుఖదుఃఖములందును మనుష్యులకును, పశు పక్ష్యాదులకును గించిన్మాత్రమగు భేదమయిన గోచరింప కున్నది. ఏ జీవికి సుఖదుఃఖముల ననుభవించు సామాన్య జ్ఞానము కలదో, అట్టి జీవరాసులన్నియు బాంధవ్యమున మనుష్యునకు సహోదరతుల్యము లే యగును. కావున సమస్త మానవులు తా మేరీతిఁ దమ సౌఖ్యమునుగూర్చి భగవం తుని బ్రార్థించుచున్నారో, అదియేవిధముగఁ దామును బశుపక్ష్యాదులపై దయను వెల్లడించవలసియున్నది.

"తే॥ గీ॥ పసులపై నెంత మన దయ ♦ పర్వె నంత
ఈశ్వరుని దయ మనపయి ♦ నెసఁగఁ గలదు
పశువులను గావ మనకు శు♦భంబు గలదు
మిత్రవరులార! ఈశ్వర♦పుత్రులార!"

—భక్తమణిభూషణము.

నేఁడు మానవులు జీవులకుఁ బరస్పరముగల బాంధవ్య మును విస్మరించి భోగాంధులయి, మదోన్మత్తులయి, యుక్తా యుక్తములఁ జింతింపక నీతిమార్గమునుండి పతితులయి కలి పురుషులో యనఁ బాషాణహృదయములు గల పతిత పాషండులై యన్యాయముగ కోటానుకోట్ల సోదరజంతువుల మట్టుబెట్టుచున్నారు. మూఢులగు మనుష్యులు నోరెఱుం గని పసిపాపలఁ గఱకుకత్తుల నరకుటకంటె సాధుజంతువుల ప్రాణసంహార మొనరించుట ఘోరపాపమనియు, పైశాచిక కృత్యమనియు గుర్తింపకుండుట కరము విషాదకరము.

ఆకృతియందును, లౌకికస్థితియందును, బలాబలము లందును భేదమెంతగానున్నను హస్తిమశకాదిజీవులు మొదలు

కొని మనుష్యుల వఱకుఁ గల సమస్తజీవరాసులకు హింస కడు పీడాకరమైనదియే. పరమ కిరాతకుఁడగు మానవుఁడు ధనతృష్ణా పిశాచావేశపరవశుఁడగుచో నొడ లెఱుంగక నిద్రించుచున్న రమణీమణిని సంహరించి సువర్ణాలంకార ముల నపహరించుకొని పోవుట కేమియు సందేహింప కున్నాఁడు. అదియే రీతి స్వార్థాంధులగు మనుష్యులును జిహ్వాచాపల్యమునకు లోఁబడియు, విషయలోలు రయ్యు మూకజంతువుల నకారణముగ వధించుచు ఘాతుకమృగ ములకంటె నిర్దయు లగుచున్నారు.

మ॥ పరమాత్ముండగు దేవదేవునకు స♦ర్వప్రాణులున్ దుల్యముల్
కరుణాదృష్టి నినుఁడు నచ్చు సకలముఁ♦గాపాడు నాతండె; సా
దరబుద్ధిన్ విడనాడి కృత్రిమ సమ♦ర్థత్వ ప్తి గర్వించి, సో
దరజంతుప్రతతిన్ భుజించుటదియున్♦ధర్మంబె మర్త్యాళికిన్?

—వసంతసేన.

అన్యదేశముల విషయ మెట్లున్నను సృష్టి కలంకార ప్రాయమయి విశ్వేశ్వరుని ముకుటమో యనఁ నుద్భాజిల్లు నట్టి యార్యావర్త మనాదికాలమునుండియు నహింసాధర్మ మును హృదయపూర్వకముగా సన్మానించుచు వచ్చి యున్నది. హైందవఋష్యాదుల యగాధమును, అపారమును నగు విజ్ఞానసాగరముయొక్క జాజ్వల్యమానమగు ప్రథమ రత్న మహింసాధర్మమే యని సామాన్యజ్ఞానసంపన్నుఁడగు భారతీయునకును బోధింప నవసరము లేదు. ఈ దేశమునందు జనియించి భారతాంబయొక్క పవిత్ర స్తన్యమునఁ బోషింపఁ బడిన మహాపురుషులెల్లరు తమ జీవితోపదేశములలో నహిం సకే తొల్లింటి స్థానము నొసంగియున్నారు.

అతి ప్రాచీనములగు వేదములు నయిత మహింసను ధారకమంత్ర మని వచించియున్నవి. భారతీయులు మూఢు లయి, విజ్ఞానశూన్యులయి రాక్షసాచారములకు బానిసలయి ఘోరమగు హింసను బ్రబలఁ జేయుచుండినపుడెల్ల దయా మయుండగు సర్వేశ్వరుని కృపచే నొక్కొక్క మహాపురుషుఁ డీ భువి నావిర్భవించి పరమపావనమగు నహింసావ్రత మాహా త్మ్యమును మూఢజనావళికి బోధఁ గావించియున్నారు.

బుద్ధుఁడు, మహావీరుఁడు, రామానుజుఁడు, రామ మోహనుఁడు, దయానందుఁడు, గాంధి మున్నగు మహా పురుషు లెల్లరు హింసాప్రాబల్యము నణఁచుటకయి భువి నవతరించి యున్నారు. అట్టి మహానుభావులు జీవహంతకుల కుద్బోధించుచు జీవహత్యగావించు మనుష్యుల కిట్టి దండన మును బరమేశ్వరుఁడు విధించునని నుడివియున్నారు.

"ప్రాణిహింసాపరాణాం తు కల్పకోటిశతం మునే,
తప్తతైలకటాహేషు గాఢం బద్ధ్వా పదద్వయం."

"ఓ మునిప్రవరా! ప్రాణిహింసకుల శతకోటికల్పాంత ముల పర్యంతము నరకమునఁ దప్తతైలభాండమున రెండు పాదములు బంధించి పడవైచి యమదూతలు బాధించెదరు.

నేఁడు భారతవర్షమున విశేషముగ వ్యాప్తియం దున్నది శంకరస్థాపితమగు నద్వైతమతమే. అద్వైతమునం దపూర్వమగు భక్తిని బ్రకటించువారి సంఖ్య భారతీయు లందు గణనాతీతమయియున్నది. లోకోద్ధారకుఁడును, సత్య ధర్మసంస్థాపనాపరతంత్రుఁడును విపుల విజ్ఞానసముపేతుఁడును నగు శంకరుఁడు సమస్తజీవులును బ్రహ్మస్వరూపమే యనియు,

జీవులకు నిమ్నోన్నతభావములును, ద్వేషబుద్ధియుఁ దగ వనియు విశ్వసోదరప్రేమ జీవితాభ్యుదయకరమగు సత్సాధన మనియు వచించియుండ వేదాంతుల మనియు, అద్వైతుల మనియు, శంకర భక్తుల మనియు, జెప్పుకొనువారెందఱో నేఁడు ప్రత్యక్షముగను, పరోక్షముగను సోదరజంతు సముదాయమును వధించి భక్షించుచుండుట మహాఘోరము.

రేపో మాపో భస్మమయి పోవునట్టి యీ దేహము యొక్క జానెడు పొట్టకొఱకును, జిహ్వాచాపల్యమును దీర్చుకొను నిమిత్తమును మూఁగబిడ్డలగు పశుపక్ష్యాదుల కంఠములను త్తరించుటను విలోకింప నే దయార్ద్రహృదయుని నేత్ర యుగ్మమునుండి దుఃఖాశ్రు బిందువులు ధారారూపంబునఁ ప్రవహింపకుండును ? కరుణాక్రందన మొనరించుచున్నను లెక్కింపక క్రూరుఁడయి, ఘాతుకమృగమువలె సాధుజంతువుల సంహార మొనరించు మానవాధముఁడే భయంకర రాక్షసుఁడు. అట్టి నిర్దయుఁడగు దైత్యుఁడు మలమును భక్షించు సూకరముకంటె హీనుఁడని బుద్ధాది మహర్షులు సిద్ధాంతీకరించి యున్నారు.

తే॥ గీ॥ తీసి యీలేని ప్రాణముల్ ♦ దీసితీసి
భావమందుండు కరుణను ♦ బాపిపాపి
చేత వాతను బాపముల్ ♦ జేసిచేసి
బ్రదుకు మనుజుఁడు భూమికి ♦ బరువు మనస !

—ప్రబోధశతకము.

ఇంచుక విజ్ఞానముగల వ్యక్తి తన దృక్కుల విశ్వము యొక్క నలుదిక్కులఁ బ్రసరింపఁజేయుచో వధింపబడుచున్న

సాధుజంతువులయొక్క హాహాకార ధ్వనులతోఁ గూడిన భయంకర రక్తమయ దృశ్యమును విలోకింపఁ గలఁడు. సాధువులయి, విజ్ఞానమూర్తులయి జీవింపవలసిన మనుష్యులే నేఁడు డాకినీ, శాకినీ భూతప్రేతపిశాచములయి, కోమల స్వభావమును గలిగి యున్నట్టియు, లోకమున కేవిధమగు నపకారమును జింతింపనట్టియు, దేవునిసృష్టిలో మానవజాతి కుపకరింపని పూరిని భక్షించి జీవించునట్టియు, ప్రశాంతజీవిత పరతంత్రము లయినట్టియుఁ బశుపక్ష్యాదుల వధించి వాని మాంసపిండముల దిగ్రమింగుచు నుష్ణరక్తధారలఁ గ్రోలు చుండు టెంత నైచ్యమో, ఘోరమో అన్యాయమో విచారించువారు లేరు.

సమగ్రప్రపంచము నేఁడు పశుపక్ష్యాదుల తప్తరక్త ధారలతో నిండిపోవుచున్నది. దీనపశువుల యార్తనాదములు భూమ్యాకాశముల వ్రయ్యఁ జేయుచున్నవి. నిష్కళంకము లగు జీవకోటుల దుఃఖారావముల నాలకించి పాషాణము లయిన ద్రవీభూతము లగుచున్నవి కాని మానవాకృతియం దున్న మాంసాశనులగు ఘోరరాక్షసుల హృదయములు కరుణారసార్ద్రములు గాకున్నవి మనుష్యు లీరీతి నీచులయి, నీతిహీనులయి నెగడుచుండుట వలననే వేమనార్యుఁడు మానవుల నీరీతి నిరసించి యున్నాఁడు.

కం॥ నోరెఱిఁగి తా మరేమియు
నేరని జంతువులఁ జంపి ♦ నెమ్మదిఁ దిను నా
క్రూరపు సంకరజాతుల
మారణ మేమందు నింక ♦ మహిలో వేమా.

దేహపోషణము నిమిత్తము దయామయుండగు పరాత్పరుఁడు పవిత్రములును, రుచ్యములును, సకలజన లభ్యములును, సర్వవ్యాపకములు నగు నోషధులను, పత్రఫలపుష్ప కందమూలాదులను, వివిధములగు ధాన్యములను ప్రసాదించి యుండ నగులు నీతిమాలినవారలయి, కరుణాశూన్యులయి ధర్మమును, జగదీశ్వరుని విస్మరించి, మూత్రాశయము నుండి వెలువడురజస్సుచే నేర్పడుమాంసఖండముల భక్షింప నలవడు టెంత క్రూరత్వము! హేయమగు కార్యము.

ఆహారమందును, విహారమందును, నిద్రాదికవ సామాన్యములగు ధర్మములందును జ్ఞానము లేనివని మనచే సంభావింపఁబడు పశువులుసైతము జిహ్వేంద్రియనిగ్రహమును గలిగి, ప్రకృతినియమముల నుల్లంఘింపక నైసర్గికజీవిత నిర్వహణ మందే తుష్టినందుచుండ, విజ్ఞానధనులమని విఱ్ఱవీగు మనుష్యులు దైత్యాధములయి జిహ్వేంద్రియచపలత్వమును నిరోధింపఁజాలక మధుమాంసాది దుష్పదార్థభక్షణమున కలవడి యుండుటెంతయు నీచము మనుష్యుఁడు ప్రకృతిని విస్మరించి మాంసాహారి యయినప్పటినుండియే వాని జీవితము సకల దుర్గుణముల కాకరమయి, పాశవిక జీవితముకంటె హీనాతి హీన మయిపోయినది.

"మాంసభక్ష్యై స్సురాపానై ర్మూర్ఖై శ్చాక్షరవర్జితైః,
పశుభిః పురుషాకారై ర్భారాక్రాంతా స్తి మేదినీ."

"మాంసభక్షకులును, మదిరాపానమత్తులును, నిరక్షరకుక్షులును నగు మూఢనరపశువులు భూదేవికి భారమయి యున్నారు."

ఉత్తముఁడయి, ప్రేమస్వరూపుఁడయి దేవుని విచిత్ర లీలల కాఁడర్శస్వరూపుఁడయి జీవింపవలసిన ప్రతిగృహస్థుని నికేతనమున నేఁడు భుజించుటకయి వధింపఁబడుచున్న పశుపక్ష్యాదుల గణనకు మేరలేదు నేఁటి నరరూపరాక్షసునకు నోరులేని పశుపక్ష్యాదులే ప్రియమగు నాహార మయ్యె. విలాసపురుషు లనేకులు మృగయావినోదమునకయి విపిన భూముల కరిగి లోకముతోఁడ నెట్టి సంబంధమును గలిగి యుండక, ప్రశాంతముగ జీవించు హరిణములను, తచ్ఛాబకములను వన్యసూకరములను గరుణమాలి వధించుచున్నారు. దయాశూన్యములును, రాక్షసములును, నీచములును నగు నిట్టి యాఖేటములు సత్యధర్మసంరక్షకులయి మనవలసిన వీరమూర్తులగు క్షత్రియుల ధర్మములట! అరెరెరే! విజ్ఞానము వికసించిన దనుకొనుచున్న యీ కాలమం దీరీతి మానవుని బుద్ధి మంటఁ గలిసెనేమి!

హైందవుల పర్వములలోనెల్ల సంక్రాంతి మహాపవిత్రమయినది. ఈ మాసము దినములలో హైందవస్త్రీ పురుషులెల్లరు నతిపవిత్రులై యుండి సత్పురుషుల చారిత్రముల సభక్తికముగ నాలించుచుందురు. గ్రామగ్రామము లందును హరికథలును, హరిభజనలును, ధనుర్మాసమహోత్సవములును జరుగుచుండును.

దేవాలయములందు భారత భాగవత రామాయణ భగవద్గీతాది పవిత్రగ్రంథములు పారాయణ మొనరింపఁబడుచుండును. తనజీవితమునం దేనాఁడు హరిని స్మరింపనివారును సంక్రాంతి మాసములలో భగవన్నామస్మరణచేఁ దమగృహముల బ్రతిధ్వనింపఁ జేయుచుందురు. సంక్రాంతి పర్వము

నాఁడు నిత్యము గంజినీళ్ళను ద్రావి జీవించు కార్మికులును క్షీరాన్నములతో హాయిగ భుజింతురు.

పరమలుబ్ధులును బుణ్యావాంఛచే నెపుడులేని యౌదార్యముతో దీనులను వికలాంగులను దృప్తిగాఁగుడువఁబెట్టుదురు. ఆచార్యులను, పండితులను ధన వస్త్రదానములచే సన్మానింతురు. స్త్రీలు తమ గృహముల నెల్లరీతుల సంస్కరించి వ్రతోపవాసములచేఁ బుణ్యము నార్జింపఁ జూచుచుందురు. ఈ మహాపర్వదినమం దనుష్ఠింప మనపూర్వులచే విధింపఁబడిన ధర్మము లతిపవిత్రములు.

కోవిదులగు మనపూర్వు లీమహాపర్వమును హైందవ జాతీయజీవిత సంస్కరణమునకయి యేర్పఱచియుండ నిట్టి సం॥ క్రాంతిమహాపర్వసందర్భమున నేఁడు హిందువులొనరించు ఘోరదురాకృతములు, అమానుషకృత్యములు వర్ణనాతీతములు.

పారమార్థిక విద్య భారత వసుంధరయందు నశించి నప్పటినుండియు భౌతికవిద్య విస్తరిల్లి మానవుల సౌఖ్యతృష్ణను బెంపొందింపఁజేసినది. చదువనేర్చినవారియం దధిక సంఖ్యాకులు తమ విజ్ఞానమయ దృష్టిని నయితము సంకుచితపఱచి జనసామాన్యమునకు నహింసాధర్మాచరణ విషయమున దుస్సలహాల నొసంగ నారంభించినారు.

మనుష్యున కేదేని విశేషకారణమున వ్యాధి తటస్థించినపుడు నేఁటి నవనాగరకతకు శానినీఁడగు భిషగ్వరుఁడు శరీర దౌర్బల్యము బాపుటకును, దేహపాటవమును వృద్ధినొందించుటకును మాంసాహారమే పరమౌషధ మని నుడువు నంతటి

మాౘఢ్యమునకు వశీభూతుఁ డయినాఁడు. నేఁటి యారోగ్య శాస్త్రవేత్తల జ్ఞానశూన్యమగు దృష్టికి గర్హ్యమును, నీచమును, అస్పృశ్యమును ధర్మహానికరమును నగు మాంసము కంటె వేఱొండు పౌష్టికాహారము స్ఫురింపకుండుట కడుంగడు శోచనీయము.

మాంసాహారముకంటె గోధుమలు, వేరుసెనగపప్పు కందిపప్పు, బాదముపప్పు, అక్రోటు, కొబ్బరి మొదలగు సాత్త్వికాహారపదార్థము లన్నియు దుర్బలశరీరమును, శల్యావశిష్టమగు కాయమును వజ్రసమానదృఢముగను, బలాఢ్యముగను జేయఁగలవని ఆయుర్వేదమును, ప్రత్యక్షానుభవమును జాటుచుండ నాలుకరుచులకు బానిసలయిన వెఱ్ఱివెంగళప్పలు మాంసముకంటె శరీరదార్ఢ్యమును బెంచు నాహారపదార్థము లేదని వచింపఁ బూనుటెంతయు మూఢసాహసము.

విలాసప్రియులును, ధనాఢ్యులును, అనాగరికులును దమ యుల్లాసము నిమిత్తము పొలములందు వృక్షములపై గూండ్లు కట్టుకొని నివసించుచు మనసయినపుడెల్ల యంబర పథమునను, ధరణీతలమునను విహారమొనరించుచు, పరాత్పరుని మూర్తీభవించిన కరుణారూపములగు పాదపము లొసంగు పరిపక్వఫలముల భక్షించి క్షుద్బాధను బాపుకొనుచు, పిపాస కలిగినపుడెల్లఁ బుణ్యాత్ముల దయాస్వరూపములగు పుష్కరిణులయొక్కయు, ఝరములయొక్కయుఁ బవిత్రాంబువులఁ బాన మొనరించుచుఁ దమ శ్రావ్యములగు కంఠములనెత్తి యవ్యక్త మధుర స్వరంబున ననంతకల్యాణగుణార్ణవుం డగు జగదీశ్వరుని నిరుపమాన దయావిశేషమును గీర్తించుచుండు

విహంగములఁ బట్టి పంజరములఁ బెట్టి వాని స్వేచ్ఛానంద సౌఖ్యముల భంగ మొనరించుచుందురు.

స్వేచ్ఛానందమును గోరు జీవులు దాస్యముచేఁగాని, నిర్బంధజీవితమునఁగాని లభించు పీయూషముకంటె, గంజిని, హంసతూలికా తల్పముకంటెఁ గఠిన శిలామయ భూతల శయ్యను విశేషముగఁ బ్రేమించుచుండుట సహజము. ఈ రహస్యము నెఱింగి మనుష్యులమగు మనము పక్ష్యాదుల యొక్క యమందానందకందమగు స్వేచ్ఛా జీవితమార్గమున కెట్టి యవరోధముల నకారణముగఁ గల్పింపరాదు.

అట్లొనరింతుమేని మనము భయంకరమగు హింస నొనరించినవారల మగుదుము. ఏ పక్షి యయిన వ్యాధిచే బాధింపఁబడుచుండి మన దృష్టిపథమునఁ బడిన మన మద్దానిని స్వగృహమునకుఁ దెచ్చి చికిత్సఁ గావించి, పోషించి స్వస్థత నందినపిదప దానిని యథాస్థానమునకుఁ జేర్చిన నెంతయో పుణ్య మొనరించినవారల మగుదుము.

తమ యావజ్జీవితమును మానవసేవకయి ధార వోయుచు మనుష్య లొసంగు సామాన్యాహారమాత్రంబున సంతుష్టునిజెందు వృషభములు, గోవులు, అశ్వములు, ఎనుములు, దున్నలు వృద్ధాప్యమునకుఁ జిక్కినపుడుగాని, భయంకర వ్యాధులచేఁ బీడితములయినపుడుగాని దయలేని కర్కశ హృదయు లనేకులు స్వార్థాంధులయి యిట్టి పసరములవలన నెట్టి ప్రయోజనము గలుగనేరదనియుఁ దా మొసంగు మేఁత విలువ నిరుపయోగ మగుననియుఁ దలంచి స్వల్పమగు విత్తము నపేక్షించి ఘోరరాక్షసులగు చర్మవ్యాపారులకు వధింప విక్రయించుచున్నారు.

ఇంతకంటె నిర్దాక్షిణ్యమగు మహాపాపము వేఱొండు లేదు. మనుష్యుఁడు దీర్ఘజాడ్యగ్రస్తుఁ డయినపుడుగాని, జరాభారమునకుఁ జిక్కినపుడుగాని తాను స్వస్థతయం దున్నపుడు వెచ్చించు దానికంటె నమితధనమును నిజసౌఖ్యమునకయి వినియోగించుచు ఆత్మీయులచే దివారాత్రము లూడిగము (పరిచర్య) చేయించుకొనుచు నిరుద్యోగియయియుండి తన కుటుంబమున కేమాత్రము నుపకృతిఁ గావింపకుండియు స్వప్రాణసంరక్షణార్థ మెంతయో వ్యాకులచిత్తముతో నుండుచున్నాఁడేగాని, జీవితకాలమునంతయుఁ దన హితమునకయి వినియోగించి విధివశంబున రోగపీడితమయినట్టియుఁ బ్రకృతి నియమంబున జరావ్యథితంబయినట్టియు, తన్నుఁ గన్నతండ్రిగ మది నమ్మినట్టియు, ఏపాపమెఱుంగనట్టియు నోరులేని మూగ పసరముల ధర్మముముందు మట్టిపెళ్లలకంటె హీనములగు కనక ముద్రికలకయి కటికివాండ్రకు విక్రయించు టేటిన్యాయము?

సహోదరులారా! మీరీ విషయమయి దీర్ఘముగా విచారించుడు. మనుష్యులమగు మనము యావజ్జీవితమును మనకు సమర్పించిన పశువులు వృద్ధాప్యముచేఁగాని, దీర్ఘవ్యాధిచేఁగాని ప్రయోజనమును గలిగింపలేనిస్థితియం దున్నను మనము వాని పూర్వోపకారమును దలంచికొనియో, మనుష్యధర్మము యొక్క ప్రథమాంగమగు దయను సంస్మరించియో యవి బ్రతికియున్నన్నాళ్లు పోషించుట కర్తవ్యము.

క॥ సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల ♦ భంజింపని రా
జాధము బాయును స్వర్గ
శ్రీధనములు వీటిఁబోవు ♦ సిద్ధము తల్లీ! —భాగవతము.

భారతీయులమగు మనము గోమాంసమును భక్షించు యవన చండాలాదుల రాక్షసాధములని నిరసించుచున్నారము. కాని కోళ్ళను, గువ్వలను, పావురములను, పందులను, గొఱ్ఱెలను, మేకలను వధించి భక్షించు మన హిందువులనుగూర్చి విచారింపకున్నారము. మాంసాహారప్రియుఁడగు హైందవుఁడు గోవధ పాపమని సంభావించుచున్నాఁడు. కాని కుక్కుట సూకర మేష మహిషాదుల సంహరించి భుజించుట పాపమని తలంపకున్నాఁడు.

దూరదృష్టిలేని హిందువు లనేకులు మహమ్మదీయ మతగ్రంథమగు ఖురాను గోవధ కియ్యకొనుచున్నదని భ్రమించుచు దానిని దూషించుచుందురు. పరమతసహన బుద్ధియు, విశ్వవిజ్ఞానానుభవమును లేని యమాయకులే యీ రీతిఁ బొరపడుచుందురు. ఖురాను సమస్తజీవులందు దయఁగలిగి యుండు విషయమున మనవేదమునకంటె నుత్సాహముతో ముందంజ వేసియున్నదని హైందవసోదరులు గ్రహింపకపోవుట కడు శోచనీయము.

"The creation is of God's family, for its sustenance is from him, therefore the most beloved unto is the person who doeth good to God's family. Fear god in respect of animals; ride them when they are fit to be ridden and get off when they are tired. He who is not loving to God's creatures and His own children, God will not be loving to him. God has created the quadrupeds to be beast of burden and He has created vegetables and cereals to serve as food for man. God does not want the flesh of your sacrifices nor the blood of animals, but He wants your sanctity only."

—From Koran Surate IXXX by Mirza Abdul Fazal.

"సృష్టి దేవునికుటుంబము. దేవుఁడే దీనిని బోషించుచున్నాఁడు. కావున దేవుని కుటుంబమునకు మేలు విశేషమొనరించినవాఁడే దేవుని ప్రీతికిఁ బాత్రుఁడగుచున్నాఁడు. దేవునిఁజూచి పశువుల నాదరించు విషయమున భయపడియుండుము. అవి మంచి స్థితియం దున్నపుడే వానిచేఁ బనిఁ జేయించుకొనుము. అవి యలసియున్నవని గ్రహించినంతనే వానికి విశ్రాంతి నొసంగుము. ఎవఁడు దేవుని కుటుంబమగు పశువులను, వాని బిడ్డలను బ్రేమించుచుండడో వానిని దేవుఁడును బ్రేమింప నొల్లఁడు. దేవుఁడు చతుష్పాత్తులను బరువుల మోయ సృజించియున్నాఁడు. శాకాదుల మానవాహారమున కుత్పత్తిఁ జేసినాఁడు. దేవుఁడు మీ బలిదానములయొక్క మాంసమునుగాని, పశ్వాదుల రక్తమునుగాని కోరఁడు. ఆతఁడు మీయొక్క చిత్తశుద్ధినే యభిలషించుచున్నాఁడు."

—ఖురాను సూరతునుండి మీర్జాఅబ్దుల్ ఫజల్ గారిచే ననువదింపఁబడెను.

మహమ్మదీయవేదముయొక్క యహింసాతత్త్వాలంకారములగు నీవాక్యరత్నముల నాలకించిన నే హైందవవిద్యాధికుఁడు ఖురాను నొక పవిత్రవేదముగ భావింపకుండనుండఁగలఁడు?

ఉర్దూభాషలోనున్న "ఆగ్బరు-ఆయినా" అను గ్రంథములో జగద్వంద్యుఁడును, జగద్విఖ్యాతరాజ్యాంగవేత్తయునగు నగ్బరుసార్వభౌముఁడు మాంసభక్షణము పరమధర్మమగు నహింసకుఁ బ్రబలశత్రు వను కెటింగి విసర్జించివైచినటుల వ్రాయఁబడియున్నది.

అందే యతని చెలికాడును, సచివుడును, ఆస్థాన పండితుఁడును నగు నబుల్ ఫజలు బాల్యమునుండియు నహింసారతుఁ డనియు నుల్లేఖింపఁబడి యున్నది. ఈ రెండు యుదంతములు మహమ్మదీయజాతి కాదర్శపురుషులయిన, అగ్బరు అబుల్ ఫజలు ప్రభృతులు లోకమున కహింసాతత్త్వమును జాటియున్నటులఁ దెల్ల మొనరించుచున్నవి.

క్రైస్తవమతమును జీవహింస నంగీకరించుట లేదు. పరమశాంతమును, విశ్వప్రేమసిద్ధాంతమును లోకమునకుఁ జాటి లోకకల్యాణము నిమిత్తము తన ప్రాణముల ధార వోసిన సర్వసంగపరిత్యాగియగు జీసస్సు జీవుల హింసించుట కెట్లంగీకరించును? క్షమనే మానవుని యుత్తమధర్మ మని జీసను బోధించియుండ నేఁడు క్రైస్తవులు సామ్రాజ్య తృష్ణాపీడితులయి మానవరక్తధారలచే భూమిని దడిపివేయుచున్నారు. తను వేదములు నిషేధించుచున్నను హిందూ మహమ్మదీయు లేరీతి విషయలోలురయి, దయాశూన్యులై జీవులసంహరించి మాంసాహార మొనరింప నలవడియున్నారో అదియేచందమున క్రైస్తవులును మాంసాహారప్రియులైనారలే కాని వారి వేదమగు బైబిలును ప్రాణిహింస నంగీకరించుటలేదు.

"I delight not in the blood of goats, sheep and birds."
—Holy Bible

"నేను మేకలయొక్కయు, గొఱ్ఱెలయొక్కయు, పక్షులయొక్కయు రక్తమును ప్రవహింపఁ జేయుటకు సంతోషింపను."

—బైబిలు.

ఈ విషయమునే సమర్థించుచు మహాత్ముండగు భీ చార్యులు ధర్మజున కెఱింగించిన నీతిపద్యము సంగ ణీయము.

"ఆ॥ అన్యమాంసమున నిజాంగ మాంసంబుఁ బో
షింతు ననుట కంటెఁ జేటు లేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలు లేదు కర్మ జాలకమున."

ధర్మములలోనికెల్ల భూతదయ యుత్కృష్టమగు ధర్మ మని వైదికవిజ్ఞానసంపన్నులకును, శ్రీ బుద్ధుని జన్మభూమి వాసులకును వేఱుగా నుడువఁ బనియుండదు. ఏ దుష్టసాంగ త్యమునయిన హిందువులు మాంసభక్షణమున కలవడి యున్నచోఁ బశ్చాత్తాపపూర్వకముగా నీశ్వరుని యెదుటఁ బ్రమాణ మొనరించి యహింసావ్రత దీక్షాబద్ధులగుట శ్రేయ స్కరము. భూతదయను గుఱించి నుడువని మతగ్రంథము లేవియు లేవు.

"తే॥గీ॥ అన్ని తపములకును బెద్ద యన్ని దాన
ములకు నెక్కువ, యన్ని నోములకు హెచ్చు
అన్ని తీర్థములకునుఁ గన్నాకు వినుము
భూతదయకంటె ధర్మంబు భూమి లేదు."

—దేవీభాగవతము.

ఈ దిగువ నుదహరింపఁబడు ప్రమాణవాక్యములచే శాస్త్రములందే కేవలము విశ్వాసముగలవారి కహింస యందు భక్తి యేర్పడఁగల దని నమ్ముచున్నాఁడను.

...ం పరిపశ్య న్తిపక్వం య ఈమాహుః సురభి ర్నిర్హ రేతి యేచార్వతో ...భిక్షా ముపాసత ఉతో తేషా మభిగూర్తి ర్న ఇన్వతు.

—ఋగ్వేదము.

"అన్నమును జలమును శుద్ధపఱచి పక్వ మొనరించి ...జించునట్టియు, మాంసాహారమును విసర్జించినట్టియు మనుష్యులే శ్రేష్ఠులు."

ఇమ మూర్ణాయుం వరుణస్య నాభిం త్వచం పశూనాం ద్విపదాం చతుష్పదాం, త్వః ప్రజానాం ప్రథమం జనిత్ర మగ్నే మాహింసీః.

—యజుర్వేదము.

"ద్విపాదములు గల మనుష్యులను, పక్ష్యాదులను, చతుష్పాదములు గల గోవు, మేక, గొఱ్ఱె మున్నగు పశువులను హింసింపరాదు."

'పశూన్ పాహి' 'పశువుల రక్షింపుఁడు' ఇదియు వేదవాక్యమే !

య ఆమం మాంస మదన్తి పౌరుషేయంచ యేక్రవిః
గర్భాన్ ఖాదన్తి కేశవస్తానితో నాశయా మసి.

—అథర్వణవేదము.

"మాంసమును, అండములను భక్షించువానిని ధరణీపతి సంహరింపఁదగును." ఇవియేకాక వేదములం దెన్నియో ప్రమాణవాక్యము లైక్యకంఠమున జీవహింసను నిషేధించుచున్నవి. చతుర్వేదములందును భూతదయయొక్క ప్రాముఖ్యమునుగూర్చి గంభీరముగా నుగ్గడింపఁబడి యున్నది. వేదముల దైవవిరచితగ్రంథములని విశ్వసించు హిందువులు కేవల శాస్త్రప్రమాణములనే సత్యాన్వేషణమున నంగీకరించువా రగుటచే నీ వేదప్రమాణములతో నిత్య మహింసావ్రతదీక్షితులయి వరలుచుందురుగాక !

మన ప్రాచీన మతగ్రంథములందు వేదములే గాక వేదేతరము లగు పవిత్రగ్రంథము లన్నియు నహింసాధర్మము సమర్థించియుండిన విధము కడు ప్రశంసా పాత్రమయి వెలయుచున్నది.

ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః,
సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః.

—ఛాందోగ్యోపనిషత్తు.

"ఆహారశుద్ధిచే భావశుద్ధియు, భావశుద్ధిచే స్థిర బుద్ధియుఁ గలుగును."

ఈ యుపనిష ద్వాక్యము మాంసాహారమును నిషేధించుచున్నయది.

తత్రాహింసా సత్యా స్తేయ,
బ్రహ్మచర్య పరిగ్రహా యమాః.

—పాతంజలియోగసూత్రములు.

"(అష్టాంగయోగములలోఁ బ్రథమ మగు) యమమును సిద్ధిప్రద మొనర్చుటకు అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ముఖ్యాంగములు." పాతంజలి వచించిన యీ సూత్రముచే యమముయొక్క యంగములలోని కెల్ల నహింసయే తొల్లింటి ముఖ్యధర్మమైనటుల స్పష్టపడుచున్నయది.

దుష్టం హింసాయామ్,
తస్య సమభివ్యాహారతో దోషః.

—వైశేషిక సూత్రములు.

"మద్యమాంససేవానిరతుఁ డగు వ్యక్తి దుష్టుఁడు. అట్టి దుష్టుని సాంగత్యము దోషప్రదము." అని కణాద

మహర్షి తన వైశేషిక సూత్రములయందుఁ బ్రతిపాదించి యున్నాఁడు.

గీ॥ వినుము చంపుటయును జంపఁ♦బనుచుటయును
కల్మషంబుల కెల్ల న♦గ్గలము లధిప!

—మహాభారతము.

మహమ్మదీయమత వేదమగు ఖురానుషరీఫు హింసా విధానము నంగీకరింపదను మాట ధ్రువపఱచియేయుంటిని. సంస్కారణప్రియుఁడును, ధీరుఁడును, ప్రజాహితాభిలాషియు నగు నాఘను అమీరు అనునుల్లా చక్రవర్తి యహింసాభివృద్ధి కెంతయుఁ దోడ్పడి లోకసంస్తవ భాజనుఁ డయి యున్నాఁడు.

మహమ్మదీయ మతమునకు వన్నెఁ దెచ్చియుండిన మహాత్ముండగు కబీరుదాసు హింసను నిషేధించి భూతదయను లోకమునకుఁ జాటియుండిన విధము జగద్విదితము.

అబ్దుల్లా మనూద్దను మహమ్మదీయ సాధుప్రవరుఁడు "తనసౌఖ్యమునిమిత్తము బుద్ధిపూర్వకముగ నే జీవిని హింసించినను మనుష్యుఁడు పాపియయి దేవునిచే దండింపఁబడఁ గలఁడు" అని వక్కాణించెను.

మహమ్మదీయుఁడును, పండితుఁడును నగు - అలీ తనచే రచింపఁబడిన ఇజారిహెక్కను గ్రంథమున నుడివిన వాక్యములు పఠనార్హములు:—

"మహమ్మదీయభ్రాతలారా! మీ దేవుఁడు పూజలం దర్పితమగు మాంసమునుగాని, పశువుల రుధిరమునుగాని

స్వీకరింపఁడు. ఆతఁడు సదా మీ చిత్తశౌచమునే యభిల షించుచుండును. కావున మీర కరుణారసార్ద్రహృదయుల రయి, పవిత్రస్వాంతులరయి, పాపభావవిహీనచిత్తులరయి, మిమ్ము సంరక్షకులుగను, తండ్రులుగను, నాథులుగను మది నెంతయు నమ్మి మిమ్మాశ్రయించియుండి సదా మీ హిత మునకయి తమ దేహప్రాణముల సమర్పణ మొనరించుచున్న దీన మూక పశు సంతతిని హింసింపకుఁడు. సంహరింపకుఁడు. దయామయుఁడగు దేవుని బడయుటకు మీ రీ రీతి భూత దయార్ద్రహృదయులగుటకే మీ మతము మిమ్ము హెచ్చ రించుచున్నది.''

ప్రపంచమందలి యీ యా మతమను నంతరము లేక సమస్తమతములు లోకశాంతిస్థాపనమున కయి భూతదయ ననన్య సామాన్యోత్కృష్టధర్మముగ సిద్ధాంతీకరించియుండ సకల మతావలంబులు భ్రష్టులయి, పతితులయి తమ మత గ్రంథముల నెన్నింటినో ప్రక్షిప్తములఁ జొప్పించి జీవహిం సను ధర్మముగఁ జేసి హింసామయజీవను లయినారు. ఇది సిగ్గు.

శ్రీ బుద్ధప్రభు వీ దేశమునం దవతరించి యుండిన నాఁటికి బ్రాహ్మణబ్రాహ్మణేతరు లను భేదములేకయే భార తీయు లెల్లరు యజ్ఞప్రియులయి పశువుల రక్తమాంసపిండ ములతో భూలోకమునంతయు నింపివేయుచుండిరి. వైదిక మతము నిశ్చయించి యుండిన పవిత్రమగు యజ్ఞవిధానము ఘోరహింసా ప్రధానమగుటచే బుద్ధుఁ డద్దానిని నిర్మూలింప యత్నించి యుండెను. యజ్ఞ మనఁగాఁ ద్యాగ మను నర్థ

మును నేఁటికిని హైందవపండితులు గ్రహింపకుండుట శోచనీయము.

నేఁడు మహాత్ముఁ డొనరించుచున్న మహాయజ్ఞము త్యాగప్రధానమయినది. గాంధిమహాత్ముఁడు నిష్కామబుద్ధితో ధర్మసంస్థాపనార్థము సేయఁబడు నాత్మబలిదానమునే యజ్ఞ మని వచించియున్నాఁడు. శ్రీ బుద్ధప్రభువు ఆత్మ సంస్కరణాభ్యుదయములకు సలుపఁబడు త్యాగమును, తృష్ణావినాశనమునే యజ్ఞమని నుడివియున్నాఁడు.

"రాష్ట్రం వా అశ్వమేధః అన్నగ్ం హి గౌః.
అగ్నిర్వా అశ్వః ఆజ్యం మేధః."

—శతపథబ్రాహ్మణము.

"భూపతి రాష్ట్రమును ధర్మయుతముగాఁ బాలించుట, అగ్నియం దాజ్యాహుతి (ఘృతము, ధాన్యము మున్నగునవి) సేయుట అశ్వమేధము. అన్నము, పృథ్వి, ఇంద్రియములు మున్నగువానిని బవిత్రీకరించుట గోమేధము."

అతిప్రాచీనములగు మన యార్షగ్రంథములు యజ్ఞవిధానము నీ రీతి గాంధిమహాత్ముని యాత్మసమర్పణమహాయజ్ఞమునకుఁ దుల్యముగ సిద్ధాంత మొనరించియుండ మూఢులు యజ్ఞమును బశుమారణముగఁ జేయుట విచారకరము.

శ్రీ బుద్ధప్రభువును, జీససుప్రభువును, గాంధి దేవుఁడును నుడివియున్న యజ్ఞపద్ధతినే వేదమందలి జ్ఞానయజ్ఞవిధానము సమర్థించుచునే యున్నది. ఇది కడు ప్రశంసార్హము.

అహింసకుఁ బెట్టనిపేరును, పుట్టినిల్లును నగు బౌద్ధమతమునుగూర్చి వేఱుగ నుడువఁ బనిలేదు. బుద్ధుఁడు భువి నవతరించినదే హింసానివారణార్థము. బౌద్ధుల పవిత్ర వేదమగు ధమ్మపదము స్థూలసూక్ష్మమగు హింస నంతయు సంపూర్ణముగ నిషేధించి యున్నది. ప్రపంచమందు నేఁడున్నవి సుప్రసిద్ధములగు మతములు నాలుగే.

అం దతివిశాలమయినది బౌద్ధము, రెండవది క్రైస్తవము, మూఁడవది మహమ్మదీయము, నాల్గవది హైందవము, లోకవిఖ్యాతములగు నీ నాలుగు మతములును జీవహింసను నిషేధించుచు నహింసా సిద్ధాంతమును సమర్థించి యున్నవి. పారసీకుల జందవేస్తావంటి వేదమును హింస నంగీకరించుట లేదు. ఆర్యసమాజ బ్రహ్మసమాజములు అహింసను ముఖ్యధర్మముగ నవలంబించియే యున్నవి.

మానవజీవితోపాధికి ముఖ్యవృత్తియగు సేద్యమును సంరక్షించు పశువులు నేఁడు కోటానుకోట్లుగ మనుష్యులచే వధింపఁబడుచుండుటవలననే మనుష్యజాతియం దనేకులు దుర్భర దారిద్ర్యమహా పిశాచపీడితులయి 'అన్నమో రామచంద్రా' యని యాఁకటిచిచ్చునకుఁ దాళఁజాలక బొబ్బలిడుచున్నారు. క్షీరమును, ఘృతమును, దధిని, తక్రమును, ఎఱువును దన జీవితకాలమంతయు నొసంగుచున్న గోవు, ఎనుముమున్నగు జంతువులను, క్షీర దధి ఘృతములను, కంబళ్ళను బ్రసాదించుచున్న గొఱ్ఱెలను, మేకలను, దేవుఁ డొసంగిన ఘటికాయంత్రమో యన కాలముఁ దెలుపుచుండు కుక్కుటములను, ప్రపంచశుద్ధికొఱకు లోకమందలిమలమును భక్షించుచు

జీవించుచున్న సూకరములకు జలమందు నివసించుచు, మాలిన్యమునుభక్షించి జలశుద్ధి యంత్రము లనఁనొప్పు మత్స్యములను, హాయిగా నాకాశమండలమున నెగురుచుఁ దమ యాటపాటలచే మన హృదయముల కాహ్లాదమునొదవించు గువ్వ, పావురము మున్నగు నభశ్చరములను దయమాలి, స్వప్రయోజనము నెఱుంగక, దేవుని మఱచి సంహరించుటకంటె ఘోర దుష్కర్మ మఱేమి కలదు ? మనుష్యు లేనాఁ డిట్టి దయాశూన్యములగు ఘోరకృత్యముల మానుదురోనాఁడేధన్యులు.

దయలేనివాఁడే రాక్షసుఁడు. దయలేనివానిని సదా రాక్షసాధమునిగ వర్ణించుమనుష్యులునోరెఱుంగని పశువుల యెడ నిర్దయులగు టేటి న్యాయము ? దయగల తల్లి తన గడుసుపిల్లవానియందుకంటె నమాయకుఁడగు మూగబిడ్డ యందు విశేషమగు దయను గలిగియుండును. మన మూగబిడ్డకంటెఁ బశువు మూకస్థితియందుండును. దానికి నోరులేదు. జ్ఞానములేదు. పాప మెఱుంగదు. యథాశక్తి లోకసేవ యొనరించుచుండును. అయ్యో! అట్టి మూగబిడ్డల కంఠములఁ దెగనఱుకు మానవులారా! మీచిత్తము లెంతవజ్రసమానములు?

"శాంతితుల్యం తపో నాస్తి న సంతోషా త్పరం సుఖం
నాతృష్ణాయాః పరో వ్యాధి ర్నచ ధర్మో దయాత్పరః."

"శాంతికిఁ దుల్యమగుతపస్సును,సంతోషమునకు సరివచ్చు సౌఖ్యమును, తృష్ణ కీడగు వ్యాధియును, దయతో సమానమగు ధర్మమును లేదు."

కావుననే శ్రీకృష్ణుఁడును భగవద్గీతయందు "అహింసా పరమో ధర్మః, అహింసా పరమో యజ్ఞః" అని వచించి

యున్నాఁడు. ఈశ్వరనందనులగు నోమానవసహోదరులారా! మీ రెల్లవిధములఁ బశువధల నిరోధించివేయ యత్నింపుఁడు. జీవకారుణ్య మెపుడు మీ హృదయములందు సిరముగ నాటుకొనునో, అపుడే మీ దానవత్వము నశింపఁ దిరిగి మానవత్వము ప్రాప్తించును. మీ పాదముల సూక్ష్మమగు కంటకము గ్రుచ్చుకొనినంతనే జీవసామాన్యమగు బాధచేఁగుయ్యోమొఱ్ఱోయని దేవునిఁ బ్రార్థించుమీరు వాడికత్తులచే మూకపశువుల ఖండించునపుడవి యశ్రుధారల వర్షింపఁజేయుచు రక్షించువారు లేరాయనితమదైన్యదృష్టుల వ్యాకులహృదయములతోఁ జతుర్దిశలఁ బ్రసరింపఁజేయుచు హాహారుహాహారున నడలుచు దేవాదేవాయని యెట్టిపరితాపము నందుచుండునో క్షణమాత్రకాల మూహించుకొనుఁడు.

బాధ సమస్తజీవులకు దుర్భరమయియున్నదని గ్రహించియే విజ్ఞానధనులగు నార్యులు 'ఆత్మవత్సర్వభూతాని'యని వచించియున్న పూతవాక్యమును విస్మరింపకుఁడు.



# ఏబదియాఱవ ప్రకరణము



## అనివార్యమగు హింస, హింస కాదు

దుస్సాంగత్యమునను, దుర్విషయ చింతనమునను, దుర్వ్యసనప్రభావంబునను నిరంతర మాంసాహారభక్షణమున కలవడిన సాక్షరులును, నిరక్షరులును నహింసాధర్మాను ష్ఠానము సృష్టియం దెవ్వారికిని సాధ్యముకాని కార్యమనియు, నెన్ని విధముల శ్రమఁ జేసినను, ధర్మజ్ఞానకరుణాదికములఁ గలిగి సాధుమార్గంబున వర్తింపవలెనన్నను హింస యేదియో యొకరూపంబునఁ దటస్థమగుచునే యుండును. గావున నహింసావ్రతము నవలంబింప యత్నించుట వెఱ్ఱితనమనియు, వ్యర్థశ్రమమనియు గంభీరోపన్యాసముల నొసంగువారు నేఁడు ప్రపంచమునం దనేకులు కానఁగుచున్నారు.

అట్టి మహనీయులవాద మున్నతసౌధము నారోహింప సోపానపరంపరల ననుసరించుచుండఁ బ్రమాదవశంబున నొక సారి యొక మెట్టునుండి కాలుజారి క్రిందకు దిగఁబడిన కారణ మునఁ బునరారోహణ మసంభవ మని వచించువారి బుద్ధి హీనతను గలిగియున్నది. పంచభూతములచే నిర్మితమయిన దేహ మున్నంతవఱ కేదిరెూ యొక విధమున హింస కలుగు చుండు ననుమాట వాస్తవమే.

మానవదేహనిర్మాణమే హింసనుండి కలిగియున్నది. జీవకణములతోఁ గూడియున్నట్టియు, దేహమునకు జీవశక్తిని పోషకసామర్థ్యమును బ్రసాదించు శుక్లశోణితములు స్త్రీ పురుషసంగమమున నష్టపడనిదే పిండోత్పత్తి కానేరదు. ఆ పిండము మాతృదేవియొక్క దేహమునం గొంత భాగమును హరింపనిదే శిశురూపమును దాల్చదు. తచ్ఛిశువు జన్మానంతరమయిన మాతృపీడనవృత్తినుండి నివృత్తిఁజెందెనా యన్న లేదు. తల్లియొక్క రక్తమును స్తన్యరూపమునఁ బానమొనరించి నిజదేహపోషణ మొనరించుకొనుచున్నయది.

ఈ రీతిగా మానవదేహధారణయే యొక విధమగు హింస కెడ మొసంగుచున్నది. తల్లి యిన్ని విధముల శిశువుచే హింసింపఁబడుచుండియుఁ గినియక శిశుకృత్యమును హింసయని భావింపక, హర్షించుచు సంతానవాత్సల్యమును బ్రకటించుచున్నయది. కారణ మేమన ననివార్యమగు నిట్టి హింసను మాతృదేవి యహింసాధర్మముగనే భావించుచున్నది. కాని హింసగఁ దలపోయుచుంచుట లేదు. ధర్మవ్యాధుఁడు భారతమునఁ గౌశికునితో వచించినవిధమున జగత్సర్వము జీవమయంబుగ నున్నది. కాన జగమందున్న యెట్టి సాధు సత్త్వమునకయిన నహింసాధర్మమును సమగ్రముగ నాచరించుట కేవల మసంభవ మయియున్నది.

చ॥ సలిలములుర్వియాకసముసర్వముజంతుమయంబుగావునన్
గలుగు నవశ్యము న్సకల కర్మములందును హింస దీనికిన్
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమైనటులుండునింతయుం
దఁలపరు హింసచేయమని తారుచరింతురుకొంద ఱిమ్మహిన్.

నిశ్చయముగ మన మాఘ్రాణించు వాయువునందును పాన మొనరించు సలిలమందును మన దృష్టికిఁ గానరానంతటి సూక్ష్మాకృతియందున్న లక్షోపలక్షలగు జీవరాసులు కలవు. మానవుని యే యవయవము చలించినను జీవహింస వాటిల్లు చునే యుండును. ఇట్టి యనివార్యములగు క్రియల నన్నింటి హింసగఁబరిగణింప నారంభించినచో విశ్వమునజీవయాత్రయే దుర్ఘట మయిపోవు ననుట సత్యము.

మానవాసాధ్యమగు నీసమస్యనుగూర్చి సర్వజ్ఞుండగు నీశ్వరుఁడు విచారింపనగుఁగాని మనము విచారింపఁజాలము. అవ్యక్తముగా, అప్రయత్నముగా నీరీతి హింస మనచేఁ గావింపఁ బడుచున్నదని భావించి మన మనావశ్యకముగా, బుద్ధిపూర్వకముగా మేకలను, గొఱ్ఱెలను, కోళ్ళను వధించి భక్షించుట న్యాయము కాఁజాలదు. సృష్టియందు కంద మూలములు, ఫలములు, శాకములు, ధాన్యములు లేని పక్షమున మనుష్యుఁడు గత్యంతరములేక సాధుజంతువుల వధించి భక్షించి జీవించుచున్నానని వచించిన సహేతుకముగ నుండ వచ్చును. కాని, అమూల్యములును, రుచ్యములును నగు సకల పదార్థములఁ గలిగియుండి మాంసభక్షణమునకుఁ గడంగుటకంటె రాక్షసమును, నికృష్టమును నగు కృత్యము మఱొకటి లేదు.

మ॥హలికుండెంతయునోజదున్ను నెడసీ♦రాగ్రంబునంబొందిప్రా
ణులనేకంబులుసచ్చుహింసయదియౌ♦నో కాదో వేయేల మ
ర్త్యులునేలంజరియించుచోఁబదములం♦ద్రొక్కంబడుంబెక్కుజం
తులుహింసావిధి గాదనంగవశమే ♦ దోషజ్ఞయూహింపుమా.

—భారతము.

వాస్తవమాలోచింపఁ బ్రకృతిసామాన్యమగు జీవితోపాధి నిమిత్తము పొసఁగుచుండు హింస యహింసగనే పరిగణింపఁ బడవలసియున్నది. మనుష్యుఁడు స్వయముగ సదా స్వీయసౌఖ్యము నభిలషించుచుండువాఁ డయియుండియు నొక్కొకప్పుడు తన దేహమునుబుద్ధిపూర్వకముగా హింసకుఁ బాల్పడఁ జేసికొనుచున్నాఁడు. మనుష్యుఁడు స్వవిషయమునందే యనివార్యమగు పీడకు గుఱియగుచుండ నితరజీవరాసుల విషయమున నబుద్ధిపూర్వకముగా వాటిల్లు హింసను గూర్చి విచారింపఁ బనియే యుండదు. అకారణముగను, అన్యాయముగను, బుద్ధిపూర్వకముగను, స్వార్థపరత్వముచేతను, కామాంధతవలనను సలుపఁబడు హింసయే పరిత్యాజ్యమగు హింసయనియు, తదితర మహింసయే యనియు గ్రహింపవలసి యున్నది. ఈ భావమునే సమర్థించుచున్న భారతమందు గల పద్యమును విలోకింపుఁడు.

"గీ॥ హింససేయనివాఁడు లేఁ ♦ డిజ్జగమున
నొక్కఁడైనను దమ తమ ♦ యోపినట్లు
హింస తెరువున కెడగల్గి ♦ యేగవలయు
నదియ చూవె యహింస నా ♦ నతిశయిల్లు."

విద్యార్థులారా! అహింసనుగూర్చి నే నింతవఱకు బోధించియున్న విషయములందలి సత్యమును గ్రహించి హృదయపూర్వకముగ స్వీకరింపుఁడు. మీ జీవితములయందు నహింసావ్రతానుష్ఠానమున కెంత ప్రాముఖ్యము నొసంగఁగలరో, అంతగా ధన్యులు కాఁగలరు. మానవుని జీవితము శాశ్వతమయినది కాదు. సంపదలు స్థిరములేనివి. వాంఛలు,

సౌఖ్యములు క్షణికములు. బంధుబాంధవులు బుద్బుదప్రాయులు. మన మీ తనువులఁ బాయునపుడిం దొక్కటియు వెంట వచ్చునది లేదు.

మన మొనరించిన మన పాపపుణ్యములే పరలోకయాత్రాసందర్భమున మనల వెంటాడు నేస్తములు. కావున నాయనలారా! కేవలము మీరొక్క పరమార్థమును జూచుకొనుటే కాక, ఐహిక జీవితశాంతి నపేక్షించియు, ఆర్థికశ్రేయస్సు మది నెంచియు, భగవంతునిశాసనముల బుద్ధిచే గుర్తించియు, ఏపాప మెఱుంగని మూకజీవములందు దయఁ దలఁచియు, క్షణికమగు జిహ్వాభిరుచి నింద్యమని గ్రహించియు సత్వరమే మాంసభక్షణమును వర్జించివైచి, అహింసావ్రతదీక్షు లగుఁడు. శుభమస్తు!



# ఏబదిఏడవ ప్రకరణము



## ధర్మము

"చలా లక్ష్మీ శ్చలా ప్రాణా శ్చలా జీవితమానవాః,
చలాచలతి సంసారో ధర్మ ఏకో హి నిశ్చలా."

"ధనము, ప్రాణము, జీవితము, సంసారము సర్వము నశించిపోవునవియే. కాని, ధర్మ మొక్కటిమాత్రము క్షయముగాక సుస్థిరమయి యుండును.

అనంతమగు దేవుని సృష్టియొక్క తత్వము కడు నిగూఢమయినది. మనుష్యుఁ డెంతయో శ్రమమొనరించి, బుద్ధి బలము నుపయోగించినఁగాని విశ్వముయొక్క సత్యమును, విశ్వమందలి హితాహితకరములగు పదార్థముల వివరణమును గుర్తెఱుంగఁజాలకున్నాఁడు. అంతరాత్మయొక్క ప్రభావమే సమస్త జీవరాసులలో మేధావంతుఁ డగుటకు మనుష్యునకుఁ దోడ్పడియున్నది.

ఈ విశ్వమందలి ప్రతిపదార్థమును ద్వైతతత్వ సముపేతమయి యుండుటచే సౌఖ్యానందశాంతుల సదా యన్వేషించుచుండు మానవులు త్వరపడి వివేచింపకయే యే వస్తువును సంపాదించుటయు, ఏకార్యము నాచరించుటయు సమంజసము గాకున్నది. కోలాహలప్రపూర్ణమును, సందేహాభయసమన్వితమును, సారాసారసముపేతంబును, త్యాజ్యగ్రాహ్య

పదార్థ యుక్తంబును నగు ప్రపంచరంగంబున విచక్షణా శక్తిని ముఖ్యావలంబనముగఁ గొని మనుష్యుఁ డనేక కార్యముల స్వీయ హితమునకయి యాచరించుచున్నాఁడు. మానవుని మస్తిష్కమున వాసనాసంస్కారముల ననుసరించియే విశ్వమండలి యొక వస్తువు మనకు సుఖదుఃఖములఁ గల్పించుచుండు ననుమాట వాస్తవము. మనుష్యుఁడు తన జీవిత సంగ్రామంబునఁ గర్తవ్య పథమునఁ దటస్థించు కొన్ని పదార్థముల స్వీకరించుటకును మఱి కొన్నింటిఁ బరిత్యజించుటకును బాధ్యుఁ డగుచున్నాఁడు.

ఏ మానవుఁడును నిరుద్యోగిగఁ బ్రపంచమందు జీవింపఁ జాలఁడు. కర్మాచరణము జీవి కనివార్య మగు ధర్మము. సమస్త ప్రపంచము కర్మావలంబితము. ఆచరణ యోగ్యమగు వృత్తిని సాధింప నుపక్రమించుట కే ప్రవృత్తి మానవుని సదా పురికొల్పుచుండునో, అట్టిదే జ్ఞానము లేక అంతరాత్మయొక్క వికాసము. మానవుని కాచరణ యోగ్యము కానట్టియు, హిత ప్రతిపాదకము కానట్టియు నాచరణమున కే ప్రవృత్తి మానవుని వానిహృదయాంతరాళము నుండి ప్రోత్సహింపఁజేయుచుండునో, అదియే యజ్ఞానము, లేక ఆత్మయొక్క పరమదౌర్బల్యము. ఈ రెండు ప్రవృత్తుల సంతత ప్రవాహంబున మానవజీవిత నౌక తేలియాడుచుఁ బ్రయాణ మొనరించుచుండును.

ఇందొక్క ప్రవృత్తియొక్క ప్రేరేపణంబున మానవునిచే నాచరింపఁబడునది సత్కర్మ. మఱొక్క ప్రవృత్తి యొక్క ప్రోద్బలంబున మానవుఁడొనరించునదియే దుష్కర్మ. సత్కర్మయొక్క పరిణామమున సౌఖ్యానందములు కలవు.

దుష్కర్మయొక్క ఫలితమున శోకభయములు కలవు. మానవుని యావజ్జీవితాభీష్టములు సిద్ధించుటకు సత్కర్మ సహకారి యగుచుండ, దుష్కర్మ యనేకములగు ప్రతిబంధకములఁ గల్పించుచుండును.

ఈ రహస్యము నెఱింగిన ప్రతి మనుష్యుఁడు సత్కర్మ సత్వరసంపాదనార్హ మయిన దనియు, దుష్కర్మ శీఘ్రపరిత్యాగ భాజన మయినదనియు సులభముగా నిశ్చయింపఁ గలఁడు. ఇట్టి నిశ్చయానంతర మెట్టి సామాన్యమానవుఁ డయినను వ్యష్టి సమష్టిజీవితమునకు శ్రేయస్కరమగు కర్మాచరణమును, భావధారణమును ధర్మమనియు, తనకును, లోకమునకును హితము నొడఁగూర్పఁజాలనట్టి భావపరిగ్రహణమును, కర్మానుష్ఠానమును నధర్మమనియు స్పష్టముగా గ్రహింపఁ గలుగుచున్నాఁడు.

"యతోఽభ్యుదయ నిశ్శ్రేయస్సిద్ధిః స ధర్మః"

"ఏ శుభగుణముల ధారణముచే మానవుని యైహిక పారమార్థికోన్నతి కలుగునో, అదియే ధర్మము."

ధర్మ మిట్టి పరమపావనమగు వస్తు వగుటవలననే దాని నీశ్వరస్వరూపముగ గురుజనులు నిశ్చయించియున్నారు.

"ఆ॥ సకలపుణ్యకర్మ♦చయమును నొకదెస
వినుము పాడిదప్ప♦కునికి యొక్క
దిక్కు దీని శ్రుతులు ♦ తెలిపెడు నెడఁబాడి
కలిమి యెందుఁ బెద్ద♦గా నుతించె.

—మహాభారతము.

"ఆ॥ ధర్మమునకుఁ గీఁడు♦దలఁచినవాఁడు దా
దుష్టమార్గుఁ డౌను♦దోఁవ చెడును."

అని వేమనార్యుఁడు నుడివియున్నాఁడు. మానవుని యొక్క కల్యాణమును, సమస్త విశ్వముయొక్క మంగళమును సేకరింపఁగలట్టి కర్మలన్నియుఁ గర్తవ్య మను పేరను, ధర్మ మను నామంబునను వ్యవహృతము లగుచున్నవి. వీనికి విరుద్ధములయి, విశ్వకల్యాణదాయకములు కానట్టి కర్మలెల్ల నధర్మములనఁబడుచున్నవి. కావున సమస్త ప్రపంచమునకు సారభూతమును, సజీవమును, సన్మానయోగ్యమును నగునదే ధర్మము. ధర్మముకంటెను నమూల్యమగు పదార్థము వేఱొండు భువిని మృగ్యము. విజ్ఞానధను లగు ఋష్యాదులు ధర్మప్రాశస్త్యము నెఱింగియే మానవానుష్ఠేయములలోని కెల్ల ధర్మమునకు నగ్రేసరత్వమును బ్రసాదించియున్నారు.

పురుషార్థచతుష్టయములో ధర్మమే తొల్లింటిది. అర్థము ద్వితీయము. తృతీయము కామము. చతుర్థము మోక్షము. సమస్త ప్రపంచ వ్యాపార వ్యవహార నిర్వహణమునకీ నాలుగు పదార్థములే మిక్కిలి యావశ్యకము లయినవి. ఇట్టి యమూల్యములగు దైవికసంపదలలోనికెల్ల ధర్మ మనాదిసిద్ధముగను, ఆద్యప్రకృతిగను, ఐహికాముష్మికసౌఖ్య సంధాయకంబుగను, సర్వజీవకల్యాణపరతంత్రముగను, అజరామరంబుగను, శాశ్వతంబుగను గణింపఁబడినది.

తస్మా దర్థాచ్చ కామాచ్చ ధర్మ ఏవోత్తరో ఽభవత్
అస్మిన్ లోకే పరేచైవ ధర్మాత్మా సుఖ మేధతే.

—మహాభారతము.

“ఓరాజా! కామార్థములకంటె ధర్మము శ్రేష్ఠమయినది. ఆ ధర్మమును పాలించువారే యిహపరముల సుఖింపఁగలరు.”

హిందూమతముయొక్క సమస్త పవిత్రగ్రంథములును ధర్మమును నొక దేవతగ సంభావించి సంస్తవ మొనరించుచుండ, సమస్తప్రపంచవిఖ్యాతమగు బౌద్ధమతము సచ్చిదానందకందమగు బ్రహ్మమే ధర్మమని సిద్ధాంతీకరించియున్నది. లోకమునం దెపుడు ధర్మ మంతరించునో, అపుడు భయంకరమగు ప్రళయ ముద్భూతమగునని మతములన్నియు గంభీరముగ వచించి యున్నవి. నేడు విశ్వమున గోచరించుచున్న సమస్త నిబంధనలకును, ఆచారములకును, ఆలోచనములకును, అభిప్రాయములకును మూలకారణము ధర్మము.

ధర్మము మానవుని జన్మానంతరమే వాని కాచరణయోగ్యమయిన నవీనప్రవృత్తి కాదు. అయ్యది సృష్టికిం బూర్వమే సుస్థిరమయి, అవినాశియయి, స్వయంసిద్ధమయి బ్రహ్మమను పేర వెలయుచుండెను. విజ్ఞానసంపన్నుఁడగు మనుష్యుఁడు తన దినచర్యయందు, జీవితసమస్యాపరిష్కారమందుఁ బొరపడినను బొరపడవచ్చును. కాని స్వయంసిద్ధమగు ధర్మము నెట్టి దోషములును, లోపములును స్పృశింపనేరవు.

ధర్మముయొక్క యనంత ప్రభావముననే సూర్యచంద్రాదులు సక్రమముగ లోకమునకుఁ జంద్రికాతపప్రకాశముల నొసంగఁ గలుగుచున్నారు. ధర్మకారణముననే పంచభూతములు తమ విహిత కర్మల నాచరించుటయందే మలఁకయున్నవి. ధర్మముయొక్క సంపూర్ణానుగ్రహముననే తమకు జుట్టును గట్టులు లేకున్నను నగాధములును, అతిగంభీరములును నగు జలనిధులు తావులు దప్పి పొంగి పొరలి లోకముల జలమయము మొనరింపకున్నవి.

ధర్మ మిట్టి మహత్తరమగు పదార్థ మగుటవలననే బుద్ధప్రభువు దీనిని వేనోళ్ళ సంస్తుతించియున్నాఁడు.

"ధర్మమే మానవుని సత్యమునకుఁ బ్రాపింపఁజేయును. ధర్మము నెవ్వారును బరాభవింపఁజాలరు. ధర్మముయొక్క హృదయము ప్రేమ. ఈ ప్రేమయొక్క పరిణామము చిర శాంతి; మృదుమధురమగు సమగ్రస్థితి. రత్నఖనికంటె ధర్మభండార మధిక మూల్యవంతమైనది. ధర్మము మాధు ర్యమునకు మాధుర్యము. ఇద్దాని రసాస్వాదనానంద మపూ ర్వము. వర్ణనాతీతము.

—ది లైట్ ఆఫ్ ఏశియా నుండి.

ధర్మముయొక్క ప్రభావమే లేకున్న నాకాశము సకాలమునందు వర్షింపనేరదు. వసుంధర పుష్కలముగ దయామతిని సస్యములఁ బ్రసాదింప నొల్లదు. స్థావరజంగమ ములు మానవజీవిత ప్రయోజనమును గలిగింప నొల్లవు. ధర్మమహిమయే లేకున్న మాతాపితలు తృష్ణాభిభూతులయి యుండియుఁ గన్నబిడ్డల గారాబమున నెత్తి పెంచుట తట స్థింపదు. ధర్మముయొక్క దివ్యప్రభావముననే ధరణీధవుఁడు ధర్మాసనమునఁ గూర్చుండి, ధర్మరూపంబగు దండమును హస్తమునం గొని జనసముదాయమధ్యంబునఁ జిరశాంతిని నెలకొనఁ జేయుచుండ మనము సౌఖ్యవంతులమై, ప్రశాంతు లమై హాయిగ గుండెపైఁ జేయివైచుకొని నిస్సందేహముగ సుఖనిద్రాపరవశుల మగుచున్నారము.

మాతృవక్షస్స్థలమును గఱచుకొని శిశువు నిర్భయ ముగా సుషుప్తిం దలిగియుండురీతిఁ బ్రాణిలోక మంతయు

ధర్మదేవతయొక్క సురక్షితమగు విశాలాంకమున భయముఁ దక్కి సుఖముగ మనుచున్నయది. పలుపలుకు లేల? ధర్మ శూన్యముగ విశ్వమొక్క క్షణమేని సుస్థిరముగ నుండ నేరదు. ధర్మ మిట్టి మహిమాన్వితమగుటవలననే ఋషు లిట్లు నుడివి యున్నారు.

"ఏక ఏవ సుహృద్ధర్మో నిధనే ప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వ మన్యత్తు గచ్ఛతి."

"ధర్మము మృత్యువునకుఁ బిదపను వెంటవచ్చునట్టి పరమమిత్రము. ధర్మేతరములగు సమస్త పదార్థములును శరీరముతో నియ్యెడనే నశించిపోవుచున్నవి."

ఆర్యవిజ్ఞానమును, బౌద్ధవిజ్ఞానమును ధర్మమును సహస్రముఖంబుల సంస్తుతించుచున్నవి. మత విజ్ఞానము సమస్తలోకములకు ధర్మ మత్యంతావశ్యకమగు సర్వోత్కృష్ట పదార్థ మగుటచే దాని మహిమను లోకమందలి మనుష్యులు విస్మరించుచున్నప్పు డెల్ల నిర్వికార నిరంజనమగు భగవత్పదార్థమునుండి నిరంతర మొక తేజస్సు బయల్వెడలి పురుషపుంగవులు కొందఱియందు మూర్తీభవించుచు వారల నవతారపురుషులవలె వర్తింపఁ జేయుచు, వారి మూలమున లోకమున ధర్మప్రచార మొనరింపఁ జేయుచుండునని నుడువు చున్నయది. ఈ భావమునే భగవద్గీత సమర్థించుచున్నయది.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదా ఽఽత్మానం సృజా మ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

—భగవద్గీత.

"ఓ పార్థా! భువి ధర్మము లోపించి, అధర్మ మభివృద్ధిఁ జెందునపుడెల్ల నే నవతరించుచున్నాఁడను. సాధుసంరక్షణము, దుష్టశిక్షణము, ధర్మసంస్థాపనార్థము నేను యుగయుగమునం దవతరించుచున్నాఁడను."

భగవద్గీతాకారుఁడగు శ్రీకృష్ణయోగీంద్రుని శ్రీముఖమునుండి బహిర్గతములయిన యీ నాలుగు వాక్యములును ధర్మముయొక్క మహిమాతిశయమునే ప్రకటించుచున్నవి. విశ్వముయొక్క కర్మక్షేత్రమున మనుష్యుఁడు ధర్మానుగ్రహశూన్యుఁడయి యెట్టి స్వల్పకార్యమునయిన సాధింపఁజాలడు. ధార్మికశక్తిశూన్యమగు నంతఃకరణము సదా చింతలవంతలఁ జిక్కుచు, శుష్కించిపోయిన వృక్షంబుమాడ్కి వెలయుచు మనుష్యజీవితమును దుఃఖపరంపరలకు గుఱి యొనరించుచుండును.

ధార్మికపురుషుని జీవితము వసంతఋతువునందలి వాసంతికవలె దినదినాభివృద్ధి నందుచు సర్వేంద్రియ పర్వమయి తనరారుచుండఁగలదు. సామాన్యముగ భరతవర్షమునఁ గ్రామీణజనులు సయితము తమ గృహకృత్యవిషయంబున ధర్మమువంటి బలవత్తరమును, మహత్తరమును నగు పదార్థము లేదనియు, ధర్మమునకే జయము స్థిరమనియు, మానవు లెన్నివిధంబుల యత్నించినను నధర్మము వోటువడుటయే సక్కువంటనియు రామాయణ భారతయుద్ధముల పరిణామమే యిందులకు సబలమగు దృష్టాంతమనియు నొక్కివక్కాణించుచుందురు. కాని, ఆచరింపవలసివచ్చినపు డాత్మబలములేని సామాన్యమానవులం దనేకులు తమ్మధిరోహించి స్వారిఁ జేయుచున్న తృష్ణాపిశాచముయొక్క తీక్ష్ణాంకుశ

ప్రహారంబుల గుండియుమువియ, ధర్మవిరుద్ధములగు కర్మలకుఁ గడంగుచున్నారు.

ఇట్లొనరించుట జీవితో న్నతి నభిలషించువారికి భావ్యము కాదు. క్షణికములగు తుచ్ఛసౌఖ్యముల నపేక్షించి స్థిరశాంతిదాయకమగు ధర్మమును విసర్జింపనెంచుట తా నధిరోహించియున్న వృక్షశాఖను ఖండించుకొనుటను బోలియున్నది. ప్రతి మనుష్యుఁడును శాశ్వతసుఖదాయకమగు ధర్మమును స్వశ్రేయోభిలాషియయి సంపాదించుచుండుట పరమావశ్యకము. ఈ విషయమునే మనుధర్మశాస్త్రము సమర్థించియున్నది.

"ధర్మం శనైః సంచినుయా ద్వల్మీకమివ పుత్తికాః
పరలోకసహాయార్థం సర్వభూతా న్యపీడయన్."

"మనుష్యుఁడు పరలోకసంస్కారము నిమిత్తము సర్వభూతములకు దుఃఖము నొదవింపక యథాశక్తి క్రమక్రమంబుగఁ జెదపురుగు మట్టితో గూడుకట్టుకొను విధంబున ధర్మసంచయ మొనరింపవలయును."

ధర్మముకంటె మనుజుని హితమును గోరు పదార్థమేదియు లే దని బుద్ధభగవానుఁడు ధమ్మపదమున లిఖించియున్నాఁడు. ఆతఁడు న్యాయమార్గమున 17 గీతములందు ధర్మమహిమాసంస్తవ మొనరించియున్నాఁడు. బుద్ధప్రభువు సదా 'ధర్మం శరణం గచ్ఛామి' అను దివ్యమంత్రోచ్చారణమున ధర్మప్రభావమును తన శిష్యమండలికి బోధించుచుండెడివాఁడు. బుద్ధదేవుని ధమ్మపదమందలి ధర్మగీతముల సార్థక మొనరించినట్టివే శ్లోకములు కొన్ని మనుస్మృతియందును దృగ్గోచర మగుచున్నవి.

"నాముత్ర హి సహాయార్థం పితామాతా చ తిష్ఠతః,
న పుత్రదారా నజ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః."

"ధర్మసంచయ మెట్టిప్రయోజనమును గలిగించునా యని సందేహించు మూఢు లుండవచ్చును. పరలోకమున జననీజనకులుగాని, దారాపుత్రులుగాని మనుష్యునకు సాహాయ్యభూతులు కాఁజాలరు. ధర్మ మొకటియే సహకారి కాఁగలదు.

ఆత్మ ప్రబోధానుకూలముగ వర్తించుట, మాతాపితాచార్యాది గురుజనుల పవిత్ర శాసనముల నెఱపుట, దీనుల యందును, మూకపశువులందును దయఁజూపుట, సత్యభాషణము, సౌజన్యము, పరోపకారము, ఈశ్వరభక్తి దేహసంరక్షణము, క్రోధవిసర్జనము, నిగ్రహము, సాధువర్తనము, వినయవిధేయతలు, త్యాగము, మాతృభావదృష్టి, విశుద్ధ విశ్వప్రేమ, లోభ మోహ మద మాత్సర్యదర్పదంభ పరదూషణాది దుర్గుణవిసర్జనము, శమదమాది సద్గుణసంపాదన ముత్తమ మానవజీవిత సహజధర్మము లయియున్నవి.

ఈసద్గుణములన్నియు ధర్మముయొక్క యంగప్రత్యంగము లయియున్నవి. మన మతగ్రంథములును, సాంఘిక శాస్త్రములును మానవుని జీవితాభ్యుదయమున కావశ్యకములగు సద్గుణములను, సద్విచారములను, సద్వృత్తులను ధర్మ స్వరూపముగ నిర్ణయించియున్నవి.

"సీ॥ సత్యహితాలాప • చతురత యర్థాంబు
సంతత సుజనపూ•జనము వలయు
విను క్రోధసంరంభ • విద్వేషములఁ జేసి
మతి గలంగినను ధ•ర్మంబు దప్ప

కుండంగ నడచు ట♦త్యుత్తమ సరణియ
ప్రియములయం దను♦ప్రియములందు
దైన్య హర్షంబులఁ ♦ దగులక యున్నట్టి
కల్యాణవర్తన♦కాంక్ష లెస్స
తే. గీ. యెగ్గుసేసినవారికి ♦ హితముసేఁత
యార్య జనములు గీర్తింతు ♦ రన్యదోష
కారి తనపాపమునఁ దాన ♦ కాలిపోవు
వేఱవానికిఁ గీఁడు గా♦వింప నేల ?

శిష్టాచారవర్తనములును ధర్మలక్షణము లగుటంజేసి వాని నిట వివరించుట సమంజసము.

సీ॥ దానంబు సత్యంబుఁ ♦ దపము యజ్ఞము నార్జ
వముః గామక్రోధాది ♦ వర్జనంబు
గురుజన శుశ్రూష ♦ క్రోధరాహిత్యంబు
దమము సంతోష మ♦ధ్యయననిరతి
దాంభికత్వము లేమి ♦ దైన్యంబు బొరయమి
యనసూయయ నహంక్రి♦యాభియుక్తి
తలఁపంగ నాద్యమై ♦ తనరు ధర్మము నెప్డుఁ
గొనియాట నాసిక ♦ గోష్ఠిఁ జనమి
తే. గీ. శీల సంరక్షతీర్థసం♦సేవశౌచ
మఖలభూతంబులందు ద♦యార్ద్రుఁడగుట
మిత హితోక్తులు సంశ్రిత ♦ మిత్రగుప్తి
యిన్నియును శిష్టచరితంబు ♦ లిద్ధచరిత.

—మహాభారతము.

మహాభారతము వచించిన ట్లీ సమస్తసద్గుణ విలసితుం డగు వ్యక్తియే సకలలోకాదర్శప్రాయుఁడగు ధర్మాత్ముఁడు.

ఇట్టి పవిత్రములగు ధర్మములయం దనాసక్తుఁడయి, తన జీవితకాలము నంతయు వ్యర్థముగాఁ గడపుచుండువాఁడు జీవచ్ఛవము లేక ద్విపాదపశువు. తన జీవిత సంగ్రామరంగం బున ధర్మమునకుఁ బ్రాముఖ్య మొసంగని వ్యక్తి సౌఖ్యా నందముల సంపాదింపఁజాలఁడు. కర్తవ్యమే ధర్మమనఁబడు చున్నది. అనాచరణీయ మధర్మము. అచింత్యమును నధర్మమే. ఒక పవిత్రాంగనయొక్క దివ్యసుందర విగ్ర హము లోచనగోచర మయినంతనే, ఆ దేవియొక్క యంగ ప్రత్యంగముల నశ్లీలభావముతో లోలోనఁ జింతించుచు భావ వ్యభిచారమునకు గడంగుట యచింత్య మను నధర్మము. ఆ దేవిని బలాత్కారముగాఁ గామాంధతచేఁ బట్టుట యనా చరణీయమగు నధర్మము. ధర్మము మనోవాక్కాయముల మానవజీవితమునందు శౌచమును నెలకొనఁజేయును. అధ ర్మముచే మానవుని మనస్సు, వాక్కు, కాయ మను త్రికర ణములు దూషితము లగుచున్నవి.

ధర్మ మక్షయానంద పీయూష రసభాండము. అధ ర్మము భయంకర హాలాహలపూర్ణమగు భాండము. ధర్మము నొక దివ్యసుగంధమయ వికసిత పుష్పమాలగఁ బోల్చిన నధర్మము నొక భయంకర విషసర్పముగఁ బోల్చవచ్చును. ధర్మ నిర్వహణమునకును, అధర్మ బహిష్కారమునకును మనుష్యజీవితము సృజింపఁబడి యున్నదని ప్రతిమనుజుఁడు గ్రహించి నిత్య మిట్టి భావమునే చింతించుచుండవలయును. భుజించుట, నిద్రించుట, భయపడుట మున్నగునవి జీవ సామాన్యములగు ధర్మములు. వీనియం దేవిధమగు గురుత్వ మును, ఘనతయు లేదు. సత్యము, దయ, శౌచము, అహింస,

త్యాగము, భక్తి, జ్ఞానము మున్నగునవియే జీవుని యున్నత ధర్మములు. వీనినే యాదర్శధర్మము లనియు నందురు. మనుష్యుఁడు కేవలము జీవసామాన్యములగు ధర్మముల మాత్రమే కలిగియుండి, ఆదర్శధర్మములకు దూరుఁడయి యుండునేని వాఁడు పశుపక్ష్యాదులకంటె హీనుఁడు.

"ఆహారనిద్రాభయమైథునాని
సామాన్య మేతత్ పశుభి ర్నరాణాం
ధర్మో హి తేషా మధికో విశేషో
ధర్మేణ హీనాః పశుభిః సమానాః."

"ఆహారనిద్రాభయమైథునములు పశువులకును, మనుష్యులకును సామాన్యములై యున్నవి. మనుష్యుఁడీ సామాన్యధర్మములకంటె ధర్మము నొకదానిని విశేషముగాఁ గలిగియున్నాఁడు. ధర్మహీనుఁ డగు మనుజుఁడు పశుతుల్యుఁడు."

సదాచార సమన్వితమగు జీవితమునకు ధర్మము మూలము. దురాచార ప్రాప్యకమగు రాక్షసజీవితమున కధర్మ మాధారము. ధర్మమందు సమస్త సద్గుణములు సమావేశితము లయియున్నవి. ధార్మికపురుషులయొక్క హృదయములు పరిశుద్ధములయి, ఈశ్వరతేజోవిలసితములయి, నిర్మలజ్ఞానకాంతికళల విరజిమ్ముచుండును. అట్టివారి జీవితములు లోకోపకార పరతంత్రములయి, యశస్కరములయి, వారి ప్రతిష్ఠచంద్రికల దిగ్దిగంతముల వ్యాపింపఁజేయుచుండును. ప్రభువు శ్రీరాముఁడు, హరిశ్చంద్రుఁడు, దధీచి, శిబి, రంతిదేవుఁడు, ధర్మనందనుఁడు, బుద్ధుఁడు, అశోకుఁడు,

హర్షవర్ధనుఁడు మున్నగు ధార్మికపురుషుల జీవితము లతి ప్రశస్తములు.

ధనబలము, విద్యాబలము, దేహబలము, అధికార బలము, యౌవనబలము, సంఘబలము మున్నగు బలము లన్నియు మనుష్యునకుఁ దాత్కాలిక విజయమును ప్రసా దించి పిమ్మట వానిని దుఃఖవారిధిని ముంచివేయును! ధర్మ బల మిట్లుగాక తన్నాశ్రయించిన వ్యక్తిని క్రమక్రమముగా దుఃఖపరంపరలనుండి విముఖు నొనరించి యంతమునకు వానిని సౌఖ్యానందవారిధి నోలలాడింపఁగలదు. హరిశ్చంద్రుని జీవిత మును, సావిత్రిజీవితమును, బాలభక్తులగు ప్రహ్లాదధ్రువుల జీవితములును ధర్మబల మెట్టి సత్పరిణామమును గలిగియున్న దియు స్పష్టీకరించుచున్నయవి.

ధర్మ మిట్టి పవిత్రమును, లోకోత్తరమును, మహత్తర మును నగు సాధనం బగుటవలననే సత్పురుషు లెన్ని కష్ట నిష్ఠురములనయిన సహించుటకును, ధనధాన్యైశ్వర్యములఁ గోల్పోవుటకును, దారాపుత్రుల వియోగమును సహించు టకును సమ్మతింతురేకాని ధర్మమును మాత్రము విసర్జింప నొల్లరు. సత్పురుషులకు ధర్మము స్వప్రాణముకంటె మధుర మయినది. ఇయ్యది భయంకరమగు నరకమును సయితము తరించుటయందు జీవునకు మిక్కిలి సహకారి యగుచున్నది. ఈ రహస్యమునే మనుధర్మశాస్త్రము చాటియున్నది.

"తస్మా ద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయా చ్ఛనైః,
ధర్మేణ హి సహాయేన తమ స్తరతి దుస్తరం.
ధర్మప్రధానం పురుషం తపసా హతకిల్బిషం,
పరలోకం నయ త్యాశు భాస్వంతం ఖశరీరిణం."

"జీవుని దుస్తరనరకమునుండి తరింపఁజేయుటకు సహకారియగునట్టియు, పరలోకసాహాయ్యక మగునట్టియు ధర్మమును నిత్యము గొంచెము గొంచెముగా సంపాదించుచుండవలయును. నిగ్రహముచేతను, భక్తివలనను నిజపాపముల నశింపఁజేసికొన్నట్టి ధర్మాత్ముఁడును, బ్రహ్మస్వరూపుఁడును, తేజస్వియు నగు పురుషుఁడు స్వానుష్ఠిత ధర్మప్రభావమున సులభముగా నిర్వాణము నందుచున్నాఁడు."

దివారాత్రములందు మనుష్యుఁడొనరింపవలసిన ప్రతి సామాన్యకర్తవ్యమును పాశ్చాత్యులు విధి (Duty) యనుచున్నారు. మన మిట్టి సామాన్యకర్తవ్యముల నిత్యధర్మములనియు, జీవిత విధులనియు నుడువుచున్నారము. పరమపూజ్యుఁడును, మానవజాతియొక్క పరమహితైషియు నగు మనువు తన ధర్మశాస్త్రమందు ధర్మముయొక్క యంగప్రత్యంగములను, లక్షణములను బాగుగా వివరించియున్నాఁడు.

ఆతఁడు సయితము ధర్మము నొక సత్యమును, నిత్యమును సనాతనమును నగు దైవికసంపదయని ప్రవచించినాఁడు. పశుపక్ష్యాదులకంటె నీ మహత్తరమగు సంపదకధికారులు మనుష్యులు. అయస్కాంతమునందుఁ గల యపూర్వమగు నాకర్షణశక్తి ధర్మమునందును నెలకొనియుండు నని ఋషుల స్థిరాభిప్రాయము. ధర్మపూర్వకములగు కర్మలన్నియు నాత్మప్రీతికరము లగుటచే నవి సమస్తలోకము నాకర్షించు నని మనువు నుడివియున్నాఁడు. మనుధర్మశాస్త్రము ధర్మముయొక్క ముఖ్యలక్షణముల నిట్లు వచించుచున్నది.

"శ్రుతిః స్మృతిః సదాచారః, స్వస్యచ ప్రియ మాత్మనః,
ఏత చ్చతుర్విధం ప్రాహు స్సాక్షా ద్ధర్మస్య లక్షణం."

"వేదోక్తములును, స్మృతిప్రతిపాదితములును, సత్పురుషాచరణానుకూలములును నగు కర్మల నాచరించుటయే ధర్మము. పరిశుద్ధాత్మునకుఁ బ్రీతిపాత్రమగు కార్యాచరణమును ధర్మమే యనఁబడుచున్నది. ధర్మమున కీ నాలుగే ముఖ్యలక్షణములు."

ఎట్టి దురాత్ముఁడయినను, దుష్టుఁడయినను ధర్మవిరుద్ధమగు కార్యమును బహిరంగముగా నాచరింపఁజాలఁడు. అంతరాత్మ సత్యమునందుఁ బక్షపాతబుద్ధి కలదగుటవలన మానవుఁడు ధర్మవిరుద్ధముగ వర్తింపఁ గడంగినపుడు వానిని మిక్కిలిఁ బాధించుచున్నయది. అధర్మ మాత్మవిరుద్ధమగు ప్రవృత్తియగుటచే మానవుని హృదయ మెపుడును దదాచరణమందు శంకించుచు, లజ్జించుచు భీతిల్లుచుండును. పాఠశాలయం దక్షరముల నేర్చు బాలుఁడయినను దన సాటి సహచరుని సామాన్యవస్తువు నపహరించునపుడు తన హృదయము దడదడ కంపించుచుండ, హస్తములు వణకుచుండ, నేత్రముల దృష్టి వక్రమును, చంచలమును నగుచుండ, గాత్రమున స్వేదకణములు కలుగ, ముఖవికాసము నశింప, మదియం దుల్లాసము సమసిపోవ ఘోరాపరాధివలెఁ బరీక్షకునకు స్పష్టముగా గోచరింపఁగలఁడు.

ప్రాయమునందును, లోకానుభవమందును, విజ్ఞానమందును బాలుఁడు దుర్బలుఁడై యున్నను ధర్మస్వరూపమగు బ్రహ్మచేఁ బ్రసాదింపఁబడిన కర్తవ్యాకర్తవ్యప్రదర్శక యంత్రమగు నంతఃకరణమును బడసియున్నవాఁడగుటచే

దూషితకార్యాచరణమునకుఁ గడంగ సాహసింపకున్నాఁడు. ఈ ప్రబల ప్రమాణములచే ధర్మము స్వాభావికమును, స్వతస్సిద్ధమును నగుచున్నయది. దాని నుల్లంఘింప నుపక్రమించు మానవున కంతరాత్మ తొలుత బోధించుచున్నయది. పిమ్మట భయభీతు నొనరించుచున్నది. మనుజుఁడు నిర్బంధముగను నిజబోధ నాలింపక యధర్మమార్గానువర్తి యగుచో నంతరాత్మ వాని నపరాధిగ నిశ్చయించి పట్టి బంధించి దండనకు గుఱియొనరించుచున్నయది. మాతాపితాచార్యులేని ధర్మవిరుద్ధముగ వర్తింప హెచ్చరించినచో వారి శాసనమును గడుసాహసముతోఁ దిరస్కరించుటయే ధర్మమగును.

"ధర్మో హి పరమో లోకే ధర్మే సత్యప్రతిష్ఠితః,
ధర్మసంశ్రితమప్యేత త్పితు ర్వచన ముత్తమం."

"ప్రపంచమున ధర్మమే సర్వోత్కృష్టమైనది. ధర్మము సత్యప్రతిష్ఠితము. ధర్మము నాశ్రయించియే పితాజ్ఞను బాలించు టుత్తమము."

ధర్మము నిత్యసత్య మగుటవలననే దాని బీజములు జన్మతోడనే మనహృదయక్షేత్రమున దయామయుండగు జగత్పితచే నాటఁబడియున్నవి. మానవుని లోకానుభవ సంపాదితమగు విజ్ఞానమునయితము భగవంతునిచే నంతఃకరణమున వెలయింపఁ జేసిన ధర్మమును సర్వతోముఖాభివృద్ధికిఁ బాల్పడఁజేసి, వివిధకళాభాసుర మొనరింపఁ గలుగుచున్నది.

విజ్ఞానానుభవసంయుతమగు శిష్టాచరణముచే నంతఃకరణసీమయందు మోసులెత్తిన ధర్మభావాంకురములకు

దోహదమొసంగి తన్మూలమున సుఖించుట మనవిహితకర్తవ్యము. సార్వజనీనమును, సార్వత్రికమును, సార్వకాలికమును నగు ధర్మముయొక్క ముఖ్యాంగములను గూర్చి ఋష్యాదు లిట్లు వచించియున్నారు.

"ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః
ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణం."

"1 ధృతి (ధైర్యము) 2 క్షమ (ఓరిమి) 3 దమము 4 అస్తేయము(దొంగిలించకుండుట) 5 శౌచము 6 ఇంద్రియ నిగ్రహము 7 ధీ 8 విద్య 9 సత్యము 10 అక్రోధము యీ పదియు ధర్మముయొక్క ప్రధానలక్షణములు."

మహాపురుషుఁడును, ధర్మాత్ముఁడును నగు వ్యక్తి సత్తమునియం దీలక్షణము లన్నియు వెలయుచున్నవి. ఈ లక్షణములచే లక్షితుఁడయి యుండు వ్యక్తి సర్వమాన్యుఁడయి యిహపరముల సుఖించును. ధర్మముయొక్క యీ దశలక్షణములను గూర్చి ప్రత్యేకముగా విద్యార్థుల ప్రయోజనము నిమిత్తము వ్రాయుచున్నాఁడను.

ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః.



## ఏబదియెనిమిదవ ప్రకరణము.

---

### ధృతి (ధైర్యము)

"న సంశయం సమారుహ్య నరో భద్రాణి పశ్యతి,
సంశయం పున రారుహ్య యది జీవతి పశ్యతి."

"నిరంతరము సంశయగ్రస్తుఁడగు మనుష్యుఁ డెప్పుడును గల్యాణము నందఁజాలఁడు. మానవుఁడు సందేహపరంపరల నిర్మూలించివైచి వీరత్వముతో నేదేని కార్యము నాచరింపఁ గడంగినపుడే సజీవుఁడు కాఁగలుగును. ప్రతియుత్తమ కార్యము నాచరించునప్పుడును గష్టనిష్ఠురము లనంతములు వాటిల్లుచుండును. కాని మానవుఁడు క్లేశముల లక్ష్యముఁ జేయకుండినపుడే కృతకృత్యుఁడగును."

ధృతియనఁగా ధైర్య మని తాత్పర్యము. ఈధైర్యము విజయమందిరమును దెఱచుటకుఁ దాంత్రిక కీలకము. ధైర్యశూన్యమగునట్టి మనుష్యజీవితము దీపములేని గృహంబు మాడ్కియు, వర్షఋతువందలి శిథిల నికేతనంబు పగిదియు జీవచ్ఛవమయి, వికాసరహితమయి, దుఃఖభయరోగములకు నిలయమయి యుండుచుండును. ధైర్యములేని మానవున కీభూమండలమునఁ బదపదంబునఁ గంటకము లొదవుచుండఁగలవు. ధైర్యమును గలిగియున్న మానవుని కర్తవ్యపథమందలి తీక్ష్ణములగు కంటకములన్నియు మృదులప్రసూనములగును. ధైర్యమున కసాధ్యమగు కార్య మీ విశ్వమండ

లమునఁ గానరాదు. ధృతిశీలుఁడు తాను వహించిన కార్యముల నెల్ల క్షణమాత్రకాలంబున సులభముగ జయింపఁ గలుగుచున్నాఁడు.

ధైర్యసంపన్నుని హృదయమున సదా సత్యస్వరూపుండగు జగదీశ్వరుఁడధివసించియుండి వాని సమస్తోద్యమముల సహకార మొనరించుచు వానిని సంరక్షించుచుండును. ఆపదలును, దుఃఖములును, దారిద్ర్యమును ధైర్యధురీణుని ధీరనామము నాలించినంతనే కంపించుచు వానిచెంతఁ జేర వెఱచుచుండును. ధైర్యము మానవుని కక్షయాలంకారము. రక్షణమున కద్భుతమగు దుర్గము. ధీరులు నిర్భయచిత్తులగుటచే నెట్టి ఘనకార్యములనయిన సాధింపఁగలుగుచున్నారు.

"Millions of spiritual creatures walk
The earth unseen both when we walk
and when we sleep. —Milton.

"ధీరస్వభావులగు మహాత్ములు కోట్లకొలఁదిగ మనకుఁ గానరాకుండగనే మన జాగ్రత్సుషుప్త్యవస్థల భూమిపై సంచార మొనరించుచున్నారు." —మిల్టను.

పురుషార్థచతుష్టయసంపాదనమందు ధైర్యమే మానవునకు మిక్కిలి సహకారి. ధీరునకుఁ బ్రకృతి పరమమిత్రము. ధైర్యవర్జితున కిదియే ప్రబలశత్రువు. ధైర్య మెచ్చోట సుస్థిరముగఁ గాపురనుండునో అయ్యెడ సమస్తసంపదలు వెలయుచుండఁగలవు. ధైర్యమునకు లక్ష్మీసరస్వతు లూడిగముచేయు పరిచారికలు. ధైర్యము భూధరమువలె స్థిరమైయుండి ప్రాపంచికములగు విపత్పరంపర లెన్ని తన్ను డీకొనుచున్నను సరకుఁజేయక స్వీయకర్తవ్యానుష్ఠానమున సంలగ్న

మయి యుండుచుండును. ధైర్యములేని ధనాఢ్యుని సంపద లును, ధైర్యశూన్యుండగు పండితుని పాండిత్యమును, ధృతి రహితుఁడగు క్ష్మాధవుని క్షాత్రమును, ధీరత్వములేని వజ్ర కాయుని బలమును కింశుక పుష్పములవలెను, నీటిబుడగల రీతిగను, సౌదామినీకాంతులచందమునను వ్యర్థములే యగును.

ధైర్యముచే భువి నెందఱో సామాన్యమానవులు సర్వజనవంద్యు లయినారు.

" కం. ధైర్యము పెట్టనివరణము
ధైర్యము నానాశుభప్రదము నేడ్గడయుగ్
ధైర్యధురంధరులకు నోగి
వార్యము లెక్కడివి వార్ధి వలియిత ధాత్రిన్."

ఆంగ్లకవిచూడామణి యగు షేక్స్పియరు ధైర్యము లేనివాఁడు మృత్యువునకుఁ బూర్వమే చీటికి మాటికి సందేహ భయములచేఁ జచ్చుచుండుననియు, ధీరుఁ డిట్లు మాటి మాటికిఁ జచ్చుచుండక యొకేసారి మృత్యువు నెదుర్కొన వలసినవాఁ డగుచున్నాఁడనియు వచించియున్నాఁడు. ధీరుఁడు మృత్యువు తన్ను సమీపించినను దిగులొందక బ్రహ్మానంద పూర్వకముగనే భౌతికదేహమును విసర్జింపఁగలట్టి స్థైర్యమును గలిగి యుండుచున్నాఁడు.

మహావీరుఁ డగు నెపోలియను ధైర్యములేనివాఁడు జీవచ్ఛవముగనుండి భూదేవికి భారమగుచున్నాఁడు. కావున తత్క్షణమే తన వ్యర్థమగు కళేబరమును నక్కలకును, కుక్కల కును నాహారముగ నొసంగు టుచితమని నుడివియున్నాఁడు. ధన విద్యాబలములు లేకున్నను, సంఘబలము శూన్యమయి

యున్నను, శరీరబలము పూర్ణానుసార్వమునకుఁ బ్రాపించి యున్నను ధైర్యముచే ననేకులు ఘనకార్యములందు విజయ శ్రీని వరించి సుఖించినట్లు చరిత్రములు వ్యక్తీకరించు చున్నవి. అనేకసమయములందు ధైర్యముచే ననేకుల ప్రాణ ములు సయితము సంరక్షింపఁబడుచున్నవి. ధైర్యవిహీనతచేఁ గాఁగల కార్యము లెన్నియో భంగమయిపోవుచున్నవి.

"కం॥ ధృతి యారోగ్యము నొసఁగును
ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు ♦ ధృతి కీర్తిసము
న్నతిఁ జేయుఁ గాలగత్యవ
గతి గలిగినఁ గలుగు ధృతివి♦కారవిమారా!

—మహాభారతము.

సంపూర్ణముగ నవిచలధైర్యమునకు హృదయమున స్థాన మొసంగకయే నేఁడు యువజను లనేకులు ఫలతృష్ణచే నుత్తమములని ప్రశస్తిఁ గన్న కార్యములనెల్లఁ బ్రారంభించి వానియందు సఫలమనోరథులు గాక దుఃఖములపా లగు చున్నారు. శ్రీకృష్ణభగవానుఁడు ధర్మశూన్యుఁడును, నిరం తరసందేహ పీడితుండును నగు మనుష్యుఁడు చచ్చినవాని కంటె హీనుఁడు కావున కడు నింద్యుఁడని ధనంజయునితోఁ గురుక్షేత్రసంగ్రామ సందర్భమున వచించియున్నాఁడు. కర్మ యోగము ధైర్యముయొక్క ప్రభావమును సహస్రముఖములఁ గీర్తించుచున్నది. ధర్మముయొక్క వివిధాంగ బలమును సంపాదించుటయందు ధైర్య మెనలేని తోడ్పాటు నొసం గును.

నిరుత్సాహము, ఉద్వేగము, చింత, దుఃఖము, భయము. సందేహము మొదలగు భయంకరశాత్రవుల దాడి

నుండి మానవజీవితమును సంరక్షించుటకు ధైర్య మొక యభేద్యమగు దుర్గమువంటిది. ధైర్యవిహీనుఁ డగు భీరువు యెట్టి స్థితియందును ధార్మికుఁడు కాఁజాలఁడు. శబ్దరూపరస గంధ స్పర్శాదుల జ్ఞానమును సంపాదించుట కేవిధముగ జ్ఞానేంద్రియపంచకమును, కర్మాచరణమునకుఁ గరచరణాది కర్మేంద్రియములును బరమావశ్యకము లయి యున్నవో, అదియే వడువున ధృతిక్షమాదులును మానవజీవిత సాఫల్యమున కావశ్యకము లయియున్నవి.

ధర్మముయొక్క దశాంగములలోఁ దొల్లింటిదే ధైర్యమగుటచేతఁ దదన్యములగు ధర్మాంగము లన్నియు ధైర్యావలంబనముచే లభ్యమగునని స్పష్టపడుచున్నది. గంగాసమానమగు పరిశుద్ధజీవితము నందుటకును, జీవితమును ప్రతిష్ఠావంతముగను, సౌఖ్యసంపన్నముగను, పరిష్కృతముగను, జేసికొనుటకును, సమస్తవిధ ధర్మకార్యసంపాదనమునకును ధైర్యగ్రహణ మవసరమయి యున్నది. ధైర్యముచే సమస్త వాంఛలు సిద్ధించును. కావునను దీని నొక కవీశ్వరుఁడు కల్పతరువని సంబోధించియున్నాఁడు. దుఃఖవారిధియొక్క తరంగములఁ బడి కొట్టుకొనిపోవుచున్నవానికి ధైర్య మొక నౌక వంటి దని లోకానుభవసంపన్నుఁడగు పండితుఁ డొకఁడు నుడివియున్నాఁడు.

"వ్యసనే ష్వేవ సర్వేషు యస్య బుద్ధి ర్నహీయతే
స తేషాం పార మభ్యేతి తత్ప్రభావా దసంశయం."

"క్లేశములయందు స్థిరబుద్ధిఁ గలిగియున్నట్టి పురుషుఁడు ధైర్యముచే నిజోద్దేశ్యమున సఫలమనోరథుఁ డగుచున్నాఁడు. ఉత్తమంబగు నౌక నధిరోహించి మనుష్యుఁడు సాగరమును

దాటు విధంబున, ధైర్యమనునావ నారోహించి ప్రాపంచకులు అగాధమును, అపారమును నగు దుఃఖభయవిపదాంబుధుల సంతరణమున విజయులగుచున్నారు."

సూర్యకిరణ ప్రకాశమున నంధకారపుంజములు పటాపంచలగు చందమునను, శుష్కతృణరాశి ప్రచండాగ్ని జ్వాలల భస్మమగు విధమునను ధైర్యావలంబన మాత్రమున సకలకార్యప్రతిబంధకములును, సమస్తారిష్టములును సులభముగాఁ దొలంగిపోవును. వాస్తవ మాలోచింప విపత్కాలమందలి దుఃఖముల నష్ట మొనరించుట ధైర్యముయొక్క ప్రథమవిధియయి యున్నది.

సర్వోత్తమంబులగు సౌఖ్య సముదాయములు ధైర్య పరిగ్రహణంబుననే కరతలామలకము లగుచున్నవి. ధైర్యవంతులు సింహసమానులు. వా రెట్టి కఠినోద్యోగ మొనరించుటకును లేశమాత్రమయిన శంకింప నొల్లరు. వా రన్యుల సాహాయ్యమునకై నిరీక్షింపక స్వీయబాహుబలమందే యధిక విశ్వాసమును గలిగియుందురు. పరావలంబనము మహాపాపమని ధీరులు సిద్ధాంతీకరించు చుందురు. వారు ప్రారబ్ధమునుగూర్చి స్వప్నమందును జింతింప నొల్లరు. ధైర్యము సదా ప్రారబ్ధమందుకంటె నుద్యోగమందే విశేషప్రయోజనము కలదను సిద్ధాంతమును ఋజువుపఱచు చుండును.

"Life is not made for doubts but convictions, and the man who has the courage of his convictions is the man who serves and elevates his country."

—Chandavarkar.

"మానవజీవితము సందేహించుటకేర్పడియుండ లేదు. దృఢవిశ్వాసములకే యది సృజింపఁబడినది. తన దృఢవిశ్వా

సమునందు ధైర్యమును గలిగియున్నట్టి మనుష్యుఁడు తన దేశమును సేవించుటకును, ఉన్నతికిఁగొనిపోవుటకును సమర్థుఁడు."

ప్రపంచమందు నుత్తములు, మధ్యములు, అధము లను మూఁడు తెగలకుఁ జెందిన మనుష్యులున్నారు. అధములువిఘ్నములు కలుగునను భయముచే నేకార్యమును ప్రారంభింప నొల్లరు. మధ్యములు ప్రారంభించియుఁ బ్రథమవిఘ్నదర్శనంబున భీతిల్లి కార్యవిముఖు లగుదురు. ఉత్తమపురుషు లిట్లుగాక విఘ్నము లెన్ని తటస్థించినను సరకుఁజేయక ధైర్యసముపేతులయి కర్తవ్యముల నిర్వహించి ధన్యు లగుదురు.

ధృతిశీలు రెప్పుడు నపజయముయొక్క ముఖమునయిన వీక్షింపనొల్లరు. ఏదేని కారణముచే భంగపడిన కార్యమును ధైర్యముచేధీరులు సమర్థింతురు. నూత్నముగు కార్యమెద్దియుఁ బ్రారంభింపగనే సఫలీభూతము కానేరదు. మనుష్యుఁడు ధీరుఁడై కార్యముయొక్క ఫలము నొక్కసారిగఁ గబళించి వేయవలయునని యాసపడక క్రమముగా ఫలము నందుటకు యత్నించు టుచితము నిరంతరాభ్యాస ప్రభావంబునను, నిర్మాణకుశలత్వమునను కార్యములు సాధింపఁబడుచున్నవి.

ఉన్నతియు, వికాసమును సాధనమాత్రోపలబ్ధములు. తత్సాధనము ధైర్యసంజనితము. ఏకార్యమును బ్రారంభింపఁబడినంతనే సాఫల్యమొసంగఁజాలదు. విజయప్రాప్తికి వ్యవధి యగత్యము. వ్యవధి పూర్తియగునంతలో ధైర్యముయొక్క పరిమితి క్షీణించునేని విజయము గగనపుష్పమగును. ధీరుఁడన్నను, కర్మవీరుఁడన్నను. వీరపుంగవుఁడన్నను ధైర్యముచే విభూషితుఁడయిన వ్యక్తియే యని గుర్తింపుఁడు.

ధైర్యస్వీకృతివలననే మనుష్యుఁడు కర్మయోగి కాఁగలుగుచున్నాఁడు. ధైర్యములేనట్టివా రెన్ని శాస్త్రములఁ బఠించినను, గురుముఖంబున నీతిధర్మసిద్ధాంతముల శ్రద్ధతో నభ్యసించినను, అంతఃకరణము కర్తవ్యప్రబోధము నొసంగుచున్నను కష్టములకు భయముఁజెంది యెుక్కొకప్పుడు నీతిపథమును బహిష్కరించుటకేని సంశయింపరు. కాని ధైర్యవంతు లెట్టి విషమస్థితియందును నీతిమార్గచ్యుతులు కానొల్లరు.

"నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టం
అద్యైవ వా మరణ మస్తు యుగాంతరే వా
న్యాయాత్ పథః ప్రవిచలంతి పదం న ధీరాః."

—భర్తృహరి.

"ధీరులగు పురుషులు లోకము తమ్ము నిందించినను, స్తుతించినను - సంపదలు వచ్చినను, తరలిపోయినను-నేఁడు మరణించుట తటస్థించినను, కల్పాంతమున మరణింపవలసి వచ్చినను నిట్టివేనిని సరకుగొనక న్యాయపథమునుండి చలింపక సుస్థిరులయి ప్రకాశించుచుందురు."

ఇట్టిధైర్యము మూలముననే మనుష్యులయొక్క నిర్జీవములగు రక్తనాళములందు నవీనమగు శక్తి సంచరింపఁదొడంగును. ఉద్యోగమందును, కార్యమందును ప్రగాఢమగు నాసక్తి ప్రాదుర్భవించును. ప్రాచీనేతిహాసములవైపున కొంకెంత మీ దృష్టిని బ్రసరింపఁజేయుఁడు. సమరాంగణమున శత్రువుల పరాక్రమాధిక్యముచేఁ బరాభూతులైన భూపాలు రెందఱో ధైర్యము నాశ్రయించి తమ ప్రచండమగు శత్రు

చమూవాహినిని జీల్చి చెండాడి యపహృతమగు తమ సర్వస్వ మును సంపాదింపఁగలిగి యున్నారు.

గ్రీకు దేశ సార్వభౌముండగు నలెగ్జాండరు భారత దేశ ముపై దండెత్తివచ్చినపుడు మగధసామ్రాజ్యముయొక్క ప్రశస్తి నాలకించి, దానిని గబళింపనెంచెను. ఘోరాంధ కారము నల్దెసల వ్యాపించియున్న యొక కాళరాత్రియం దతఁడు తన సైన్యమును సింధునదిని దాటఁ గఠినముగ శాసిం చెను. భయంకరమగు నిశీథకాలమున నగాధమగు సింధు నదిని దాటుటకు గ్రీకుయోధు లెల్లరు ప్రాణభీతిచే సంశ యించిరి. ఎన్నియో భయంకరయుద్ధముల నవలీలగ జయించి యుండిన తన యోధుల యధైర్యమునకుఁ బరిహాస మొన రించుచు నద్రిసమధీరుఁడగు నలెగ్జాండరు ప్రభువు సాహస మును బురికొల్పు గంభీరవచనములఁ బలుకుచుఁ బిఱికితనము కళేబరముయొక్క లక్షణమగుఁ గాని సజీవుని లక్షణము కానేరదనుచు సింహకిశోరంబుమాడ్కి ముందుగఁ దానే యగాధమగు సింధునదియందు లంఘించియావలితీరమున కీద నారంభించెను. తమసార్వభౌముని యపూర్వమగు ధైర్య మును వీక్షించినంతనే సైనికులెల్లరు తమ పిఱికితనమునకు మిక్కిలి లజ్జితులయి క్షణ మాత్రకాలమున సింధునదిని దాటిరి.

అనంతరము సార్వభౌముఁడు తన దండయాత్రలో సంపూర్ణమగు విజయమును బడసిన విషయము విద్యార్థు లెల్ల రెఱింగినదే. ఒక వ్యక్తి ధైర్యము నవలంబించుటచే నెందఱో భీరువులు సింహపరాక్రములయి శత్రుపక్షము నెదిరిపోరి విజయలక్ష్మిని వరించిరి. అలెగ్జాండరువంటి వీరవరేణ్యుని

సేనాధిపతిత్వముక్రింద నడుపఁబడిన గ్రీకుసైన్యము మగధ భూపాలుఁడగు పురుషోత్తముని సైన్యమునంతయు సమరాంగణమున హతమొనరింప, హతశేషులు ప్రాణములమీఁది యాశచే యుద్ధభూమిని విడిచి పలాయనమొనరింప మగధ భూపాలుఁడగు పురుషోత్తముఁడు లేశమేని చలింపక మహాధీరుఁడయి మదగజంబుపై నధిరోహించి తానేకాకియయి శత్రుసైన్యముతోఁ బోరాడుచుండుటను వీక్షించి, అలెగ్జాండరు విస్మితుఁడయ్యెను.

పురుషోత్తముని మొక్కవోనిధైర్యమును విలోకించి గ్రీకుభూపతి మెచ్చి యతనిచెంతకేతెంచి "రాజా! నీసైన్యమంతయుఁ జిందరవందరయయి పోయినను ప్రాణభీతిని దక్కి ధైర్యమునే యభేద్యమగు కవచముగ ధరించి సాగరమువలెఁ బొంగి పొరలి పైఁబడుచున్న నాప్రచండసైన్యమును దును మాడ ముందునకు లంఘించుచున్న నీ యప్రతిహతమగు ధీరత్వము సహస్రముఖంబుల స్తుతింపఁ దగియున్నది. నీవేమి వాంఛింతువో కోరుకొనుము. నేనొసంగుటకు సన్నద్ధుఁడను" అని నుడివెను.

వీరకంఠీరవుఁడగు పురుషోత్తముఁడంత మీసముమెలి వెట్టుచుఁ దన ముఖారవిందమున సాహసద్యుతి మూర్తీభవించియుండ గంభీరముగ నిట్లుత్తర మొసంగెను.

"ధైర్యప్రియుండవగు నో రాజా!

తే॥గీ॥ అవగుణంబులలోన నధై ♦ ర్యంబుకంటె
నధికదుర్గుణ మొకటి లే ♦ దరసిచూడ
నాపదలయందు నీశ్వరు ♦ నాత్మ నమ్మి
ధైర్యమూనిన ధైర్యంబె ♦ తన్నుఁగాచు."

అను నీతివాక్యమును నేను మిక్కిలి ప్రేమించుకోటి లోనివాఁడను. ప్రాణములనయినఁ దృణప్రాయముగ విసర్జించుట కేని సమ్మతించి, ధైర్యమును వహించి తమ ధర్మమును నిర్వహించు ధీరులగు భూపాలుర కెట్టి సన్మానము తగియుండునో అట్టిగౌరవమునే నేను కోరుచున్నాఁడను.”

అలెగ్జాండరు అవక్రపరాక్రమ నిధియగు పురుషోత్తముని యపూర్వధైర్యమునకు ముదమంది యతనిసామ్రాజ్యమునతని కొసంగివైచెను.

విద్యార్థులారా! ధైర్యావలంబనమున నేకాకియగు పురుషోత్తముఁ డెటులఁ బ్రచండమగు శత్రుసైన్యమునుండి తన ధనవంతమగు సామ్రాజ్యమును సురక్షిత మొనరించు కొనఁగలిగినాఁడో గ్రహించితిరా? దిగ్విజయాపేక్షాపరుఁడగు ఫ్రాంసువీరుఁడు శ్రీ నెపోలియను రష్యాదేశమును స్వాధీన మొనరించుకొనుట కొకతూరి లక్ష సైన్యముతో బయలు దేఱెను. ఐరోపాఖండమున హిమాద్రియను పేరఁ బఱగు నాల్ప్సుపర్వతమును ఫ్రాన్సుసైనికులు రష్యాకుఁ బోవు మార్గమున దాటవలసివచ్చెను.

సైనికు లెల్లరు మంచుగడ్డలలో నడువఁజాలక విగత సాహసులయిరి. అపుడు నెపోలియను వీరుఁడు ధైర్యము యొక్క యనంతప్రభావమును వర్ణనాపూర్వకముగ వారి కెట్టెదుటఁ జిత్రించి స్వయముగఁ దానే ముందు నడువ నారంభించెను. తమభూపాలుని ధైర్యమును గాంచినంతనే సైనికు లెల్లరు నూతనోత్సాహపూరితచిత్తులయి నూతనధైర్యము నవలంబించి నెపోలియను వీరుని వెంబడించి శీఘ్రకాలమందే పర్వతము దాటఁగలిగిరి.

భారతవీరులం దనేకులు ధైర్యముచే నపూర్వములును, అత్యద్భుతములును నగు కార్యము లొనరించి చరిత్రలందుఁ దమ నామముల సువర్ణాక్షరముల నంకిత మొనరించుకొని యున్నారు. "ఛిన్నే మూలేనైవ శాఖా నపత్రం" మూలమే నశించినపుడు శాఖాఫలపత్రపుష్పము లెట నుండునను విధంబున ధైర్యమే నశించినపుడు మానవజీవితమునం దేవిధ మగు సౌఖ్యములు నుండఁజాలవు. నెపోలియను వలె హిమాద్రిపై మంచులోఁ జిక్కుకొనినపుడు ఫ్రాంసుసైనికు లెల్లరు ధైర్యమే యవలంబింపకుండిన భయంకరమృత్యువునకు గుఱి యగుటయే తటస్థించి యుండెడిది.

"తే॥గీ॥ వసుధ నెపుడైనను విపత్తు ♦ వచ్చినపుడు
తాల్మి విడనాఁడి వగఁగూరి ♦ తలఁకుచున్న
దాసఁగు రెట్టింపు గాఁగను ♦ దోఁచుఁగాని
కొంచెమైనను గార్యంబు ♦ కూడిరాదు."

—నీతిదీపిక.

కావునఁ బ్రతివ్యక్తియు స్వహితాపేక్షచే నయిన సకలసౌఖ్యమూలమగు ధైర్యమును గలిగియుండుట మిక్కిలి శ్రేయస్కరము. ధైర్యమూలము సౌఖ్యదాయక మయినది. 'తస్మాన్మూలం యత్నతో రక్షణీయం' అని యెఱింగి సదా సంరక్షించుచుండు టావశ్యకము. ధైర్యముచే బలపౌరుష ములు నిత్య మభివృద్ధిఁ గాంచుచుండును. విద్యార్థు లనేకు లొకతూరి పరీక్షయం దుత్తీర్ణులు గానంతమాత్రముననే విగతసాహసులయి తమ జీవితకాలమంతయు నన్యాయముగ నశింపఁ జేసికొనుచున్నారు.

కొందఱు విద్యార్థులు పరీక్షయందు విజయము నందకున్నచో ధైర్యమును గోల్పోయి యెటులో గుండెలు బిగఁబట్టి రెండవసారి పరీక్షకుఁగూర్చుండి యపుడును గృతార్థత నందనిచో నాత్మహత్య యొనరించు కొనుటకేని సన్నద్ధు లగుచున్నారు. అధైర్యము, ఉద్విగ్నత, చాంచల్యము, తత్తరపాటు, సందేహము, భయము మున్నగు దుర్గుణములకు ధీరులు స్వాగత మొసంగఁజాలరు. ధైర్యపరిత్యాగముకంటెఁ బ్రాణ విసర్జనమే సుఖకర మను పండితవాక్యము కడు గంభీరార్థ సమన్వితమయినది.

"He who has no courage and steadiness in suffering the puzzles of his duty's path, cannot ge t success in attaining happiness. Discouraged are half-dead."

—Hariji.

"తన కర్తవ్యపథమునఁ దటస్థించు కష్టముల సహింప ధీరత్వమును, సాహసమును లేని వ్యక్తి సౌఖ్యసంపాదనమున విజయుఁడు కాఁజాలఁడు. ధైర్యవిహీనుఁ డర్ధమృతుఁడు."

—హరిజీ.

సంపత్కాలమున సంతోషాతిరేకమున గంతు లిడకయు, విపత్కాలమున దుఃఖాతిశయముచేఁ గ్రుంగి కృశింపకయు, సముచితోత్సాహస్వాంతముతో, ధైర్యావలంబన పూర్వకముగ నిరంతరము కర్తవ్యనిర్వహణమునఁ దగిలి యుండు పుత్రులఁ బ్రసవించిన తల్లిగర్భము కడు పవిత్రమయినది.

ప్రాచీనకాలమందువలె నేఁడు భారతవర్షమున ధీరులు గోచరింపకున్నారు. అన్యాయమును, అధర్మమును నెదుర్కొనగల ధీరప్రవృత్తియే ధైర్యము. నేఁ డసత్యమును డీకొనుట

వెఱ్ఱితనముగను, అధర్మకార్యములఁ గడు సాహసముతో నాచరించుటయే ధైర్యముగను సంభావింపఁబడుచున్నది. నింద్యములగు విలాసముల నిమిత్తము ధనతృష్ణాపరుఁడయి యొక ధనికునియింట దుష్టచరిత్రుఁ డొకఁ డర్ధరాత్రమునఁ బ్రవేశించెను.

ఆతఁడు గృహమందలి వస్తువులనెల్ల నపహరించుకొని పోవుచుండ గృహస్వామియు, ఆతని బలాఢ్యులగు పరిచారకులును నిద్రనుండి మేల్కాంచి 'దొంగదొంగ' అని వానిని వెంటాడిరి. చోరుఁడును గత్యంతరములేక వెనుదిరిగి తన బాహుబలమును బ్రదర్శించుచు గృహస్వామిని, వాని భృత్యులను దన వాఁడికత్తికి బలి యొసంగెను. చోరుఁ డొనరించిన యీ కృత్యము ధీరకృత్యమనిగాని, గృహస్వామిని వాని సేవకులతో సంహరించిన ప్రవృత్తి ధైర్యమనిగాని నుడువఁబడదు.

ఒకతూరి రామపురమను గ్రామంబున గృహ మొండు హుతాశనుని ప్రీతికిఁ బాత్రమయ్యెను. దగ్ధమగుచున్న గృహమందు బాలు రిరువురును వారి మాతృదేవియుఁ జిక్కువడి పోయిరి. గృహమునకు నలువైపులఁ బొగ దట్టముగఁ గ్రమ్ముకొనుటచే నాస్త్రీయు, బిడ్డలును బయట కేతెంచుటకు దారిఁ గానక ప్రాణభీతిచే 'రక్షింపుఁడు రక్షింపుఁడు' అని బొబ్బలిడఁజొచ్చిరి. గృహము నాప్పట కేతెంచియుండిన పురుషులెల్ల రెవరికివారే ప్రాణభీతిచేఁ దల్లడిల్లుచుఁ 'బొండు. పొండు వారల రక్షింపుఁడు' అని కేకలు వేయఁదొడంగిరి. అగ్నిదేవుని ప్రకోప మనుక్షణము హెచ్చుపెరిగి పోవుచున్నంతలో శుద్ధ జాతీయవేషమును ధరించిన బలాఢ్యుఁడగు యువకుఁ

డొకఁడు విపత్తు నాలకించి పరుగెత్తి వచ్చి దహనమగు చున్న గృహములోఁ గడుధైర్యముతోఁ జొరఁబడెను.

అతఁ డట్లు గృహమునఁ బ్రవేశించి దేహము తపించి పోవుచున్నను లెక్కింపక మూర్ఛితులయి పడియున్న బాలురను, వారి మాతను కడు నైపుణ్యముతో గృహబాహ్యమునకుఁ దెచ్చి రక్షించెను. ఆ యువకుని ధైర్యమున కెల్లరు విస్మయానంద పరవశులయిరి. గాంధిభక్తుఁడగు నాయువకుఁ డంతఁ బ్రజల నుద్దేశించి "అయ్యలారా! భీరువులగు మీరు, ధైర్యమువంటి రత్నమును బోఁగొట్టిన మీరు భట్టులవలె నన్ను స్తుతింపఁబనిలేదు. ధర్మసంరక్షణార్థము బలిదానమగుటయే ధైర్యము. అధర్మకార్యముల స్వార్థము నపేక్షించి వెల్లడింపఁబడు నీచసాహసము ధైర్య మనఁబడనేరదు. నే నిపుడు ధైర్యము నవలంబించుటచే ముగ్గురు సాధువుల ప్రాణసంరక్షణము కాఁగలిగినది" అని నుడివి తనదారి నరిగెను.

యువకుఁ డొనరించిన నిస్స్వార్థమగు నీప్రవృత్తియే ధైర్యము. నేఁటి భారతీయులందు ధైర్యము బొత్తిగా క్షీణించి పోయినది. మేరుసమానధీరులని లోకమునందంతట ప్రఖ్యాతి వహించియుండిన భారతీయులు నేఁడు తమధర్మమును సంరక్షించుకొనలేనంతటి భీరువు లయినారు. వైదికయుగమునుండి స్మృతియుగము పర్యంతము గల భారతేతిహాసము నవలోకింతు మేని నాఁడు భారతభూమియందు ధాన్యాదుల సస్యములతోఁ బాటు ధైర్య మేరీతి నుత్పత్తి యగుచుండెడిదియో, ధీరత్వముయొక్క జీవరస మెటుల

భారతమాతృస్తనముల దుగ్ధరూపమునందుండి యుండెనో పాఠకులకు స్పష్టపడఁగలదు.

ప్రాక్తనభారతవర్షమున ధీరులే సర్వత్రఁ గానఁగుచు లోకపూజ్యతను సంపాదించుచుండిరి. నేఁడు ధైర్యము మనదేశమున శబ్దరూపమునందు మాత్రమే యుండిపోయి నది. నేఁటి భారతజాతి ధనమును, ధాన్యమును, భోగవిలాస ములను గోరుచుండ నాఁడు స్త్రీపురుషులెల్లరు ధీరత్వమును బడయుటకయి తపమొనరించుచుండిరి. కారణ మేమన ధీరు లిహపరముల సుఖశాంతులఁ బడయ నర్హులు.

"స ఏవ ధన్యో విపది స్వరూపం యో నముంచతి
త్యజ త్యర్కకరైస్తప్తం హిమం దేహం నశీతతాం."

"సూర్యుఁ డుష్ణమును బాసినను హిమము శైత్య మును విసర్జించినను, ఆపదలు పుంఖానుపుంఖములయి తమ్మె దిరించినను ధైర్యమును విడువనొల్లని పురుషులే ధన్యులు."

మానవజీవితముయొక్క మహత్వమును, గౌరవ మును, సార్థక్యమును ధైర్యధారణముననే లభించు నని గుర్తెఱింగి సమస్తమానవులు తత్సంపాదనమునకయి నిరంత రోద్యోగపరాయణులయి మనుచుందురుగాక ! 'సాహసేన లక్ష్మీః' అను పూతమంత్రము సదా యువజనుల హృదయ మందిరములఁ బ్రతిధ్వనించుచుండునుగాక !



# ఏబదితొమ్మిదవ ప్రకరణము

## క్షమ (ఓరిమి)

"కం॥ క్షమియించువారిఁ గని చా
లమివెట్టుదు రైననుం దలంప ననూన
క్షమయ కడు మెఱయు తోడ వృ
త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్.

—మహాభారతము.

"మూషికపీడనమును సహింపఁగలుగు మార్జాలము క్షమయం దారితేఱినదియే శక్తిని గలిగియుండియుఁ బరులఁ బీడింపని గుణమే క్షమ యనఁబడుచున్నది. ప్రాజ్ఞప్రపంచమున కిదియే తలమానికమువంటిది. క్షమయనియెడి యభేద్యమగు కవచమును ధరించెడి యోధుఁడు ప్రపంచధర్మ సంగ్రామమున సులభముగా విజయుఁ డగుచున్నాఁడు."

—గాంధిమహాత్ముఁడు.

క్షమయను పదము సంస్కృతముయొక్క "క్షమ్" ధాతువునుండి కలిగినది. సహించుట దీని యర్థము. సహనశీలత, సహిష్ణుత, తాలిమి, తాల్మి, ఓర్పు, ఓరిమి మున్నగు శబ్దము లన్నియు క్షమకుఁ బర్యాయపదములే. పరులు మన కొనరించు నపకారమునకుఁ బ్రగుద్ధులము గాక మన హృదయములందు వైరద్వేషభావములకుఁ దావొసంగక, శాత్రవ

పరికల్పితమగు నపకృతిని సహించినపుడే మనయందు క్షమ యున్నటుల స్పష్టపడఁగలదు.

భోగవిలాసములు విశ్వమానవజీవితమునఁ బ్రవేశించి నప్పటినుండియు క్షమయను దైవిక సంపత్తి మనుష్యజాతిని వీడిపోయినది. పవిత్రుఁడయి, పుణ్యాత్ముఁడయి సాధు జీవితయాత్రను గడుపవలసిన మనుష్యుఁడు నేఁడు విలాస పురుషుఁడయి, కామక్రోధాదుల కనుసైగల వర్తించుచు క్షమకు జలాంజలి యొసంగు టెంతయు శోచనీయము.

క్రోధాది దుష్టగుణము లుండుచోట శమక్షమాది సద్గుణము లుండుట సంభవింపనేరదు. ఎవఁడేని మూఢుఁడు మన యెడ నేదేని యపరాధమును బుద్ధిప్రమాదవశంబునఁ గావించినచో నద్దానికిఁ బ్రతిక్రియఁ గావింపవలయు ననియెడి వాంఛను దమన మొనరించుటవలననే క్షమ వికసించు చున్నయది. సమర్థుఁడయి యుండియుఁ దన్ను నష్టపఱచిన మూఢుని దండింపక దయతో క్షమించువాఁడే సర్వోత్త ముండగు సహనశీలుఁడు. క్షమ శక్తిసంపన్నులును, సమర్థులును నగువారి కొక శాశ్వతమగు దివ్యాలంకారము.

చ॥ కనులను నిప్పులున్గురియఁ • గాబయివచ్చు మహోగ్రకో
పియుం

దనకడనోరుపున్న యెడఁ • దత్క్షణమందె ప్రశాంతుఁడయ్యెడున్
ఘనమగు ధూళితోడ వడ • గాడుపు భీకరభంగి వీచి, చి
క్కని తడివట్టివేళ్ళతడ • కంబడి చల్లనగాదె! మిత్రుఁడా!

—సూక్తివసుప్రకాశికము.

తనసమస్తేంద్రియములను, చిత్తమును నిగ్రహపూర్వకముగ వశ మొనరించుకొను మానవోత్తముని హృదయాంత

రాశమున క్షమ యపరిమితముగ వెలయుచుండఁగలదు. క్షమను గలిగియుండుటచే విలక్షణమగు మానసికశక్తి విజృంభితమయి క్రమక్రమముగా మనుష్యుని దేవతాపురుషునిగ సిద్ధ మొనరింపఁగలదు. సత్వగుణసంపన్నుఁ డగు దేవతా పురుషుఁడు సామాన్యమానవు లొనరించు నెట్టి దోషముల నయిన, భయంకరాపరాధములనయిన సులభముగా క్షమించుచు, సహించుచు నీతి ధర్మజ్ఞానప్రబోధముచే వారి మూఢ హృదయముల సంస్కరింపఁ గడంగుచుండును.

ఓరిమియొక్క ప్రభావముచే మనుష్యుఁడు సర్వజన వంద్యుఁడై నిత్య ప్రశాంతస్థితియం దుండుచుండును. దుష్టులు శరసమానమగు కటువాక్యములచేఁ ద న్నెంతగా దూషించినను సహనశీలుఁడు తనమానసమం దెట్టి వికారభావమునకును దా వొసంగక, దూషణతిరస్కారవచనముల నన్నింటి నాశీర్వాదములుగ భావించి, మృదుమధురహాసచంద్రికల నిరంతరము నల్దెసల వ్యాపింపఁజేయుచు నెట్టి పాషాణహృదయములనయిన ద్రవీభూత మొనరించివేయఁగలఁడు. క్రీస్తు భగవానుని "చెంపఁ గొట్టినఁ జెంపఁ బట్టుము" అను నీతివాక్యము క్షమ సమస్తలోక వశీకరణమహామంత్ర మను భావమునే వ్యక్తీకరించుచున్నయది.

భక్తవరేణ్యుఁ డగు ప్రహ్లాదుఁడు పరమదుష్టరాక్షసుఁ డగు తన తండ్రి తన్నెంత బాధించినను, దూషిం‍ హింసించినను నీషణ్మాత్రమయినఁ జలింపక, క్రోధ జెందక, పరుషవాక్యములనయిన నుచ్చరి‍ తాడనముల మిక్కిలి యోర్పుతో సహిం‍

యొక్క దివ్యప్రభావముచే నసురప్రకృతి గల దుష్టుల నెంద ఱినో మంత్రముగ్ధులఁ గావించెను.

ప్రహ్లాదుని సహపాఠులును, సహచరులును దమయుపాధ్యాయుని శాసనమునయినఁ దిరస్కరించుటకు సన్నద్ధులయిరే కాని పరమసహనశీలుఁడగు ప్రహ్లాదకుమారుని ప్రబోధానుసరణమునుండి విముఖత్వమును జూపరైరి. మిక్కిలి క్రోధాంధుఁడై కోపానలమున దగ్ధ మయిపోవుచున్న తండ్రియందు దయఁదలఁచి క్షమనుగూర్చి యిటు లతని కుపదేశించెను.

"క॥ క్షమ గలిగిన సిరి గలుగును
క్షమ గలిగిన వాణి గలుగు • సౌరప్రభయున్
క్షమ గలుగఁ దాన గలుగును
క్షమ గలిగిన మెచ్చు శౌరి•సనయుఁడు తండ్రీ!"
—భాగవతము.

ప్రతివస్తువునందును, ప్రతిప్రాణియందును, ప్రతి జీవనశక్తి యందును గతి యొండు వెలయుచున్నది. తమ సహజగతిని నిరోధించు శక్తుల నెదిరింపఁజాలనట్టి ప్రాణుల యొక్క గతి సర్వదా వక్రమగుచుండును. ఓషధులు మొదలుకొని మనుష్యులు పర్యంతము సర్వత్ర యీ నియమమే గోచరించుచున్నయది. బీజము లంకురించుటకును, పక్షులు జీవించుటకును మనుష్యులు వృద్ధినందుటకును నూర్ధ్వమార్గానుసరణ మవశ్యము. నిరోధకశక్తులు సహజగతి నడ్డగించుచుండును.

బీజములయొక్కయు, ప్రాణములయొక్కయు ..ధకశక్తుల నాశన మొనరింపఁగడంగుచున్నవి. ..దీ శక్తి ధృతియను పేర ..బఱఁగుచున్నది.

ధీరపురుషులు తమగతిని వక్రము గానీయ నొల్లరు. అప్రాకృతిక శక్తిని నిరోధించుటకు ధృతిని ముఖ్యసాధనముగఁగొని యుత్తమ మానవులు తమ జీవితముల నాదర్శప్రాయముగఁ జేసికొనుచుందురు.

మనుష్యుఁడు తన స్వాభావికశక్తిని బాహ్యపదార్థములందు సంలగ్న మొనరించినచోఁ దన కెంతయో కీడొనరించుకొనినవాఁ డగుచున్నాఁడు. అప్రాకృతికశక్తిని నిరోధించు ధృతి క్షమయను మహాపదార్థముతోఁ బ్రగాఢమగు నవినాభావ సంబంధమును గలిగియున్నది. క్షమాశూన్యమగు ధృతియు నొక్కొకపుడు విషమపరిణామదాయక మగుచుండును.

మానవజీవితముయొక్క యస్వాభావిక గతిని, స్థితిని నిరోధించుటకు క్షమయే మహత్తరమగు సాధనము. కావున సహనశీలత సమస్తమానవసంపాదన యోగ్యమయి రాణించుచున్నయది.

"క్షమా శస్త్రం కరే యస్య దుర్జనః కిం కరిష్యతి,
అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి."

"తృణశూన్యమగు స్థలమునఁ బడిన యగ్ని స్ఫులింగములు తమంతట తామే చల్లారిపోవు విధంబున క్షమయను శస్త్రమును హస్తమున ధరించువాని కెట్టి కీడును దుర్జనుఁడు కావింపఁజాలఁడు."

సబలహృదయులయందే విశేషముగ క్షమ నెలకొనియుండుచుండును. దుర్బలులయందు క్షమ స్వల్పముగను, క్రోధ మపరిమితముగను వెలయుచుండును. ఎవనియొక్క యంతరాత్మ దుర్బలమయి యుండునో, ఎవ్వాని దేహము

ప్రకృతివిరుద్ధముగ క్షీణించియుండునో, వానియందు క్షమ కాపుర ముండ నేరదు. బలాఢ్యుం డెవడేని మన కపకార మొనరించిన మనము దుర్బలులమయి యుండుటచేం దిరిగి వానికిం బ్రత్యపకార మొనరింపంజాలనివారమయి వానిని క్షమించినార మని శుష్కవేదాంతోపన్యాస మొసంగినంత మాత్రమున మనము క్షమాశీలురము కాంజాలము.

నేండు ప్రపంచమునం దపకారమునకుం బ్రత్యపకార మొనరింపనివా రెల్లరు సహనశీలురే యని నుడువ వలను పడదు. శక్తి సంపన్నుండయి యుండియు మనుష్యుండు తన కపకార మొనరించినవారికిం బ్రత్యపకార మొనరింపక మీందు మిక్కిలి యుపకారమే యొనరించునేని నిశ్చయముగా నట్టివాం డోర్పునందు లోకోత్తరుం డనియే యెన్నంబడంగలండు.

"కం॥ ఉపకారికి నుపకారము
విపరీతముకాదు సేయ ♦ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాండె ♦ నేర్పరి సుమతీ!"

ప్రపంచరంగమునుండి సమస్తదోషములును, సకల కిల్బిషములును, నిఖిలదుర్గుణములును నితాంత మంతరించి పోయినచో క్షమయొక్క యవసరమే యంతగాం దటస్థింప నేరదు. విశ్వప్రేమావతారమును, లోకపావనుండును నగు జీససు క్షమను గూర్చి తనశిష్యుల కీరీతి బోధించియున్నాండు.

"Love your enemies. Do good to them that hate you. Bless them that curse you. And unto him that smiteth thee on cheek offer also the other."

"నీ శత్రువులఁ బ్రేమించుము. నిన్ను ద్వేషించు వారికి మేలొనరించుము. నిన్ను దూషించువారి నాశీర్వదించుము. నీ చెంపపైఁ గొట్టువానికి రెండవ చెంపను గొట్టనిమ్ము."

గుణ మెచ్చోట కలదో దోషమును నయ్యెడనే వెలయు చుండుట సహజము. పరమపావనుఁ డగు సర్వేశ్వరుని సృష్టియందు సత్కర్మపరాయణులును, దుష్కర్మపరతంత్రులును, సుశీలురును, దుశ్శీలురును గలరు. సజ్జనులు దుర్జనులు తమ కపకార మొనరించినచో క్షమింపక తిరిగి వారికిఁ బ్రత్యపకార మొనరింపఁ గడంగినచో సజ్జనదుర్జనులందుఁ దారతమ్య మేమికలదు? క్షమయను పవిత్రగుణము శిష్టాశిష్టభేదము లేక సర్వమానవహితకరమయి యొప్పారుచున్నయది.

నేరస్థులయొక్క యపరాధముల నివారించుటయందు రెండు విధములగు సాధనములు ప్రయోజనకరము లగుచున్నవి. ఒకటి యపరాధమును క్షమించుట, రెండు ప్రభుత్వదండనము. దూరదృష్టి లేనివా రెండటో యాత్మజ్ఞానముచే హింసకుఁ బ్రతిహింస యొనరింపక దుష్టులయొద్ద సహనము నవలంబించువారల దుర్బలు లనియు, కాపురుషు లనియుఁ దెగడుచుందురు. లోకుల యిట్టి సంకుచితభావముచే వారి బుద్ధిమాంద్యమును, జ్ఞానశూన్యతయు వెల్లడియగుచున్నవి. కొట్టిన వారినిఁ దిరిగి దండించువాఁడు ధీరుఁడు కానేరఁడు. క్షమించువాఁడే ధీరుఁడు లేక ప్రజ్ఞావంతుఁడు.

కం॥ పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ
బడుచుందురుగాని పరమ ♦ భాగవతులు దా

రోడఁబడరు మాఱుసేయఁగ,

.............................

—భాగవతము.

క్షమామాత్రప్రయోగమును గూర్చి యనేకు లనేకవిధంబుల బొరఁబడుచున్నారు. ప్రాజ్ఞులు కానివారు సూత్రము యొక్క బాహ్యార్థమునే గ్రహించుచుందురుగాని, విశేషార్థమును, అంతరార్థమును గుర్తింపఁజాలరు. లోకమందలి సమస్తాపరాధములను సహనముకంటె పవిత్రమగు ధర్మము మఱొండులేదుకదాయని భావించి క్షమించుట సమంజసము కానేరదు. ఎట్టి ఘోరాపరాధములనైన నిరంతరము క్షమించుచుండుటచే లోకవ్యవహారము సాగుటయే యసంభవము కావలసివచ్చును.

అట్టిస్థితియందు ప్రపంచమందలిమూఢులెల్లరు విచ్చలవిడిగా సంచరించుచు జ్ఞానము లేకపోవుటచే నిరంకుశబుద్ధులయి, ప్రభుభీతిని విడచి ఘోరోపద్రవములఁ జెలరేఁగ జేయుచుండఁగలరు. భూపాలురయొక్క సామ్రాజ్యనిబంధనలును, శాసన ప్రణాళికయు నట్టిస్థితియం దొక్కసారిగ భంగపడి పోవలసివచ్చును.

దండించువారు లేరుగదా యను నిర్భయముచే దుర్మార్గు లనుదినము, అనుక్షణము సాధువుల బాధించుచు దుష్కర్మ లెన్నియో చేయుచుండఁగలరు. ఘోరాపరాధములఁ గావించిన దుష్టులు తాడనపీడన నిర్బంధవాసములచే బాధింపఁబడుదురను శాసనమును భూపాలురు ప్రకటింపనిదే జనసామాన్యమందు సుస్థిరమగు శాంతి నెలకొనఁజాలదు.

నిరంతరము సాధుసత్తముల సంహరించుచు దానవుఁడయి, నరహంతకుఁడయి, క్రూరుఁడయి చరించు నరాధముని బట్టి దండింపక క్షమించుటయే ధర్మమని భావించి వాని రాక్షస వృత్తి నాటంకపఱచనిచో మనము క్షమను దుర్వినియోగ మొనరించిన పాపమునకుఁ బాత్రులము కావలసివచ్చును.

తెలియక దుష్కృత మొనరించినవాఁడు క్షమార్హుఁడు. తెలిసియు నపవిత్రకర్మ నాచరించి పిమ్మట నద్దానికయి పశ్చాత్తాపతప్తుఁ డగువాఁడును క్షమింపఁబడఁదగినవాఁడే. అజ్ఞానముచే మంచిచెడ్డల రెంటి సమానమని నుడువుచు దుష్టకార్యముల గుత్తగొనువాఁడు తీవ్రదండనకు గుఱి కానంతవఱకు సంస్కరింపఁ బడఁజాలఁడు.

నేఁడు మనదేశమునఁ బ్రభుత్వసంస్థాపితము లగు న్యాయాలయములు పాపాత్ములకు భయంకరదండనల విధించు చున్నను పాపములు తగ్గుటకు మాఱుగాఁ బెచ్చు పెఱుగుచునే యున్నవి. సద్విద్యావ్యాపనము లేకపోవుటయు దీని కొక ముఖ్యకారణము కావచ్చును. దుష్టజనమండలియందు క్షమ విశేష ప్రయోజనకారి కానేరదు.

దండనవిధాన మహింసాపద్ధతికి విరుద్ధమని భావించు పక్షమునఁ బ్రభుత్వము సైన్యవిభాగమును దగ్గించి బౌద్ధమహా యుగమునందువలె లక్షోపలక్షల సంఖ్యయందు ధర్మోపదేశ కుల నియమించి వారిమూలమున దేశమునందంతట సత్య ధర్మజ్ఞాన ప్రచార మొనరింపఁజేసినచో దేశకాలపాత్రల భేదమును బాటింపకయే క్షమ ప్రయోగింపఁబడవచ్చును.

వేమనాది మహాత్ములు సయితము ప్రాణము పోవుచున్నను, పోవనున్నను శత్రువున కేవిధమగు హానియుఁ గలి

గింపరా దని నుడివియున్నారు. ఇది క్షమాధర్మముయొక్క చరమ భాగము. విశ్వప్రేమసిద్ధాంతముయొక్క లోకోత్తరాదర్శము. కాని క్షమయొక్క యీ యున్నతాదర్శము జనసామాన్య సాధ్యము కానేర దనుట రూఢి.

"ఆ॥ చంపఁదగినయట్టి ♦ శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు ♦ సేయరాదు
పొసఁగ మేలుచేసి ♦ పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ ♦ వినుర వేమ"

ఋష్యాదులు క్షమయొక్క ప్రభావమును సహస్రముఖంబుల సంస్తవ మొనరించియున్నను, భయంకరాపరాధుల యొక్క ప్రకృతులఁ బరిశీలించి దండనయొసంగుట రాజధర్మమని స్మృతులందు వ్రాసియున్నారు. సంస్కరణాభిప్రాయముతో నేరస్థుఁడు న్యాయసంగతమగు దండనకు గురియగుట శ్రేయస్కరమే యగును.

అనుదినముయొక్క సాధారణ వ్యవహారములపై పునకు మనము మనదృష్టిని బ్రసరింపజేయుదుమేని ప్రతి యపరాధమునకును దండన మనావశ్యక మను భావము మనకు స్ఫురింపకపోదు. శుద్ధసాత్త్వికహృదయముతో నిజదోషము నంగీకరించువానిని ముం దట్టిదోష మొనరింపనను పద్ధతిపై విడిచిపుచ్చవలయునేకాని రాజశాసన మొప్పదని దండింపరాదు.

సామాన్యమగు నపరాధ మొనరించినవాని తత్కాలప్రకృతినిఁ బరిశీలించినపుడు భవిష్యద్దశయందు వాఁడట్టి నేర మొనరింపఁడని మనమదికి స్థిరపడినఁ దత్క్షణము వానిని క్షమించుటయే మనధర్మము. అనవరతదోషపరాయణుండగు

వ్యక్తిని దుష్పథమునుండి సత్పథానుగామి నొనరించుటకు యథోచితదండనమే కల్యాణదాయకమగు సాధనము. న్యాయప్రదాత దండన విధించుటకుఁ దొలుత నేరస్థుఁడే యుద్దేశ్యముతో నేటిస్థితియందపరాధము గావించినదియు బాగుగా విచారించు టావశ్యకము.

వాఁడు క్రూరుఁడయి, ద్వేషాంధుఁడై విశుద్ధమానవ హృదయమును దుఃఖింపఁజేయునిమిత్తము బుద్ధిపూర్వకముగ దోష మొనరించినటుల నిశ్చయమగునేని క్షమార్హుఁడు కాఁజాలఁడు. చోరుఁడు పట్టువడినపు డవశ్యము శిక్షింపఁబడ నిదే సంస్కరింపఁబడి తన భావిజీవితమును సుఖమయముగఁ జేసికొనఁ జాలఁడు. ఈవిషయములన్నియు రాజ్యాంగము యొక్క ముఖ్యాంగమగు దండనీతికి సంబంధించినవి.

నేఁడు గాంధిమహాత్ముఁడు లోకమందంతట వ్యాపింపఁ జేయుచున్న యహింసాతత్త్వము పరిశుద్ధమగు క్షమననుసరించియే వెలయుచున్నది. ఆతఁడు తన సత్యాగ్రహమున క్షమనే ముఖ్యధర్మమని బోధించుచున్నాఁడు. అనేకసందర్భములందు బవిత్రధర్మమగు క్షమ లోకమున కశేషశ్రేయస్సు నొడఁగూర్చునదయి యుండుటంజేసియే ప్రాచీనపండితులు క్షమ ననేక విధములఁ బ్రశంసించియున్నారు. క్షమచే దౌర్జన్యోత్పత్తి నశించుచున్నది. కావుననే గౌతమమహర్షి క్షమ నీరీతి స్తుతించి యున్నాఁడు:—

"క్షమా హింసా క్షమా ధర్మః క్షమాచేంద్రియనిగ్రహః
క్షమా దయా క్షమా యజ్ఞః క్షమా ధైర్య ముదాహృతం
క్షమావాన్ ప్రాప్నుయాత్ స్వర్గంక్షమావాన్ ప్రాప్నుయా ద్యశః,
క్షమావాన్ ప్రాప్నుయాత్ మోక్షం క్షమావాం స్తీర్థముచ్యతే."

"క్షమయే అహింస. క్షమయే ధర్మము. క్షమయే ఇంద్రియనిగ్రహము. క్షమయే త్యాగము. క్షమయే ధైర్యము. క్షమచే స్వర్గాపవర్గములు రెండును బ్రాప్తించును. క్షమ కీడగు పవిత్రరక్షణసాధనము వేఱొండు లేదు."

మొన్న మొన్నటివాఁడును, సమస్తభారతవర్షపూజ్యుఁడును నగు రామకృష్ణపరమహంస క్షమనుగూర్చి యిట్లు వచించియున్నాఁడు:—

"వర్ణమాలయందు నక్షరము లన్నియు వేఱువేఱుగా నున్నవి. హకారమునకుఁ బూర్వమందున్న శ, ష, స యను మూఁడక్షరములవలన 'సహించుము, సహించుము' అను బోధ లభించుచున్నది. క్షమయే తపస్సు. అదియే శాశ్వతధనము.

అన్యులు మనల దూషించినపుడుగాని, నిరసించినపుడు గాని, దుర్భాషలాడినపుడుగాని, పరుషవాక్యములచే మన మదుల నొవ్వఁజేయ యత్నించినపుడుగాని మనము ప్రశాంత చిత్తులమయి క్షమయొక్క ప్రభావముచే వాని నన్నింటి సరకుఁజేయనివారలమయి యుండవలయును. అన్యు లెవరేని మనల సన్మానింపలేదనికాని, గౌరవముగ సంబోధింపలేదని గాని మన మేస్థితియందును భావింపరాదు. ఇట్టి సామాన్యము లగు విషయముల నన్నింటిని సదా సహించుచుండుటవలననే మనయం దొకవిధమగు నాధ్యాత్మికశక్తి యావిర్భూతమయి మనల సుఖదుఃఖముల రెంటిని లెక్కింపనంతటి ధీరులుగను, స్థితప్రజ్ఞానంతులుగను జేసివేయును.

"కం॥ అలిగిన నలుగక యెగ్గులు
వలికిన మఱి వినని యట్లు • ప్రతివచనంబుల్

వలుకక బన్నము వడియెదఁ
దలఁపకయున్నతఁడు చూవె ♦ తత్త్వజ్ఞుఁ డిలన్"

ఇట్లు వర్తించుటచే మన జీవితమున కేవిధముగను నపాయము సంభవింప నేరదు. మన మే దేశమందున్నను సుర క్షితులమయి యుండఁగలము ఈ రహస్యము నెఱింగియే భర్తృహరి 'క్షాంతి శ్చేత్కవచేన కిం' క్షమయే యున్నచో దేహసంరక్షణమునకుఁ గవచమేల!' అనివచించియున్నాఁడు. నిశ్చయముగా సహనశీలునికంటె వసుధయందు సురక్షితుఁ డయి యుండువాఁడును, సౌఖ్యవంతుఁడును వేఱొక్కఁడు లేఁడు.

దుర్యోధనుని యన్యాయముచే ఘోరారణ్యముల నాశ్రయింపవలసివచ్చిన పాండునందనులు దివారాత్రములు సౌఖ్యముల నెఱుంగక కందమూలముల భక్షించుచు, వల్కల ముల ధరించి, శీతవాతాతపములకు బాధపడుచుఁ గంటకాకీర్ణ ములగు పథముల నడచుచు, శిలామయభూమిపైఁ బరుండుచు దుర్భరదుఃఖముల సహించుచుండిరి. అట్టి దుఃఖమయ దినము లలో నొకనాఁడు ద్రౌపది సంతప్తహృదయ యయి ధర్మ నందనుని విలోకించి యీరీతిఁ గడు మృదుమధురముగ వచించెను :—

రాజా! తమ క్షాత్రమునకును, ధర్మమునకును, పరా క్రమమునకును కోటి ధిక్కారములు. తమ రొకనాఁడు రత్న ఖచితంబగు హేమ సింహాసనముం దారూఢులయి యుండిరి. నేఁడు గర్భదరిద్రులవలె, నాటవికులచందమునఁ గంటకాకీర్ణ మగు కఠినభూతలశయ్యపై శయనించుచు రుచిలేని కంద

మూలముల భక్షించుచు సౌఖ్యముల కలవడియుండిన కోమ లాంగి నగు నాకును దుఃఖమును కలిగించుచున్నారు.

సమస్తలోక వంద్యులయి, పాండుభూపాలునంతటి వాని ప్రథమతనూభవులయి, భీమార్జున నకుల సహదేవులం బోలు సింహకిశోరముల కన్నలయి యున్న మీ క్షత్రియత్వ మును, ధర్మపరాయణత్వమును, శమక్షమాది సద్గుణములును మీ యర్ధాంగిని నగు నాకెట్టి ప్రయోజనమును సౌఖ్యమును గలిగింపనేరవయ్యె.

తన యపూర్వ బాణవిద్యాకుశలత్వముచే సమస్త కురుసైన్యమును హత మొనరింపఁజాలినట్టి మేటిజెట్టి కిరీటి మీ చెంత నుండ మహాబలుఁ డను ప్రఖ్యాతి వడసి, గదా యుద్ధమున సమస్త ప్రపంచమును గజగజలాడించిన భీమ సేనుఁడు మీచెంత నిలువ, యుద్ధవిద్యయం దద్భుత సామ ర్థ్యముగల నకులసహదేవులు మీ సన్నిధి వెలయుచుండ మీ రింకను దుర్బలులవలె, భీరువుల చందమున, గర్భదరిద్రుల మాడ్కి గంజికయినను నోచక క్షుధార్తిచే నీ భయంకరాట వులఁ బడియుండనేల? లెండు! శీఘ్రమే సమరాగ్ని రగు ల్కొలిపి కురుసేన నద్దాని కాహుతిఁ గావించుఁడు. సుఖించి మమ్మెల్లర సౌఖ్యములఁ దేలలాడింపుఁడు. దిక్కు లేనివారి వలె దుఃఖముల ననుభవించుచుండియు క్షమను గలిగియుండు టేటి క్షత్రియ ధర్మమో —వీర పురుషలక్షణమో గ్రహింప శక్యము గాకున్నది.''

తన సతీమణియగు ద్రుపదపుత్రికయొక్క శోకతాప పూరితములగు వచనముల నాలించినంతనె ప్రేమస్వరూపుఁ

డగు ధర్మనందనుని నేత్రద్వయమునుండి యప్రయత్నముగ నశ్రుబిందువు లాణిముత్తెములవలె జలజల రాలెను. అంతఁ నతఁడు రుద్ధకంఠముతో శాంతముగ నిటుల నుడివెను :—

ప్రేయసీ! అశాశ్వతమగు శరీరముయొక్క క్షణిక సౌఖ్యముల నపేక్షించి ఘోరములగు పాపముల కొడిగట్టి యుద్ధ మొనరించి, బంధుబాంధవుల హత మొనర్చి, భ్రాతృ ఖండితశీర్ష సోపానముల మీఁదుగ సింహాసనము నధిరోహించు రాక్షస కృత్యమున కొడఁబడుటకంటెఁ ప్రశాంతగంభీరములగు నిట్టి వనముల నెవ్వాని కెట్టి యపకార మొనరింపక, కందమూలాదుల భక్షించుచు దయామయుండగు పరాత్పరుని వింతల సానందముగ నయనాభిరామముగఁ గాంచుచు, భగవంతుని ధ్యానించుచు, నవకాశములం దెపుడు సద్విషయములను గూర్చి ప్రసంగించుకొనుచు విజ్ఞానధనులగు ఋష్యాదుల సేవా శుశ్రూషలఁ గావించుచు జ్ఞానపూర్వకముగ సాధు జీవయాత్ర సేయుట సహస్రగుణము లుత్తమంబుగాదే?

దుర్యోధనాదులు మనల ద్వేషించినారని, దూషించినారని తిరిగి మనము నయితము వారిని నిందించినను, హింసించినను దోషమే యగును. మనకుఁ గీడు తలఁచిన శత్రువునకు మనము మేలొనరింతుమేని ధర్మపక్షపాతియగు జగదీశ్వరుఁడు మనల కవశ్యము హితమును కలిగించును. దుర్యోధనాదులకు వెఱచి కాని, భీమార్జునులు సుయోధనాదు లంతటి పరాక్రమవంతులు కారని గాని నేను శత్రు మారణమునకుఁ గడంగియుండ లేదు. క్షమ యుత్తమ మానవ లక్షణమని యెంచియే సుయోధనాదులు తమంతట

తామే తమ భ్రాతృద్రోహమునకయి పశ్చాత్తాప పడఁగల రని తలంచియే నేను పోరు సలుప మాని అరణ్యావాసమున కియ్యకొంటిని దేవీ !

"క్షమాతుల్యం తపో నాస్తి న సంతోషా త్పరం సుఖం
న చ తృష్ణపరో వ్యాధి ర్నచ ధర్మో దయాపరః."

"క్షమకు సమమగు తపంబును, సంతోషమున కీడగు సుఖంబును, తృష్ణకు తుల్యమగు జాడ్యంబును, దయకు సరి వచ్చు ధర్మమును లేదు." అని ప్రాజ్ఞులు నుడువ వినలేదే ? ధర్మజిజ్ఞాసను గలిగియున్న నాకు క్షమకంటె జీవితమున కలంకారప్రాయమగు వస్తువేదియు గోచరించుట లేదు. క్షమ వలననే మిత్రులు శత్రులను భేదములేక సమస్తమానవుల మన హితైషులుగఁ జేసికొనవచ్చును. క్షమయం దత్యంతమగు విశ్వాసగౌరవములఁ గలిగియున్న నా యంతరాత్మ యపకారికిఁ బ్రత్యపకార మొనరింప సాహసింపకున్నది.

"క్షమా బల మశక్తానాం శక్తానాం భూషణం క్షమా
క్షమావశీకృతి ర్లోకః క్షమయా కిం న సిద్ధ్యతి ?"

"సబలులకును, దుర్బలులకును క్షమయే భూషణము. క్షమ సకలలోకమును స్వాధీనమొనరించుకొన సమర్థమయి యున్నది. క్షమచే సిద్ధింపని దేది కలదు ?"

'క్షమారూపం తపస్వినాం, 'ధరణిసహనమేరూపంబు తాపసులకు' అను నీతివాక్య మెంతయుఁ బవిత్రమయినది. తపోధనులకు సైతము వన్నెను గలిగింపఁగల క్షమ నాయందున్నచో నందుల కెంతయు సంతసించుటకు మాఱుగా నీ వేల బేలవయి విలపించుచున్నావు ?'

ఉపదేశపూర్వకములగు ధర్మజుని సాంత్వనవాక్యములచేఁ బతివ్రతయగు ద్రౌపది సంతుష్టాంతరంగ యయ్యెను. కశ్యపమహర్షి క్షమయే తపమనియు, క్షమయే ధనమనియు, క్షమయే సత్యమనియు, క్షమయే ధర్మమనియు క్షమకు బాహ్యముగా నీ జగతీతలమునం దే పదార్థము లేదనియు నొక్కి వక్కాణించియున్నాఁడు.

విద్యార్థులారా! చీటికి మాటికి సామాన్యవిషయముల కయి కుపితులగుచు, పరమపావనమగు నోరిమివంటి దైవికసంపత్తిని నష్టమునొందింపకుఁడు. సహనశీలతచే నాధ్యాత్మికశక్తి వికసింప నిహమునందుఁ బ్రతిష్ఠయు, గౌరవమును, సౌఖ్యమును, పరమందు శాంతియు లభింపఁగలవు.

"ఓం సహనావవతు సహనౌ భునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై సహోఽసి సహోమయి ధేహి."

కృపాసింధూ! తావకంబగు కృపావిశేషముననే మేము సురక్షితులమయి యున్నారము. దేవా! నీవు మా యానందము నభివృద్ధిఁగావించుము. నీవు సహనశక్తిసంపన్నుఁడవు. కావున మాకునయిత మట్టి సహనశీలతను ప్రసాదించి యనుగ్రహించుమని విద్యార్థులు సదా ప్రాతస్సాయంసమయములఁ బ్రార్థన సలుపునపుడు జగదీశ్వరు నర్థింపఁదగును.

శుభమస్తు!



# అఋపదవ ప్రకరణము



## దమము

మ॥ అనయంబున్ దమవంతుఁడై వినుతశిష్టాచార మార్గంబులన్
జనుపుణ్యాత్ముఁడు దుర్గతుల్ గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై
కనుచుండున్ బటుమోహపంకజలమగ్నంబైన లోకంబువీ
కనధోభాగమునందుడింది కడుదుఃఖంబొందగా నవ్వుచున్.

—మహాభారతము.

దమమాదిగాఁగల శిష్టాచారయుక్తమగుసత్పథమున వర్తించు పుణ్యాత్ముఁడు శోకతాపాది దుర్దశలఁబాసి ప్రజ్ఞయను సర్వోత్తమమందిరమునధిరోహించి, వ్యామోహ మను బురదగుంటలోఁబడి దొర్లుచు నుపరిభాగమునకు రాఁజాలక కడు దుఃఖించుచుండు తృష్ణాబద్ధులఁ గాంచి నవ్వుచుండును.

దమముధర్మముయొక్క దశలక్షణములలోఁ దృతీయస్థానము నాక్రమించుచున్నయది. ఇంచుమించుగ దమమింద్రియ నిగ్రహమునకుఁ దుల్యముగనే యున్నదని వచింపవచ్చును. మహాపురుషులు "దమోనామ మనసో వృత్తినిగ్రహః" దమమనఁగా మానసముయొక్క వివిధ వృత్తుల నిగ్రహించుట యని వచించియున్నారు.

చిత్తముయొక్క చంచలములగు దుష్ప్రవృత్తుల దమన మొనరించి వానిస్థానమున సుస్థిరములగు సద్వృత్తుల నెలకొల్పుటయే దమముయొక్క ముఖ్యవిధి. చిత్తసమేతముగ సమస్తేంద్రియముల నాత్మాధీనము గావించుటయు దమ మనియే నుడువఁబడుచున్నది. ఏది యెట్లున్నను భావనిగ్రహమే దమముయొక్క పరిణామమనుటమాత్రము నిశ్చయము. మానవజీవితవిధులలో నుత్తమోత్తమంబగుతపమున దమము ముఖ్యముగా సమ్మిళితమయి యున్నది.

ఆత్మ చేతనపదార్థము. జడప్రాయ మగు దేహముయొక్క సమస్తకార్యముల నెఱవేర్చున దీయాత్మయే. కావుననే సమస్తమతగ్రంథములాత్మనుసర్వోత్కృష్టపదార్థముగ నిశ్చయించియున్నవి. మానసమునకాలోచనాశక్తిని, భావించింతనశక్తిని బ్రసాదించిన దీయాత్మయే. ఆత్మయే నేత్రములకు దర్శనశక్తిని, కర్ణములకు శ్రవణయోగ్యతను, జిహ్వకు రుచిగ్రహణసామర్థ్యమును, నాసికకు నాఘ్రాణించు పటుత్వమును, చర్మమునకు స్పర్శజ్ఞానమును, కరచరణాది కర్మేంద్రియములకు దేహయంత్రమును నడపు వివిధములగు శక్తులను బ్రసాదించియున్నది.

మనుష్యదేహయంత్రము నొక సర్వోత్కృష్టపదార్థముగ సిద్ధమొనరించుటయందాత్మయే యుపాదాన కారణమయినది. ఇంద్రియములు స్వేచ్ఛాపరతంత్రములయి, చిత్తము సర్వస్వతంత్రమయి ఆత్మకథనానుగుణ్యముగ వర్తింపనిచో మనుష్యునిజీవితము భయంకరదుర్దశగ్రస్తము కావలసివచ్చును. మానసము మానవుని యాత్మవలెనేనిర్మం

మయి, పవిత్రమయి, సద్భావనముల కాకరమయి యున్న పుడే జీవిత మభ్యుదయ పదవి నందఁగలుగుచున్నయది. ఆత్మవిజ్ఞానమునకు విరుద్ధము లగు దుర్భావములఁ జింతించు మానసమును గలిగియుండుటచే మనుష్యజీవితనౌక దుఃఖ వారిధియందు మునిఁగిపోవుచున్నది.

"యేన కర్మా ణ్యపసో మనీషిణో
యజ్ఞే కృణ్వంతి విదథే సుధీరాః,
యదపూర్వం యక్షమంతం ప్రజానాం
తన్మే మనః శివసంకల్ప మస్తు."

"ఏమానసముచే బుద్ధిమంతులును, సత్స్వభావులును, విచారపరాయణులును శుభకార్యాచరణంబునను, పాపకార్య విధ్వంసయత్నమునను సుకృతాత్ములయి యుండుచుందురో ఎయ్యది విస్మయోత్పాదకమును, సంపూజ్యమును, సమస్త ప్రాణిసంఘహృదయవిరాజితమును నయియున్నదియో, అట్టి నామానసము శుభసంకల్పములచే వర్తించునుగాక!"

ఇట్టి పవిత్ర విచారణబలముచే మానవుని చిత్తసీమ నుండి దుర్భావములు తొలంగ వాఁడనుదినము దమవంతుఁడయి సమున్నతజీవనుఁ డగుచుండఁగలఁడు. మానవజీవితోత్థానకరమును, నిశ్చలసౌఖ్యానందప్రదమును నగు పరిశుద్ధజ్ఞానము దమముచే మానవాత్మకు సంప్రాప్త మగుచున్నయది. దమశూన్యమగు మనుష్యజీవితము దుఃఖభయభూయిష్ఠమయి, భవతాపపీడితమయి, నిరంతర విపత్పరంపరలఁ జిక్కుచు, సొక్కుచు, బొక్కుచు నుండఁగలదు.

బాల్యకాలమాదిగ దుర్జనసాంగత్యమునఁ బెరిఁగి దురభ్యాసములకును, దుర్వ్యసనములకును జిక్కుపడి యౌవనదశకు

వచ్చియున్న మనుష్యుని చిత్తము నింద్యములగు విషయా
దులయం దాసక్తమయి, దుష్కార్యముల నాచరింప నుత్స
హించుచుండును. పరిశుద్ధమగు జ్ఞానమయ వాతావరణ
మునఁ బోషింపఁబడని మనుష్యుని చిత్త ప్రవృత్తులయందుఁ
జాంచల్యము, మాలిన్యము నెలకొనియుండుచుండును. తరుణ
ప్రాయమందు సద్గ్రంథములఁ బఠించి, ధర్మముల గుర్తిం
చియో, సత్పురుషుల సాంగత్యముచే యుక్తాయుక్తములను,
హితాహితములను గ్రహించియో, దుష్టశిష్ట మానవప్రపం
చమును నిత్యము సందర్శించుచుండుటచే సత్యాసత్యాను
భవపరిజ్ఞానము నందియో కొందఱు బుద్ధిమంతులు మన
శ్చాంచల్యము నుడుగఁజేసి, చంచలములగు ప్రవృత్తుల
నిరోధించి దమవంతులయి నునుటకు వాంఛించుచుందురు.
అట్టివారి వాంఛ ప్రశంసనీయమును, శాంతిదాయకమును
ననుట కెట్టి సందియమును లేదు. కాని వారి యీ యుత్తమ
సంకల్పము సఫలీభూత మగుట కెంతయో శ్రమయు, వ్యవ
ధియు, సహిష్ణుతయు నావశ్యకము లగుచున్నవి.

తామస, రాజసమగు నస్వాభావికాహారభక్షణమున
కును, ప్రకృతివిరుద్ధములగు విహారములకును నలవడిన స్త్రీ
పురుషుల వీర్యముచే సృజింపఁబడినవారు బాల్యమందు దుష్ట
సహవాస సంప్రాప్తములగు దురభ్యాసములకుఁ జిక్కియుండి
యొక్కసారిగ దమవంతు లగుటయందుఁ గృతార్థతను
గావించుట బహుకష్టసాధ్యము. సత్య మాలోచించిన
దమము లేని జీవితము కడు దుఃఖమయము.

"Man without self restraint is like a barrel
without hoops, and tumbles to pieces."
—Ward Beecher.

"దమములేని మనుష్యుఁ డేమియుఁబో టొగ్గనికంబము వలె విఱిగిపడి ముక్కలగుట నిశ్చయము."

—వార్డు బీఛెరు.

దమము కేవలము చిత్తమునం దభిలషించినంత మాత్రముననే లభించు సామాన్యమగు పదార్థము కాదు. దమ మసాధ్యమును గాదు. మనుష్యుఁడు తాల్మిని వీడక, విశేషమగు శ్రమ సలుపుటచే దమవంతుఁడు కాఁగలుగు చున్నాఁడు. వివిధలక్షణమగు సౌందర్యముచే విభ్రాజితమై పలుతెఱంగుల రంగుల నీనుచుఁ జీటికి మాటికి నత్యద్భుతము లును, విస్మయానందకరములును నగు విచిత్రములఁ బ్రదర్శిం చుచుండు సృష్టియొక్క దశదిశలకు శాఖాన్యగమున లెఁ బర్వెత్తుచుండుచిత్తమును వశీకృత మొనరించుకొనుటకు విజ్ఞా నానుభవసంపన్నులగు ఋష్యాదు లెన్నియో ప్రశస్తములగు మార్గముల ధర్మగ్రంథములచే మనకుఁ దెలిపియున్నారు.

ప్రాణాయామము, ఈశ్వరధ్యానము, జపమాలను ద్రిప్పుట, సంకల్పమును వికల్ప మొనరించు యత్నము, నిరంత తరోద్యోగ పరతంత్రత, అవకాశములందు సద్గ్రంథపఠనము సత్పురుషసంపర్కనము, సద్విషయగోష్ఠి, ఏకాంతజీవనము, తత్త్వప్రసక్తి, ఆడంబరశూన్యములగు సాత్త్విక వేషభాషా భోజన శయన మజ్జన వ్యవహారములు మున్నగు ననేకపద్ధ తుల నవలంబించి చిత్తప్రవృత్తుల నిగ్రహింపవలసిన దని వీతరాగులగు ఋషిపుంగవులు మానవహితము నభిలషిం చుచు నుడివియున్నారు.

ఋషిప్రోక్తులు నుడివియున్న యీ సాధనము లన్నియు మనోవశీకరణమును గూర్చియే కృషి సలుపునవయి యున్నవి. మానస మెపుడు మన స్వాధీన మగునో, మన మపుడే దమవంతులమయి, ప్రజ్ఞావంతులమయి నిశ్చలానందము ననుభవింప సమర్థుల మగుచున్నారము.

"తే॥గీ॥ సదమలంబయి సుగుణాళి ♦ సదనమైన
స్వాంత మేకద భువిలోన ♦ స్వర్గ మనఁగ
మలినమయి దుర్గుణాళికి ♦ నిలయమైన
చిత్తమేకదా నరకంబు ♦ సెపుము మనస."

—ప్రబోధ శతకము.

దమమును సంపాదించు విషయమున హైందవులు నేఁటికిని ఋషిప్రోక్తమగు సూత్రమును పల్లించుటను విసర్జింపకున్నను సూత్రార్థమునకు మాత్రము విరుద్ధముగనే సంచరించుచున్నారని నుడువక తప్పదు. మనుష్య జీవిత నిర్మాణమునకు, బునాది వేయఁదగిన బాల్యమున బిడ్డల స్వాభావికములగు దుశ్చేష్టల కలనడి, దుష్టస్వభావులయి, దుర్వ్యసనముల నభ్యసించుచుండఁ బ్రేమయున నెట్టిదో యెఱుంగని మాతాపితలును, బంధుబాంధవులును వారి నట్టి దుష్క్రియాచరణమునుండి నిరోధింపక, ప్రబోధింపక, మీఁదుమిక్కిలి "కుఱ్ఱతనమున నుండు కొంటెతనము యౌవన కాలమం దుండ నేర్చునా? తెలియక బాల్యమునం దొనరించు తప్పులను బిడ్డలు పెద్దవార లయినంతనే లోకానుభవ జ్ఞానసంపన్నులయి తమంతట తామే సవరించుకొనగల" రని వచించుచు సంతానహితవిషయమునందలక్ష్యమును వహించుచున్నారు.

దూరదృష్టిలేని మనపెద్దల యీ యవివేకమున కెంత యుఁ జింతింపవలసివచ్చుచున్నది. ఉగ్గుపాలతో నొసఁగబడిన జ్ఞానసారము బాలుని దేహముయొక్క ప్రతిరక్తకణమందును వ్యాపించి వాని నప్రతిహతమగు ప్రతిభావంతునిగను, అసామాన్యమగు ప్రజ్ఞాశాలిగను, అపూర్వమేధావంతునిగను సిద్ధమొనరింపఁగలదు.

పచ్చిగానున్న వెదుళ్లు వంచఁబడునటుల నెండిన వెదుళ్లను వంపఁ జూచిన నవి పెళ్ళున విరిగిపోఁగలవు. దమపూర్వక మగు జీవితక్రమమునకు బాల్యమునుండియు సంరక్షకులగు జననీ జనకులచేఁ బునాదులుఁ వేయబడిన సంతానముయొక్క భావిజీవితము సంయమితమయి సౌఖ్యానంద కందమగు ననుట నిస్సందేహము. సంయోగవియోగజ్ఞానముచేఁ బ్రవృత్తి నివృత్తిని జెందునని ఋషుల యనుభవము తెల్ల మొనరించుచున్నయది.

సంకల్పోత్పత్తికి వెనువెంటనే వికల్పచింతనము నభ్యసించుటచే మనుష్యునియందుఁ జిత్తవశీకరణశక్తి యేర్పడఁగలదు. మనుష్యుఁడు కాంతనో, ధనమునో, సుందరమగు మఱియే యితరమగు పదార్థమునో వీక్షించినంతనే వానిచిత్తమందుఁ గామ ముదయించుచున్నయది. ఈ కామమునే మన మాసక్తియనియు, మోహమనియు నుడువుచున్నారము. మన యీ యాసక్తి భ్రాంతిమూలక మయినది. మనుష్యునకుఁ గాంతాభిలాష కలిగినంతనే వాఁడా కాంతను సంపాదించుట కనేకమార్గములఁ ద్రొక్కుచున్నాఁడు. అపుడు మానవుఁడు తన కాము తృప్తికయి

నీచోచ్చములను, ధర్మాధర్మములను విచారింపనివాఁ డయి దుష్క్రియాచరణోన్ముఖుఁ డగుచున్నాఁడు. దుష్కర్మ దుఃఖమువంటి దుష్పరిణామాంత మయియున్నది.

"యా దుస్త్యజా దుర్మతిభి ర్యా నజీర్యతి జీర్యతః
యోఽసౌ ప్రాణాంతికో రోగస్తాంతృష్ణాంత్యజతఃసుఖం."

"అధమ విచారపరాయణు లెద్దానిని విడిచిపుచ్చఁ జాలరో, ఎయ్యది మనుష్యులు నశించినను, నశింపకయుండి ప్రాణముల సయితమపహరించునో, అట్టి తృష్ణ (వ్యామోహము) ను విసర్జించుటవలననే సౌఖ్యము సిద్ధించును."

మనుష్యుఁడు తన కెట్టెదుటఁ గాననగుచున్న సుందర కామినీమూర్తిని జిత్తమున సంస్మరించుచు "ఆహా! ఈ భామామణి తరళనయనము లెంత తేజోమయములు! సుందరములు. గండుతుమ్మెదల గేరు కురు లెంతమనోహరములు! సుధాకర బింబమువంటి వదన మెంత మనోజ్ఞమయినది!" అను దుష్టభావములు చిత్తమునఁ బొడసూపినంతనే యట్టి దుష్టసంకల్పములఁ దుదముట్టించు నిమిత్తము సత్సంకల్పముల నవలంబింపనలయును. వాఁడు వెంటనే—

"ఆ॥ స్త్రీలముఖముజూచి♦చిత్తంబునిలుకడఁ
జేయలేక నరుఁడు♦చెడునుగాదె!"

అను వేమనార్యుని నీతిని స్మరించుచు "హరి హరీ! నే నెట్టిపాపమునఁ గొడిఁగట్టితిని? ఎంతటి జడమతినయితిని. నవ మలద్వారములతోఁ గూడియున్న ముఱికితిత్తికయి నే నెంత కామాంధుఁడనయితిని. పరకాంతను గన్నెత్తి వీక్షింపరాదను నీతివాక్యమును విస్మరించి దేవునిదృష్టియందు నే

నెంత పతితుండనైతిని? కడు హీనమగు ముఱికితిత్తిని-రేపో మాపో భస్మము కానున్న మట్టిబొమ్మను బ్రహ్మపదార్థము గను, ఆనందమయ వస్తువుగను భ్రమించిన నా జడబుద్ధికిం గోటి ధిక్కారములు.

"నేంటినుండి నే నిట్టి హీనములగు నీచభావములకు నా మదియందుం దావొసంగకుందునుగాక!" అను పవిత్రభావములచేం జిత్తముయొక్క కామాంధమగు సంకల్పమునకు వికల్పమును గలిగించుచుండినం గ్రమక్రమముగ మనుష్యుని చిత్తమందు రాగము నశించి, విరాగము హెచ్చి వానిని దమవంతుని గావించును.

"నారీ స్తనభర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏత న్మాంసవసాదివికారం
మనసి విచింతయ వారం వారం."

—శంకరాచార్యులు.

"ఓరీ మూఢా! స్త్రీలకుచములంగాంచి మోహ మందకుము. అవి క్రొవ్విన రక్తమాంసపు ముద్దలని సారె సారెకు మనంబునం జింతించుచుండుము."

శంకరాచార్యుని యీతత్త్వచింతనపద్ధతి దుష్టసంకల్పమును వికల్ప మొనరించుటకుం బ్రశస్తమగు సాధనమయియున్నది. చిత్త మాసించు ప్రతినీచపదార్థము దుఃఖదాయకమనియు, నరకప్రాప్తికి మూలమనియు నిరంతరము చింతించు వాని మదియందు క్షీరమును మథింపగా నవనీత మేర్పడు రీతి దమము స్థిరపడుచుండంగలదు.

మనస్సు నేస్థితియందును నిరుద్యోగముగ నుండనీయ రాదు. కార్యభారము లేనపుడు మనస్సు పరిశుద్ధములగు భావములం జింతించుటచేం గ్రమక్రమముగాం జిత్తశౌచమేర్పడి, చపలత్వము నుడుగం జేయును. కావున విద్యార్థులు సదా పరిశుద్ధమగు జీవితమును గూర్చి చింతించు చుండవలయును.

"స్వవివేకఘనాభ్యాసవశా దాత్మోదయేన సా
సుశుభేశోభనాపుష్పలతేవాభినవోద్గతా."

—యో. వా. రామాయణము.

(శిఖిధ్వజరాజుయొక్క పత్ని చూడాల వృద్ధాప్యమునం దీరీతిగ నుండెను.):—"పరిశుద్ధ్యమును గూర్చి చీటికి మాటికిం జింతించువాని హృదయమునం దేజముదయించును. కావున వార్ధక్యమునం దీయమ నవముకుళిత కుసుమసంభరితలతికా విధంబున సౌందర్యప్రభాభాసురయయియున్నది."

సోమరితనముచే మనస్సు చంచలమై దుష్ప్రవృత్తులను దుష్టసైనికుల వెంటనిడుకొని, పుణ్యభావములను సాధుసత్తముల శాధించి, నేరారోపణమునం బట్టువడి న్యాయాధిపతియగు దేవునిచే దండింపంబడి దుఃఖములం జెందుచుండం గలదు. మానసిక నిరుద్యోగసమస్యను నివారించు ప్రయత్నము చిత్తప్రవృత్తుల నిగ్రహమునకుం బ్రబలసాధనమను రహస్యమును బోధించు కథ యొకటి కలదు.

ఒక సాధుసత్తముండు తన గృహకృత్యముల నిర్వహించు నిమిత్త మొక వేతనము నభిలషింపని పరిచారకుని సంపాదించెను. ఆ పరిచారకుండు తనకు నిరంతర మేదో యొక కార్యమును జూపించుచుండవలయుననియు, తన్ను నిరు

ద్యోగముగఁ గూర్చుండఁ బెట్టినపుడు తానొసంగు శిక్ష నను భవింప వలయుననియుఁ దన యజమానితో నొక యొడం బడిక చేసికొనియెను. సాధుసత్తముఁడగు యజమాని యను దినము చెప్పు కార్యములనెల్లఁ జతురుఁడగు భృత్యుఁడు క్షణ ములలో నిర్వహించివేయుచు ననుక్షణము నూతన కార్యములఁ జూపించుడని బాధింపఁ దొడంగెను.

సాధువు గత్యంతరము లేక యొడంబడికను స్మృతికిఁ దెచ్చికొని పనిని గల్పించ లేనిచోఁ దనకుఁ గీడు మూడునని తలంచి తనకుఁ బరిచితుఁడగు నొక ఋషిపుంగవుని చెంత కరిగి తన యాపద్దశను నివేదించుకొనియెను. విజ్ఞానధనుఁ డగు ఋషిసత్తముఁ డంత విషయమును గ్రహించి యిట్లుత్తర మొసంగెను:—"సాధుపుంగవా! నీభృత్యునకు నిరంతర మేదో యొక కార్యమును గల్పించుటయే నీ కిపు డావశ్యకము కావునఁ దత్క్షణము నీగృహసమ్ముఖమునం దొక పొడవగు స్తంభ మును స్థాపిత మొనరించి దానిని నిరంతర మెక్కుచు దిగుచు నుండవలసినదిగా నీపరిచారకున కాజ్ఞాపించుము. దానితో నతని మదమణఁగ నీకు వశవర్తియగును."

ఈకథయందు దృష్టాంతముగఁ గైకొనఁబడినభృత్యుఁడే మనస్సు. సాధువే యంతరాత్మ. క్షణములో మనస్సు లెక్కలేనన్ని పనులఁ బ్రారంభించి ముగించివేయుచుండును. నిర్వ్యాపారత్వము కలిగినంతనే చంచలప్రవృత్తిగల చిత్తము కామక్రోధలోభమోహమదమాత్సర్యాది ధూర్తులఁ బురి కొల్పి, అంతరాత్మపై దండెత్తి తత్సంపదలగు జ్ఞానాయు స్తేజోబలవీర్యములనెల్ల హరించివేయును.

విద్యార్థులారా! ఈరహస్యము నెఱింగి నిరుద్యోగులయి యుండక సదా మనస్సును స్వాధీనమునం దుంచుకొన యత్నించుచుండుఁడు. చిత్త మేకాగ్రముకాదేని యసంఖ్యాకములగు యనర్థములు వాటిల్లి మీ జీవితముల దుఃఖభాజనము లొనరించివేయును. శ్రుతులు సయితము మనస్సుయొక్క చంచలప్రవృత్తిని గుఱ్ఱెఱింగి యది చెప్పినచొప్పున వర్తింపరాదనియు, సదా మనస్సు విషయమున జాగ్రత్తగ నుండవలయుననియు వచించియున్నవి.

"యజ్జాగ్రతో దూర ముదైతిదైవం
తదుసుప్తస్య తథైవైతి
దూరంగమం జ్యోతిషాం జ్యోతి రేకం
తన్మే మనః శివసంకల్పమస్తు."

"ఎయ్యది జాగ్రదవస్థయందు దూరముగ నరుగుచున్నదో, ఎయ్యది సుషుప్తిదశయందామార్గముననే స్వస్థానము జేరుచున్నదో, ఎయ్యది దివ్యమయి, దూరావలోకనశక్తియుతమయి యున్నదో, ఎయ్యది ప్రకాశస్వరూపమయి, అద్వితీయమయి యున్నదో, అట్టి నామనస్సు సుఖసంకల్పములచే వెలుంగుచుండుగాక'' మ్మని దమము నభిలషించు ప్రతి వ్యక్తియుఁ గోరుచుండవలయును. ఇచ్ఛాశక్తిచే నీరీతి మనస్సును సుఖసంకల్పగత మొనరింపఁ గల్యాణము కలుగఁ గలదు.

చంచలమగు మనస్సు జాగ్రదవస్థయందుఁ బారము లేని ప్రపంచముయొక్క వివిధనగరముల రెప్పపాటుకాలములోఁ జుట్టుముట్టి వచ్చుచున్నయది. దీనితో సమానముగ

విద్యుద్వార్తయు, వాయువును బరుగెత్తఁజాలకున్నవి. సుషుప్తియందు సయితము మీ మనస్సు మౌనమును వహింపక యెన్నియో విచిత్రములగు కార్యముల నాచరించివేయు చున్నది. అపు డిది యాకాశమున కెగయును. పాతాళ మునఁ జొచ్చును. సాగరమునఁ జొరఁబడును. సూర్యచంద్రాదుల బంతులుగఁ బట్టియాడును. మహోన్నతములగు భూధరములఁ బెకలించి వైచును. మఱొకప్పుడు ఘోరారణ్యములఁ జొచ్చి యథేచ్ఛావిహార మొనరింపఁ గడంగును. ఒకప్పుడు ధనధాన్యముల నపేక్షించి రాజసింహాసనము నధిరోహించి భోగవిలాసంబులఁ దేలియాడును. ఇంకొకప్పుడు కేళీగృహమునఁ బ్రవేశించి చంద్రముఖులగు రమణీమణులతో సరస సల్లాపము లాడును. మఱొకప్పుడు సమస్త ప్రపంచ సౌఖ్యములు నశ్వరము లని యెంచి సన్యసించి భిక్షాపాత్రమును హస్తమునఁ బూని లోకసంచార మొనరింప గడంగును. మనస్సుయొక్క చేష్టల కంతము లేదు. ఈ చేష్టలన్నియు కల్పితములే గాని వాస్తవములు కావు. మనస్సు సదా రజ్జుసర్ప భ్రాంతికిఁ జిక్కి వర్తించుచుండుటవలననే దుఃఖములు కలుగుచున్నవి. యువజనులు మనస్సుయొక్క చంచలములగు నీ విచిత్రముల నెల్ల గుర్తించి సుఖసంకల్పములచే దానిని నిశ్చలస్థితికిఁ దీసికొనివచ్చుటకయి యత్నింపవలయును.

"యేనేదం భూతం భువనం భవిష్యత్
పరిగృహీత మమృతేన సర్వం
యేన యజ్ఞస్త్రాయతే సప్తహోతా
తన్మే మనః శివ సంకల్పమస్తు."

భూతభవిష్యద్వర్తమానములఁ దెలియు నమృత స్వరూపశక్తిగనున్నట్టియు, జ్ఞానేంద్రియపంచకము, మనస్సు, బుద్ధి యను సప్తహోత రూపములగు నింద్రియముల మూలమున నీ ప్రపంచముయొక్క శుభాశుభ కార్యములఁ బ్రవృత్తుల మగుటకు హేతువయి యున్నట్టియు, నామానస మున శుభసంకల్పము లాదవునుగాక !

నిత్యము మన మీరీతి మనమానసమును సత్సంకల్ప ములచే విభూషిత మొనరింప యత్నించుచుందుమేని మనము సులభముగా శీఘ్రకాలముందే దమవంతులమయి దుష్టకార్య ములపొంత కరుగక, భావవ్యభిచారమున కేని యొడఁబడక నిత్యశుద్ధులమయి సౌఖ్యానందముల నోలలాడఁగలము.



## అఱువదియొకటవ ప్రకరణము

## అస్తేయము

"ఆ॥ దొంగతనము చేయ ♦ దొర పట్టి శిక్షించు
నిరుగుపొరుగువార ♦ లెగ్గులెంత్రు
పరమునందు నరక ♦ బాధలు పైకొను
దోషములకుఁ గుదురు ♦ దొంగతనము."

ధర్మముయొక్క చతుర్థలక్షణము అస్తేయము. అస్తేయ మనగా దొంగిలింపకుండుట యని తాత్పర్యము. స్తేయమనగా దొంగతనము. చౌర్యము మూఁడు విధములుగ మనుష్యజాతిచేఁ గావింపఁబడుచున్నది. మానసిక, వాచిక కాయికచౌర్యమే సంపూర్ణ మయినది. మానసమునం దొక విధముగ భావించుచు, వాగ్రూపమునఁ దద్విరుద్ధముగ వర్తించుచుఁ గార్యరూపమున మనోవాక్కులకు భిన్నముగా వర్తించుమనుజుఁడు తనయాత్మకుఁదానే మోసమొనరించిన వాఁ డగుచున్నాఁడు. మానసమం దొకరీతిగ భావించి తద్విరుద్ధముగ వర్తించువృత్తికే మానసిక చోరత్వ మందురు. ఈ చోరత్వమును లోక మంతగా గ్రహింపఁజాలక పోయిన‌ను సర్వాంతర్యామి యగు సర్వేశ్వరుఁడు మాత్ర మనుక్షణము వీక్షించుచునే యుండును.

మనుజుఁడు మానసికచోరత్వమును, వాక్చోర్యమును, కార్మికచోరత్వమును సంపూర్ణముగా బహిష్కరింపని దే పవిత్ర మగు నస్తేయ గుణమును సంపాదింపఁజాలఁడు. చోరత్వముచే ననత్యభాషణము, కపటము, డంబము, పరాప కారము, ధనతృష్ణ మున్నగు దుర్గుణము లన్నియు మానవ హృదయమునఁ బ్రవేశించి, వాని జీవితము నధఃపతిత మొన రించివేయును. పరుల వస్తువును స్వప్నమందయినను నక్రమ ముగ నభిలషింపరాదనియు, బరధనాభిలాష కడు హీనమైన వృత్తియనియు, అస్తేయముచే మనుష్యజీవితము పరిశుద్ధమై, తృష్ణాశూన్యమయి ప్రకాశింపఁగలదనియుఁ బతంజలిఋషి వచించియున్నాఁడు.

"అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం."

"త్రికరణములఁ జోరత్వమును వీడువానికి రత్నోప స్థానమే లభ్యమగును."

అస్తేయమును సంపాదింపఁగోరు మనుష్యుఁడు సర్వేశ్వ రుఁడు తనకుఁ బ్రసాదించినంతటితో మనస్తృప్తిని గలిగి యుండి పరవిత్తాదులయందు భావమునందయిన నపేక్ష లేని వాఁడయి మనుచుండవలయును.

"Contentment is the source of very joy,"
—Beathie.

"మనస్తృప్తి సమస్తోల్లాసముల కుత్పత్తిస్థానము."
—బేథై.

"True happiness is to no place confined but still is found with a contented mind." —Sonnets.

"వాస్తవికమగు సౌఖ్యము నిర్బంధితమగు చిత్తమునం దుదయింపఁజాలదు. సంతృప్తిగల మానసమునం దపారమగు సౌఖ్య మిమిడియుండఁ గలదు. —సోక్రెటుస్.

ధర్మశాస్త్రము లస్తేయమునకు సమమగు పుణ్యమును స్తేయమునకుఁ దుల్యమగు పాపమును లేదని ఘోషించుచున్నవి. సమస్తాధర్మములకును, సకలపాపములకును జౌర్యమే మూలము. చౌర్యభావము మానవుని చిత్తమును అంతరాత్మను దూషిత మొనరించి వేయుచున్నది. చోరుఁడు దేహబాహుబలమునం దెంతటి సమర్థుఁడయి యున్నను, ఆత్మబలమునం దత్యంతము హీనుఁడయి యుండుచున్నాఁడు. వాని భావనలు కడుంగడు నీచములు.

నేఁడు దొంగతనముచేఁ గలుగు ఘోరోపద్రవములకుఁ బరిమితియే లేకున్నది. చౌర్య మను ఘోరపాపముచే సుఖింపనెంచుట కేవలము మౌఢ్యము. చౌర్యము యొక్క పరిణామము భయంకరమును, దుఃఖదాయకమును, అప్రతిష్ఠాకరమును, పరమార్థభంజకమునునయి వెలయుచున్నది. చౌర్యవృత్తి నవలంబించు వ్యక్తి తన స్వచ్ఛమగు జీవితమును, విశుద్ధమగు ప్రతిష్ఠను గళంకిత మొనరించుకొని నానా విధములగు కష్టపరంపరల సహింప బాధ్యుఁ డగుచున్నాఁడు.

మానవుని స్వాభావికమగు జీవితస్వేచ్ఛను నశింపఁ జేయుటలోఁ జౌర్యము ప్రథమ గౌరవమును సంపాదించుచున్నయది. చోరుఁ డే యే రీతిఁ బ్రజాసముదాయమందు హీనునివలె నవనతమస్తకుఁడయి, ఘోరావమానముల సహించుచు నధమజీవితమును గడపవలసి యుండుననియుఁ

చౌర్య మొనరించినవారలే స్వానుభవముచే గ్రహింపఁగలరు. చౌర్యముచే మనుష్యుఁడు సంపాదించు వస్తువు విశేషకాల మతనియొద్ద నిలువనేరదు. ఇసుకపాతఱపయిఁ గట్టఁబడిన గోడవలెఁ జోరులనుండి యపహరింపఁబడిన ధనధాన్యాదికములు మనకుఁ దెలియకుండఁగనే మన యొద్దనుండి యంతర్హితము లయిపోవునని భారతాది గ్రంథములు నుడువుచున్నవి.

సత్యమును, ధర్మమును, కాయకష్టము నాశ్రయించి, తనస్వాలమున మనుష్యుఁడు సంపాదించు సంపదలు దిన దిన ప్రవర్ధమానము లగుచు వాని జీవితమును సౌఖ్యానందకంద మొనరించివేయును. చోరుని ముఖమండలము సజ్జనబృందమునఁ జేరినంతనే వికాసశూన్యమయి వెలవెలఁబోవుచు వాని మానసిక దుర్బలత్వమును వెల్లడించును. వానియం దంతరాత్మ స్వేచ్ఛగా నెల్లరివలె నానందింపఁజాలక యనుక్షణము సందేహభయములచేఁ గంపించుచుండఁ గలదు. చౌర్య మొనరింపనివాఁ డెట్టి నిరుపేదయైనను కోటీశ్వరులఁ గాంచియు భయముఁ జెందక యభిమానపూర్వకముగఁ దన మస్తకము నున్నత మొనరించుకొని కాయకష్టార్జితమగు స్వల్పధనముచే గంజియో, కలియో త్రాగుచు నిత్యానందము ననుభవించుచుండఁగలఁడు.

కోటీశ్వరుఁ డయినను, మహాపండితుఁ డయినను, మహాబలాఢ్యుఁడయినను పరవిత్తాదికముల నపహరించియుండినచో ధైర్యము లేనివాఁడయి యెద్దియో విపద్దశకుఁ జిక్కినటులఁ బెద్దలఁ జూడఁగాంచినంతనే వ్యాకులహృదయుఁ డగుచుండును.

పరులు పరస్పర మం దేమి సంభాషించుకొనుచున్నను జోరుఁడు తన్నుఁగూర్చియే లోకమంతయుఁ బ్రసంగించుకొనుచున్న దని సందేహించి మానసమందు దుర్భరమగు నావేదన పడు చుండఁగలఁడు.

దొంగ తా నొనరించిన చోరత్వమును గప్పిపుచ్చుట కయి యనేకవిధముల బొంకులాడవలసినవాఁ డగుచున్నాఁడు. తన్మూలమున దొంగయొక్క జీవితము నిరంతర మృషాలాప ముల కాకరమగుచున్నది. కావున దొంగ యైహికాముష్మి కములకు దూరుఁ డగుచున్నాఁడని శ్రీ బుద్ధప్రభువు సెలవిచ్చి యున్నాఁడు. చౌర్యముచే జగత్పితయగు పరాత్పరుఁడు మిక్కిలి యప్రసన్నుఁ డగుచున్నాఁడు.

కారణ మేమన దొంగ ధన తృష్ణాబద్ధుఁడయి దేవుని యొక్క స్నేహపాత్రులగు సాధువుల బాధింపవలసినవాఁ డగుచున్నాఁడు. చౌర్యముచే మానవుని యంతఃకరణ సామాన్యమగు దయ నశింప వాఁడు క్రిమక్రమముగా నర హత్య లొనరించుట కేని శంకింపనంతటి వజ్రసమాన హృదయుఁ డగుచున్నాఁడు.

లోకశాంతిని భంగపఱచునట్టి చౌర్యవృత్తి హత్యా వృత్తికంటె నల్పమయినది కాదు. చౌర్యమొనరించువాఁడు తన రహస్యమును బరులెవ్వరు విలోకించుచుండుట లేదనియు, కావున తా నొక బుద్ధిమంతునివలెనే సజ్జనసంఘమందు సంచ రింపవచ్చుననియుఁ దలపోయుచుండును.

సర్వశక్తి సంపన్నుఁడును, సర్వవ్యాపకుఁ డును సర్వాంతర్యామియు నగు సర్వేశ్వరుఁడు సర్వత్ర వ్యాపించి

యున్నాఁడని తెలిసియు దేవుని సామ్రాజ్యమందు స్తేయము వంటి దూషితకర్మకుఁ బాల్పడు వ్యక్తికంటె నధమాధముఁ డీసృష్టియందుఁ గానరాఁడు. చౌర్యవృత్తియం దున్నవారు వాస్తవ మాలోచింప హితాహితముల నుద్బోధించునట్టి యంతరాత్మను హతమొనరించుకొనినవారే యని తెలియ వలసివచ్చుచున్నది.

సర్వవ్యాపకుండగు పరాత్పరుని గనుగ్రామి యెంతటి నిపుణుఁడయిన నావగింజంత పనియు నీవిశ్వమునం దొనరింపఁ జాలఁడు. చోరులు తమ చౌర్యమును లోకులు కనిపెట్టలే దని సంతోషించుచుందురే కాని గగనమండలమునుండి భూమి పైఁగల జీవరాసులఁ దేటపాటఁజూచు దివాకరునిభంగి సర్వే శ్వరుఁడు సర్వమును స్పష్టముగా విలోకించుచున్నాఁడని గ్రహింపలేనంతటి యజ్ఞానస్థితియం దున్నందులకు మిక్కిలి విచారింపవలసియున్నది.

"ఏకో౽హ మస్మీతి చ మన్యసే త్వం
న హృచ్ఛయం వేత్సి మునిం పురాణం
యో వేదితా కర్మసు పాపకస్య
తస్యాంతికే త్వం వృజినం కరోషి.
మన్యతే పాపకం కృత్వా న కశ్చి ద్వేత్తి మామితి
విదంతి చైనం దేవాశ్చ యశ్చైవాంతపూరుషః."

—మహాభారతము.

"(చోరుఁడా !) నీవు 'నేనొక్కఁడనే యున్నాఁడను. నా రహస్య మెవ రెఱుంగుదు' రని యనుకొనుచున్నాఁడవు. కాని నీ హృదయాభ్యంతరస్థితుఁ డయినట్టియు, పుణ్యపాప దర్శియు నగు పురాణపురుషుని నీవు మరచితివి. ఆయన నీ

వొనరించు సమస్త కార్యములను జూచుచునే యున్నాడు. గ్రహించుచునేయున్నాడు. ఆయనసమ్ముఖమంటే నీవు పాపములఁ జేయుచున్నాడవు. పాపియగువాఁడు దుష్కృతము లొనరించియు వాని నెవ్వ రెఱుంగరని భావించుచున్నాడు. కాని నీవు సేయు పాపకర్మలనెల్ల దేవతాపురుషులును హృదయాభ్యంతరవర్తి యగు యమధర్మరాజును జూచుచునే యున్నారు."

జన్మములలోనికెల్ల నుత్తమంబగు మనుష్యజన్మను గ్రహించి మనము చోరులమై విశ్వాసోపరప్రేమను, శాశ్వతమగు ధర్మమును బరిత్యజించి పరధనాపహారణమునకయి కడు హీనము లగు కార్యముల నిర్విచారముగా నాచరించునట్టి స్థితికిఁ జిక్కినందుల కెంతయు దుఃఖింపవలసియున్నది. దుష్కర్మలవలనను, అసత్యవర్తనంబునను మన సాటి సహోదరుల కెట్టి యన్యాయము నొనరింపరాదనియే యస్తేయము బోధించుచున్నను దానిప్రబోధము నాలకింపకుండుటకంటె నాత్మద్రోహము వేఱొండు లేదు.

చౌర్య మొనరించుటకు ముఖ్యకారణము లోభము. అన్యుల కష్టార్జితమగు సంపదను గాంచి, ఎట్టి పరిశ్రమయు, ఉద్యోగమును గావింపకయే దానిని బొందవలయునని కోరుటయే పేరాస యనఁబడుచున్నది. ఎచ్చోట పేరాస యుండునో అయ్యెడ సంతోష ముండనేరదు. సంతృప్తచిత్తులయందు మందునకయిన నత్యాశ లభింపఁజాలదు.

ఈ కారణముననే యత్యాశాపరులును, లుబ్ధులును మనస్తుష్టి లేనివార లయి నిరంతరము మలినముఖులయి నిరు

త్సాహపూర్వకముగఁ దమ జీవితములఁ గడుపుచుందురు. వారెల్లపుడు పరుల సంపదలఁగాంచి మత్సరముఁబూని యా సంపదలు తను కెటుల లభించునా యను దుర్విచారమందే సంలగ్న మనస్కులయి యుండుచుందురు.

మనుష్యుఁడు తనహృదయక్షేత్రమునుండి యత్యాశా బీజముల నిర్మూలించివేయునేని వాని కెట్టి స్థితియందును తన దారిద్ర్యమునం దసంతృప్తి కలుగమి చౌర్యమొనరింప నభిలాష యుదయింపనేరదు. తనయందుఁ గల చౌర్యబుద్ధిని నశింపఁ జేసికొన వాంఛించు వ్యక్తి తన్మూలములగు లోభ ధనతృష్ణాదికముల విధ్వంసమొనరించివేయుట శుభప్రదము. విపులైశ్వర్యముల కధికారులయి యుండియు, దేవేంద్రభోగ ముల ననుభవింపఁదగు సౌకర్యమును గలిగి యుండియు అసం ఖ్యాకులను దీనులఁ బోషించు సామర్థ్యముచేఁ జెన్నొందు చుండియు ధనతృష్ణావ్యాధిచే నిరంతరము పీడింపఁబడుచుండు లుబ్ధులే గర్భదరిద్రులుగనుండి కాయకష్టముచే సంపాదించిన కాసులచేఁ బొట్టఁబోసికొనుచు సంతుష్టినిఁ జెందు కార్మికుల కంటె గర్భదరిద్రులు; హీనులు. ధనతృష్ణాశూన్యుఁడయి, సంతుష్టుఁడయియుండు మనుష్యుఁడు సులభముగా న స్తేయ వ్రతదీక్షచేఁ జరితార్థుఁడు కాఁగలుగుచున్నాఁడు.

ప్రాయికముగా ననేకులు ప్రతిష్ఠకొఱకుఁ బరోక్షమునఁ జౌర్య మొనరించుచున్నారు. ఏ యే కార్యములను, భావ ములను మనుష్యుఁడు గురుజనుల సమ్ముఖమునఁ బ్రకటించుటచే నపఖ్యాతి యొదవునని భీతిల్లుచుండునో, అట్టి సమస్త భావములును, కార్యములును నొకవిధమగు చౌర్యముగనే

పరిగణింపఁబడుచున్నవి. కాయకష్టము, ధైర్యము, సద్బుద్ధి సంతుష్టి, సత్యము, నిరాడంబరము, సౌజన్యము మున్నగు సద్గుణరత్నహారములచే నలంకృతుఁడై యున్న మనుష్యుఁడు చోరుఁడు కావలసిన యవసరమే తటస్థింపనేరదు. సామాన్యముగాఁ బ్రపంచమునందు దుర్వ్యసనపరాయణులయి, వ్యభిచారులై, మద్యపానాసక్తులయి, జూదరులయి సోమరితనముగఁ దమ కాలమును గడుపు విలాసప్రియులే నిరంతరము చౌర్యవృత్తి నవలంబింపవలసినవార లగుచున్నారు.

కొందఱు మనుష్యులు సత్యనిష్ఠాశూన్యులును, జీవితమునందుఁ గ్రమపద్ధతి లేనివారును, ప్రమత్తులును నగుటవలననే సకాలమందుఁ దమ వాగ్దానములఁ జెల్లింపనేరనివారయి వాక్సంబంధమగు చోరత్వ మొనరించుచున్నారు. వాస్తవమున కిట్టి వచస్సంబంధమగు చౌర్యమును సంపూర్ణాదర్శాస్తేయ వ్రతమును భంగపఱచు నొక దుర్గుణమే యని యంగీకరింపక తప్పదు.

మనుష్యుఁడు సదా తనపాదములపై నిలువఁబడియుండు విధము నెఱింగి స్వావలంబనమందే మనుష్యజీవిత సాఫల్యము కలదని విశ్వసించి పరిశ్రమపూర్వకమగు సాధుజీవిత నిర్వాహణమునకుఁ గడంగినచోఁ జౌర్యసంబంధమగు దూషిత భావమేని యతనిస్వచ్ఛందసాత్వికహృదయమునఁ బ్రవేశింపనేరదు. అపు డతఁడు శుద్ధాస్తేయ వ్రతదీక్షితుఁడు సులభముగాఁ గాఁగలఁడు.

విపద్గ్రస్తులును, దరిద్రులును నగు పురుషు లనేకు లాత్మజ్ఞానము లేనివా రగుటచేఁ జౌర్య మొనరింపనిదే తమ విశాల

ములగు కుటుంబముల భరించుట కష్టసాధ్యమని నిశ్చయించుకొని చోరత్వమునే జీవితోపాధి కుచితమగు వృత్తిగ నవలంబించుచున్నారు. మనుష్యుఁడు ధైర్యము నవలంబించి, సోమరితనమును వీడి, కాయకష్ట మొనరించుట కొడఁబడిన దయామయుఁడగు పరాత్పరుని సత్యావలంబితమగు విశ్వమండలమునఁ గుక్షింభరత్వమునకు వలసినంత ధర్మసమ్మతమగు ధనలాభము కలుగకపోదు.

ఏనాఁడు మనుష్యుఁడు ధైర్య సంతోషసత్యశ్రమోద్యోగాది ధర్మముల లాఘవముగఁ జూచి విసర్జించెనో, నాఁడే వాని చిత్తసీమయందుఁ జౌర్యవృత్తి స్వీకారబీజములు నాటఁబడినవనియే మనము గ్రహింపవచ్చును. అధ్యవసాయముచే విశ్వము కరగత మగునను లోకమాన్యమగు కర్మయోగసిద్ధాంతము మన యందనుండ మనము మూఢులమయి క్షణికములగు ధనధాన్యాది వస్తువుల నపేక్షించి శాశ్వతమగు నాత్మయొక్క యక్షయ సంపద యగు నస్తేయరత్నమును జౌర్యవృత్తికి బలిదాన మొనరించు నంతటి మూఢుల మయిపోయినారము.

చౌర్యబుద్ధిచే మానవుని విజ్ఞాననేత్రదృష్టి క్రమముగా మందగించిపోవ నంతమున కతఁ డజ్ఞానాంధుఁడయి పోవునను రహస్యమును మనుష్యులువిస్మరించినారు. త్యాగావతారములనఁదగు ఋషిశ్రేష్ఠుల సంతతివారమగు మనయందుఁ జౌర్యమును ప్రేమించువారు కొందరు కలరన్న నింతకంటె లజ్జాకర మగు విషయము మఱేమి కలదు? మృత్యుబాధకంటె దుర్భర మగు వేదనమును గలిగించున దైయున్నను మనుష్యు

లేలకో బుద్ధిలేనివారై చోరత్వము నవలంబించుచున్నారు. నైతికబల మేనాఁడు మనల నెడబాసి చనినదో, నాఁటి నుండియే భయంకరములగు దుర్గుణములును మనకుఁ బ్రశస్తములగు సద్గుణములుగనే గోచరింప నారంభించినవి.

"తే॥ మనుజు లెప్పుడుఁ దృణమైనఁ ♦ బరుల సొమ్ము
వాని యనుమతి లేకుండ ♦ జేరఁబోయి
ముట్టుకోరాదు, పొరపడి ♦ ముట్టుకొన్న
శాశ్వతంబైన యపకీర్తి ♦ సంఘటిల్లు."

—నీతిదీపిక.

ఒకప్పు డీ భారతవర్షమున స్త్రీపురుషు లెల్లరు భౌతిక పదార్థములందు కంటెఁ బారమార్థిక వస్తువులందే విశేషానురాగబద్ధులును, నిర్లిప్తులును, సత్యసంధులును, ధర్మపరాయణులును నయియుండుటచే వారు చోరభీతిఁ దక్కియుండి తమ సంపదల నంతిగా నేఁటివలె సంరక్షించుకొన యవసరము లేనివారయి యుండెరి. నేఁ డధర్మము పెచ్చుపెరిగిపోవ, అస్తేయ మదృశ్యమయి చన రక్షకభటుల నిరీక్షణమందున్న సంపదలే యపహరింపఁబడుచున్నవి.

అస్తేయమును బ్రాణముకంటె నధికమగు బ్రేమతోఁ గాంచియుండిన ప్రాక్తనభారతము నేఁడు మన దృష్టినుండి యంతర్హితమయి పోయినది. సత్యధర్మజ్ఞానశూన్య మగు పాశ్చాత్యనాగరికతకు దాస్య మొనర్చు నవ్యభారత మపరిమితముగ విలాసముల కలవడి సముద్రమువలెఁ బారములేని విషయములు నిత్యనూతనము లయి కానవచ్చుచుండ ననుక్షణము ధనాభావము స్ఫురించుచుండుటచే నస్తేయము నొక

ఛాందసవృత్తిగ భావించి, యథేచ్ఛావిహారమునకుఁ బక్షిమ ఖండములవలెఁ గడంగినది.

సత్యముకొఱకయి కృషిసలుప వాంఛ లేకున్నను, ధన మందు మిక్కిలి ప్రీతిగల మన ప్రభుత్వమువారి దండన మెంత తీవ్రముగ నున్నను, భరతఖండమందు స్తేయము క్షీణింపకుండుటకు హేతువేమి యని విచారింతిమేని జన సామాన్యమం దస్తేయము పరమధర్మ మను జ్ఞానము లేకుం డుటయే యని తెల్లము కాఁగలదు.

నేఁడు బుద్ధిమంతులుగ జనసామాన్యముచే భావింపఁ బడువారు సయితము మార్గమధ్యమునఁ దమ కేదేని పరుల వస్తువు లభించిన బ్రహ్మానందపరవశులయి దానిని తత్క్షణము కబళించివేయఁ జూచుచున్నారే కాని, పూర్వమువలె నా వస్తువు యెవరిదా యని విచారించి, దాని యధికారి నన్వే షించి తిరిగి యతని కొసంగివేయుటకు సంసిద్ధులు గాకున్నారు. మనము రాత్రులందు వేషాంతరమును ధరించి పరుల గృహ ములఁ జొచ్చి ధనము నపహరింప నవసరము లేదు.

పరులు తమ ధనమును బోఁగొట్టుకొనినపుడు మన కది లభించినచో దానిని దిరిగి సొత్తుగలవారి కియ్యకుండఁ గబ ళించితిమేని మనమును దొంగలమే యగుదుము. ఇట్టి దొంగ తనమునే పరోక్షచౌర్య మందురు. సొత్తు పోఁగొట్టుకొన్న వారి వృత్తాంతము తెలియరానిచో నా ధనమును మనము స్వప్రయోజనార్థ మయి వినియోగించుకొనక లోకోపకార కములగు పుణ్యకార్యములకయి వెచ్చించుట పరమధర్మము.

అస్తేయవ్రతధారి చౌర్యముయొక్క సూక్ష్మములగు నిట్టి యంశములను సయితము నెఱింగియుండు టావశ్యకము.

విద్యార్థులారా! అస్తేయధర్మానుష్ఠానమందు భారతవర్షముయొక్క ప్రాచీనదశకును, అర్వాచీన స్థితికిని గల భేదమునుగూర్చి విచారింతుమేని మన హృదయములు కంపించిపోవును. నేత్రము లశ్రుధారల వర్షింపఁజేయును. ప్రాచీనకాలమునం దీదేశమున నాబాలగోపాలము పరుల కనకముద్రికలను మట్టిపెల్లలకంటెను హీనముగఁ జూచుచుండిరి. కాళిదాస మహాకవీంద్రుని యీ శ్లోకముచే బ్రాచీనకాలమందుఁ జౌర్యము సంఘమందు హీనమగు పాపకర్మగఁ బరిగణింపఁబడుచున్నటుల స్పష్టపడఁగలదు.

"నకిలాను యయు స్తస్య రాజానో రక్షితు ర్యశః
వ్యావృత్తా యత్ పరస్వేభ్యః శ్రుతౌ తస్కరతా స్థితా."
—రఘువంశము.

"ఆ దిలీపమహారాజు లోకమున దొంగతన మితరుల సొత్తులకు కలుగకుండా దొంగతన మను శబ్దమునకే కలుగునట్లుగా ననఁగా దొంగతనమన్నమాట యెక్కడను లేకుండఁ జేసినందున ప్రజాసంరక్షణ విషయమునం దాతని కీర్తి మఱియేరాజును బొందఁ డాయెను.

నేఁటికిని వేదధర్మములయందుఁ ద్రికరణముల భక్తి కలిగినట్టి వానియందును, స్వతంత్రజీవులగు కృషీవలులందును నస్తేయవ్రతావలంబులు విశేషముగఁ గానవగుచున్నారు. భగవానుఁడా! జ్ఞానభూమియు, కర్మభూమియు నను ప్రసిద్ధి వడసిన భారతవర్షమునకుఁ దిరిగి యస్తేయ మను నక్షయ

సంపదను ప్రసాదింపుము. భారతజాతీయ దుర్బలత్వమును నశింపఁజేయుటకును, భారతీయులందుఁ బరస్పరము వేరూని యున్న ద్వేషమాత్సర్యముల నిర్మూలించుటకును, సంఘీభావ మహావృక్షమునకు వేరుపురుగులుగ నున్న చౌర్యాది దుర్వృత్తులను మట్టుఁబెట్టుటకును రాష్ట్ర నిర్మాణశక్తి ధురంధరులగు విద్యార్థులకు నూతనబలమును, అనూనోత్సాహమును, అకళంకమగు బుద్ధిని బ్రసాదించుము.

ప్రతిభారతీయపురుషుఁడును స్త్రీయు హృదయపూర్వకముగా నస్తేయముపట్ల గాఢానురాగబద్ధులయి వెలయుచుందురుగాక! త్యాగమే పరమధర్మమనియు, సంతుష్టియే స్వర్గమనియు, లోభమే భయంకరజాడ్యమనియు, ప్రేమయే మోక్షమనియు, అస్తేయమే తపమనియు, గ్రహించునట్టి వినిర్మలజ్ఞానమును, కృపామయా! జగదీశ్వరా! శీఘ్రమే భారతీయులకెల్లరకుఁ బ్రసాదించుము. ఇదియే మదభీష్టము; సవినయ ప్రార్థనము.



# అఱువదిరెండవ ప్రకరణము

## శౌచము

"చిత్తశౌచంబు లేనిదే ♦ క్షితి నదెట్లు
గంగలో మున్గఁ బుణ్యంబు ♦ గలుగనేర్చు ?"
—బుద్ధపురాణము.

ధర్మముయొక్క పంచమాంగమే శౌచము. శౌచములేని మనుష్యుఁ డైహికాముష్మికసౌఖ్యముల ననుభవింపఁజాలఁడు. నేఁడు సమస్తప్రపంచము శౌచముయొక్క యథార్థమగు తాత్పర్యమును విస్మరించివైచినది. విదేశీయులు పరిశుభ్రముగ సబ్బునీటిలో స్నానమొనరించి, సుగంధద్రవ్యలేపన మొనరించుకొని, సుందరములగు ధౌతవస్త్రముల ధరించుటనే శౌచ మని వచించుచున్నారు.

భారతీయులును నేఁడు శౌచవిషయమున విదేశీయులకంటె స్థూలబుద్ధినే వహించియున్నా రని వచింపవలసివచ్చినందుల కెంతయు విచారింపవలసియున్నది. దేహముయొక్క మాలిన్యము దూరమొనరింపఁబడకపోయినను గంగాజలమున మూఁడు బుటకలు వేసి యెన్నఁడు నుతికింపఁబడని పట్టువస్త్రమును బేటికాంతర్భాగమునుండి వెలికిఁదీసి మడికట్టుకొనినంత మాత్రముననే దేహము పరిశుద్ధమయి పోయిన దని భావించుకొనువార లనేకులు నున్నారు గలరు.

శౌచవిషయమున నేఁడు ప్రాక్పశ్చిమఖండవాసు లుభయులు నించుమించుగనున్న భేదముతో దప్పిద మొన రించుచున్నా రనుటలో సందేహ మేమియు లేదు. నిర్మల జల ప్రక్షాళనముచేఁ గావింపఁబడు దేహశుద్ధికంటె మానవుని కిహపరసౌఖ్యమును బ్రసాదింపఁగల సౌఖ్య మొండు కలదు. దానినే కోవిదు లంతశ్శౌచ మనియు, ఆత్మశుద్ధి యనియు చిత్తశౌచ మనియు వివిధ నామములఁ జేర్కొనుచున్నారు. చిత్తశౌచములేని వ్యక్తి కేవల మాకారమాత్ర మానవుఁడే కావున పశువుకంటె హీనుఁడయి, భ్రష్టాచారుఁడయి యిహ పరములకు దూరుఁ డగుచున్నాడు. ఈవిషయమునే మను ధర్మశాస్త్ర మీరీతి సమర్థించుచున్నయది.

> "అద్భి ర్గాత్రాణి శుద్ధ్యంతి మనస్సత్యేన శుద్ధ్యతి
> విద్యా తపోభ్యాం భూతాత్మా బుద్ధి ర్జ్ఞానేన శుద్ధ్యతి."

"దేహముయొక్క యుపరిభాగము జలముచేఁ బరిశుద్ధ మొనరింపఁబడుచున్నది. మనస్సు సత్యాచరణమున శుద్ధ మగుచున్నది. జీవాత్మ విద్యాతపములచేతను, బుద్ధి జ్ఞానము వలనను శౌచము నందుచున్నది.

ఇట్టియంతశ్శుద్ధి దేహశుద్ధికంటెను మనుష్యజీవితమునకు సహస్రగుణము లధికముగ శ్రేయోదాయక మగుచున్నయది. మనుష్యుఁ డాహారమందును, విహారమందును, ఆచరణ మందును, భాషణమందును, వేషమందును, ఆలోచనయం దును, కర్మాచరణమందును నిం దం దను భేదము లేక సర్వ కాల సర్వావస్థలయందు సకలవిషయముల బరిశుద్ధుఁ డయి యుండు టావశ్యకము.

కామక్రోధాది దుర్గుణములు చిత్తమున నెలకొని యున్నంతవరకు మనుష్యుఁడు బాహ్యమున కెంత సుస్నాతుఁడయి శుభ్రముగ నున్నను, సుందరముగ రాణించుచున్నను శౌచవిహీనుఁడుగనే పరిగణింపఁ బడుచుండఁగలఁడు. జడమగు దేహమునకు జీవకళనొసంగిన యంతరాత్మయే దుర్వ్యసనములను మాలిన్యముచేఁ గప్పబడియుండ బాహ్యశుద్ధిచే నేమి ప్రయోజనము కలుగఁగలదు?

దుర్వ్యసనములచేఁ దమ యంతరాత్మల దూషితమొనరించుకొనువా రెల్లరు రుద్రాక్షల ధరించియు, విభూతి రేఖల లలాటమున నంకిత మొనరించుకొనియుఁ దప్తలోహ శంఖచక్రముల హస్తముల ముద్రింపఁ జేసికొనియు భారత దేశమునందు నేఁడనేకులు పరిశుద్ధు లగుచున్నారు. బ్రాహ్మణ వైశ్యాద్యున్నతజాతులందు మాంసాహారభక్షణము, నీచవనితాసంభోగము మున్నగు నింద్యకర్మలకుఁ గడంగిన వ్యక్తి యొక్క రసనేంద్రియముపై సూదితో నొకటి రెండువాతలు వేసి వానిని పరిశుద్ధునొనరించునట్టి యాచార మొండుకలదు.

వ్యభిచారాది దుర్వ్యసనములచేఁ జిత్తము దూషితమయియుండ నాలుకపై సూదితో వాతలువేయఁ జిత్తశౌచ మెట్లేర్పడునో దుర్గ్రాహ్యముగ నున్నది.

ఒకానొక మనుష్యుఁడు తా నబుద్ధిపూర్వకముగఁగాని, బుద్ధిపూర్వకముగఁగాని యొకపాప మొనరించినచో, దానికిఁ బరిహారము సూదివాతలు కాదు. ఆత్మపశ్చాత్తాపమును జెంది యుత్తరజీవిత సంస్కరణమునకుఁ గడంగుటవలననే పాపము నశించును. ఇదియే శౌచవిధి.

"కృత్వా పాపం హి సంతప్య తస్మాత్ పాపాత్ ప్రముచ్యతే,
నైవం కుర్యాత్ పునరితి నివృత్యా పూయతే తు సః.
—మనుస్మృతి.

"ఒకవ్యక్తి పాపకార్య మొనరించియు హెచ్చరికఁజెంది నే నింక నిట్టి పాపకార్య మాచరింపనని నిశ్చయించినచో ననఁగా నాత్మపశ్చాత్తాపతప్తుఁడైనచోఁ దొల్లింటిపాపము నశించును."

చరిత్రభ్రష్టుఁడగు వ్యక్తిని బరదారాగమనమునకుఁ బ్రోత్సహించిన చిత్తముయొక్క శౌచము నపేక్షించి స్వల్పమగు బాహ్యదండనను విధించుటచేఁ గలుగఁగల ప్రయోజన మేమియో తెలియకున్నది. నేఁటి ఛాందసాచారపరాయణులు బాహ్యశుద్ధిచేతను, బాహ్యసంస్కారము వలనను మనుష్య జీవితమున కెట్టి లాభము కలుగునో నుడువవలసి యున్నది. హైందవవిజ్ఞానమున కలంకారప్రాయుఁడగు పతంజలి మహర్షి శౌచమునుగూర్చి యిట్లు వచించియున్నాఁడు.

"సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్యేంద్రియ
జయాత్మదర్శనయోగ్యత్వానిచ."

"మానవుని దుర్గుణము లన్నియు మనశ్శుద్ధివలనను. సత్త్వశుద్ధి వలనను నష్టమయిపోవ బుద్ధి విశుద్ధమగుచున్నది ఇందువలన మనస్సు సుస్థిరమయి, తుచ్ఛభోగములయందు విరక్తిని జెందఁ దన్మూలమున నాత్మదర్శనప్రాప్తి కలుగుచున్నయది."

తనయందుఁగల దోషముల గ్రహింపలేని మనుష్యుని శౌచము లేనివాఁడనియు, మలినుఁ డనియు నిశ్చయింపవలసి యున్నది. అన్యులు వచ్చి తన దోషముల వ్యక్తీకరించుటకుఁ

దొలుతనే యేమానవుఁడు తనయందుఁగల దుర్గుణములనెల్ల నన్వేషించి నశింపఁజేయుటకు యత్నించునో, వాఁడే శౌచ సంస్కారముల కెల్లవిధములఁ బాత్రుఁడు. ఈ యాత్మపరి శోధనారహస్యమునే, ఆత్మానందయోగిపుంగవుఁ డగు సుక రాత్తు మహాశయుఁడు. **'Know thyself'** 'నిన్ను నీ వెఱుంగుము' అను సూత్రముచే సమర్థించియున్నాఁడు. వివేకా నందస్వామి సయిత మంతర్బాహ్యప్రకృతుల సంస్కరణ మున సంఘటితమగు శౌచమే (విశుద్ధదశ) మోక్ష మని సిద్ధాంతీకరించియున్నాఁడు.

వేదోక్తమగు కర్మకాండమునఁ జెప్పఁబడియున్న షోడశసంస్కారములలో నంతశ్శుద్ధియే యగ్రస్థాన మలంక రించుచున్నయది. నేఁడు బౌద్ధావతారమునకుఁ బూర్వ ముండిన పౌరాణికయుగమునందువలెనే భారతీయులు వ్యర్థము లగు బాహ్యసంస్కరణములకయి పెనగులాడుచు నాత్మ సంస్కారమును గూర్చి శ్రద్ధవహింపకున్నారు. అంతశ్శుద్ధి శౌచము లన్నింటిలో సర్వోత్కృష్టమని వచించినంతమాత్ర మున దేహశుద్ధియు, వస్త్రశుద్ధియు ననావశ్యకములే యని తలంపరాదు. ఆత్మదేహవస్త్రాదికముల సంపూర్ణశౌచమే నాగరికతయొక్క ముఖ్యలక్షణమయి యొప్పుచున్నయది. అన్నివిధములగు శౌచములచేఁ జెన్నొందునప్పుడే మనుష్యుఁ డును బవిత్రుఁడయి వాస్తవికానందసౌఖ్యముల ననుభవింప సమర్థుఁ డగుచున్నాఁడు.

మన మిపుడు శౌచముయొక్క ముఖ్యాంగములను గూర్చి ప్రత్యేకముగా విచారింతము. మాతృగర్భమునుండి

భూతలమున కవతరించినదాదిగ దేహధారియగు జీవునకుఁ బ్రథమ మావశ్యకమగునది బాహ్యశుద్ధి. దీనినే శరీరశౌచ మని నుడువవచ్చును. శరీర మనుదినము శీతలమగు నిర్మలజలముచేఁ బ్రక్షాళన మొనరింపఁ బడనిచో దుర్గంధపూరితమయి రోఁతను బుట్టించును. దుర్గంధము దేహమున వ్యాపించియుండుటచే స్వాస్థ్యము భంగమయి దుఃఖముల నొదవించును. దేహమంతట వ్యాపించియున్న రోమకూపములనుండి నిరంతరము స్రవించుచుండు మాలిన్య మనుదినస్నానముచేఁగాని, శుద్ధము కాదు. నిత్యస్నానముచే దేహమును బరిశుద్ధమొనరించుకొనుట స్వాస్థ్యదృష్టితోఁగాని పారిశుద్ధ్యదృష్టితోఁగాని ముఖ్యము.

ప్రాతఃకాలము శయ్యానుండి లేచినంతనే మనుష్యుఁడీశ్వరప్రార్థన మొనరించి, పిమ్మట నిత్యకృత్యములఁదీర్చుకొనుటయందు సంలగ్నచిత్తుఁడగు టావశ్యకము. మలమూత్రవిసర్జనానంతరము పరిశుద్ధమగు జలముతోడను, మట్టితోడను జలపాత్రమును, కరచరణములను బరిశుద్ధమొనరింపవలయును. ఆడంబరము లేనట్టియు, స్వల్పమగు మూల్యమున లభించునట్టియు పరిశుద్ధముగా నున్నట్టియు వస్త్రములనే సదా ధరించుచుండవలయును.

మురికిబట్టల ధరించుటచేఁ జూచువారి కసహ్యముగ నుండుటయేగాక ధరించువారి మనస్సునకును సంతోషమును, ఉల్లాసమును నుండనేరవు. నిర్మలినములగు ధవళవస్త్రములు హృదయాహ్లాదమును పెంపొందించును. నేత్రములకు సుందరములుగ నున్నను, స్వేదయుక్తములును దూషితములును

నయి యున్నచో నా దుకూలములు స్పృశించుటకైన నర్హా ములు కావు.

హస్తములయొక్కయు, పాదములయొక్కయు నఖ ముల నెపుడును కత్తిరించుచు వానియందు మురికిచేరకుండ నుండు విధము చూడవలయును. దేహముయొక్క బాహ్య శుద్ధి నీరీతి సదా రక్షించుకొనుటచేఁ జర్మవ్యాధులును మఱి ఇతరములగు భయంకరవ్యాధులును గలుగనేరవు. దేహశుద్ధిని గూర్చి గతారోగ్య ప్రకరణమందు విపులముగాఁ జర్చించి యుంటిని. కావున దానిని గూర్చి విశేషముగా నీశౌచమను శీర్షిక క్రింద వ్రాయఁబూనుట చర్విత చర్వణమే యగును.

యువజనులు బాహ్యశుద్ధినిగూర్చి యప్రమత్తతను వహించినపిమ్మట నంతశ్శుద్ధికయి యావచ్ఛక్తిని ధార వోయు టావశ్యకము. శాశ్వతులు కానట్టి లోకులు బాహ్య శుద్ధిని విలోకించి మనల నాగరికు లని సన్మానించుచుండ, అంతశ్శుద్ధినిఁ గాంచి యజరామరుం డగు పరాత్పరుఁడు మిక్కిలి హర్షించును. బాహ్యాభ్యంతరిక శుద్ధినిఁ గలిగియుండు మనుష్యుఁ డెల్ల విధముల స్తవనీయుఁడు. ఏమనుష్యులు మనో వాక్కర్మల నిసుమంతయు భేదములేక సదా సత్యమును బాలించుచుఁ బరుల దూషింపక, పెద్దలవాక్యములయందు శ్రద్ధగలిగి, సత్కార్యములయం దాసక్తిని వహించి, అల సతను విసర్జించి, సమస్తభూతములందు వాస్తవికమగు సహానుభూతిని గలిగియుండి నిత్యము సాధుమార్గానువర్తు లయి చరించుచుందురో, వారే నిజముగ ధన్యులు. అట్టి వారినే పవిత్రులగు పురుషులుగ భావింపవలయును. దేహ

మునం దంతట చందన లేపన మొనరించుకొని దైవప్రీతి సంపాదనార్థము ధ్యాన మొనరించుచుండియు నంతశ్శుద్ధిలేని మానవుఁడు విశ్వప్రయత్నము లొనరించియు దైవమును బడయజాలఁడు. ఏ పురుషపుంగవుల హృదయములు స్వచ్ఛములై, వివిధ సద్గుణాలంకృతములయి, విద్యావివేక యుతములై, జితేంద్రియము లయియుండునో వారే సమస్త విధముల బరిశుద్ధమూర్తులు.

త్రికరణముల మధ్యగల భిన్నత్వమును నశింపఁజేసి, మనోవాక్కర్మలఁ బరిశుద్ధుఁడయి యొప్పు మనుష్యుఁడే సర్వలోకైకపూజ్యుఁడు. మనోవాక్కర్మల శుద్ధి పూర్వకమగు నైక్యబుద్ధిని గలిగియుండని వ్యక్తికంటె నశుద్ధుఁడు మఱొకఁడు లేఁడు. త్రికరణశుద్ధియుతుఁడే మహాత్ముఁడు. త్రికరణశుద్ధి హీనుఁడే దురాత్ముఁడు.

మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం ।
మనస్యన్య ద్వచస్యన్య త్కర్మణ్యన్య ద్దురాత్మనాం.

—నీతిశాస్త్రము.

“మనస్సుచేతను, వాక్కుచేతను, కర్మచేతను, నొక్కటిగా నుండువాఁడు మహాత్ముఁడు. త్రికరణముల భిన్నముగ నుండువాఁడు దురాత్ముఁడు.”

శరీరశుద్ధి యెపుడు నాత్మశుద్ధి కానేరదు. పేటికయం దుంచఁబడిన వస్త్రములఁ బరిశుద్ధ మొనరింపవలయు నన్న వాంఛచే సబ్బుతోఁ బెట్టెను తోమిన నెంత ప్రయోజన ముండునో శరీరశుద్ధిచేఁ దదంతర్భాగమున వెలయు నాత్మకును నంతయే ప్రయోజనము కలుగఁగలదు. విద్యార్థులారా!

అంతశ్శుద్ధియొక్క విశేషము నెఱింగి మూల్యవంతములగు వస్త్రముల ధరించుచు, సుగంధతైలములచే శిరోజముల సంస్కరించుకొనుచు నున్నంతమాత్రముననే మీ జీవితములు సార్థకములు కానేరవని గుర్తించి సదాచారాది సద్గుణములచే మీ యంతఃకరణముల నలంకరించుకొనుఁడు.

పరిశుద్ధమగు హృదయము తీర్థక్షేత్రములకంటె సహస్రగుణము లధికము శ్రేయస్కరమని ప్రేమమూర్తి యగు శ్రీరామమోహనుఁడు నుడివియున్న విషయమును విస్మరింపకుఁడు. సదభ్యాసములు లేనట్టియు, నిరంతరము దుర్విచార దుర్భావములకు హృదయమునఁ దావొసంగుచుండునట్టియు, దుష్కర్మాచరణమునం దానందము ననుభవించుచుండునట్టియు మానవుని మలినజీవితము వ్యర్థమయినది. అట్టివాని జీవితము మలభుక్కగు సూకరజీవితముకంటె హీనమైనదని బుద్ధప్రభువు నుడివియున్నాఁడు. శ్రీకృష్ణయోగీంద్రుఁడు సయితము బాహ్యమగు శుద్ధికంటె సంయమాదులచేఁ గలుగు నాత్మశుద్ధినే ఘనమని ధనంజయునితో నుడివియున్నాఁడు.

"ఆత్మా నదీ సంయమపుణ్యతీర్థా
సత్యోదకా శీలతటా దయోర్మిః
తత్రాభిషేకం కురు పాండుపుత్ర
న వారిణా శుద్ధ్యతి చాంతరాత్మా."

విద్యార్థులారా! కృష్ణయోగీశ్వరుని కథనానుకూలంబుగ నాత్మ యను నదియొక్క సంయమ మను తీర్థక్షేత్రమున సత్యోదకముచే నంతశ్శుద్ధు లగుఁడు. అంతశ్శౌచము లేని మనుష్యజీవితము ముమ్మాటికిని వ్యర్థమని విశ్వసించుఁడు.

# అఱువదిమూఁడవ ప్రకరణము



## ఇంద్రియ నిగ్రహము

"ఇంద్రియాణాం ప్రసంగేన దోషో మృచ్ఛ త్యసంశయం,
సంనియమ్య తు తా న్యేవ తతః సిద్ధిం నియచ్ఛతి."

—మనుస్మృతి.

"ప్రసంగవశముననైన నింద్రియాదులకు వశుఁడైన వ్యక్తి దూషితుఁ డగుచున్నాఁడు. ఇంద్రియముల నిగ్రహింపలేని మనుష్యుఁడు సిద్ధి నందఁజాలఁడు."

ధర్మముయొక్క పష్ఠమాంగమే యింద్రియనిగ్రహము. నీతివిరుద్ధ మగు పథమునుండి సమస్తేంద్రియముల విముఖమొనరించి ధర్మాచరణము వైపునకు సుముఖము గావించుటకే యింద్రియనిగ్రహ మని పేరు. ఇంద్రియ వశీకరణముననే మనుష్యుఁడు శోకభయాది విపత్పరంపరలనుండి విముక్తుఁడయి, నిశ్చలానందసౌఖ్యముల ననుభవించుచుండఁ గలఁడు. మానస సమేతముగా సమస్తేంద్రియముల నాత్మాధీనముఁ గావించు వృత్తికే దమ మని పేరనియు, దమమునకును, ఇంద్రియనిగ్రహమునకును విశేషమగు తారతమ్యము లేదనియుఁ దృతీయప్రకరణమున లిఖించియుంటిని.

మానసము, ఆత్మ యను నీరెండుపదార్థముల స్వరూపతత్త్వముల నిరూపించు విషయమున మేధావంతులు సయిత

మొకప్పుడు నిశ్చేష్టులయి పోవుచున్నారు. వీని సూక్ష్మధర్మములఁ బరిశీలించుట సామాన్యమయిన కార్యముగాదు. ఇంద్రియనిగ్రహమునకు బ్రహ్మచర్య మను పదమును బర్యాయవాచకమే కాఁగలదు. బ్రహ్మచర్యముకంటెను లౌకికపారలౌకికము లగు విషయములయం దన్నింట మానవుని నిష్ఠాగరిష్ఠు నొనరించు దమమే శ్రేష్ఠతరమయినది. ఇంద్రియనిగ్రహము దమవంతునకు మిక్కిలి సులభానుష్ఠేయము. దమమును, బ్రహ్మచర్యమును పరస్పరసంబంధబద్ధము లయి యున్నవి. కావున బ్రహ్మచర్య మనఁదగు నింద్రియ నిగ్రహమునుగూర్చి విశేషముగా విమర్శింప నిట నవసరములేదు.

ఏకాగ్రచిత్తముచే విశ్వమునం దనేకములగు కార్యములు సులభముగా నిర్వహింపఁ బడుచున్నవి. చిత్తముయొక్క యా యేకాగ్రతవలననే ప్రాచీన భారతీయ ఋష్యాదులు సర్వోత్కృష్టము లగు సద్గ్రంథముల రచింపఁగలిగి యుండిరి. ఇంద్రియములయొక్క చాంచల్యమునకు వశీభూత మయియున్న చిత్తమును గలిగియున్నవ్యక్తి యే కార్యమును సమర్థింపఁజాలఁడు. ప్రశాంతచిత్తుఁడు, నిర్మలహృదయుఁడు సామాన్యమానవదృష్టి కసాధ్యములుగ నున్న కార్యముల నెన్నింటినయిన సులభముగా సాధింపఁ గలుగు చున్నాఁడు. మనుష్యజాతియొక్క యున్నతిమంత్రము సుస్థిరచిత్తమునం దంతర్భూతమయి యున్నది.

"రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.
ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి."

—భగవద్గీత.

"రాగద్వేషములను జెందనీయక, తనకు స్వాధీనము లయినట్టి యింద్రియములచే నిషిద్ధములుగాని శబ్దాదులగు విషయముల ననుభవించుచుండు విధేయాత్మ మనోధైర్య మును బడయును. అట్టి యాత్మ గలవానికి మానసిక నైర్మ ల్యము కలిగినతోడనే దుఃఖము లన్నియు నంతరించును. చిత్తము నిర్మలముగా నున్న వాని బుద్ధియే త్వరగా స్థిర పడఁగలదు."

మానవుని యున్నత జీవితలక్ష్యమునందు సంలగ్నము గానట్టి చిత్తమును గలిగియుండు మనుష్యుఁ డేకార్యముల నాచరించినను సాఫల్యమును బడయఁజాలఁడు. ఉన్నతి మార్గమున కవరోధములఁ గల్పించుచుండు ప్రమాదాది దోషములు చిత్తచాంచల్యమునుండియే యుదయమగు చున్నవి. దుర్గుణములును జిత్తము చంచలమగుటకు ముఖ్య కారణము లయియున్నవి. ఈమర్మము నెఱింగి మనుష్యుఁడు పదా తనచిత్తము నేకాగ్ర మొనరించుకొనువిధము నభ్య సింప వలసియున్నది. చిత్తైకాగ్రతాసాధనమునే యోగ మందురు.

చిత్తైకాగ్రతచే మనుష్యప్రకృతియొక్కయు నానా విషయములయొక్కయు నిగూఢ రహస్యము లన్నియు స్పష్ట పడఁగలవు. సంయమశక్తిహీనుఁడు సమస్తేంద్రియాధిపతి యగు చిత్తమును స్థితప్రజ్ఞాన్వితముగఁ జేసికొనఁజాలఁడు. ఈ కారణమునే మానవుని జీవితమందలి ప్రశస్తములగు విజయముల కన్నింటికి నిగ్రహమే మూలకారణమని గురు జనులు వచించియున్నారు.

"అవిజిత్య య ఆత్మాన మమాత్యాన్ విజిగీషతే,
అమిత్రాన్ వాఽజితామాత్య సోఽవశః పరిహీయతే."
—భగవద్గీత.

"తన్నుఁదాను జయించుకొనకయే మిత్రులను జయించకయే శత్రువులను జయింపఁగోరుచుండువాఁడు దీనుఁడయి నశించును.

ఇంద్రియముల సంయమపాశముచే బంధింపఁజాలని మనుష్యుఁడే ధార్మికకార్యమును బ్రారంభింపఁజాలఁడు. ఒకవేళఁ బ్రారంభించినను దానిని నిర్వహింప నసమర్థుఁడే యగును. ఆత్మోన్నతికిఁ గారణభూతములగు బుద్ధి విద్యాబల రూప గుణాదికములు మన కింద్రియ నిగ్రహమువలననే సంప్రాప్తము లగుచున్నవి. పరమేశ్వరుఁడు మన కెందు నిమిత్తము వివిధేంద్రియములఁ బ్రసాదించియున్నాఁడో, వాని నా యీశ్వర నిర్ణీతమగు సదుద్దేశ్యమును సాధించుట యందే నియమించుటకే నిగ్రహ మని పేరు.

దయామయుం డగు పరమేశ్వరుఁడు విజ్ఞానధనము నార్జింపవలసిన మనుష్యుల మగు మనకు శబ్దముల నాలకింప శ్రవణముల నొసంగియున్నాఁడు. అట్టి పవిత్రములగు కర్ణముల మూలమున సత్ప్రసంగముల నాలించుటకు మాఱుగఁ బరనిందాది దుష్ప్రసంగముల విను వృత్తిని నిరోధించిన మనము కర్ణేంద్రియ నిగ్రహమున విజయమును గాంచిన వారల మగుదుము. చక్షువులు మంచి దృశ్యముల వీక్షించు నిమిత్తము సృజింపఁబడినవి. ఈ కారణమున వానిచే మనము నీతివిరుద్ధములగు భావముల హృదయములయం దావిర్భ

వింపఁ జేయనట్టి దృశ్యములను, భక్తి ధర్మ జ్ఞానములకు క్షతి నొదవింపని పదార్థములను సందర్శింపవలయునే కాని కామ క్రోధాదులను, అవినీతినిఁ బ్రేరేపించునట్టి సిందృశ్యములగు దృశ్యములను, దుష్పదార్థములను విలోకింపరాదు. ఇట్లొనరించుటచే నేత్రేంద్రియము నిగ్రహబద్ధమగును. ఇదియే చందమున జిహ్వేంద్రియమును, త్వగింద్రియమును, ఘ్రాణేంద్రియమును, తదితరేంద్రియములను దుష్ప్రవృత్తులనుండి మరల్చి, సత్ప్రవృత్తులయందు లీనమొనరించిన నిగ్రహ సాధనమున మనుష్యుఁడు కృతార్థుడు కాఁగలఁడు.

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.

—భగవద్గీత.

"అర్జునా ! నిస్సందేహముగ మనస్సు కడు చంచలమును, దుర్నిగ్రహమును నయియున్నది. కాని అభ్యాసమునను, వస్తుసంబంధమగు విరక్తి వలనను వశమొనరించుకొనఁబడఁగలదు."

అశ్వారోహికి వాహనముగనున్న సైంధవము లోఁబడియుండవలయునుగాని, వాజికే గుఱ్ఱపురౌతు వశవర్తియయిన సైంధవము మార్గముయొక్క ఋజువక్రస్థితిని పాటింపక తన యజమానుని విపత్తులకు గుఱిఁగావింపఁగలదు. ఇంద్రియాదుల చాంచల్యమును గుఱించి భగవద్గీత యీరీతి బోధించుచున్నయది.

"ఇంద్రియాణాం విచరతాం విషయే ష్వపహారిషు,
సంజయే యత్ర మాతిష్ఠే ద్విద్వాన్ యంతేవ వాజినాం."

"చిత్తాకర్షకములగు విషయాదులవైపున కింద్రియములు పరుగిడుచుండును. యోగ్యుఁ డగు సారథి శకటము నీడ్చు సైంధవముల స్వాధీనమునం దునిచికొను విధంబుననే విద్వాంసుఁడు (జ్ఞాని) స్వీయేంద్రియముల నెల్ల వశ మొనరించుకొనఁ దగును."

నేఁడు ప్రతిమానవుఁ డింద్రియములపై నెట్టి శాసన బలమును గలిగియుండక వానిని యథేచ్ఛాసంచారమునకు వదలివేయుటచేఁ దన జీవితమునం దెన్నెన్నియో యిక్కట్టుల ననుభవింప బాధ్యుఁ డగుచున్నాఁడు. దురభ్యాస గ్రస్తములయిన యింద్రియముల స్వాధీన మొనరించుకొనుట యందు మనుష్యుఁ డెన్నియో కష్టనిష్ఠురముల సహింపవలసి యుండును. మదగజము నంకుశముచే మావటీఁడు యథేచ్ఛగా నడపుచుండు చందముననే ప్రతి మనుష్యుఁడును నిగ్రహ ప్రభావమున మదోన్మత్తములయియున్న యింద్రియముల నెల్ల ధర్మమార్గమునకుఁ ద్రిప్పుకొనుచుండవలయును.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు,
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ.
ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్,
ఆత్మేంద్రియ మనో యుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః."

"మానవుని దేహ మొక రథమువలె నున్నది. జీవాత్మ యీరథము నధిరోహించి యున్నది. బుద్ధి సారథిగా నున్నది. జ్ఞానేంద్రియములు రథమును లాగు పంచాశ్వములు. మనస్సు యీ పంచాశ్వముల నోళ్ళ దగిలింపఁబడిన ప్రగ్రహము (కళ్ళెము). ఈ రీతిగనున్న రథము శబ్దరూపరసగంధస్పర్శాది

పంచవిధ మార్గములంబడి ప్రయాణ మొనరించుచున్నది. ఆత్మేంద్రియ చిత్తములతోఁగూడి మనుష్యుఁడు (జీవాత్మ) ఈ ప్రయాణముచేఁ గలుగు ఫలము ననుభవించుచున్నాఁడు."

శకటము నధిరోహించినవాఁ డెట్టివాఁడయినను, రథ మెట్టిదయినను దానికిఁ బూన్చఁబడిన గుఱ్ఱముల కళ్ళెమును బట్టి నడపించు సారథి సమర్థుఁడును, చతురుఁడును నయి యున్న నెవరి కెట్టి హానియు లేక రథము శీఘ్రకాలమందే గమ్యస్థానమును జేరి యెల్లరి కానందమును గలిగింపఁగలదు. సారథి మూఢుఁడయిన తేరునఁ బూన్చఁబడియున్న గుఱ్ఱములు వక్రమార్గమును బట్టిపోయి రథము నే గోతియందునో పడవైచి యెల్లరికి ముప్పునొదవించును. సారథియొక్క తెలివి లేమిచే రథమూ-తుత్తునియ లగును. రథారోహియూ- యసువులఁ బాయును. సారథి యన్ననో బలవన్మరణము నందును. మదించినగుఱ్ఱములో, యన్న నవియు విపద్గ్రస్తము లగును.

సరిగా నిదియేచందమున విషయాదిమార్గముల ననుస రించి దేహము నీడ్చుకొనిపోవుచున్న పంచేంద్రియములను మనస్సుతోఁబాటుగా నిగ్రహముచే బంధించి వానిని బుద్ధికి వశమొనరించినఁ గాని దేహమునఁ గాపుర మొనరించుచున్న యాత్మ సౌఖ్యము నందఁజాలదు. ఇంద్రియముల స్వాధీన మొనరించుకొనినపుడే చిత్త మధర్మమార్గమునుండి యాక ర్షింపఁబడి ధర్మాచరణమునందు సంలగ్నము కాఁగలదు. కావున మిథ్యలగు ప్రాపంచిక తుచ్ఛభోగవిలాసము నుండి విడివడి స్వచ్ఛందమగు పవిత్రజీవితమును గడవ నారంభించి నపుడే మనుష్యుఁడు నిగ్రహ ధర్మానుష్ఠానమునఁ గృత కృత్యుఁడు కాఁగలఁడు.

ఎవ్వాఁ డింద్రియనిగ్రహమున సమర్థుఁడు కాఁగలుగునో, అతఁడే ప్రతాపవంతుఁడయి, వీర్యవంతుఁడయి, యశస్వియయి సమస్తవిధములగు పవిత్రానందముల ననుభవించి, అనాయాసముగ మోక్షపథగామియగుచున్నాఁడు. ఇంద్రియనిగ్రహమే మనుష్యుని సద్గుణసంపన్నునిగను, సాధుసత్తమునిగను, సర్వజనవంద్యునిగను, మేధావంతునిగను జేయఁగల దనుట కెట్టి సందియమునులేదు. మనమెల్లపుడును సావధానులమయి యుండినఁగాని చంచలేంద్రియముల విషయములనుండి మరలించుటయందు శక్తులము కాము.

"కామక్రోధా లోభమోహా దేహే తిష్ఠంతి తస్కరాః,
జ్ఞానరత్నాపహారాయ తస్మా జ్జాగ్రత జాగ్రత."

"కామ క్రోధ లోభమోహాదులు దేహమున డాగియున్నట్టి తస్కరులు. ఈచోరులు జ్ఞానరత్నము నపహరింపనున్నారు. కావున మెలఁకువతోడ నుండవలయును."

మన పూర్వఋషులు మనుష్యజీవితమును చతుర్భాగములుగ విభజించియున్నారు. తద్భాగముల బ్రహ్మచర్యాశ్రమము తొల్లింటిది. ఈ యాశ్రమమందు మనుష్యుఁడాదర్శ మానవజీవితోచితము లగు నిగ్రహలక్షణములనెల్ల సంపాదించి స్థితప్రజ్ఞుఁడయి, స్థిరచిత్తుఁడయి తన భావిజీవితము నానందమయము గావించుకొన బాధ్యుఁ డగుచున్నాఁడు.

కాని నేఁ డట్టి నిగ్రహశక్తినిఁ బ్రసాదించు పవిత్రమగు బ్రహ్మచర్యాశ్రమపూర్వక మగు జీవితవిధానము భరతవర్షమున మన దుర్భాగ్యవశమున నశించిపోయినది. ఋష్యాదులు విధించియున్న చతురాశ్రమములందు నిగ్రహమునకే

సమున్నత మగు స్థాన మొసంగఁబడినది. ఋషులు సంయు
మిత ప్రాపంచిక సౌఖ్యానుభవమును, పరమార్థసంపాదన
మును మానవజీవిత లక్ష్యములుగ నిర్ణయించియున్నారు.

నేఁటి నాగరిక ప్రపంచము తన విలక్షణమగు విజ్ఞాన
మహిమచే మనుష్య జీవితమునకు నిగ్రహము నొక యనా
వశ్యకమగు పదార్థముగ సిద్ధాంతీకరించి తన రూప, యౌవన,
విద్యాగుణమేధాసంపత్తులఁ దుచ్ఛములగు విలాసములకయి
వెచ్చించుచున్నయది. నేఁటి సంతాననిరోధవాదము, దేహా
రోగ్యమునకు విషయసేవన మవసరమను శరీరవిజ్ఞానవాదము
మనుష్యసంఘమున హతావశేషమైయున్న నిగ్రహశక్తిని
సయితము నశింపఁజేసి వైచినది.

బాల్యమున నిగ్రహబీజములు మన హృదయములందు
నాటఁబడి విద్యార్థిదశయందు దోహదము నంది బ్రహ్మ
చర్యాశ్రమము ముగిసి, గృహస్థాశ్రమము ప్రారంభ మగు
సరి కచంచలమగు నిగ్రహనిష్ఠగఁ బరిణమింపవలసి యున్నది.
విద్యకును, ఇంద్రియనిగ్రహమునకును విశేషమగు సంబంధము
కలదు. భోగవిలాసములు, శృంగార తృష్ణ విద్యోపార్జనకుఁ
బ్రబలశత్రువులు.

ఇంద్రియనిగ్రహమును దొలుత సంపాదించియుండినఁ
గాని యువకుఁడెట్టి యుత్తమకార్యము నొనరించుటకును సము
ర్థుఁడు కాఁజాలఁడు.

"కం॥ విచ్చలవిడి నింద్రియముల
నెచ్చటికైనను జనంగ ♦ నిచ్చిన నరకం

బచ్చు పఱచు గదియించినఁ
దెచ్చును గతి నరున కది సంతీమాళిమణీ."

—మహాభారతము.

మానవుని సుగతి కింద్రియనిగ్రహ ముత్తమసాధన మని యువకులు విశ్వసించి వర్తించు టుచితము.

ప్రాపంచిక సౌఖ్యములయొక్క నైచ్యము నెఱింగి, నిగ్రహపూర్వకముగాఁ బవిత్రసంకల్పములతో శ్రమ యొనరించి విద్యను సంపాదించు ఛాత్రుఁ డీ సమగ్రవిశ్వమునకు స్పర్థను గలిగింపఁగలట్టి యపూర్వమగు నభివృద్ధిని గాంచఁగలఁడు. విద్యార్థులు బ్రహ్మచర్య మింద్రియనిగ్రహమునుండి భిన్నమగు వృత్తి యని భావింపరాదు. అహింసాధర్మమున జీవకారుణ్యము స్థూలభాగ మయియున్నట్లు బ్రహ్మచర్యమున వీర్యరక్షణము తొల్లింటిసూత్ర మయియున్నది. ఇంద్రియ నిగ్రహముచే మనుష్యుఁ డాదర్శస్థితికిఁ బ్రాపించుచున్నాఁడు.

విద్యార్థులారా! మీ రింద్రియనిగ్రహములను సంపాదింపరేని యిహపరములకు దూరము కావలసివచ్చును. మీరు నిత్య మభిలషించు మోక్ష మింద్రియనిగ్రహమువలననే లభించునుగాని, ధనాపేక్షాపరులును, కృత్రిమయశఃకాములును నగు గురువులచే లభింపనేర దని గుర్తెఱుంగుఁడు. స్వయంకృషిచే స్వీయేంద్రియముల నెల్ల దుర్విషయముల వైపున కరుగుటనుండి మరలింపుఁడు. ఈవిషయమయి ప్రహ్లాదకుమారుఁ డెటుల విషయపరవశుఁడగు తనతండ్రికి బోధించియున్నాఁడో విలోకింపుఁడు.

"తే॥ గీ॥ వైరు లెవ్వరు చిత్తంబు ♦ వైరిగాక
చిత్తమును నీకు వశముగాఁ ♦ జేయుమయ్య
మదయుతాసుర భావంబు ♦ మానుమయ్య
యయ్య నీ మ్రోల మేలాడ♦రయ్య జనులు."

"ఉ॥ లోకము లన్నియున్ గడియ♦లోన జయించినవాఁడ వింద్రియా
నీకము జిత్తమున్ గెలువ♦నేరవు నిన్ను నిబద్ధుజేయు నీ
భీకరశత్రులార్వురఁ బ్ర♦భిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు♦ నేర్పునఁ జూడుము దానవేశ్వరా."

—భాగవతము.

జితేంద్రియుఁడగు ప్రహ్లాదకుమారుఁడు వచించినరీతిగ నింద్రియనిగ్రహశూన్యుఁడు సమస్తమును గలిగియున్నను వ్యర్థుఁడే. ఇంద్రియనిగ్రహసంపన్నుఁ డేమియుఁ గలిగి యుండకపోయినను సకల జన పూజితుఁడగు విజయుఁడే. యువకులారా! మీ రనుదిన ముదయ మాదిగ సాయంకాలము వఱకు మీ పంచేంద్రియములచే యే కార్యములఁ గావించియుండినదియు, తత్కార్యముల బాగోగు లెట్లుండినదియు ధ్యానముతో రాత్రికాలమందు శయ్యను జేరినంతనే విచారించుకొనుఁడు.

పంచేంద్రియంబులయందే యింద్రియములచే నయిన మనస్సు కలుషితమయి, దుష్క్రియకు బాల్పడియున్నఁ గాని, వాల్పడు సంకల్పమునం దున్న కాని తత్క్షణమే యట్టి పాపమునకయి సిగ్గుజెందుచుఁ బశ్చాత్తాపతప్తులయి యాత్మ ప్రబోధ జాగరూకతచే నింద్రియముల దుష్ప్రవృత్తులనుండి

నిరోధించు యత్నమునకుఁ గడంగుఁడు. నేఁడు మనము క్షణి కములును, అల్పములును నగు ధనధాన్యవస్తువాహనాదిక ముల రక్షణమును గూర్చి వహించుశ్రద్ధలో శతాంశమయిన నింద్రియముల నిగ్రహవిషయమునఁ గలిగియుందుమేని భూతలమును స్వర్గతుల్యముగ మార్చివేయఁగలము.

నాయనలారా! ఇంద్రియనిగ్రహ మేదో యొక యల్పవిషయ మని భావింపకుఁడు. వ్యాసునంతటి మహర్షియే చంచలములగు నింద్రియముల నిరంకుశప్రకృతి నెఱింగి "బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" బలవత్తరములగు నిందిృయములు విద్వాంసుని సయితమాకర్షించి వేయుచున్నవని వచించియున్నాఁడు.

ప్రేమపాత్రులగు విద్యార్థులారా! వ్యాసునికథనమం దలి సత్యము నెఱింగి సదా యప్రమత్తులయియుండి విజ్ఞానసం పాదనమునకును, పవిత్రానందశాంతులఁ బడయుటకును దయాంబుధియగు జగదీశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన పంచేం ద్రియముల నిగ్రహముచే దుర్విషయముల పొంతకుఁ బోనీ యక సద్వృత్తులయందే లీన మొనరింపుఁడు. అపుడే మీరు కల్యాణమూర్తు లయి సుఖంతురు.

"విషస్య విషయాణాం చ దూర మత్యంత మంతరం,
ఉపభుక్తం విషం హంతి విషయాః స్మరణాదపి."

—భగవద్గీత.

"విషమునకును, విషయములకును మిక్కిలి భేదము కలదు. విషము భుజించినవానినిమాత్రమే హత్య నొనరిం

చును. విషయము లన్నినో సంస్మరణమాత్రముననే జీవాత్మను నష్టమొనరించును."

కామినీకాంచనాది విషయపదార్థము లనంతములయి విశాలమగు నీవిశ్వమున దశదిశల వ్యాపించియున్నవి. నాయనలారా! వీని మధ్యయం దుండియే మీరు మీ జీవయాత్రలఁ జేయవలసియున్నది. సకలలోకపావనమూర్తియగు శ్రీ భీష్మాచార్యుఁడు రంభాదుల సౌందర్యము ధిక్కరింపఁగలట్టి కాంచనమూర్తులగు మదవతులచే నొప్పారు రాజప్రాసాదముల మధ్యఁ దనజీవితము నెట్లు దాంతుఁడయి, ఇంద్రియనిగ్రహయుతుఁడయి పవిత్రముగఁ గడిపియుండెనో, ఆవిషయమును మీ రాదర్శప్రాయముగ భావించుకొని విషయపరిపూర్ణమగు విశ్వమండలమున నిగ్రహపూర్వకముగ మనుఁడు నిగ్రహానుగ్రహశక్తి సంపన్నుఁడగు జగదేకసార్వభౌముఁడు మిమ్మాశీర్వదించునుగాక!

శుభమస్తు!



# అఖువది నాలుగవ ప్రకరణము



## ధీ (బుద్ధి)

తే॥గీ॥ కండబల మెంత యున్నను ♦ గండ డంచు
బుద్ధిబల మెక్కుడు గలుగు ♦ పురుషవరుఁడు
దేహబలమునకంటెను ♦ ధీబలంబె
శ్రేష్ఠతర మెల్లగతులఁ ద♦ర్కించి చూడ.

—నీతిమంజరి.

ధీ ధర్మముయొక్క సప్తమాంగము. దీనిని సంస్కృత మందు బుద్ధి యనియు, ధిషణ యనియు, శేముషి యనియు, ప్రజ్ఞయనియు నెన్నియో నామముల వ్యవహరించుచుందురు. సమస్తప్రపంచముయొక్క హితాహితములు ముఖ్యముగా బుద్ధి మీఁదనే యాధారపడియున్నవి. మన కెన్ని సంపద లున్నను బుద్ధి యొకటి లోపించిన సమస్తము వ్యర్థమే యగును. అమూల్యమగు నీ బుద్ధి రజస్సత్వ తమోగుణ సమన్వితమై యున్నది.

ప్రాకృతమగు నియ్యది జ్ఞానముచే సదా పరిశుద్ధ మగుచుండును. సముద్రమునుండి జలము బాష్పరూపమున మేఘములను, మేఘములనుండి వర్షరూపమున నదులను, నదులనుండి చిన్న కాలువలను జేరి లోకోపయోగ కరమగు న్న చందముననే జ్ఞానమునుండి పరమ పవిత్రమగు జీవ

శక్తి బుద్ధికి సంప్రాప్తమగుచున్నది. బుద్ధినుండియే యీ శక్తి వివిధేంద్రియములఁ బ్రవేశించి, తన్మూలమున వివిధములగు పరిణామములఁ గలిగించి, తత్పరిణామ సంభూతములగు సుఖదుఃఖముల జీవాత్మచే ననుభవింపఁజేయుచున్నది.

చర్మచక్షువునకు ననఁగా నయనగోళమునకు పదార్థవిలోకనశక్తి లేదు. ధీనుండియే వీక్షణశక్తి కంటిగ్రుడ్డునకు లభించియున్నది. అట్టి శక్తికి నేత్రగోళము సాధనమాత్రముగ నున్నది. ఇదియేచందమున శ్రవణఘ్రాణేంద్రియాదులకును తదుచితములగు విషయముల గ్రహించు సామర్థ్యము బుద్ధినుండియే లభించి యున్నది.

మన ఋషులు బుద్ధిని భూధరముతోఁ బోల్చియున్నారు. బుద్ధి పర్వతమువలెనే మహోన్నతమును, అతి విశాలమును నయి యున్నదనియే వారి యుద్దేశ్యము. వృద్ధి గావింపఁబడుకొలఁదియు బుద్ధి యభ్యున్నతి నంది సర్వాభీష్టసిద్ధిప్రద మగుననుట నిర్వివాదాంశము. బుద్ధి పరిశుద్ధ మయినపుడే మానవునకు మోక్షము నొసంగ సమర్థ మగుచున్నది. ఈ బుద్ధియే కలుషితమయినపుడు నరకమునకుఁ గారణమగును.

నేఁడు సకలప్రపంచము పరమపవిత్రమును, అమూల్యమును నగు ధీశక్తిని దుర్విషయములకయి నష్ట మొనరించుచున్నయది. బుద్ధియొక్క కర్తవ్యము న్యాయాధిపతియొక్క ధర్మమువలె నుండుచున్నయది. న్యాయాధిపతి ధర్మపీఠము నధిష్ఠించి యొక వ్యవహారమున సాక్షులఁ గొందఱిని విచారించు చున్నాఁడు. సాక్షు లనేకులు నేరస్థుని విషయమై

బరస్పర భిన్నాభిప్రాయముల నొసంగుదురు. ద్రోహి నన్వే షించి నిశ్చయించుటకయి న్యాయాధిపతి సాక్షులొసంగిన వాఙ్మూలముల నన్నింటి విశ్వసింపక నియమశూన్యములుగ నున్న వారి భిన్నములగు కథనములందలి సత్యమునే గ్రహించి సాక్షుల వివిధాభిప్రాయములలో నేదో యొక్క యభిప్రాయ మునే స్థిరపఱచును.

ఇదియే విధముగఁ బవిత్రమగు బుద్ధియు జ్ఞానబలము నాధారముగఁ జేసికొని ప్రపంచమందలి మిథ్యావిషయముల బహిష్కరించుచుఁ బాపమధ్యమునుండి పుణ్యమును, అజ్ఞాన మధ్యమునుండి జ్ఞానమును సంపాదించుచుండును. వివిధము లగు నిగూఢరహస్యములతోడను, దుర్భావ సద్భావములతో డను, గుణావగుణములతోడను, నిండి నిబిడీకృతమై యున్న విశ్వాంబుధిఁ జొచ్చి సత్యధర్మరత్నముల నన్వేషించి తెచ్చు టయే బుద్ధియొక్క పవిత్రమగు కర్తవ్యము.

కావుననే విద్వాంసులు బుద్ధి నీరీతి సంస్తుతించి యున్నారు.

**"One drop sense is worth a river of words,**
**A deluge of words and a drop of sense."**

"వాక్ప్రవాహమునకు బిందుమాత్రపు బుద్ధి సరి వచ్చును అణువుయంతబుద్ధి వాక్ప్రవాహమునకుఁ దుల్య మయియున్నది."

తన జీవితలక్ష్యము నేనాఁడు మనుష్యజాతి విస్మృతి గర్భమున లీన మొనరించెనో నాఁటినుండియే ధీవికాసమునకు వయు ప్రయత్నము లొనరించుటయు నంతరించినది. విశా

లాకాశమునం దనంతములయి, మిణుకు మిణుకు మని ప్రకాశించు తారకాసముదాయమధ్యంబున దివ్యమగు ప్రభతోఁ బ్రకాశించు సుధాకరుని పగిది మానవజీవితముయొక్క చిత్రవిచిత్రములగు శక్తులలోని కెల్ల బుద్ధి సుప్రశస్తమును, అతులితానంద సంధాయకమును, అనన్యసామాన్యప్రభావోన్నతమును నయి వెలయుచున్నది.

అనంతమగు ప్రపంచమున వ్యాప్తము లయియున్న మిథ్యావిషయావృతములగు పదార్థములలోనుండి సారభూతమగు సత్యమును గ్రహించుట, అగాధమగు సాగరంబున మునింగి రత్నముల వెదకి తెచ్చుటకంటె మిక్కిలి కష్టసాధ్యమగు కార్యము. ఇట్టి కష్టసాధ్య మగు జటిల సమస్యను బరిష్కరించుటకు బుద్ధి యెంత విశాలమును, పరిశుద్ధమును నయి యుండవలయునో విచారించుఁడు.

ఉ॥ పెద్దయుఁ జిన్నయంచు నొక ♦ భేదము లేక సమస్తసంగతుల్
బుద్ధి గ్రహింపఁజాలుఁ జుమి ♦ పోడిమిగా నది యెట్టు లన్నచో
నద్దము పర్వతంబు పర ♦ మాణువటంచును జూడ కన్నిటిం
దద్దయుఁ దాల్పుచుండ నిర ♦ తంబునఁ జూచుట లేదె మిత్రుఁడా!
—సూక్తివసుప్రకాశకము.

దేవుఁడు దయామయుఁడయి యుండ, సమస్తజీవరాసులతని కరుణాకటాక్షముచే లోకమునం దెట్టి కొఱంతయు లేక సకలసౌఖ్యానందముల ననుభవించుచుండ, పాపవిమోచనమున కా దేవుఁడే నోరులేని సాధుజంతువుల బలివెట్టవలసినదిగా మనుష్యులఁ గోరుచున్నాఁడను టెట్టిసత్యమో తెలియకున్నది. చిత్తసీమయందుఁ గామక్రోధాది దుర్గుణములు

వేరూనియుండ బాహ్యానుష్ఠానమాత్రంబున మోక్షము లభించునను కేటిధర్మమో యూహింప వలనుపడకున్నది.

ప్రాపంచికములగు సమస్తవిషయాదులనుండి విరక్తిని జెందకయే శిరోముండన మొనరించుకొని, కాషాయాంబరముల ధరించి హస్తమునఁ గమండలముఁ బూనినంతనే మనుష్యుఁడు తాపసోత్తముఁ డగునను కేటిన్యాయము? విశ్వజీవ ప్రేమ మనుష్యధర్మ మని వేదాది పవిత్రగ్రంథములు చాటుచున్నను విద్యాధికుఁడగు మనుష్యుఁడు తన సాటిసహోదరుని నీచకులసంభూతునిగ భావించి మలాదికముల భక్షించు శ్వానముకంటె హీనముగఁ జూచు నాచారము నే దేవుఁడు సృజించియుండెనో స్పష్టపడకున్నది. సహచరులవలె నుండి సుఖదుఃఖములఁ బరస్పరసాహాయ్య మొనరించుకొనుచు నిగ్రహముతోఁ బవిత్రజీవితమును గడుపవలసిన దంపతులు దేవుఁడు స్త్రీ పురుషభేదమును సంభోగవృత్తిచే సుఖించుటకే కల్పించి యుండెనని భావించు టెంత సమంజసమో వివేచింపవలసి యున్నది.

కందమూలఫలాది సాత్వికాహారమును భక్షించి, తన్మూలమున జీవించుచు జ్ఞానమును సంపాదింప దేవుఁడు నియమించియుండ మనుష్యులు ఘాతుకమృగములవలె ముట్టురక్తముచే నేర్పడు మాంసఖండముల దయమాలి జిహ్వాచాపల్యమునకు వశులయి భుజించు టేపాటి పవిత్రకర్మయో విచారింపవలసియున్నది. నేఁడు ప్రపంచమున మనుష్యజాతి యుక్తాయుక్తవిచక్షణము లేక, దూరదృష్టిని విడిచి సత్యవిరుద్ధములగు కార్యము లొనరించుచుండుటకు ముఖ్యమగు హేతువు పవిత్రమును, భగవత్ప్రదార్థమును నగు

బుద్ధి తగినంత వికాసము నందలేక జడత్వమునకుఁ బాల్పడి యుండుటయే. మానవుని బుద్ధి సంపూర్ణముగా వికసించి, పవిత్రమయియున్నచో వాఁడు స్వప్నమందును సత్యమునకు విరుద్ధముగ నణుమాత్రమగు కార్యమునయిన నాచరింప నొల్లఁడు.

నేఁడు బుద్ధిజాడ్యముచే దేవుని పవిత్రశాసనముల దూషిత మొనరించివేయునట్టి సత్యవిరుద్ధములగు దురాచార దుర్నీతు లన్నియు మానవసంఘముచేఁ గడు ప్రీతితో ననుష్ఠింపఁబడుచున్నవి. నేఁటి మనుష్య సమాజముయొక్క యాచరణనుండున్న ధర్మములకును, భగవన్నిర్ణీతములగు ధర్మములకును హస్తిమశకాంతరము కలదు. నేఁటి మానవ జాతీయ వర్తనమునకును, సత్యమునకును బూర్ణవిరోధభావ ముండుటచుబట్టి మనుష్యజాతి తన విశాలమగు పరిష్కృత ధీశక్తిని జాలవఱకుఁ గోల్పోయినదనియే నుడువవలసి వచ్చు చున్నది.

"చ॥ నిరుపమబుద్ధిదైవమిడ. నీచుఁడుదుర్విషయంబులంబొరిం బొరిఁ గనిపెట్టుటం దహితముల్ పొనరించుటయందుఁజూపె డుఁ;
వెఱవుల నందె వేసినది. ఘోరవ మేమి ఫలంబు? దాని నే ర్పరితనమెల్ల, వంచన శవగ్రహణంబునఁ గాదె? మిత్రుఁడా!
—సూక్తివసుప్రకాశకము.

లోకమున వెలయుచున్నట్టి యొక వస్తువుయొక్క పూర్వాపరములను విచారించి సత్యమును గ్రహింపవలసివచ్చి నపుడు గృహనిర్మాణమునకు వివిధోపకరణము లావశ్యక

మయినటులనే కొన్ని సాధనము లపేక్షితము లగుచున్నవి. సత్యనిర్ధారణమున మనుజుఁడు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము అను సప్తవిధప్రమాణముల ముఖ్యముగా నవలంబించుచున్నాఁడు.

నేఁడు భారతీయుల విశ్వాసమునకుఁ బాత్రములయి, వేదధర్మముల నశింపఁజేసిన పౌరాణిక కల్పితగాథలు ఋషుల పవిత్రసంతాన మగు హైందవులందు విశేషసంఖ్యాకుల దేవుని కే దూరమొనరించె ననుటలో నతిశయోక్తి లేదు. నేఁటి మానవుని సాంఘిక, నైతిక వర్తనమునందు బుద్ధిప్రభావ మేమియు గోచరింపకున్నది. నేఁటి మనుష్యప్రపంచముచే రాగిడబ్బులవలన మోక్షము హస్తగతమగునను విషయము సత్యమే యగుచో వేదాది ధర్మగ్రంథములును సత్యము, ధర్మము, జ్ఞానము, శౌచము, భక్తి, సేవ, అహింస, పరోపకారము, దయ మున్నగు ధర్మములును వ్యర్థములు కావలసివచ్చును.

విద్యార్థులారా! మీరు విశాలమగు నీ ప్రపంచమందు సత్యమును, అఖండమగు విజయమును సంపాదింప వాంఛింతురేని శీఘ్రమే పవిత్రమగు బుద్ధిబలమును సంపాదింపుఁడు. బుద్ధిబలమున కీడగు బల మీ సృష్టియందు లేదు. మీయందు వలసినంత బుద్ధిబలము లేకపోవుటవలననే మీరు మూఢులయి మిథ్యాగురువుల యొక్కయు, కల్పితగ్రంథముల యొక్కయు, వంశపరంపరాగతములగు దురాచారముల యొక్కయు దాసాధములు కావలసివచ్చినది. మీరు ధీమంతులయి ప్రతివిషయమును దీర్ఘముగ విచారించి, అద్దాని తత్త్వ

మునుగూర్చి తర్కించి, దాని ప్రయోజనాప్రయోజనములజ్ఞానానుభవసంపన్నుల నడిగి తెలిసికొని, అటుపిమ్మటనే బుద్ధిబలముయొక్క సాహాయ్యమున ధర్మాధర్మములను, కర్తవ్యాకర్తవ్యములను, సదాచారదురాచారములను నిశ్చయించుకొనుడు.

మీ రెట్టి లోక విషయమునుగూర్చి సత్యమును గ్రహింప వలయునని దృఢసంకల్పపూర్వకముగ యత్నించెదరో, అపుడే మీ బుద్ధిబలము పరుల భూరిసాహాయ్యము కంటె మీకు మంచివలె దోఁప్పడి యసత్యమును ఖండించి సత్యమును వెల్లడి చేయఁగలదు.

"Words are like leaves, and where they most abound much fruit of sense bencatn is rarely found."

—Pope.

"శబ్దములు వృక్షపత్రములవలె నున్నవి. బుద్ధి కొలదిగా నట నట నా యాకులక్రిందఁ బొందఁబడు ఫలమువలె నున్నది." —పోపు.

పోపుగారు వచించినరీతిగఁ బ్రపంచమునగల సమస్త సౌఖ్యసాధనములలో బుద్ధియే ప్రధాన మయినది. కావున మానవుఁడు జీవితసౌఖ్యప్రాప్తి నిమిత్తము బుద్ధిని సమస్త విధముల వృద్ధిఁగావింప యత్నింపవలయును. తగినంత యాహారము సకాలమందు లభింపకుండుటచే దేహము శుష్కించి పోవుచున్నది. అదియేవిధముగ సత్సాంగత్యము, సచ్చింతనము, సద్విషయప్రసంగము, సద్గ్రంథపఠనము, పవిత్రాచరణము మున్నగు నైతికఖాద్యములు లేకుండుటచే

బుద్ధియు శుష్కించిపోయి మనుష్యునకు సత్యాసత్యనిర్ణయమునఁ దోడ్పడఁ జాలనంతటి హీనస్థితికిఁ బాల్పడఁగలదు.

విద్యార్థులీ రహస్యము నెఱింగి సత్పురుషుల సేవాశుశ్రూషల వలనను, ఆచార్యుల సద్బోధామృతపానముననను, ఏకాంతప్రదేశమునఁ గూర్చుండి దేవునియొక్క మహిమను గూర్చి చింతించుటవలనను, ఒకపదార్థమును స్వీకరించునపుడుకాని, పరిత్యజించునపుడుకాని దానియొక్క హితాహితములఁ గూర్చి తర్కించుటవలనను, సదా పవిత్రసంకల్పములఁ గలిగియుండుటచేతను మానవుని బుద్ధీంద్రియము విశుద్ధమయి, వృద్ధిఁజెంది యభిలషించిన దెల్లఁ గల్పతరువువలెను, కామధేనువురీతిగను ప్రసాదించుచుండఁగలదు.

ఉ॥ ఎందుఁ బ్రవేశపెట్టిన నహీనత నందెడుసంగుఁ, గానఁ దాఁ
బొందుగ మంచికార్యముల బుద్ధినిఁ జొన్పవలెన్ వివేకివై;
మందిరమందుఁ గ్రమ్మినతమమ్ముఁ నడంపఁగఁ జాలుదీపమున్
మందత జారులోనిడఁ బ్రమాదము సేయకయున్నె? మిత్రుఁడా!

—సూ. వ. ప్రకాశకము.

బుద్ధిమంతుఁడును, ధీమంతుఁడును, నగు వ్యక్తి సమస్త జనులచేఁ బూజింపఁబడఁగలఁడు. బుద్ధిలేనివాఁడు మనుష్యజన్మ మెత్తినను లోకముచే గార్దభమని పిలువఁబడుచున్నాఁడు. బుద్ధిబలము లేని వ్యక్తి పుణ్యాపుణ్యవిచారవర్జితుఁడయి యకృత్యము లెన్నియో సలిపి దుర్భరదుఃఖాగ్నిజ్వాలల దగ్ధమగును. బుద్ధిస్వభావము వృద్ధిగాంచుటయనియు, జ్ఞానస్నైజము బుద్ధిని శుద్ధమొనరించుటయనియు.

వివరించి యుంటిని. స్వాభావికముగా బుద్ధి మనుష్యునిచే వృద్ధిఁ గావింపఁబడదేని యది తన సహజ శక్తిని గోల్పోయి క్రమముగా జడప్రాయమయి పోఁగలదు.

వ్యవధియు, శ్రమయు, సత్సంకల్పమును, విశ్వాసమునుగూడి బుద్ధీంద్రియాభ్యుదయమును గావించుచుండును. శైశవమున శిశువుయొక్క బుద్ధీంద్రియ మంతగా వికసించి యుండని కారణముచే నగ్నిగోళమును నారింజపండుగ భావించి, స్పృశించి దుఃఖములపా లగుచున్నది. ఇట్టి యకార్యమును మనుష్యుఁడు బుద్ధిబలముచేఁ బరిత్యాజ్యముగ గ్రహింపఁ గలుగుచున్నాఁడు. శైశవమునందుకంటె బాల్యమునను, బాల్యమునందుకంటెఁ గౌమారమునను, కౌమారమునందు కంటె యౌవనమందును, యౌవనమందుకంటె వార్ధక్యమునను సదాచారసంపన్నుఁడయియుండు మనుష్యుని బుద్ధిబలము లోకానుభవజ్ఞానవిశేషముచే మిక్కిలి వృద్ధి యగుచున్నది.

ప్రాయము నరిల్లు కొలఁదియు స్వాభావికముగఁ గలుగు బుద్ధివికాసముకంటె మానవుని నిరంతరోద్యోగమునను, దృఢసంకల్పమువలనను గలుగునట్టి ధీవికాసము సహస్ర గుణాధికమయి, శ్రేష్ఠమయి యొప్పుచుండఁగలదు. బుద్ధీంద్రియముయొక్క వికాసోన్నతులను స్వభావముపై విడిచిన మనుష్యుఁడు లోకానుభవమును బడయు పశువులకుఁ దుల్యుఁడగునేకాని సకలలోకాదర్శప్రాయుఁడగు ధీమంతుఁడు కాఁజాలఁడు.

కావున విద్యార్థులారా! మీరు సద్వర్తనాసంశోభితులయి, సద్గుణశీలురయి, సదయహృదయులయి, పుణ్యాధను

లయి, పవిత్రమగు జీవయాత్రఁ జేయుచు ననుక్షణము ప్రతి పదమున మీబుద్ధిని శుద్ధమొనరించుకొనుచు వృద్ధిఁగావింప సన్నద్ధు లగుఁడు. సత్యజిజ్ఞాసాపూర్వకముగ మీరు ధర్మాను ష్ఠానమునకుఁ గడంగుచుండు రేని యవశ్యము బుద్ధిబలమందుఁ బెద్దలయి ధన్యులు కాఁగలరు. క్రైస్తవవేదము బుద్ధిమూల్య మును గుఱించి నుడివియున్న యీవాక్యములు చిరస్మరణీ యములు:

"An ounce of wisdom is worth a pound oi wit.
The price of wisdom is above rubies."

"ఒక ఔన్సు బుద్ధి యొక పౌను తెలివికి సమాన మయి యున్నది. బుద్ధియొక్క మూల్యము మాణిక్యముల విలువను మించియున్నది."

విద్యార్థులారా! మాణిక్యములకంటె, రత్నముల కంటె, వజ్రములకంటె నమూల్యమయియున్న బుద్ధి యను నక్షయ సంపదను సముపార్జింప మీ యావచ్ఛక్తుల ధార వోయుఁడు. ఏనాఁడు మీరు బుద్ధిబలమును సంపాదించుట యందుఁ గృతార్థు లగుదురో నాఁడే మీ జీవితవ్రతము లన్నియు ఫలించిన వనియే తలంపవచ్చును. దీనిధి యగు జగ న్నియంత మీకు బుద్ధిబలమును సంపాదించుటకుఁ దగిన యుత్సాహమును, ధైర్యమును పూర్తిగా నిఁ బ్రసాదించును గాక!

శుభమస్తు



## అఱువదియైదవ ప్రకరణము



### విద్య

"విద్యా దదాతి వినయం వినయా ద్యాతి పాత్రతాం
పాత్రత్వా ద్ధన మాప్నోతి ధనా ద్ధర్మం తతః సుఖం."

"తే॥గీ॥ విద్య యొసఁగును వినయంబు ♦ వినయమునను
బడయుఁ బాత్రత, పాత్రత♦వలన ధనము
ధనమువలనను ధర్మంబు ♦ దానివలన
నైహికాముష్మికసుఖంబు ♦ లందు నరుఁడు."

—హితోపదేశము.

ధర్మముయొక్క యష్టమాంగమే విద్య. ఇయ్యది యైహికాముష్మికసౌఖ్యసంధాయక మగు పరమ పునీత మంత్రము. విద్యావిద్యనిరూపణవిషయమున నేఁడు ప్రాక్పశ్చిమ ఖండవాసులయం దెన్నియో మతభేదములు కలవు. దేశవిదేశములఁగల పండితులయట్టి భేదాభిప్రాయములతో మన మెట్టి నిమిత్తమును గలిగించుకొనక మానవునియొక్క యథార్థమగు హితమును, ఉన్నతిని దృష్టిపథమునం దిడికొని మానవానుష్ఠేయ మగు నాదర్శవిద్యను గూర్చియే విచారింతము. విద్య 'విత్' ధాతువునుండి కలిగినది. 'విత్' అనఁగాఁ దెలియుట యని యర్థము. సత్యాసత్యములఁ దెలుపు వృత్తినే విద్య యని ప్రాచీనార్యులు స్పష్టపఱచియున్నారు.

"వేత్తి యథావత్తత్త్వపదార్థస్వరూపం యయా సా విద్యా."

—నిరుక్తము.

ఎద్దానిచే సమస్త పదార్థస్వరూపజ్ఞానము లభించునో అదియే విద్య.

విశ్వము ద్వంద్వార్థయుక్తమయినది. ఈ విశ్వరంగమున సుఖము, దుఃఖము, జననము, మరణము, సంయోగము, వియోగము, ధర్మము, అధర్మము, సత్యము, అసత్యము, నిత్యము, అనిత్యము, ఆత్మ, అనాత్మ, గ్రాహ్యము, త్యాజ్యము మున్నగు నెన్నియో వ్యవస్థలు కలవు. ఇందు కొన్ని సత్పదార్థముల నుండియు మఱికొన్ని యసత్పదార్థముల నుండియు సంభూతము లగుచున్నవి. సత్పదార్థ సంజనితములగు వస్తువులు మానవజీవిత శ్రేయోదాయకము లగుటచే గ్రాహ్యములుగను, అసత్పదార్థ సంభవములగు వస్తువులు మానవజీవిత వినాశకరములగుటచే త్యాజ్యములుగను నున్నవి.

త్యాజ్యాత్యాజ్యపదార్థ నిర్ణయమునకుఁ దొలుత మనుష్యుఁడు సత్యాసత్య వివేచనాజ్ఞానమును సంపాదింపవలసియున్నది. ఇట్టి పవిత్రమగు జ్ఞాన సంపాదనమునకు సర్వోత్తమంబును, ఏకమాత్రంబును నగు సాధనమే విద్య. విద్యయొక్క ప్రభావమును, ప్రయోజనమున్ను, ప్రాశస్త్యమును సంస్తుతింపఁ బూనుట సాగరమండలి జలకణముల గణించుటను బోలియుండును.

"మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే
కాంతేవ చాభిరమయ త్యపనీయ ఖేదం
లక్ష్మీం తనోతి వితనోతి చ దిక్షు కీర్తిం
కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా."

"మాతవలె సంరక్షించును. జనకునిరీతి హిత మొన రించును. భార్యవలె ఖేదమును బాపి సుఖ మొసంగును. ధనము నిచ్చును. దిక్కతటముల యశస్సును వ్యాప్త మొన రించును. కల్పలతవలె విద్య సాధింపలేని వస్తువు లేమి కలవు ?"

ఇట్టి పరమపవిత్రమగు విద్య నేఁడు పాశ్చాత్యులచే భౌతిక జీవిత సౌఖ్యసాధనముగ మాత్రమే సంభావింపఁబడు చున్నది. పాశ్చాత్యుల విద్యకును, విలాసయుతమగు భౌతిక జీవితమునకును విశేషమగు సంబంధము కలదు. అందుచే వారి విద్య దుఃఖ నివారణమునకును, ఆదర్శజీవితాశయసాధన మునకును గారణము కాఁజాలదు. ఆర్యుల విజ్ఞానమయ వాతావరణమున జన్మించి పెరిగి పెద్దవారలమైన మన దృష్టి యందు విద్య రెండు విధముల భావింపఁబడుచున్నయది. ఒక విద్య యిహలోకమునకు సంబంధించినది. మఱొక్కటి పర లోకమునకు సంబంధించినది. ఐహికమగు విద్యకే భౌతికవిద్య యనియు, లౌకికవిద్య యనియు, వృత్తివిద్య యనియుఁ బేళ్లు.

జీవుఁడు దేహధారి యగుటవలనను, దేహము సుఖ దుఃఖముల నొసంగు క్షుత్పిపాసలకు నెలవగుటచేతను భుక్తి మానవునకుఁ బ్రథమావసరమయినది. ధర్మము ననుసరించి యిట్టి భుక్తిసమస్యను బరిష్కరించుటకు సమర్థమై యున్నదే భౌతికవిద్య. రెండవదియగు పారమార్థికవిద్య యైహికవస్తు సముదాయముల యస్థిరత్వమును, తృష్ణాదికముల భయంకర స్వభావమును, విరక్తజీవితముయొక్క యప్రమేయానంద మును, భక్తిజ్ఞానవైరాగ్యములచే సంపాదింపఁబడు మోక్ష ధర్మమును మనుష్యులకుఁ దెలిపి వారిని భౌతికజీవితోపాధుల

కోలాహలముచే నిండియుండు వ్యష్టిజీవితవాతావరణము నుండి తప్పించి సమష్టిజీవితప్రపంచమునఁ జొప్పించి వారిచే నాముష్మికశాంతిని సేవింపఁజేయును. ఆముష్మిక సౌఖ్య సాధన మగుటవలననే పారమార్థికవిద్యకు మతవిద్య యను నామాంతరమును గలదు. అనేకు లీమతవిద్యనే యధ్యాత్మ విద్య యనియు, వేదాంతవిద్య యనియు నుడువుచుందురు.

ఏది యెట్లున్నను మానవుని యిహపరజీవితసంతరణము నకు భౌతికపారమార్థికవిద్యలు రెండును ముఖ్యములే యయి యున్నవి. నేఁడు ఋషిసంతతివారగు భారతీయులును విద్య కనేక యపార్థములఁ గల్పించి, పాశ్చాత్త్యుల సంసర్గమున విరుద్ధమార్గమునుబట్టి వర్తించుచు భ్రష్టు లగుచున్నారు. నేఁడు చమత్కారముగను, ప్రౌఢముగను, రసయుక్తము గను, అలంకారయుతముగను వ్రాయను, చదువను నేర్చిన వాఁడెవఁడో వాఁడే విద్యాధురీణుఁడుగను, విద్వద్వరేణ్యుఁడు గను సంభావింపఁబడుచున్నాఁడు. మనుష్యునకు లేఖనపఠన ములకు సాధనభూతమయి యొప్పుచున్నది భాష యనియు, ఆ భాష విద్యోపార్జన కుపకరణముగ మాత్రమే యెంచబడు ననియు నాగరికులు గ్రహింపకుండుట కడు శోచనీయము.

సాహిత్యము, కవిత్వము, సంగీతము, శిల్పము, చిత్ర కళ, వాస్తుకళ, లేఖనకళ, వక్తృత్వకళ మున్నగునవియుఁ దదితరములగు వివిధ పారిశ్రామికములును భౌతికవిద్య కుపాంగములు. ఇట్టి భౌతికవిద్యయొక్క వివిధాంగములను సంపాదించుటతోడనే మనుష్యుఁడు సంతుష్టుఁడై యుండ రాదు. కారణమేమన నీవిద్యలన్నియు నుపాధికి తోడ్పడున వే కాని మనుష్యునకుఁ బ్రపంచమునం దడుగడుగున సంభ

వించునట్టి శోకతాపభయాదుల నివారించుటకును, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యముల నిరోధించుట కును, సచ్చిదానందకారణ మగు భగవత్పదార్థము గ్రహిం చుటకును సాహాయ్యభూతములు కాఁజాలవు.

నేఁటి నవనాగరికులు భగవదన్వేషణము, భగవద్భక్తి, పరమార్థప్రయత్నము, ఆత్మతత్త్వపరిశోధనము మున్నగు సదభ్యాసముల నన్నింటి ఛాందసవృత్తు లనియు, నిరుపయోగ ములనియు, స్వచ్ఛందమగు సౌఖ్యమయజీవితమున కనావశ్య కము లనియు వచించుచున్నారు. వృత్తిమూలకమగు విద్యా సముపార్జనముతోడనే మానవుని విద్యోపార్జనాకర్తవ్యము ముగిసినదని భావించినవాఁడట్టి విద్యయొక్క ప్రభావముచే క్షుత్తును నివారించునట్టి ధనముమాత్రమే సంపాదింపఁగలుగు చున్నాఁడు.

అట్టి ధనముచే మనుష్యుఁడు భోగముల ననుభవింపఁ గలుగునేకాని, విలక్షణమగు విశుద్ధానందము ననుభవింపఁ జాలఁడు. వాఁడు పారమార్థిక విద్యావిహీనుఁడగుటచేఁ జీటికి మాటికిఁ దృష్ణాపిశాచముచే బాధింపఁబడుచు, కాముని దండయాత్రలకు లోనగుచు ముప్పతిప్పలకుఁ బాల్పడుచుండఁ గలఁడు. పారమార్థిక విద్యాశూన్యతచే మనుష్యుఁడు నిగ్రహ మన నెట్టిదో తెలియనివాఁడయి విషయముల చేతిబొమ్మ యయి దుఃఖవారాశిఁ గొట్టుకొని పోఁగలఁడు.

రేపో మాపో భస్మమయిపోవునట్టి యీదేహమునం దుండి దీని నొకయంత్రమువలె నడిపించు చైతన్యముయొక్క రహస్యమును గ్రహింపనిదే మనుష్యుఁ డొక్క క్షణకాలమేని

వసుధ సుఖింపఁజాలఁడు. మన దేహాంతరాళమునఁ జైతన్య రూపమునందున్న యాత్మరహస్యముల గ్రహించుట కేవిధముగను వృత్తివిద్య తోడ్పడఁజాలదు. కావున మతవిద్య లేక యాత్మవిద్య ప్రతిమనుష్యునకు స్వసౌఖ్యము నిమిత్తమే ముఖ్యముగా సంపాదనయోగ్య మయియున్నది.

కేవలము భాషయందుఁగాని, వ్యాకరణశాస్త్రమందుఁగాని మఱి యే భౌతికవిద్యాశాస్త్రమందుఁగాని ప్రౌఢత్వమును సంపాదించినంతమాత్రమున మనుష్యుఁడు భాషాప్రవీణుఁడును, శాస్త్రవేత్తయు నగునేకాని విద్వాంసుఁడు కానేరఁడు. భాషయం దున్నతాభినివేశమును సంపాదించినవ్యక్తి వాఙ్మయధురీణుఁడగునేకాని విద్యాధికుఁడు కాఁజాలఁడు.

నేఁడు భారతవర్షమునం దనేకులు కల్పితములును, పౌరాణికములును నగు కథలఁ బ్రబంధరూపములుగను, రూపకంబులుగను, ఆఖ్యాయికలుగను విరచించుచు విద్వాంసులనఁబడుచున్నారు. నేఁటి యొక్కొక్కవిద్వాంసుఁ డమూల్యమగు తన యావజ్జీవితకాలమును కౌముదియొక్క 'లట్' ధాతువును వల్లించుటయందే గడిపివైచుచున్నాఁడు. నేఁ డెందరో వైయాకరణులు ధర్మము, శౌచము, న్యాయము, పరోపకారము, దయ మున్నగు ధర్మము లెట్టివో యెఱుంగక చిలుకలవలె వ్యాకరణసూత్రములఁ గంఠస్థమొనరించి, యొక్క బిగువునఁ దిరిగి యొప్పగించివేయుచున్నారు.

ఈ వ్యర్థమగు శ్రమయంతయు దేశకాలపాత్రానుగుణ్యముగ విచారించిన సద్విద్యాభ్యాసముయొక్క లక్షణము కాఁజాలదు. వ్యాకరణశిక్షణ మనావశ్యక మని నేను వచిం

చుట లేదు. మానవున కిహపరధర్మములఁ దెల్పి వానిజీవిత మును బరిశుద్ధముగను, సాత్వికముగను, సౌఖ్యవంతముగను, ధర్మార్థకామమోక్షప్రాప్తి కనుగుణ్యముగను జేయఁగలట్టి సద్విద్యాభ్యసనము మనుష్యజాతి కంతటికిఁ బరమావశ్యక మనియే నా సిరోద్దేశ్యము.

నేఁడు మనుష్యసంఘముచే సద్గుణములుగను, సదభ్యాసములుగను సంభావింపఁబడుచున్న సత్యము, ధర్మము, పుణ్యము, శుభము, నియమము, నీతి, భక్తి, శౌచము, దయ, అప్రమాదము, ఆరోగ్యము మున్నగువానిని బోధించునదియే పారమార్థికవిద్య యనియు నిది మానవుని కర్మముఁగాని ఛాందసమును, జటిలమును, వ్యర్థమునగు నేఁటి శుష్కవేదాంతము వంటి మూఢవిద్య కాదనియు నవయువకులగు విద్యార్థులు గ్రహింతురుగాక !

"విద్యాం చావిద్యాంచ యస్తద్వేదోభయం సహ
అవిద్యా యా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే."
—యజుర్వేదము.

"విద్యావిద్యల గ్రహింపఁగలిగిన మనుష్యుఁ డవిద్యాసంబంధమగు మృత్యువు నతిక్రమించి విద్యాస్వరూపమగు మోక్షమును బడయఁగలుగుచున్నాఁడు."

భౌతిక పారమార్థిక విద్యలయొక్క సంబంధము దేహాత్మల సంబంధమువలె నున్నది. కావున నీరెండును మానవున కావశ్యకములే. దేహశూన్యమగు నాత్మసేవయు, ఆత్మదూరమగు దేహశుశ్రూషయుఁ బొసఁగనేరవు. ఇదియేచందమున భౌతికవిద్య నెడఁబాసిన పారమార్థికవిద్యయు, పారమార్థికవిద్య నెడబాసిన భౌతికవిద్యయు మనుష్యప్రపంచ

మునకు విశేషలాభదాయకములు కాఁజాలవు. మనుష్యుని దేహాత్మల రెంటిని సంస్కరించునట్టియు, సుశిక్షితమొనరించునట్టియు సద్విద్యాసంపాదనమునకు స్త్రీపురుషులెల్లరుఁ గడంగిననే కాని మనదేశ ముద్ధరింపఁబడఁజాలదు.

"అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః పంచ క్లేశాః"

—యోగశాస్త్రము.

"అనిత్యా శుచి దుఃఖా నాత్మసు నిత్య శుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా

—పాతంజలి.

"దేహాదులయందు నిత్యబుద్ధియు, అమిత విషయసేవనారూపమగు దుఃఖమందు సుఖబుద్ధియు, అశౌచమందు శౌచబుద్ధియు, అనాత్మయందు దాత్మబుద్ధియుఁ గలిగియుండు విపరీతజ్ఞానమున కవిద్య యని పేరు."

ఇట్టి యవిద్యానిరూపణము సామాన్య విద్యార్థులకు సులభగ్రాహ్యములు కావు కావునఁ బై నుదహరించిన విధమునఁ బవిత్రమగు జీవయాత్రార్థ మపేక్షణీయమగు సద్విద్యను గూర్చి ముచ్చటించుకొందము. మనుష్యులయొక్క హృదయ మందిరముల వ్యాప్తమయియుండు యజ్ఞానాంధకారమును దూరమొనరించుటకు విద్య దివాకరప్రకాశము వంటిది. విద్య యొక్క సాహాయ్యముననే మానవహృదయమునుండి కామక్రోధాది దుష్ప్రవృత్తు లన్నియు నశించిపోవ మనుష్యుఁడు సౌఖ్యానందకారకమగు నాత్మోన్నతినిఁ బడయఁ గలుగుచున్నాఁడు. మహాపురుషులు సంసారసాగరమును దరించుటకు విద్య సేతుసమానమని వచించియున్నారు.

విద్య యిట్టి పవిత్రతమంబును, సర్వోత్కృష్టమును సకలకల్యాణగుణార్ణవంబును నగుటవలననే మహర్షులచే

సహస్రముఖంబుల స్తుతింపఁబడి యున్నది. మనుష్యునకు రూప యౌవన దేహ ధనాదిబలము లెన్ని యున్నను విద్యాబలము శూన్య మగుచో వాని జీవితము దివాకరశూన్యమగు దినంబు వలెను, దీపవిహీనమగు గృహంబుమాడ్కియు శోభాశూన్యముగ నుండఁగలదు. ఈ విషయమును నీతిశాస్త్ర మెంత మనోహరముగ సమర్థించుచున్నదో విలోకింపుఁడు :

"రూపయౌవనసంపన్నా విశాలకులసంభవాః
విద్యాహీనా న శోభంతే నిర్గంధా ఇవ కింశుకాః.

"రూపవంతుఁడును, యౌవనుఁడును, ధనవంతుఁడును, ఉచ్చకులసంభూతుఁడును నగువాఁడు విద్యాశూన్యుఁడగునేని సుగంధములేని కింశుకపుష్పము (మోదుగుపువ్వు) వలె రాణింపఁడు."

వాస్తవ మాలోచింపఁ బికమునకు గానమును, పడతికి భర్తృభక్తియు, తపస్వికి క్షమయు, నలంకారము లయి యొసఁగు నట్లు మనుష్యునకు విద్యయే మనోహర మగు భూషణమై రాజిల్లుచున్నది. విద్వాంసులు సమస్తకాలముల, సకలదేశముల, సమస్తజనులచే సన్మానింపఁబడుచున్నారు.

"విద్వాన్ సర్వత్ర పూజ్యతే, విద్యా సర్వత్ర గౌరవం." అను కోవిదోక్తులు కడు నమూల్యము లయినవి. సదాచారనీతిసంపత్తులలో విద్యకే తొల్లింటి గౌరవము దక్కియున్నది. దీని సహకారముననే వివిధములగు సద్గుణములు మనుష్యజీవితమందు మూర్తీభవింపఁ గలుగుచున్నవి. సర్వ సర్వంసహాచక్రమం దీ విద్యాధనమున కీడగు వేఱొండు సంపత్తి కానరాదు.

"న చోరచౌర్యం న నృపేణ దండ్యం న బంధుభాగం న కరోతి భారం
వ్యయే కృతే వర్ధత ఏవ నిత్యం విద్యాధనం సర్వధనప్రధానం."

"విద్య చోరులచే నపహరింపఁబడదు. భూపాలురచే దండింపఁబడదు. సోదరులచే బంచుకొనబడదు. భారముగ నుండదు. వ్యయ మొనరించిన క్షీణింపదు. నిత్యము వృద్ధిఁ గాంచును. కావున సమస్త ధనములలో నీ విద్యాధనమే శ్రేష్ఠ మయినది.

ధనముకంటె విద్యాధనమునం దెన్ని విశేషములు కలవో విద్యార్థులారా గ్రహింపుఁడు. విద్వాంసులు సమస్త విధముల బలాఢ్యులును, ధనవైభవసంపన్నులును నగు ధరణీపతులకంటె గౌరవార్హులు. ధరణీధవుఁడు ప్రజాసామాన్యమున కధిపతి యగుటచేఁ దన సామ్రాజ్యమందే పూజింపఁబడుచున్నాఁడు. విద్వాంసుఁ డట్లుగాక జాతి మత భేదములు లేక సకలప్రపంచమున సన్మానింపఁబడుచున్నాఁడు. రాజు తన పాలితులమీఁదనే యధికారమును గలిగియుండ విద్వాంసుఁడు విశ్వముయొక్క సమస్త జీవులపై నధికారమును నెఱపఁగలుగుచున్నాఁడు.

సార్వభౌముల సువర్ణభండారముకంటె విద్వాంసుని యొక్క గడియకాల మధికమూల్యవంత మయియున్నది. విద్య నిర్ధనులకును, ధనాఢ్యులకును, బలాఢ్యులకును, దుర్బలులకును నపూర్వమును, అపారమును నగు బలము నొసంగుచున్నది. సమస్తసద్గుణముల కుద్గమస్థానమే విద్య. ఫలభారముచే వంగియుండు వృక్షముపగిదియు, సలిలకణభారవహనముచే వర్షించుసమయమున నమ్రమైయుండు మేఘము

వలెను విద్యచే మనుష్యుఁడు గర్వాహంకారములఁ జూర్ణ మొనరించివైచి వినయవిధేయతాయుతుఁ డగుచున్నాఁడు.

వినయముచే యోగ్యతయు, యోగ్యతచే ధనమును, ధనముచే ధర్మమును, తన్మూలమున నిహపరములును లభించునని హితోపదేశప్రోక్తమగు శ్లోకము బోధించుచున్న యది. ఈ కారణముననే మహాత్ములు విద్యను బురుషార్థచతుష్టయ ప్రదాయకమగు స్వర్గీయ పదార్థముగ నభివర్ణించియున్నారు. సూర్యుని కిరణముల కగమ్యమగు ప్రదేశమున సయితము విద్యయొక్క దివ్యప్రకాశకిరణములు నిరభ్యంతరముగఁ బ్రసరింపఁ గలుగుచున్నవి. అజ్ఞానముచే మనుష్యజీవితమును ముట్టడించియున్న రాక్షసత్వమును నిర్మూలించుటకు విద్యయే బ్రహ్మాస్త్రమువంటిది.

విద్యచే మానవునకుఁ బ్రస్తుతమున్న చర్మచక్షువుల కంటె శ్రేష్ఠమును లోకోత్తరావలోకన శక్తిసమన్వితమును నగు జ్ఞాననేత్రము ప్రాప్తింపఁగలదు. ఈ జ్ఞాననేత్రముయొక్క సాహాయ్యమున మనుష్యుఁ డంతర్బహిర్జగత్తులయొక్క చిత్రవిచిత్రములగు దృశ్యముల నన్నింటి సందర్శింపఁ గలుగుచున్నాఁడు. ఎట్టి యధమమానవుఁ డయినను విద్యాభ్యాసముచే నాదర్శపురుషుఁడు కాఁగలుగుచున్నాఁడు. నేఁడు నాఁడను భేదములేక విద్వాంసుఁడు స్వేచ్ఛగాఁ బ్రకృతియందుఁ గల పీయూషరసము నంతయుఁ బాన మొనరింపఁగలుగుచున్నాఁడు. ఇట్టి సకలసౌఖ్యకందమగు విద్యను సంపాదింపనోచని మానవుని జన్మము వ్యర్థము. కావుననే కోవిదులు—

"విద్యావిహీనః పశుః, విద్యయా లభతే సర్వం."
"కామధేనుగుణా విద్యా సదైవ ఫలదాయినీ."

"విద్య లేనివాఁడు పశువు. విద్యచే సకలము సిద్ధించును. విద్య కామధేనువువలె సకలార్థసిద్ధిప్రదమయియున్నది."

అని వచించియున్నారు. విద్యయొక్క పరమానుగ్రహంబుననే మానవునియందు యుక్తాయుక్త విచక్షణజ్ఞానమావిర్భూత మగుచున్నయది. భావగాంభీర్యమును, సచ్చారిత్రనిర్మాణశక్తియు, బ్రహ్మానందానుభవ యోగ్యతయు విద్యావలంబితములు. భక్తిజ్ఞానకర్మయోగములకు మాతృస్థానము విద్యయే. విద్యావలంబన శూన్యుఁడయి, మనుష్యుఁడిది ధర్మము, ఇది యధర్మము, ఇది శ్రేయస్కరము, ఇది యహితకరము అను భేదమునే గ్రహింపఁజాలఁడు. మానవునియందు ధర్మానుష్ఠానశక్తి విద్యయొక్క యనుగ్రహముననే కలుగుచున్నది.

ప్రాజ్ఞుఁడగు ప్రతివ్యక్తియు విద్యాభ్యాసముచే నాత్మపరిశుద్ధమగు ననియు, పవిత్రాత్మచే మనుష్యుఁడుత్తమకార్యముల నాచరించి యుభయలోకములఁ బడయ సమర్థుఁడగుచున్నాఁడనియు సులభముగా గ్రహింపఁగలఁడు. ఈ కారణముచే మనుష్యజీవితము సార్థకమగుటకు విద్యయే ప్రశస్తమగు ప్రథమసాధనమని స్పష్టపడుచున్నయది. విద్యావిహీనునికంటె గర్భదరిద్రుఁడీ విశ్వమందు మఱొక్కఁడు లేఁడు. దరిద్రునకే యభీష్టములు కలిగినను నవి బుద్బుదములవలెఁ బుట్టినవి పుట్టినట్లుగనే గిట్టుచుండును. కావున దరిద్రుఁడే స్థితియందును సుఖపడనేరఁడు. లోకమం దెట్టివారును విద్యాదరిద్రుని ముఖమును జూడనొల్లరు.

యోగులకును, భోగులకును, యతీంద్రులకును, మునీంద్రులకును, భూపాలురకును, సాధువులకును, వీరికి వారి కను

భేదములేక విద్య సమస్తజనులకు సౌఖ్యానందదాయకమయి యొప్పుచున్నది. సర్వమనోరథముల సిద్ధింపఁజేయ కల్పతరువగు విద్యను సంపాదింపనోచని దురదృష్టవంతుని జీవితము నిష్ప్రయోజనమగుటచే వాఁడు భూదేవికి భారమాత్రుఁడయి యున్నాఁడు.

"ఏషాం న విద్యా న తపో న దానం జ్ఞానం న శీలం న గుణో న ధర్మః।
తే మర్త్యలోకే భువి భారభూతా మనుష్యరూపేణ మృగా శ్చరంతి॥"

"విద్యా తపో దాన జ్ఞాన గుణ శీలధర్మములయందు దేదేని యొకదానినయినఁ గలిగియుండనివాఁడు మనుష్యరూపమునందున్న పశువువలె మర్త్యలోకమునందు భూదేవికి భారమును గలిగించుచు సంచరించుచున్నాఁడు."

విద్యావిహీనుఁడు దుర్గుణముల కాకరమని యొకానొక పండితుఁడు వచించియున్నాఁడు. పుట్టకుండుట, పుట్టిన గిట్టుట, విద్యావిహీనుఁడగుట అను నీ మూఁడు విషయములలో మొదటి రెండే శ్రేయస్కరములైనవి. అనఁగా మూర్ఖుఁడయి పుట్టరాదు. పుట్టిన గిట్టుట కడు లెస్స. మూఢసంతానము కలుగకున్నను జన్మించి మృతిఁజెందినను మాతాపితలకు మాత్రమే యొకవిధమగు విచారము స్వల్పకాలము కలుగఁగలదు. కాని విద్యాశూన్యుఁడగు మూఢుఁడు శాశ్వతకాలము భువిపై సజీవుఁడయి యుండి దుష్కృతము లొనరించుచుండుటచే వాని జననీజనకులకును, బంధుబాంధవులకును, మనుష్యజాతికిని, మనుష్యేతర జీవసముదాయమునకును దుర్భరదుఃఖము సదా వాటిల్లుచుండఁగలదు.

విద్యలేని మూఢులగు నూర్గురు సుతులకంటె విద్యావంతుఁ డగు నొకపుత్రుఁడే శ్రేష్ఠతముఁడు. గుణకత్వా ళ్యైన్ని

యయిన నొక రత్నమునకు సాటిరానివిధంబున నసంఖ్యాకు లగు మూఢు లొక్క విద్యావంతుని కీడు రారు. ఆకాశమునం దారక లెన్నియున్నను లోకమున వ్యాపించియున్న యంధ కారమును బాపఁజాలకున్నవి. చంద్రుఁ డొక్కఁడయ్యు నుద యించినంతనే తన ధవళచంద్రికాప్రసారముచే సకలలోక ధ్వాంత పటలమును దూర మొనరించివేయుచున్నాఁడు. మనుష్యుని దేహమునుగాని, ఆత్మనుగాని శోభిల్లజేయునవి ముక్తాహారములును, హేమభూషణములును, పీతాంబరము లును గావనియు, విద్యయే మానవజీవితమునకు శాశ్వతమగు నలంకారమనియు గ్రహింపుఁడు.

ఒకానొక కవి విద్యాశూన్యుని వదనమండలమును శ్మశానవాటికకుఁ బోల్చియున్నాఁడు. మరియొక పండితుఁడు విద్యాశూన్యుల జీవితముల నేవగించుకొని విద్యావిహీనుని ముఖమండల మొక ముఱికికుప్పయని నుడివియున్నాఁడు. విద్యలేని రాజప్రాసాదము చంద్రుఁడులేని యాకాశము వంటిది. విద్యగల కుటీరము సుగంధమయసువర్ణము ; భూతల స్వర్గనికేతనము. విద్యయొక్క ప్రభావము వర్ణింపఁబడునది కాదు. కేవల మది స్వానుభవైకవేద్యము.

"హర్తు ర్యాతి న గోచరం కి మపి శం పుష్ణాతి య త్సర్వదా
హ్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరాం
కల్పాంతేష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్య మంత ర్ధనం
యేషాం తాన్ప్రతిమాన ముజ్ఝతి నృపాః క స్తైః సహ స్పర్ధతే."

—భర్తృహరి.

"విద్యాధనమును జోరు లపహరింపఁజాలరు. అయ్యది సదా సౌఖ్యమునే యొసంగుచుండఁగలదు. వాంఛించువారి

కెల్లపు డొసంగుచుండినను విద్య మఱింత వృద్ధిఁ గాంచును. ప్రళయకాలమందును క్షయమొందదు. ఇట్టి విద్యాధనముగల వారియెడ సామాన్యధనముగల రాజులు దురాగ్రహమును విడిచిపుచ్చవలయును. వారి నెదుర్కొనుట కెవ్వరును జాలరు."

విద్య యెచ్చోట నధివసించుచుండునో అయ్యెడ సంపదలకును, సౌఖ్యములకును, ఆనందములకును మేరయే యుండదు. విద్యాశూన్య మగు ప్రదేశము దుఃఖములకును, విపత్పరంపరలకును నిలయమయి భయంకరారణ్యమందలి గాఢాంధకారబంధుర మగు శిథిల గృహంబుమాడ్కి నుండఁ గలదు. ఒకప్పు డీ భవ్యభారతవర్షము విద్యయొక్క దివ్య ప్రభావముచే విశ్వముయొక్క దిగ్దిగంతములఁ దన యశశ్చంద్రికల వెదఁజల్లి భగవానుని రత్నఘటిత హేమకిరీటమో యన విఖ్యాతి నందియుండినది.

అట్టి మహోజ్జ్వలప్రభాభాసురంబగు విద్య నేఁడు పతనమగుటవలననే మన దేశము తొల్లింటి మహోన్నత దశను బాసి, నిన్న మొన్నటివరకు పారతంత్ర్యమునఁ బడి, ఆత్మగౌరవమును గోల్పోయి కడు హైన్యము ననుభవించి నది. నేఁడు మన దేశమున వ్యాపించియున్న దారిద్ర్యమున కును, పరస్పరద్వేషములకును, దాస్యగ్రస్త జీవితవ్యామో హమునకును ముఖ్యకారణము విద్యావిహీనతయే.

భారతీయులు కొన్ని శతాబ్దములనుండి బానిసీంద్రయి, విదేశీయుల విలాసముల కలవడి నానాఁటికి మూఢత్వము నకుఁ బాల్పడుచు విద్యను తిరస్కారదృక్కుల వీక్షించి, బహిష్కరించి యధములయి దేశమాతను ఘోరవిపత్పరం పరలపా లొనరించియున్నారు. విద్యను బహిష్కరించి, జన్మ

భూమి నిట్టి దుస్థితికిఁ దామే పాల్పడఁజేసి "కాలస్య కుటిలా గతిః" కాలము యొక్క గతి కడు వక్ర మనియు, కాల మొక్కరీతిగఁ గడువ నేరదనియు వచించుచున్నారు.

మనుష్యుఁడు వివేకశూన్యుఁడయి తా నొనరించి యుండిన దుష్కృతములయొక్క దుష్టపరిణామమును గాల చక్రముపై నారోపించుట పరమమౌఢ్యము. ఏదేశ మొక ప్పుడు సకలసంపదలకు నిలయమయి, సౌఖ్యానందముల కాల వాలమై సమస్తవిద్యలకుఁ బట్టుగొమ్మయయి, విశ్వవిఖ్యాత మయి యుండెనో, నేఁ డాదేశమే — ఆభరతఖండమే తన యాదర్శ విద్యను విస్మరించి విలాసముల మునింగియున్నది.

ఒకనాఁ డీ భరతఖండమున సమస్త మానవులు స్త్రీ పురుషభేదములేక సంస్కృతభాష నభ్యసించి, తన్మూలమునఁ బవిత్రములగు ధార్మిక నైతిక గ్రంథముల నవలీలగఁ బఠించి జ్ఞానమూర్తులయి సకల సౌఖ్యానందముల ననుభవించు చుండిరి. నేఁ డట్టి భాగ్యము మన దేశమున మృగ్యము. భారతీయ పురుషులే విద్యయం దిట్టి యధమస్థితి ననుభవించు చుండ స్త్రీ స్వాతంత్ర్యములేని యీ దేశమందు స్త్రీ లెట్టి యవిద్యాంధకారమున మునిఁగియున్నదియు వచింపఁ బని లేదు. ఆంగ్లేయ కవీశ్వరుఁ డొకఁడు విద్యాభ్యసన ప్రియుఁ డగు వ్యక్తి నీరీతి వర్ణించియున్నాఁడు :—

"The purpose of his life its end and aim
The search of hidden truth careless of fame
Of empty dignities and dirty self
Learning He loved and sought her for himself"

"ఆతని జీవితాశయము, దాని అంతము, లక్ష్యము, గుప్తముగనున్న సత్యము నన్వేషించుటయందే లీనమయి

యున్నది. ఆతఁడు కీర్తిని, వ్యర్థాడంబర ప్రధానములగు పదవులను, తుచ్ఛమును, మలినమును నగు ధనమును సరకుఁ జేయఁడు. ఆతఁడు విద్యయందు దాసకుఁడయియుండి విద్య నిమిత్తమే విద్యను సంపాదించుచుండెను."

విద్యార్థులారా! మీ రీ యాదర్శ విద్యోపాసకుని లక్ష్యమందిడుకొని సకలసంపదలకంటెను, ప్రతిష్ఠాభిమానవుల కంటెను విద్యయే యమోఘమయినదని గుర్తించి తత్సంపాదనమునకయి సమస్త విధముల శ్రమఁజేయుచు ధన్యులగుఁడు.

"అజ్ఞస్య దుఃఖౌఘమయం జ్ఞస్యానందమయం జగత్
అంధం భువన మంధస్య ప్రకాశం తు సచక్షుషః."

—యోగవాశిష్ఠము.

"అంధున కీ విశ్వ మంధకారబంధురముగను, నేత్రములు, కలవానికిఁ బ్రకాశవంతముగను గానవగుచందము ననే విద్యావిహీనుఁడగు నజ్ఞునకు లోకము దుఃఖమయంబుగను, విద్యావంతుఁ డగు ప్రాజ్ఞున కానందమయముగను గోచరింపఁ గలదు.

విద్యార్థులారా! పలుకు పలుకు లేల? మీ జీవిత లక్ష్యమే విద్యాసంపాదన మగుటచే దానిని బడయుటకు రాత్రిందివములు యథాశక్తిఁ గృషిసలుపుఁడు. అపుడే సృష్టికి సారభూత మగు నానందసామ్రాజ్యము మీకట్టెదుటఁ బ్రత్యక్షమయి మిమ్ము సుఖింపఁజేయఁ గలదు. విద్యా సముపార్జన మందు మీకుఁ ద్వరలో విజయము సిద్ధించునుగాక!

శుభమస్తు

---

# అఱువది యాఱవ ప్రకరణము

## సత్యము

"ఆ॥ విను మహింస ధర్మ♦వితతికెల్లను మేటి
యదియు సత్యయుక్త♦మైన వెలయు
ననఘ శిష్టచరిత♦లందు సత్యమ కడు
నధిక మనిరి శ్రుతుల ♦ నరసి బుధులు."

—మహాభారతము.

"నాస్తి సత్యసమో ధర్మో న సత్యా ద్విద్యతే పరం
న హి తీవ్రతరం కించి దనృతా దిహ విద్యతే."

"సత్యమున కీడగు ధర్మమును, సత్యమునకుఁ దుల్యమగు పరమును లేదు. అనృతముకంటెఁ దీవ్రతరమగు పదార్థమిహామందే లేదు."

ధర్మముయొక్క నవమాంగము సత్యము. సత్యమే నిత్యమయినది; శ్రేయస్కరమయినది. సత్యమే సంతతాచరణ యోగ్యము. సత్యమునకు జయము సిద్ధించుట స్థిరమని వచించువారి సంఖ్య కిక్కాలమునఁ గొఱంత లేదు. సత్యమును గుఱించి విరామములేకుండ నిత్య ముపన్యసించునట్టి వారినే సత్య మెట్టి దని ప్రశ్నింతు మేని వారు సత్యనిరూపణ విషయమునం దిదమిత్థమని వచింపలేక నిరుత్తరు లయ్యెదరు.

ఏ చందమున వీక్షించితిమో, ఏరీతి నాలకించితిమో ఏ విధమున సంకల్పించితిమో యట్లు పలుకుటనే సత్యమని

పెద్దలు నుడువుచున్నారు. త్రికరణశుద్ధిగా మానవునియందుఁ గానవగు సద్వర్తనమే సత్యము. "జగన్మిథ్యా, బ్రహ్మం సత్య" మ్మని ఋషులు నుడివియున్నారు. జగ మజ్ఞానము లేక ప్రకృతిచేఁ గల్పితమయినదనియు, బ్రహ్మ మిట్లుగాక ప్రకృతి కతీతుఁడయి, జ్ఞానస్వరూపుఁడయి, వెలుఁగుచున్నాఁడనియు ఋషుల యభిమతము. విజ్ఞానపూర్వకముగ జీవింప వలసిన మనుష్యుల మగు మనము సయితము సత్యమగు భగవత్పదార్థము నొప్పుకొనియే యున్నారము.

క్రోధ, మద, ఛల, కపటాది దుర్గుణములు సత్య పదార్థ మగు బ్రహ్మమార్గమున కంతరాయమును కల్పించు నవి కావున నిట్టి దుర్గుణములన్నియుఁ బరిత్యజింపఁ దగి యున్నవి. ఈ దుర్గుణములు సత్య విరుద్ధములును, కల్పితము లును నగుటచే మనుష్యుఁడు వీని నన్నింటి విసర్జించినఁగాని సత్యమును జేరలేఁడు. త్రికరణములఁ గాంచినదానిని దిరిగి నుడువు టెట్లు సత్యమో, అసత్యస్వరూపములగు దుర్గుణము లను విసర్జించుటయు నట్లే సత్యమయి యున్నది. ఈ విష యమును గూర్చి ఋషిపుంగవులు నుడివియున్న యొక వాక్యము సంస్మరణీయమయి యున్నది.

"సత్యపూతం వదే ద్వాచం మనః పూతం సమాచరేత్."

"సత్యముచేఁ బవిత్రమయిన వచనమునే నుడువఁ దగును. అట్లు నుడివి మనస్సుచే విచారించి యాచరింప వలయును."

"ధర్మః సత్యేన వర్ధతే" అను నార్యోక్తి మఱువ రానిది. ఈశ్వరోద్దేశ్యమునకును, విశుద్ధాంతఃకరణమునకును

సమ్మతముగ నుండు వర్తనమే సత్యసమన్వితమయినది. సత్యాసత్యములను నిర్ణయించుటయందుఁ బవిత్రమగు నంతఃకరణమునకే విశేషమగు నధికారము కలదు. వస్తువుయొక్క వాస్తవిక స్థితి నెఱింగి, తదనుకూలముగ వర్తించినపుడే సత్యముయొక్క లక్షణము వెల్లడి కాఁగలదు. సదా మనఃపూర్వకముగ సత్యమును భాషించుట మనుష్యుని ముఖ్యతమములగు విధులలో నొక్కటి. మనుష్యుఁ డెపుడు స్వవిషయమై సత్యవాదిగ నుండుటకు సన్నద్ధుఁడు కాఁగలఁడో, అపుడే పరుల నిమిత్తమును సత్యసంధుఁడయి మెలంగఁ గలుగుచున్నాఁడు.

"This above all, to thine owe self be true
And it must follow as the night the day,
Thou const not then be false to any man."

—Shakespear.

"నీవు తొలుత నీ నిమిత్తమే సత్యవాది వగుము. ఇదియే యున్నతాదర్శము. అటుపిమ్మట రాత్రి దినము ననుసరించు విధమునఁ బరులనిమిత్తమును నీవు సత్యవాదివే యయి యుండఁగలవు."

—షేక్స్పియరు.

సమస్తప్రపంచము సత్యము నాశ్రయించియే వాస్తవికములగు సౌఖ్యానందముల ననుభవింపఁ గలుగుచున్నది. సత్యవిరుద్ధమగు వ్యవహారముచే లోకమున కపారమగు హాని వాటిల్లఁగలదు. ధర్మమూలమగు సత్యమే యంతరించిపోయిన ప్రపంచ మొక్క గడియకాలమేని నిలువనేర దని పెద్దలు ప్రబలవిశ్వాసముతో నుడువుచున్నారు. సత్యమంతరించుటయే తడవుగా విశ్వమం దొక్కసారిగ ప్రళ

యము సంభవించునని ధర్మగ్రంథము తెలుగెత్తి చాటుచున్నవి. సమస్తజీవసౌఖ్యసాధనమగు సత్యమును గలిగియుండని మనుష్యుఁడు జీవన్మృతుఁడు. సత్యసంరక్షణార్థము మనుష్యుఁడు ప్రాణ ధన సర్వస్వములఁ గోల్పోయినను మృతజీవుఁడయి విశ్వమున కలంకార ప్రాయుఁడుగ నుండఁగలఁడు. అట్టివాని యశశ్చంద్రికలు లోక లోకాంతర వ్యాప్తములు కాఁగలవు.

"సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌ రివ,"

"సత్యము స్వర్గమునకు సోపానము. సంసారసాగర సంతరణమునకు నావవంటిది."

ఏనాఁడో భరతఖండమున జన్మించి సత్యసంధుఁడయి మరణించియుండిన హరిశ్చంద్రుని పవిత్రనామధేయము నేఁటికిని మన దేశమునం దాబాలగోపాలముచే సంస్మరింపఁబడుచున్నది. బాలబాలికలాటలందును, పాటలందునుసత్యమును గూర్చి గాన మొనరింపవలసివచ్చినపుడు హరిశ్చంద్రునే కీర్తించుచున్నారు. స్త్రీలు సత్యవ్రతుఁడగు హరిశ్చంద్రుని మహాపర్వములందుఁ బూజసేయుచున్నారు. వక్తలగు నుపదేష్టలు సత్యమునుగూర్చి సప్రమాణముగా నుపన్యసింపవలసి వచ్చినపుడు హరిశ్చంద్రుని సత్యసంధతనే యుగ్గడించుచున్నారు. కవులు హరిశ్చంద్రుని సత్యప్రీతిపై గేయము లల్లియున్నారు. నాట్యకారులు హరిశ్చంద్రుని సుధాసమానమగు కీర్తి లోక మంతట వ్యాపించుటకో యన రూపకముల రచించి రసజ్ఞులచే హరిశ్చంద్రునిపాత్రను ధరింపఁజేసి సత్యముయొక్క దివ్యప్రభావమును లోకముయొక్క సమక్షమున మూర్తీభవింపజేయుచున్నారు.

చరిత్రకారులు హరిశ్చంద్రుని జీవితమునకుఁ దమ కృతులందు గణ్యస్థానమును బ్రసాదించి యున్నారు. భరత వర్షమందలి నదులు, అరణ్యములు, పర్వతములు హరిశ్చం ద్రుని సువిశాలమగు కీర్తి నేగానమొనరించుచున్నవి. సత్య సంధుఁడగు హరిశ్చంద్రుని దివ్యశిలావిగ్రహముల శిల్పులు సర్వత్రి ప్రతిష్ఠింపఁజేసియున్నారు. నటకులు హరిశ్చంద్ర రూపధారులయి లోకమునకు హరిశ్చంద్రుఁ డెట్టి సత్యసం ధుఁడో, సత్యవ్రత సంరక్షణమున కతఁ డెటుల దారాపుత్ర బంధుమిత్రాదులను సకలసామ్రాజ్యసౌఖ్యములను దృణ ప్రాయముగ విసర్జించి యుండెనో రంగస్థలముల కెక్కి చాటు చున్నారు.

భరతవర్షమున హరిశ్చంద్రునకుఁ బూర్వమే యెందఱో ధరణీపతులు పుట్టి లోకోత్తరములగు తమ బాహుబలపరాక్ర మములచే విశాలములగు సామ్రాజ్యముల స్థాపించియుండ సత్యము నాశ్రయించుటచే హరిశ్చంద్రుఁడు వారెల్లరికంటె జగద్విఖ్యాతుఁడు కాఁగలిగినాఁడు. సత్యహరిశ్చంద్రీయము భారతీయులయం దాబాలగోపాలమునకు "మనుష్యుఁడు సత్యసంధుఁడై జీవించిన యశస్వి యగు, సుఖి యగు, ధన్యుఁ డగు" నను నాదర్శరీతిని గఱపుచున్నయది. సత్యవంతుఁడు సకలజనవంద్యుఁడు. ఎవ్వాఁడు మనోవాక్కర్మల సత్యమును భగవత్స్వరూపముగ విశ్వసించి దానికిఁ దనజీవితమునందుఁ బ్రాముఖ్యము నొసంగునో వాఁడే ధన్యుఁడు. వాఁడు హరి శ్చంద్రునివలె నజరామరుఁడు కాఁగలఁడు.

"సత్యరూపం పరం బ్రహ్మ
సత్యం హి పరమం తపః

సత్యమూలాః క్రియాః సర్వాః
సత్యాత్పరతరం న హి."

"సత్యమే పరబ్రహ్మస్వరూపము. సత్యమే గొప్ప తపస్సు. సత్యమే సకలకర్మలకు మూలము. సత్యమున కితర మగున దేదియు లేదు."

సత్యమును గుఱ్ఱెఱింగి యద్దాని నాశ్రయించిన వ్యక్తి ధీరుఁడయి, ధీమంతుఁడయి, సౌఖ్యవంతుడయి, నిర్భయుఁడయి సాత్త్వికములగు తన సకలాభీష్టముల సాధింపఁగలఁడు. సత్యసంధుఁడు నిశ్చలచిత్తుఁడును, సుప్రసన్నహృదయుఁడును నయి యుండుటచే నిత్యానందము ననుభవింప సమర్థుఁడయి యుండు చున్నాఁడు. అసత్యప్రియుని చిత్త మెపుడును వ్యాకులభావ పీడితమయి యుండఁగలదు.

అసత్యవాది తన మృషాకథనమును గప్పిపుచ్చుకొనుట కయి నిరంతరము కల్లలాడుచుఁ దన యాత్మను గలుషిత మొనరించుకొనుచుండును. సత్యముయొక్క మహామహిమ నెఱింగిన సత్పురుషు లొకతూరి హృదయపూర్వకముగఁ దమ ముఖమునుండి బహిర్గతమయిన వచనమును బ్రాణ హాని కలుగనున్నను విసర్జింపనొల్లరు. సత్పురుషులకు సంపద లందుకంటె, సౌఖ్యములందుకంటెఁ దుదకు స్వప్రాణము లందుకంటె సత్యమందే గాఢానురాగము స్వభావసిద్ధముగ నెలకొని యుండుచుండును.

"ఉదయతి యది భానుః పశ్చిమే దిగ్విభాగే
ప్రచలతి యది మేరుః శీతతాం యాతి వహ్నిః
వికసతి యది పద్మం పర్వతాగ్రే శిలాయాం
న భవతి పునరుక్తం భాషితం సజ్జనానాం."

"దివాకరుఁడు పశ్చిమదిగ్విభాగమునం దుదయించినను, మేరుపర్వతము చలించినను, అగ్ని చల్లఁబడినను, పర్వతశిఖాగ్రమున శిలలందుఁ గమలము వికసించినను సత్పురుషులు తమ వచనమునుండి విముఖులు కాఁజాలరు."

మనుష్యుఁడు దుర్మార్గుఁడయి తన యావచ్ఛక్తిని వినియోగించినను సత్యమును లేశమాత్రమయిన బరాభవింపఁజాలఁడు. మనుష్యుఁ డెంతగా సత్యమును గప్పిపుచ్చ యత్నించినను, గాఢముగఁ గమ్ముకొనియున్న మేఘమాలికలఁ జీల్చుకొని బయటఁబడు సూర్యునివలె నయ్యది బహిర్గతము కాకమానదు. పంచభూత నిర్మితమగు కాయము నశించినను సత్యము మాత్రము నశింపక శాశ్వతమయి యుండఁగలదు.

"సాంచ్ బరాబర్ తపనహీఁ ఝూఠ్ బరాబర్ పాప్
జాకే హిరదయసాంచ్ హై, తాకేహిరదయ ఆప్."

—కబీరు.

"సత్యమునకు సమమగు తపస్సు లేదు. అనృతమునకీడగు పాపము లేదు. ఎవని హృదయమందు సత్య మున్నదో వాని హృదయమందు భగవంతుఁ డున్నాఁడు."

పరమేశ్వరుఁడు సత్యస్వరూపుఁ డగుటచే సత్యసంధుల నధికముగఁ బ్రేమించుచున్నాఁడు. సర్వత్ర సదా సత్యముయొక్క పవిత్రధ్వజమును స్థాపించి, తత్సంరక్షణమునకయి యత్న మొనరించుచుండుటయే మనుష్యజాతియొక్క పావనమగు కర్తవ్యము. సత్యశూన్యమగు జీవితము గలవాని కెన్ని సంపద లున్నను భస్మహవ్యమురీతి వ్యర్థములే యగును. నేఁడు ప్రపంచమున స్త్రీపురుషు లనేకులు వివేకశూన్యతచే స్వల్పములును, క్షుద్రములును నగు లాభముల నపేక్షించి

సత్యము నొక యల్పపదార్థముగ భావించి చీటికిమాటికిఁ గల్లలాడుచు దమ జీవితప్రాశస్త్యమును నష్ట మొనరించు కొనుచున్నారు.

మనుష్యులు తమ యసత్యభాషణమును సులభముగా సాటిమనుష్యులు గ్రహింపఁజాలకున్నను సర్వాంతర్యామి యగు భగవంతుఁడు స్పష్టముగా గ్రహించుచున్నాఁడను జ్ఞానము లేనివారగుట కెంతయు విచారింపవలసియున్నది. అసత్యవాదు లధికముగాఁ గలిగియున్న సంఘమందు సత్యవాదికిఁ దాత్కాలికముగఁ గొన్ని కష్టనిష్ఠురములు సంభవించినను నవి స్థిరముగా నిలువనేరవు. ప్రతి వ్యవహారమందును మనుష్యుఁడు సత్యము నాధారముగాఁ జేసికొని వర్తించిన వాని కెట్టి భయమును, నష్టమును, దుఃఖమును వాటిల్లనేరవు.

"Fact clinches the bargain
Fact wins the fight
Gets the votes in the senate." —D. Adams.

"సత్యసంధత బేరమును గొట్టివేయును. యుద్ధమున జయమునందును. సభయందు నధికామోదపాత్ర మగును."

—డా. ఆడమ్సు.

మూఢులగు మానవు లనేకులు లౌకిక వ్యవహారమున కసత్యము తోడ్పడు విధమున సత్యము సాహాయ్యభూతము కానేరదని యుపన్యసించుచుందురు. ఇయ్యది దూరదృష్టియు, పవిత్రబుద్ధియు, స్థిరానుభవమును లేని మూర్ఖుని ముఖోద్గత మగు శుష్కవాక్యమేకాని వేఱొండు కాదు. వేదములు, ధమ్మపదము, బైబిలు, ఖురాను మున్నగు ధర్మగ్రంథము

లన్నియుఁ బ్రాణిహత్యకంటె నసత్యకథనమును బాప మని నిశ్చయించి యున్నవి. బుద్ధభగవానుఁ డసత్యభాషణాసక్తి భయంకరమగు మానసిక జాడ్య మనియు, ఈ వ్యాధియొక్క పరిణామముచే నిహపరలోకములం దప్రతిష్ఠయు, మానభంగ మును, సందేహభయమును దేహ క్షయానంతరము ఘోర నరకము కలుగుననియు నొక్కి వక్కాణించియున్నాఁడు.

"న హి సత్యా త్పరో ధర్మో నానృతా త్పాతకం పరం
న హి సత్యా త్పరం జ్ఞానం తస్మా త్సత్యం సమాచరేత్."

"సత్యముకంటె శ్రేష్ఠమగు ధర్మ మేదియు లేదు. అసత్యముకంటె మహాపాపము లేదు. సత్యమును మించిన జ్ఞానము లేదు. కావున సత్యవ్రతాచరణ మావశ్యకము."

సత్యసంధుఁ డగుటకు మనుష్యుఁ డెప్పుడు దీక్షాబద్ధుఁ డగునో, అపుడే వాని హృదయము విశేషభాగము పరి శుద్ధము కాఁగలదు. తృష్ణ క్రమక్రమముగా క్షీణించి పోవును. ఈశ్వరునియందు శ్రద్ధాభక్తి విశ్వాసములు మెం డగును. గురుజనులయందు గౌరవభావ మేర్పడును. ఆత్మ బలము వర్ధిల్లి నిరంతర మనూనమగు హృదయాహ్లాదమును గలిగించుచుండును. సత్యసంధుఁ డీశ్వరుని ప్రియపుత్రుఁ డని జీసస్సుప్రభువు నుడివియున్నాఁడు.

సత్యబలమును వర్జించుటచే మహాబలాఢ్యములగు సామ్రాజ్యము లెన్నియో కూకటివ్రేళ్ళతోఁ గూలిపోయినవి. సత్యము నాశ్రయించిన గర్భదరిద్రు లెందఱో సర్వోత్కృష్ట స్థానము నంది జగద్వంద్యులై నారు. సత్యబలమున కెనవచ్చు మహాబల మీ దైవసృష్టియందు లేదని మహాపురుషు లనే కులు చాటియున్నారు. సూర్యచంద్రాదులు స్థిరముగ నుండు

టకును సత్యబలమే మూలకారణము. జగద్రక్షకుఁడగు దేవుఁడే సత్యస్వరూపుఁడయియుండ సత్యమునకు బాహ్యముగా మఱొండు కలదని వాదింపఁ బనియేమున్నది.

"సత్యేన ధార్యతే పృథ్వీ సత్యేన తపతే రవిః,
సత్యేన వాతి వాయుశ్చ సర్వం సత్యే ప్రతిష్ఠితం."

"సత్యమువలననే పృథ్వి నిలిచియున్నది. సత్యముచేతనే దివాకరుఁడు ప్రకాశించుచున్నాఁడు. సత్యమువలననే వాయువు వీచుచున్నయది. సకలమును సత్యావలంబితమే."

అసత్యములగునవేవియు నిత్యములు కావనుట ప్రాజ్ఞలోకమునకు విదితమే. సమస్త సద్గుణ సార స్వరూపంబగు సత్యస్వీకారముచే మనుష్యుని సకలాభీష్టములు సిద్ధించును. మనుష్యుఁడాదర్శప్రాయుఁడగుటకును, సదాచారావలంబనమున సమున్నతమస్తకుఁడగుటకును, ఆత్మాభ్యుదయమును గాంచుటకును, హృదయమును సముదార మొనరించుకొనుటకును, మస్తిష్కమును సర్వోచ్చముగను, విశాలముగను, నిర్మలముగను జేసికొనుటకును సత్యవ్రతపాలన మావశ్యకమయి యున్నది. వాయువు మనుష్యజీవితమున కనుక్షణము మిక్కిలి యవసరమగుచున్నవిధముగనే సత్యమును ప్రతిక్షణమందు మానవజీవితాభ్యుదయమున కావశ్యకమయి యున్నది.

"ఋషయశ్చైవ దేవాశ్చ సత్యమేవ హి మేనిరే,
సత్యవాదీ హి లోకేఽస్మి న్పరే గచ్ఛతి చాఽక్షయం."

"ఋషులును, దేవతలును సత్యమునే సన్మానించియున్నారు. సత్యసంధుఁడే యీ విశ్వమం దున్నతమును, అచ్యుతమును నగు పదవి నందఁగలుగుచున్నాఁడు."

న్యాయమును, దయను గలిగించునట్టియు, వాస్తవిక జ్ఞానమునకు మూలసాధనమయినట్టియు, సత్యమును బహిష్కరించిన వ్యక్తికి శరణ్యమేదియు లేదు. మనుష్యజీవితసరోవరమున సుందరకమలమును, కీర్తిబీజస్వరూపమును, సారళ్యసౌకుమార్యముల నిలయమును, విశ్వవిజయప్రాప్తికి మూలమును, ధర్మార్థకామమోక్ష సాధనమును నగు సత్యము మూఁడువిధములుగ ననుష్ఠింపఁబడుచున్నది. మనస్సువలనను, వాక్కువలనను, కర్మవలనను ననుష్ఠింపఁబడునదే సర్వాంగ పూర్ణమగు సత్యవ్రతము.

ప్రప్రథమము మనుష్యుఁడు తన చిత్తమును సత్యసంకల్పముచేఁ బవిత్రమొనరించుకొనినఁ గాని సత్యవాదియయి, సత్కార్యము నాచరింపఁజాలడు. మనోవాక్కరణముల మనుష్యజాతి సత్యమును బాలింపఁ బ్రతిజ్ఞ సలుపుచో నేఁడు లోకమున బహుళముగఁ గానవగు దుఃఖములు విశేషభాగము నశించిపోవును. సత్యమార్గము ననుసరించువారు జీవితయాత్రను సుఖపూర్వకముగను, నిర్విఘ్నముగను సమాప్త మొనరించుకొనఁగలరు. అసత్యమార్గము ననుసరించు మనుష్యు లవశ్యము విఘ్నపరంపరలచే ముట్టడింపఁబడి, తమ జీవితయాత్రను నష్ట మొనరించుకొనఁగలరు. అసత్యవాది తా నసత్యమును భాషించునపుడుగాని దుష్పరిణామమునుగూర్చి చిత్తమునందేని విచారించుకొనఁడు. మృషాకథనముచే సంభవించు దుష్ఫలితము ననుభవింపవలసివచ్చినపు డసత్యవాది మిక్కిలి చింతించును.

ఒక గోపాలబాలుఁడు నిత్యము తన గ్రామమునకు సమీపమునందున్న యరణ్యమునకు మేకలను మేపుటకయి

తోలుకొనిపోవుచుండెను. ఆ యరణ్యమందు వ్యాఘ్రభయము మిక్కుటముగా నుండెను. ఆ గోపాలబాలుఁ డొక దినమున బరిహాసమునకయి 'పులివచ్చి పైఁబడుచున్నది. రక్షింపుఁడు. రక్షింపుఁ'డని బిగ్గఱగా నఱచెను. ఆ యరణ్యమునకు సమీపమునఁగల క్షేత్రములందుఁ బనిఁ జేయుచున్న కర్షకులెల్లరు నార్తధ్వని నాలకించినంతనే గొల్లపిల్లవాని చెంతకుఁ బర్వెత్తి వచ్చిరి. తన్ను రక్షించుటకయి వచ్చియున్న జనసమూహమును గాంచి గొల్లపిల్లవాఁడు మందహాసముతోఁ గరతాళధ్వని యొనరించుచుఁ బులి రాలేదనియుఁ బరిహాసమున కట్లంటిననియు నుడువఁ గృషీవలు లెల్లరు వానిని నిరసించుచు వెడలిపోయిరి.

కొన్నిదినములకుఁ బిమ్మట నిజముగా వ్యాఘ్రమొకటి వచ్చి గొఱ్ఱెల సంహరింపఁ జొచ్చెను. గోపాలబాలుఁ డంత 'బులి, పులి రక్షింపుఁ'డని యెలుగెత్తి యఱచెను. దాపునందున్న పొలములలో, బని యొనరించుకొనుచున్న పంటకాపులు గొల్లపిల్లవాని మాటలు సత్యములుకావని నిరసించి యెవరిపనియందు వా రుండిరి. శార్దూలము యథేచ్ఛగా గొఱ్ఱెల సంహరించి, తనవేటకుఁ బ్రతిబంధకముగానున్న యాబాలుని పైఁ బడి చంపెను. గొల్లపిల్లవాఁడు ప్రాణములు విడుచునందాక యెన్నికేకలు వైచినను రక్షించుట కెవ్వరును వచ్చియుండలేదు. పరిహాసమందేని కల్లలాడరా దను నీతి యీ చిన్నికథచే మనకు లభించుచున్నది.

అసత్యవాది తన పాపముయొక్క పరిణామము నవశ్యము ననుభవింప బాధ్యుఁడగుచున్నాఁడు. అసత్యవాదిని శిక్షించు

వా రన్యు లెవరును గాదు. వాని యంతరాత్మయే వానిని బట్టి దండింపఁగలదు. దుఃఖభయము లసత్యవాదికే కలుగుచుండునేకాని సత్యభాషికి స్వప్నమందును గలుగనేరవు.

"నాస్తి సత్యే భయం క్వచిత్" సత్యమునకు లేశమును భయము లేదు. మనుష్యుఁ డెంతగాఁ బ్రయత్నించి సత్యమును ధూళియందుఁ గలిపివైచినను నయ్యది విరాట్స్వరూపమును ధరించి విశ్వమునఁ బ్రకటితము కాకమానదు. క్షణమాత్రకాలమునకు సత్యము దృష్టిపథమునుండి లోపించినటులయినను నష్టము కానేరదు.

సత్యహీనా వృథా పూజా సత్యహీనో వృథా జపః
సత్యహీనం తపో వ్యర్థ మూషరే వపనం యథా."

"ఊసరక్షేత్రమున విత్తఁబడిన బీజములవలె సత్యవిహీనములగు పూజాజపతపములు వ్యర్థములగును."

ఎట్టి గాఢమగు వస్త్రమునం దగ్నిని మూటగట్టినను నయ్యది రహస్యముగా నుండనేరదు. అదియేచందమున సత్యమును గప్పిపుచ్చ యత్నించినకొలఁదియు నది జగద్విఖ్యాతి నందుచుండఁగలదు. విషసర్పము నెంత ప్రేమతో దుగ్ధాహారము నొసంగి పోషించినను రక్షణకర్తయొక్క ప్రాణములనే యపహరించు విధమున నసత్యమును జేరదీసి పోషించువాని జీవితము నది యొక్కసారిగఁ గబళించివేయఁగలదు. కావుననే మహాపురుషులు విపత్తుల సహించుటకేని సమ్మతింతురు కాని, మృషను దరిఁజేరనియ్య నొల్లరు.

"పరిత్యజేయం త్రైలోక్యం రాజ్యం దేవేషు వా పునః
యద్వాప్యధిక మేతాభ్యాం న తు సత్యం కథంచన.

—మహాభారతము.

"నేను త్రిలోకసంపదల విడిచిపెట్టఁ గలను. దేవతల యొక్క స్వర్గసౌఖ్యములను విసర్జింపఁగలను. వీనికంటె నధిక మగున దేదియున్నను నవలీలగ బహిష్కరింపఁ గలను కాని, సత్యమును మాత్ర మేస్థితియందును విడిచిపుచ్చఁజాలను!"

సత్యవాక్య పరిపాలనార్థ మొనరింపఁబడినట్టి యిట్టి భీషణప్రతిజ్ఞవలననే గాంగేయుఁడు భీష్ముఁడని పిలువఁబడె నాఁడు. సత్యము విషయమున మన శాస్త్రములు కొన్ని విశేషధర్మముల నాపద్ధర్మము లను పేర నుడివియున్నవి.

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియం."

"ప్రియమగు సత్యమునే వచింపఁదగునుగాని,అప్రియ మగు సత్యమును భాషింపఁజనదు."

ఎట్లనిన జనుపాంధుని గాంచి ఓరి గ్రుడ్డివాఁడా! యన్నను, కురూపిని విలోకించి కోతివాఁడా! యన్నను వానికిఁ గోపమును, మనస్తాపమును గలుగఁగలవు. కావున లోకహితకరములు కాని యిట్టి సత్యములఁ బలుకరాదు.

ఒక యనాథయగు స్త్రీని పాపవర్తనులగు హంతకులు కొందఱు తఱుముకొని వచ్చిరి. ఆ దిక్కుమాలిన పడతి మనము చూచుచుండగనే చోరులబారినుండి తప్పించుకొని యొక రహస్య స్థలమున డాగినది. కిరాతకు లంత మనచెంత కేతెంచి 'ఆర్యులారా! అబల యొకర్తుక యీ మార్గమున నరిగెనా?' యని ప్రశ్నింప మనము సత్యము నెఱింగి యుండియు స్త్రీ యిటు రాలే దని వచించుటయే ధర్మము.

కారణమేమన జరిగినది జరిగినట్లేనుడువుటచే నేపాప మెఱుంగని సతీమణి మానభంగమును, ప్రాణసంహారమును గలిగించు ఘోరపాప మొదవును. కావున ధర్మసంరక్షణార్థ మిట్టి సందర్భములలో న్యాయమును, దయను దృష్టియం దునిచికొని సత్యమును యుక్తియుక్తముగ భాషింపవలసి యుండును. ఇట్టివే యాపద్ధర్మము లనఁబడుచున్నవి. ఆప ద్ధర్మానుష్ఠానముచే సత్యము కళంకితము కానేరదు.

ఉ॥ భూతహితంబుగాఁ బలుకు • బొంకునుసత్యఫలంబునిచ్చుఁద
ద్భూతభయాస్పదంబగుప్ర • భూతపుసత్యముబొంకునట్లగున్
............................................................

—మహాభారతము.

మృషాకథనముకంటె సత్యగోపనము మహాభయంకర మయినది. పాపారిష్టదాయక మయినది. సత్యగోపనము పాన్పుక్రింద డాగియున్నవిషసర్పము. అసత్యకథనము దృష్టి సమ్ముఖమున బుసఁగొట్టుచున్న పామువంటిది. బుద్ధప్రభువు సత్యగోపనము తుప్పమాటున దాగియున్న పులివంటిదనియు, అసత్యభాషణము మనకట్టెదుటఁ బచ్చిపడియున్న పులివంటి దనియు నుడివియున్నాఁడు. కిరాతకుల బారినుండి తప్పించు కొనిపోయిన స్త్రీ మనకుఁ దెలిసియుండియుఁ దెలియనిరీతి నటించుటే ధర్మమని నుడివియున్నాఁడను. అసత్యగోపన మిట నే పాపమెఱుంగని సతీమణియొక్క ప్రాణసంరక్షణము నకుఁ దోడ్పడినది. వాస్తవిక భూతహితకరంబగునట్టి సత్య గోపనము ధర్మసంగతమగుటచే సత్యభాషణముగనే పరి గణింపఁబడుచున్నది.

ఘోరపాపదాయకంబును, బుద్ధప్రభువుచే నిరసింపఁబడినదియు నగు సత్యగోపనము(సత్యాచ్ఛాదనము)నుగూర్చి యవధరింపుఁడు. సాధువగు నొక బాటసారి యరణ్యమార్గమున నరుగుచుండెను. వానికి మార్గమధ్యమున వ్యాఘ్రభీతి జనించెను. ఆతఁడు తనకట్టెదుటఁ గాననగుచున్న తుప్పల చాటునఁ బులులుండుననుసందేహము కలిగి మఱియొక మార్గమున గమ్యస్థానమును చేరఁదలంచుచున్నంతలోఁ దుప్పల వైపునుండి యొక మనుష్యుఁడు వచ్చుచుండెను.

బాటసారి యా క్రొత్తమనుష్యుని విలోకించిఅయ్యా! మీరు వచ్చునపుడా తుప్పచాటునఁ బులియున్నదా? అని ప్రశ్నించెను. ఆ మనుష్యుఁడు తాను తుప్పవద్దనుండి వచ్చునపుడద్దాని మాటున బాటసారులఁ జంప బొంచియున్న పులి నొకదానినిఁ గాంచెను. ఆ క్రొత్తమనుష్యుఁడా మర్మమును మఱుఁగు పఱచి బాటసారితోఁ దుప్పమాటునఁ బులి లేదు. నిర్భయముగాఁ బోవచ్చునని యుత్తర మొసంగెను.

బాటసారి వానిమాటను నమ్మి తుప్పవఱకరుగునంత నాకలిఁగొన్న పులి వానిపైఁబడి చంపివైచెను. క్రొత్త మనుష్యుని యీ సత్యగోపనముచే భూతాహింస మే కలిగినది. కావున నిట్టి సందర్భములో సత్యగోపనము ఘోరపాపదాయకము. కావున త్యాజ్యము.

ఒక ధనాఢ్యుని పుత్రుఁడొక నవయువకునితో స్నేహ మొనరించెను. ఆతఁ డనుదినము ద్యూతము, మద్యపానము, వేశ్యాగమనము, సాధుపీడనము మున్నగు దుర్వ్యసనములకు గుఱి యయ్యెను. ఆ ధనవంతుని పుత్రుఁడు మానసికదుర్బ

లత్వముచే నా వ్యసనములకుఁ బాల్పడెను. ప్రబోధము వాని వర్తనము సంస్కరింపఁబడుట కనుగుణ్యముగ నుండెను. ధనాఢ్యు డొకతూరి పుత్రుని నడవడినిగూర్చి సందేహించి వాని మిత్రు నేకాంతముగఁ బిలచి నాకుమారు నేమయిన దుర్వ్యసనములు ముట్టడించెనా? త్వరగ జెప్పుము. నేను శాంతముతో బోధించి సంస్కరించెదను అని యడిగెను.

నవయువకుఁ డంత మిత్రునిపట్ల గల మోమోటమిచే వాని భావిస్థితిని విచారింపక అయ్యా నీకుమారుఁడు కడు దొడ్డవాఁడు, గుణశీలుఁడు అని యుత్తర మొసంగెను. ధనాఢ్యుఁడు తన కుమారుని సజ్జనునిగనే భావించి వానిని శిక్షించు విషయమున నుపేక్షించెను. స్వల్పకాలమందే ధనాఢ్యుని పుత్రుఁడు ఘోరకిరాతకుఁడయి ప్రభుత్వదండనకు బాత్రుఁ డయ్యెను. ధనాఢ్యుఁ డంత నవయువకుని సత్యగోపనముచేఁ గలిగిన కీడును గుఱించి సత్యగోపనముకంటె మహాపాపము లేదని సిద్ధాంతీకరించెను.

ఒక పుణ్యాత్ముఁడు భయంకర విచిత్రరోగపీడితుఁ డయ్యెను. వైద్యు లెవరికిని యారోగలక్షణముల గ్రహింప శక్యము గాకపోయెను. ఒక వైద్యుఁ డంత రోగివద్ద కేతెంచి వాని దేహమును బరీక్షించి తాను చికిత్స నొనరింతునని యొప్పుకొనియెను. రోగియొక్క బంధువులు రోగ మెట్టిదని ప్రశ్నింప నా వైద్యుఁ డా భయంకరమగు రోగమును గ్రహించి యుండియు స్వలాభప్రీతిచే దాని నొక సామాన్య రోగమని వచించెను.

చికిత్సకుఁ గడంగి యా వైద్యుఁ డనుదినము ధనాకర్షణ మొనరింపఁ గడంగి మధ్యస్థితియందు రోగము నివృత్తి

కాదని వచించి వెడలిపోయెను. రోగి వివిధౌషధముల వికార ప్రాబల్యముచే మిక్కిలి బాధపడి మరణించెను. స్వార్థాంధతచే వైద్యుఁడు లోలుత భయంకరరోగమును గుర్తించియుండియు సత్యమును గుప్తపఱచెను. దీనిచే భూతహాని కలిగినది కావున నిట్టి సత్యగోపనము త్యాజ్యము.

ఒకానొక ఋషీశ్వరుఁ డరణ్యమునం దొకచోఁ దపమొనరించుచుండెను. వ్యాధులు వెంబడింపఁ దీక్ష్ణశరాఘాతమున వ్యథ నందుచు హరిణశాబక మొందు పర్వెత్తివచ్చి తపస్వియొక్క యుటజమున దాగుకొనియెను. వేటకాడు ముని చెంతకేతెంచి లేడిపిల్ల యేమాయెనని యడుగఁ దన నోటితో నసత్యమును బలుక నక్కఱ లేకుండగనే సంభాషణ సందర్భమును మార్చి సత్యముచేఁ గలుగు భూతహితమునే యీరీతి నొనరించెను.

"ఓయీ వ్యాధుఁడా!

"యా పశ్యతి న సా బ్రూతే యా బ్రూతే సా న పశ్యతి,
అహో వ్యాధ స్వకార్యార్థిన్ కిం పృచ్ఛసి పునః పునః."

"చూడనేర్చిన నేత్రమునకు భాషించు శక్తి లేదు. మాట్లాడఁగల ముఖమునకు వీక్షించుశక్తి హుళక్కి. ఓ స్వార్థుఁడవగు వేటకాఁడా! చీటికి మాటి కేల నడుగుచున్నావు?"

ఋషీశ్వరుని యసందర్భములగు వచనము లర్థముగాక పోవుటంజేసి వ్యాధుఁడు విసువుఁజెంది వెడలిపోయెను. సూక్ష్మోపాయముచే సత్యముయొక్క యావల్లక్షణము ననుస

రించి ఋషి సాధువును, నోరులేనట్టియు లేడిపిల్లను సంర క్షించెను. ఇట్టి విషమపరిస్థితులయందు సత్యస్వరూపమును గ్రహించు టొకింత కష్టసాధ్యమే యగును.

వేదశాసనములగు "సత్యంవద, ధర్మంచర, సత్యము పలుకుము, ధర్మ మాచరించుము" విస్మరింపరానివి.

విద్యార్థులారా! సత్యముయొక్క ప్రభావ మనంత మని గుర్తించి దానిని సదా సన్మానింపుడు. మీ రెట్టి స్థితి యందును సత్యము నలక్ష్యభావమున వీక్షింపక "సత్య శ్రమాభ్యాం సకలార్థసిద్ధిః" అను సిద్ధాంతమును స్మరించుచు జీవయాత్రను జేయుఁడు. దుర్గుణముల మీ రేనాడు విసర్జించి వైచెదరో నాఁడే మీరు సత్యసంధులు కాఁగలుగుదురు.

సత్య మేవ జయతే నానృతం.



# అఱువదిఏడవ ప్రకరణము



## అక్రోధము (శాంతము)

"గీ॥ కోపమునను ఘనత • కొంచెమై పోవును
గోపమునను మిగుల • గోడుఁ జెందుఁ
గోప మడఁచెనేని • గోరిక లీడేరు
విశ్వదాభిరామ • వినురవేమ !"

ధర్మముయొక్క దశమాంగ మక్రోధము లేక శాంతము. అక్రోధముచేతనే మనుష్యుఁడు స్థిరచిత్తుఁడయి సౌఖ్యానందముల ననుభవింప సమర్థుఁ డగుచున్నాఁడు. అక్రోధముచే మనుష్యుఁడు తన కెట్టి విపత్పరంపరలు సంభవించినను వాని నుండి తప్పించుకొనఁగలుగుచున్నాఁడు. శాంతములేని మనుష్యుఁడు సత్యము నెఱుఁగఁజాలక, ధర్మాధర్మవిచక్షణ జ్ఞానశూన్యుఁడయి యనేకములగు దుష్కృతములఁ గావించి, వాని దుష్టపరిణామము ననుభవింపవలసివచ్చినపుడు మిక్కిలి దుఃఖితుఁ డగుచున్నాఁడు.

శాంతము స్త్రీపురుషుల కెల్లరకు శాశ్వతమగు భూషణమని గురుజనులు నుడివియున్నారు. జీవితాలంకారమగు నిట్టి పవిత్రసుగుణము నేఁడు మనుష్యజాతియందు కేవలము లోపించి పోయినది. మనుష్యజీవితమును గడు సుందర మొనరించుటకును, సకలలోక గౌరవపాత్ర మొనరించుటకును

శాంతముకంటె నుత్కృష్టమగు సుగుణము మఱొండు లేదు. శాంతముగలవాని హృదయమందు దైవికశక్తిమూర్తీభవించి యుండి సమస్తమానవులహృదయముల నాకర్షించుచుండును.

శాంతముగల మనుష్యుఁడే దేశ మేగినను నిర్భయముగా జీవింపఁగలఁడు. దుష్టులుసయితము మొక్కొక్కపుడు శాంత స్వభావుని గాంచి కరుణార్ద్రహృదయులయి వానిని సత్క రించుటకుసయితము సన్నద్ధు లగుచుందురు. మనుష్యుని ధన ధాన్యాదివైభవములును శాంతస్వభావ ధారణముననే సార్థ కములగుచున్నవి. 'దానములలోనికెల్ల నిదానమే ప్రధానము' అను లోకవాక్యము సన్మానభాజనము. ఒక మనుష్యుని మహానుభావత్వమును గ్రహించుటకు ముం దతనియందు శాంతమున్నదియు లేనిదియుఁ బరీక్షింపవలసియుండును.

శాంతముచే నెట్టి విషమకార్యములనయిన మనుష్యుఁడు సులభముగా గ్రహింపఁ గలుగుచున్నాఁడు. శాంతముచే లోకమునకుఁ గలుగు ప్రయోజనము లసంఖ్యాకములు. మను ష్యునకు జీవకళను బ్రసాదించి వాని హృదయకర్కశత్వమును బాపి సాధుత్వమును గలిగించున దీ శాంతమే. శాంతస్వభా వునకుఁ గోపమును జెందవలసిన యవసరమును, ద్వేషింపవల సిన యావశ్యకతయుఁ గలుగ నేరవు. మనుష్యునియందు శాంత మెపుడుండునో, అపు డతనికిఁ బరులతో నేవిధమగు కలహ మును దటస్థింప నేరదు.

విశ్వశ్రేయస్కరమగు శాంతమువంటి పవిత్ర సుగు ణము నేఁడు మనుష్యజాతియందుకంటె గోవృషభాది సాధు జంతువులయందు విశేషముగాఁ గానవగుచున్నది. దీనికి

ముఖ్యకారణ మేమని విచారించినచో మనుష్యజాతియందు విలాసప్రీతి మిక్కుటమయి క్రోధమును హెచ్చించినదనియు, జంతువులయందు విలాసపరత్వము నిగ్రహింపఁబడియుండు టచే శాంతము పెచ్చుపెఱిగినదనియుఁ దెలియవచ్చును. నేఁడు మనుష్యుఁడు శాంతమువంటి సద్గుణమునెడ లక్ష్యము లేనివాఁడయి యుండుట శోచనీయము.

> "తే॥గీ॥ సర్వధర్మంబులకు నొక్క ♦ శాంతగుణమె
> వన్నెఁదెచ్చును భూష లె ♦ న్నెన్ని యున్న
> ఎన్నిపాటులు పడినైన ♦ నెల్లవారు
> శాంతమును దాల్చు యత్నంబు♦సలుపవలయు."
>
> —నీతిదీపిక.

శాంతమును సంపాదింపఁ దలఁచువారు తత్ప్రబల శత్రువగు క్రోధమును సత్వరము నశింపఁజేయవలసియున్నది. బీజమునశించినఁగాని మొలకబయల్వెడలనేరదు. అదియేచంద మున క్రోధమునశించినఁగాని శాంతమలవడనేరదు. క్రోధము తమోగుణ సంభూతము తమోగుణము నిబిడాంధకార మయము. మనుష్యుఁడు క్రోధావేశపిశాచమునకు వశుఁ డయి నంతనే వాని యుక్తాయుక్తపరిజ్ఞానము నశించిపోవుచున్నది. ప్రచండ వాయుమండలమున నెలకొల్పఁబడిన దీపము చల్లారి పోవునట్లు క్రోధావేశముచే బుద్ధిరూపమగు జ్యోతియు నారి పోవుచున్నది.

బుద్ధి నశించినపుడు మనుష్యునకు ధర్మాధర్మభేదమే గోచరింపఁజాలదు. అతఁడు మంచిచెడ్డల నెఱుఁగఁజాలక చంచలుఁడయి యున్మత్తుని చందమున మనస్సునకుఁ దోఁచిన

దుష్కర్మలనెల్ల నాచరించి భ్రష్టుఁ డగుచున్నాఁడు. క్రోధముచే లోకమునకుఁ దటస్థించుచున్న దుర్భరదుఃఖములు వర్ణనాతీతములు. క్రోధోన్మత్తుని సమస్తేంద్రియములు స్వాభావికజ్ఞానమును దక్కి వికృతము లగుచున్నవి. అపు డవి యస్వాభావిక కర్మల నాచరించి మానవాత్మను భయంకర విపద్గ్రస్త మొనరించివేయుచున్నవి.

"క్రోధమూలో వినాశో హి ప్రజానా మిహ దృశ్యతే
క్రుద్ధః పాపం నరః కుర్యాత్ క్రుద్ధో హన్యాత్ గురూనపి."
—మహాభారతము.

ప్రజావిధ్వంసమునకుఁ గ్రోధమే మూలకారణము. ఇంతకంటె వేఱుకారణ మిహమందు లేదు. క్రోధకారణంబుననే మనుష్యులు పాపకార్యాచరణోన్ముఖు లగుచున్నారు. క్రుద్ధుఁ డాచార్యునయిన వధించుటకు వెనుఁదీయఁడు."

అనేకులగు పండితులును, మహాపురుషులును గ్రోధమును గలిగియుండుటచేఁ దలవని తలంపుగా దుష్టకార్యముల నాచరించి క్రమక్రమముగాఁ జరిత్రభ్రష్టు లగుచున్నారు. మనుష్యుఁడు క్రోధాంధుఁ డగుటచే నంధప్రాయుఁడయి జననీజనకుల నయిన సంహరించుటకేని శంకింపనంతటి మహాక్రూరుఁడయి పోవుచున్నాఁడు. అగ్ని తాను స్పృశించిన పదార్థమునే దహించును. క్రోధ మట్లుగాక తన్నాశ్రయించిన మనుష్యుని, వానితో సంబంధమును గలిగియున్న జీవప్రపంచమును నిరంతరము దహించివేయుచుండఁ గలదు.

అగ్నియందు దగ్ధమగునపుడు మనుష్యుని కెంతబాధ కలుగునో అంతకంటె నధికమగుబాధ క్రోధావేశముచే మనుష్యునకుఁ గలుగుచున్నది. అసంఖ్యాకులగు భూపాలురు తమ

విశాలములగు సామ్రాజ్యములతోఁబాటు క్రోధోన్మత్తతచే నశించిపోయినటులఁ జరిత్రలు చాటుచున్నవి. క్రోధి పాపమయుఁడును, దుర్గుణనిలయుఁడును నయియుండుటచే మోక్షభాజనుఁడు కాఁజాలఁడని భగవద్గీతాది పవిత్రగ్రంథములు ఘోషించుచున్నవి.

విదేశీయభిషగ్వరులు క్రోధాతిరేకముచే దేహమునం దొకవిధమగు విష ముత్పన్నమై స్వాస్థ్యమును భంగపఱచుననియు, భయంకరములగు ననేకజాడ్యములకుఁగోపమే మూలకారణముగ నున్నదనియు సప్రమాణముగ నిరూపించియున్నారు. క్రోధోన్మత్తుఁడు బాలకునికంటె జ్ఞానమునం దల్పుఁడగుచున్నాఁడు. బాలుఁడు తళతళలాడు నిశితకరవాలమును దనకంఠముపై వైచుకొనిన నేమితటస్థింపఁగలదో అగ్నిని స్పృశించిన నెట్టి దుఃఖము వాటిల్లునో గ్రహింపఁజాలఁడు.

క్రుద్ధుఁడును బ్రాయమునం దధికుఁడయి యున్నను, వేదాది శాస్త్రగ్రంథముల నన్నింటిఁ గంఠస్థమొనరించియుండినవాఁడయినను తనప్రాణములకు మోసము గలిగించు దుష్టకార్యము నేని నిస్సందేహముగ నాచరించివేయుచున్నాఁడు. క్రుద్ధునకు మనశ్శాంతియు, సౌఖ్యానందములును స్వప్నగత వృత్తాంతములగును. వాని కెన్ని సంపదలున్నను, పరిచారికా పరిచారకులున్నను హాయి ననుభవింపఁజాలఁడు.

"క్రుద్ధో హి కార్యస్య ఫలం న యథావత్ ప్రపశ్యతి,
న కార్యం న చ మర్యాదాం నరః క్రుద్ధోఽనుపశ్యతి."

—భారతము.

"క్రోధపూరితచిత్తుఁడే కార్యమున కెట్టిఫలము లభించునో గుర్తింపఁజాలఁడు. సత్కార్యము లెవ్వియో గ్రహింపలేఁడు. మర్యాదను రక్షించుకొనవలయునను విషయమునే కుపితుఁ డెఱుంగఁజాలఁడు."

క్రోధముచే మనుష్యుఁడు మనుష్యత్వమునుగోల్పోయి రాక్షసుఁ డగుచున్నాఁడు. వాని హృదయము సౌమ్యస్థితిని బాసి పాషాణముకంటెను, లోహముకంటెను, వజ్రముకంటెను గఠినతరంబగుచున్నది. అట్టి కఠినతరంబగు హృదయమున దయాలేశమునకు స్థాన ముండనికతన మనుష్యుఁడు హరిణశాబకసమూహమునఁ జొచ్చు క్షుధాసంక్షుభితమగు క్రూరవ్యాఘ్రంబుపగిది దుష్టశిష్ట భేదము లేక మనుష్యసంఘమునఁ జొరఁబడి సమస్తమానవులఁ బాధించుచు నెపుడో యొకప్పుడు తనవంటి క్రోధోన్మత్తుని హస్తమునఁ జచ్చుచున్నాఁడు.

భూలోకము శాంతముచే స్వర్గతుల్యముగను, క్రోధముచే నరకసమానముగను గావింపఁబడఁగలదు. ఘాతుకమృగమునకును, క్రోధోన్మత్తునకును విశేషమగు తారతమ్యముండనేరదని మహాత్ములు వచించియున్నారు. ఎవ్వాని హృదయము శాంతమున కాలవాలమయి యొప్పుచుండునో, వాని చేష్టలన్నియు ధర్మయుక్తములయి యుండఁగలవు. వాని వర్తనము నిర్దోషమయి మల్లెపూవువలె నుండును. నేత్రము లచంచల ద్యుతిపూర్ణములై ప్రకాశించుచుండఁగలవు. వదనము సుప్రసన్నభావప్రభాభాసురమయి వెలుగొందుచుండును. అధరములు మృదులహాసమున ముచ్చటఁ

గొలుపుచుండును. చిత్తము నెట్టి తత్తరపాటును లేక నిర్వ్యాకు లముగను నిర్భయముగను నుండఁగలదు.

ఇట్టి సద్గుణములచేతను, శుభలక్షణములచేతను సమ లంకృతులయి యుండువారే దేవతాపురుషులు. శాంత స్వభావులగు దేవతాపురుషుల ననుదినము సందర్శించు చుండుటచేఁ గ్రూరహృదయులగు రాక్షసులు సాధువులు కాఁగలరు. శాంతస్వభావుల బాధించువారిని దేవుఁడే శిక్షించును.

ఉ॥ శాంతులకెగ్గుఁ జేసినను♦సంతసమొందునె దైవమక్కటా!
యంతకు నంతవారలకు ♦ నప్పుడు గట్టిగఁ గట్టికుడ్పుఁడే?
కాంతినడంచుఁ బున్నమను ♦ గల్వలఱేనికిభూమి నీడ్డమై;
ధ్వాంతముకోటికొండలయి♦దానిని మ్రింగదె దాన?

మిత్రుఁడా!

—సూక్తివసుప్రకాశకము.

శాంతస్వభావు లగు దేవతాపురుషుల బాధింప యత్నించు దుర్మార్గు లెందఱో సుశిక్షితు లయినారు.

విశ్వజీవప్రేమమయుఁడును, శాంతమూర్తియు నగు చైతన్యునికాలమందు నవద్వీపమున నిత్యానందుఁడు, హరి దాసు, అద్వైతుఁడు మురారిగుప్త, గదాధరుఁడు అను నేవురు పరమశాంతస్వభావులగు సాధువులు గౌరాంగుని ప్రేమ సందేశమును వంగదేశమం దంతటఁ జాటుచు నివ సించుచుండిరి. ఆ సమయమందే నవద్వీపమున జగాయి, మాదాయి అను క్రూరు లిరువురు హత్య లొనరించుట

యందుఁ బ్రసిద్ధి నందియుండిరి. వారు గోమాంసభక్షకులై సురాపానమత్తులై సాధువుల హింసించుచుండిరి.

ఒకతూరి నిత్యానందప్రభృతులతోఁ గలియుట వారికిఁ దటస్థించెను. నిత్యానందప్రభృతులఁ గాంచినంతనే జగాయి మండిపడుచు 'ఓరి దురాత్మా! నీవు మాంసభక్షణము తగదనియు, హత్య పాపమనియు బోధించుచుంటివా? నిన్నిదిగో సంహరించుచున్నా'నని కఱ్ఱతో నిత్యానందుని తలపైఁ గొట్టెను. ఆ శాంతస్వభావుని తల పగిలి రక్తము స్రవింపఁ జొచ్చెను. కాని యతఁడు కోపములేనివాఁడయి శాంతముతో 'ప్రియసోదరా! నేను నీమాట కడ్డు జెప్పి నీ మనస్సును నొప్పింపను. నీకు వలయుచో నాకంఠమును నేనే ఖండించి యిచ్చెదను' అని నుడివెను. నిత్యానందుని పరమ శాంతములగు కోమలవచనముల నాలించినంతనే యా రాక్షసుల రాతిగుండెలు నీరయ్యెను. వా రతని చరణముల వ్రాలి, క్షమింప వేఁడి నాఁటినుండి పరమశాంతులయి చైతన్య భక్త బృందమున గణ్యులయిరి.

మహాత్ముండును శాంతమూర్తియు నగు జీససు జరుసలము ప్రాంతమునఁ దన నవధర్మమును వ్యాపన మొనరింపఁ గడంగినపుడు సనాతనధర్మావలంబులగు యూదు లతనిని మతద్రోహిగ భావించి సంహరింప యత్నింపఁ దొడంగిరి. స్టిఫెను అను నతఁడు జీససుయొక్క ముఖ్యశిష్యుఁడయి తన శాంతస్వభావముచే వేలకొలఁది జనుల నవధర్మదీక్షితులఁ గావింపఁ జొచ్చెను. ఆకాలమందు టారససు నగరములో గ్యామేలియలు శిష్యుఁ డగు పలులేక సలు పేరుగల శిష్యుఁడు సకలశాస్త్రపారీణతయందు విఖ్యాతుఁడయి యుండెను.

ఆతఁడు యూదుఁడగుటచే జీససునకు బద్ధశత్రువై తన జ్ఞానమును మంటఁగలిపి జీససును సంహరించు ప్రయత్నమునఁ దిరుగుచుండెను. జీసను పరమశాంతుఁడగుటచే నీ వార్త నాలకించినంతనే కుపితుఁడు కాక దయామయుండగు భగవంతునిఁ దన యీ మూఢసోదరుని సంస్కరింపఁ బ్రార్థించెను. ఒక దినమునఁ గ్రూరుఁడగు పలు జీసను వసించు స్థానమున కేతెంచెను. ఆతఁడు క్రుద్ధుఁడయి యుండెను. నేత్రములు నిప్పులఁ గురియుచుండెను. జీసను పలురాకను గాంచినంతనే పరమశాంతభావముతో వినయవిధేయుఁడయి యతని చెంత కేగి యతని చరణముల వ్రాలి ముద్దిడుకొని, ప్రియసోదరా! నీవు మహాపండితుఁడవని వింటిని. నీ పాండిత్యమును లోకసేవకయి వినియోగింతువేని దేవుని ప్రియపుత్రుఁడవయి ధన్యుఁడ వగుదువు" అని నుడివెను.

జీససుయొక్క శీతలవచనముల నాలించి యతని పరమశాంతప్రకృతి నవలోకించినంతనే పలుయొక్క నేత్రముల నుండి కన్నీరు జొటజొట కారఁజొచ్చెను. ఆతఁడు తన పాపవృత్తిని జీససునకు నివేదించి క్షమింపవేడి నాఁడే జీససుయొక్క ప్రియశిష్యుఁ డయ్యెను. నాఁటినుండి పలు సెంట్‌పాలు అను పేర విఖ్యాతుఁ డయ్యెను. ఆతఁడు క్రైస్తవమతమునకు మహోపకార మొనరించిన ముఖ్యులలో ముఖ్యుఁడు. బైబిలు వంటి పవిత్రగ్రంథమున గణ్యమయిన పాత్ర పాలుకే లభించి యున్నది.

మక్కాప్రాంతమునఁ బరమశాంతమూర్తి యగు మహమ్మదు యిస్లాము ధర్మప్రచార మొనరింప సాగినపుడు

నా సనాతన మతావలంబులగు కోరేశజాతీయు లతనిని హత మొనర్చు నుపాయముల నన్వేషింపఁ జొచ్చిరి. కోరేశ జాతీయులలో నాఁడు ఉమరు అనువాఁడు మహాబలాఢ్యుఁడు. పరమ కిరాతకుఁడు. కోరేశజాతీయు లెల్ల రతనిని ప్రేరేపించి మహమ్మదు నాస్తికుఁ డనియు, అతనిని సంహరించినఁ బుణ్యము కలుగుననియు మతావేశమును గలిగించిరి.

ఉమరు మతావేశపరవశుఁడయి యొకదినమున మహమ్మదు వాసస్థానమున కరిగెను. మహమ్మదుఁ డపు డొక్కచో నిర్జనస్థానమున మోకరిలఁబడి కడుశాంతభావముతో, భక్తి ముఖారవిందమునఁ దాండవించుచుండ గద్గదకంఠముతో 'లోకైకపావనుఁడా! నీ బిడ్డలు క్రూరులయి యొకరి నొకరు హింసించుకొనుచున్నారు. ప్రభూ! వారి హృదయముల దయను, ప్రేమను, కరుణను, శాంతమును నెలకొల్పుము'' అని దేవుని ప్రార్థించుచుండెను.

దూరమునుండియే ఉమరు మహమ్మదుయొక్క శాంత భావమును, భక్తిని గాంచి విస్మితుఁడయ్యెను. ఉమరు సమీపించునంత మహమ్మదు దైవప్రార్థనమునుండి లేచి "సోదరా! రా'' రమ్మని పోయి కౌఁగిలించుకొనియెను. ఉమరు మహమ్మదుయొక్క శాంతస్వభావమును గాంచి ముగ్ధుఁడయి యతనికిఁ బ్రియశిష్యుఁడయి మహమ్మదీయ మత ప్రచార మొనరించెను. మహమ్మదు చనిపోయిన పిమ్మట నావుబేకారు ఖలీఫా యయ్యెను. అతనికిఁ బిదప – ఉమరు ఖలీఫాపదవి నంది యిస్లాము ధర్మవైజయంతి నైరోపా ఖండము మొదలుకొని, ఆఫ్రికావఱకు వ్యాపింపఁజేసెను.

శ్రీ బుద్ధప్రభువు తన మతప్రచార మొనరించుచుండిన కాలమున దుష్టు లనేకు లతనిని సంహరింపవచ్చి యతని శాంతస్వభావమును గాంచి మంత్రముగ్ధులయి యతనికిఁ బ్రియ శిష్యులైనట్లు తెలుపు వృత్తాంతము లెన్నియో బౌద్ధ జాతకకథలందుఁ గాననగుచున్నవి.

పరమ శాంతస్వభావముచే మనుష్యుఁడు దేవతా పురుషుడయి యెట్టి రాక్షసుల నయిన సాధువులుగఁ జేసి వేయుచున్నాఁడు. క్రోధాంధుఁడు సాధువులను సయితము భ్రష్ట చరిత్రులఁ గావించుచుండును. క్రోధోన్మత్తుని స్థితి వర్ణింప శక్యము గాదు. క్రోధావేశముచే వాని హృదయము భగభగ మండుచు వ్యాకులపడుచుండును. నేత్రము లగ్ని స్ఫులింగముల రాల్చుచుఁ జూచువారికి భయముఁ గొలుపు చుండును. ముఖము సహజకళను దక్కి వికృతమయి పైశా చికకళను కలిగియుండును. వాని యధరములు సదా కంపించు చుండ దంతములు పటపటధ్వని నొనరించుచుండును. వాని దేహమంతయు మండుచున్న నిప్పుముద్దవలె నుండును. పాదములు తడఁబడుచుండును. నాలుక పిడుచఁగట్ట నోటి నుండి నీతిశూన్యములును, హీనములును నగు పరుషవాక్య ములు వెలువడుచుండును.

నిశ్చయముగాఁ గ్రోధాంధుఁ డొక భూతమువలెను, పిశాచముపగిదియు, మద్యపానోన్మత్తుని గతియు, మూర్ఛా రోగపీడితుని విధంబునను దన చరణముల యాఘాతములచే భూమి వడవడ వణకుచుండ ఛీత్కారఫూత్కారములచే గగనమును బ్రద్దలఁజేయుచు దర్శకులకుఁ గాలునివలె గోచ రింపఁ గలఁడు. మనుష్యునియందు సహజముగా నెలకొని

యున్న దైవికశక్తియు, నిర్మలజ్ఞానజ్యోతియుఁ గ్రోధావేశముచే సమూలముగ నశించిపోవుచున్నవి.

"కామక్రోధములను ♦ గలిగియుండు నరులు
ఇష్టదేవగురుని ♦ నెఱుఁగలేరు."

—వేమన్న.

మనుష్యసంఘ మజ్ఞానాంధకారమున మునింగి క్రోధమువంటి ప్రాణశత్రువును గోరి కౌగిలించుకొనుచు దుఃఖములపా లగుచున్నది. క్రోధాంధున కీ లోకమునం దే యుత్తమ పదార్థమును సౌఖ్యమును గలిగింపఁజాలదు. ఆత్మజ్ఞానమును, ఆత్మబలమును, ఆత్మవిశ్వాసమును గలవాని హృదయమందుఁ గ్రోధ ముదయింపనేరదు.

క్రోధము దౌర్బల్యసూచక మగుటచే నియ్యది భీరులక్షణ మనియు, నపుంసకత్వమనియు జ్ఞానయోగము బోధించుచున్నయది. క్రోధముచే నొక్కొక్కప్పుడు మస్తిష్కము చెడిపోవును. దేహాత్మలకుఁ దీఱనిహాని వాటిల్లును. అనుదినము క్రోధాగ్నిచే దేహాత్మలఁ దపింపఁజేయుటకంటె మనుష్యుఁ డొక్కసారిగ నగ్నిజ్వాలలలో దుమికి భస్మమగుటయే శ్రేయస్కరము. క్రుద్ధుఁ డొనరించుచుండు కార్యము లన్నియుఁ బరమ దుష్టములును, నీచాతినీచములును నయి యుండుచున్నవి.

"క్రుద్ధః పరుషయా వాచా శ్రేయసో ఽప్యవమన్యతే
వాచ్యావాచ్యాన్ హి కుపితో న ప్రజానాతి కించిత్.
నాకార్య మస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే తథా
హింస్యాత్ క్రోధా దవధ్యాంస్తు వధ్యాన్ సంపూజయేత్తథా
ఆత్మాన మపి చ క్రుద్ధః ప్రేరయే ద్యమసాదనం."

"కుపితుఁడు సత్పురుషుల మానభంగ మొనరించును. వాఁడు యుక్తాయుక్తజ్ఞానశూన్యుఁ డగుటచే దుష్కృతముల నొనరించుచు, దుర్భాష లాడుచుండును. క్రోధముచే మనుష్యుఁడు వంద్యుల హత మొనరించును. వధ్యుల నర్చించును. క్రుద్ధుఁడు స్వయముగఁ దానే యమాలయమార్గము ననుసరించుచున్నాఁడు."

క్రోధమును గుఱించిన యీ వాక్యములను ధర్మానందనుఁడు తన సతీమణికి బోధించియుండెను. లోభాదిదుష్టగుణముల మూలముననే క్రోధము జనించుచున్న దని భీష్మాచార్యులు నుడివియున్నారు. మహాపురుషులు క్రోధనివారణమున కనేక యుపాయముల సూచించియున్నారు. క్రోధావేశము హృదయమునఁ గలిగినంతనే మనుష్యుఁడు తత్క్షణము కోపముచేఁ గలుగు కీళ్ళనుగూర్చి సంస్మరింపవలయును. కోపమునుగూర్చి మహాపురుషులు వచించిన సద్వాక్యములను స్మృతికిఁ దెచ్చుకొనఁ దగును. లేదా సర్వేశ్వరనామమును గీర్తింపఁ గడంగవలయును. శీతలజలమును బాన మొనరించినను క్రోధము తగ్గిపోవఁగలదు.

ఏయే పదార్థస్థానకారణములచే హృదయమునఁ గోపముత్పన్న మగుచున్నదో వాని నన్నింటి దూరముగా విడిచి క్రుద్ధుఁ డేకాంతస్థలమున కేగి యీరీతిఁ జింతించినఁ గోపభావము తత్క్షణ మణఁగిపోయి శాంతిభావ మేర్పడఁగలదు.

"అయ్యో! చిత్తమా! నేఁడు నీ వెంత పాప మొనరించితివి! క్రోధము రాక్షసగుణ మనియు, నీచవృత్తి యనియు మహాపురుషులచే వినియుండియు, సద్గ్రంథములఁ

గనియుండియు, స్వానుభవమునఁ దెలిసియుండియు నీవేల మూఢునివలె నీరీతిఁ గోపమును దాల్చితివి? అయ్యో! అకారణముగఁ బరుల మదుల నొవ్వఁజేసితివే! క్రోధ మను వికారముచే నాత్మశక్తి దూషితమయి పోయెనే? మనసా! నీ వొనరించిన పాపముచే నెంత దుఃఖము కలిగినది? క్రోధ మిహపరములఁ జెఱచు హీనమగు దుష్ప్రవృత్తి యని యిప్పటి కయిన గ్రహించి స్వప్నమందును దానిని నా పొంతఁ జేర నీయనని ప్రతిజ్ఞ యొనరించుము. దయామయుండవగు నో పరాత్పరా! క్రోధమను భయంకరాగ్నిజ్వాలల కర్పింపఁ బడకుండునట్లు నా దేహాత్మల సంరక్షించుకొన నాకు స్థైర్యమును, దృఢసంకల్పమును, శాంతబుద్ధిని ప్రసాదించుము. నేఁడు నేను కుపితుఁడనయి మహాపాప మొనరించినందులకు హృదయపూర్వకముగా పశ్చాత్తాప మందుచు నా జీవితమం దెపుడు నకారణముగఁ గ్రుద్ధుఁడను గానని బాసఁ జేయు చున్నాఁడను.

ఈ చందమున ననుదినము క్రోధ మను భయంకర జాడ్యమునకు వశుఁడయిన వ్యక్తి యేకాంతమునఁ గూర్చుండి నట్టి యంకృతాపరాధమున కయి యను తాపప్రార్థనశపథములఁ గావించుచుండినఁ గ్రమముగా వానికిఁ గ్రోధము నెడ ద్వేషము కలుగ శాంతస్వభావమునందు మిక్కిలి ప్రీతి యేర్పడఁగలదు.

"యస్తు క్రోధం సముత్పన్నం ప్రజ్ఞయోపేత్య బాధతే
తేజస్వినం తం విద్వాంసో మన్యంతే తత్త్వదర్శనః."

—మహాభారతము.

"ప్రజ్ఞావిశేషముచే నెవ్వాఁడు క్రోధమును వశమొన రించుకొనునో వాఁడే తేజోవంతుఁడని తత్త్వవేత్తలగు పండితులు భావించుచున్నారు."

విద్యార్థులు తమయందు క్రోధస్వభావ ముండినచోఁ దన్నివారణార్థము తాము సదా కూర్చుండు గదులయందు గోడలకు మహాపురుషుల చిత్రపటముల నలంకరించు విధంబునఁ గ్రోధము కడు భయంకరమయినది. శాంతము స్వర్గీయ సంపద యను భావముల బలపఱచు వాక్యములను నట్టలపై వ్రాసి, గోడలకు దగిలించుటచే నకారణముగఁ గోపము కలిగి నపుడెల్ల నా వాక్యములు దృష్టిపథమునఁబడి కుపితుని హృదయమునను లజ్జ నొదవింపఁగలవు.

ముఖ్యముగా విద్యార్థులు క్రోధము రాక్షసగుణమనియు, శాంతము దైవగుణ మనియు నెఱింగి విగతక్రోధులయి, శాంతస్వభావులయి వర్తించుట శ్రేయస్కరము. దుష్టుఁడు పైఁబడి హింసించుచున్నను, సంహరింపనున్నను శాంతిస్వభావముతో సహించుటయే ధర్మమా యను సందేహ మనేకులకుఁ గలుగ వచ్చును.

క్రోధాక్రోధ విషయముననను, సత్యాసత్యములందు వలెనే మహాపురుషు లాపద్ధర్మమునే వచించియున్నారు. శాంతము, వినయవిధేయతలు మనుష్యుని కుత్తమధర్మములె. కాలము ననుసరించి యొక్కొకపుడు ప్రయోజనార్థము కృత్రిమ కోపమునయినఁ బ్రకటింపవలసి వచ్చుచున్నది. అన్యాయముగను, అక్రమముగను దుష్టుఁ డెవఁ డయిన ఘోరదురాచార మొనరింప సంసిద్ధుఁడయినపుడు ధర్మపరాయణుఁడగు వ్యక్తి శాంతిముచే సమస్తము ననుభవించును.

ఉత్తమగృహస్థు డెవఁడయిన నగుచో దుష్టుని బాధల సహించి వాని నొకటి రెండు పర్యాయములు సహించును. పిదప వానిని బట్టి దండించును. క్రూరు లొనరించు దుష్కార్యములఁ జూచుచుండియు శాంతముచే నుపేక్ష వహించుటచే వారు చెలరేగి లోకాపకార మొనరింపఁ గడంగుచుండఁ గలరు. అట్టి స్థితియందు ధర్మసంరక్షణార్థమును, లోకహితము నిమిత్తమును, సత్యసంస్థాపనము కొఱకును మనుష్యుఁ డొకింతతడవు శాంతమును మరుగుపఱచి కృత్రిమ క్రోధమును వహింపవలసియే యుండును.

ఈ విషయమయి శ్రీకృష్ణుఁడు పార్థునితో నిట్లు వచించెను:—

"సవ్యసాచీ! ధర్మసంస్థాపనార్థము నీవు పాపముతోడ సంగ్రామ మొనరించుము. కర్తవ్యప్రేరితుఁడవయి జగదీశ్వరుని శాసనగౌరవమును సురక్షిత మొనరించు నిమిత్తమస్త్రశస్త్రాలంకృతుఁడ వయి అసత్యముతోడను, అన్యాయముతోడను, అశౌచముతోడను యుద్ధ మొనరింప సన్నద్ధుఁడ వగుము. క్రోధమును వెల్లడించుము. కాని క్రోధము నకుఁ జిత్తమునఁ దావొసంగకుము."

"తేజస్వీతి య మాహు ర్వై పండితా దీర్ఘదర్శినః
న క్రోధో ఽభ్యంతర స్తస్య భవతీతి వినిశ్చితం."

—మహాభారతము.

"దీర్ఘదర్శులగు పండితులచేఁ దేజోవంతులని నుడువఁబడు వారి హృదయమందుఁ గ్రోధ ముండ నేరదు."

విద్యార్థులారా! సింహగర్జనముతో భయంకరముగ హుంకరించి పాపముల డీకొని హత మొనరింప యత్నింపుఁడు. లేనిచో నా పాపములు సంఘమునం దెల్లెడల నెగఁబ్రాకి జీవ సంహార మొనరింపగలవు. అట్లొనరింపకుండుటచే గోళ్ళతో గిల్లివేయఁదగిన సమస్య గొడ్డళ్ళకుఁ బని గల్పించును.

గురుకులాశ్రమవిద్యావిధానము బాలుర నాచార్యులు క్రోధోన్మత్తులయి దండింపరాదనియు, వా రేవేని దుండగములఁ జేయుచున్నచోఁ గ్రోధవికారమున కెట్టి స్థానమును జిత్తమునం దొసంగక, తత్కోపముయొక్క తీక్ష్ణములగు లక్షణముల మాత్రము బాహ్యమునకు వెల్లడించుచు బాలుర భయపెట్టి దుష్కార్య విముఖుల నొనరింపవలయును.

అసూయతోడను, ద్వేషముతోడను, పరోపకారబుద్ధి తోడను, ధర్మవిరుద్ధముగను బూనఁబడు క్రోధము కడు నీచమయినది. నిశ్చలచిత్తముతోడను, నిర్వికారహృదయము తోడను సత్యముకొఱకును, ధర్మముకొఱకును, లోకోప కారము నిమిత్తమును వహింపఁబడు కోప మాపద్ధర్మముచే నక్రోధముగను, శాంతముగను బరిగణింపఁబడుట కెట్టి యభ్యంతరమును లేదు. "పాపసంహారణమున కావశ్యకమగు నేని క్రోధమును సహింపని వ్యక్తి యీశ్వరద్రోహి యగు చున్నాఁ"డని జోసఫుమ్యాజనీ వచించియున్నాఁడు.

ఈవిషయమునే మహాభారతమున సభాపర్వమందుఁ గశ్యపుఁడు ప్రహ్లాదునితో నుడివియున్నాఁడు. బుద్ధజీససాది మహాత్ములు సర్వసంగపరిత్యాగు లగుటచే దుష్టుల ఖడ్గా ఘాతములకుఁ దమశిరముల నర్పించుటకైన సిద్ధపడియుండిరి

కాని శాంతమును భంగమొనరింప నంగీకరించియుండలేదు. మహాభారతమందలి యీదిగువ నుదహరింపఁబడు శ్లోకమునఁ గల భావములనే శ్రీ బుద్ధప్రభువును శాంతమునుగూర్చి పఠించియున్నాఁడు.

"మృదునా దారుణం హంతి మృదునా హంత్యదారుణం
నాసాధ్యం మృదునా కించి త్తస్మా త్తీవ్రతరం మృదు."

"మృదుత్వము (శాంతము) చేఁ గఠినత్వము (క్రోధము) ను మృదుత్వమును వశమొనరించుకొనవచ్చును. మృదుత్వమున కసాధ్యమగు కార్యమేదియు లేదు. కావున కఠినత్వముకంటె మార్దవత్వమే బలవత్తరమయినది.

మహాభారతమును, బుద్ధుఁడును వచించియున్న శాంతమును జనసామాన్య మనుష్ఠించుట మిక్కిలి కష్టసాధ్యము. కష్టసాధ్య మని నేను శాంతమును విసర్జించు మని నుడువుట లేదు. శాంతమే భూషణమను వాక్య మొక యాదర్శసిద్ధాంతమనుట కేమియు సందియము లేదు. సర్పమందుండు విషము జీవసామాన్యముయొక్క ప్రాణమును హరించునదయియుండ మనుష్యుఁడు సంధిపాతజ్వరపీడితుఁడైనపు డా గరళ మౌషధమయి ప్రాణమును సంరక్షించుచున్నయది. కాని యింత మాత్రముచే విషము సకలజనశ్రేయస్కర మన నలను పడదు. క్రోధము సయితము యీ విషమువంటిదే. మిథ్యాక్రోధధారణము కేవల మాపద్ధర్మమగుచుండ శాంతము సర్వజనీనమును, సార్వకాలికమును, సార్వత్రికమును నగు పవిత్రధర్మమంగ నున్నది.

ఆపద్ధర్మమగు క్రోధధారణమును గుఱించిన పౌరాణికకథ యొకటి తెలుఁగు బ్రసిద్ధమయియున్నది: —

"భక్తుఁడగు నారదుఁ డొకదివసంబున వీణాపాణియై పోవుచుండ మార్గమధ్యమున సర్ప మొకటి యెదురై మోక్ష మెటుల లభించు నని యడుగఁ గ్రోధమును జయించుటచే నని యతఁ డుత్తర మొసంగి వెడలిపోయెను. సర్ప మా నారద సూత్రముయొక్క స్థూలార్థమును మాత్రమే గ్రహించి పరమ శాంతముతోఁ దన్నెందఱు హింసించినను లేశ మేని కోపమును జెందక జీవితమును గడుపఁ దొడంగెను. దుండగీండ్రగు బాలు రనేకులు గుమిగూడి సర్పముయొక్క యతిశాంతస్వభావ మును విలోకించి నిర్భయులయి దాని ననుదినము ఱాళ్ళతోఁ గొట్టుచు వినోదముగఁ గాలముఁ బుచ్చఁ దొడంగిరి.

ఒకదివసమున నారదుఁ డామార్గముననే యరుగుచుండ భుజంగ మతని చెంతకేగి నారదా! నీతివిశారదా! చూచి తివా నా దేహ మెట్లు శిథిలమైపోయెనో? నీవు చెప్పినచొప్పునఁ బరమశాంతమును వహించి, ఎవ్వాని కెట్టి కీడును గావింపక జీవించుచుండఁ గొంటెపిల్ల లనుదినము ఱాళ్ళను రువ్వుచు నా దేహమునంతయు రక్తమయ మొనరించి వైచినారు. మోక్షము మాట యెటులున్నను నేను శాంతస్వభావముచేఁ గలుగు నీ దుర్భరమగు బాధను సహింపలేకున్నాను అని దీనముగ నివేదించెను.

అంత నారదుఁడు పరిహాస మొనరించుచు నిట్లుత్తర మొసంగెను :—

"దూరదృష్టిలేని యో సర్పమా! అన్యాయముగఁ గ్రోధావేశపరవశత్వముచే లోకమునకుఁ గీడొనరింపవలదని

నేను నుడివియుంటిని కాని, బుసకొట్టవలదని నిన్ను నిషేధించియుండలేదు."

నాఁటినుండి సర్పము క్రోధధర్మస్వరూపము నెఱింగి దుష్టబాలకులు తన్ను బాధింపవచ్చినపుడెల్ల బుసకొట్ట నారంభించెను. తదాదిగఁ గొంటెపిల్లలు ప్రాణభీతిచే దానిచెంత కరుగుట మానిరి. ఈ కథ నాదర్శముగఁ గొని విపద్ధర్మముగ సాత్త్విక క్రోధమును వహింపవలయునే కాని మఱెప్పుడును మనుష్యుఁడు కుపితుఁడు కారాదు. ప్రాణరక్షణమునకే సాత్త్విక క్రోధావలంబన మావశ్యకము. లోకమున శాంతముచేఁ గార్యములు నెఱవేఱునట్లు క్రోధముచే సఫలముకానేరవు. విద్యార్థులు శాంతస్వభావులయి యుండుటకు నిరంతరము యత్నించుచుండవలయును. ఎంతధనమును సంపాదించినను, ఎన్నిభాషల నేర్చినను శాంతమను సద్గుణమొక్కటి లోపించెనేని విద్యార్థిజీవితము వ్యర్థమగును.

"జ్ఞానే మౌనం, క్షమా శక్తౌ, త్యాగే శ్లాఘావిపర్యయః
గుణాగుణానుబంధిత్వాత్ తస్య సప్రసవా ఇవ."

—రఘువంశము.

"ఆ రాజు రుల వృత్తాంతముల నెఱింగియు వెలిఁబుచ్చఁడు. తన కపకార మొనరించినవారికిఁ బ్రత్యపకార మొనరింప సమర్థుఁడయ్యు నట్లుచేయక యోర్చును. ఇచ్చియుఁ బొగడుకొనఁడు. ఈప్రకారము జ్ఞానమౌనములు, శక్తిశాంతములు, ఈవియుఁ బొగడుకొనమియు నను నీ పరస్పరవిరుద్ధగుణము లాతనియం దొకటితో నొకటి కలిసియే తోడఁ బుట్టువు లనునట్లొప్పుచుండెను."

విద్యార్థులు రఘుమహారాజునందుఁ గల శాంతస్వభావము గుర్తించి తాము శాంతప్రకృతిగలవారలయి మెలంగ యత్నింప వలయును. నమ్రస్వభావులగు సత్పురుషుల సాంగత్యమునను, మహాపురుషుల పవిత్ర జీవిత చారిత్రపారాయణమునను, రజస్తమోగుణములఁ బెంచునట్టి యస్వాభావికాహారమును విసర్జించి, సాత్వికాహారమును మితముగ భుజించుటవలనను, శాంతముయొక్క పునీతమగు మహిమను నిత్యము ధ్యానించు కారణమునను, నమాజుచేయుటకు ముందు మహమ్మదీయులు శీతలజలముచేఁ గర, చరణ, ముఖ, శ్రవణ, నయన, ఘ్రాణేంద్రియములఁ గడుగుకొనునట్లు కోపముగలిగినపుడు ప్రక్షాళన మొనరించుట చేతను శాంతమను రత్నము లభింపగలఁదు. శాంతస్వభావుఁడు తేజస్వియయి, మేధాశాలియయి, సుఖియై లోకపూజ్యుఁ డగును. కావున విద్యార్థులారా! శాంతము నపేక్షించి పాపదాయకమగు క్రోధమును శీఘ్రమే విసర్జింపుఁడు.

"తే॥గీ॥ పాపముల కెల్ల నెక్కుడు ♦ పాతకములు
సువ్వె క్రోధలోభంబులు ♦ సువ్రతాత్మ
వాని రెంటి జయించిన♦ వాఁడుగాని
యెందుఁ బరమధార్మికుఁడని ♦ యెన్నఁబడఁడు."

—మహాభారతము.



# అఱువది యెనిమిదవ ప్రకరణము

## ఉద్బోధనము

"సమాస్త్వాగ్న ఋతవో వర్ధయంతు సంవత్సరా
ఋషయో యాని సత్యా, సందివ్యేన దీదిహి
రోచనేన విశ్వా ఆభాహి ప్రదిశశ్చ తస్రః."

—అథర్వణసూత్రము.

"భూరిప్రయత్నముచే యథాశక్తి మనుష్యుఁడు తన సమయమును సద్వినియోగముచే ననుకూల మొనరించుకొనుచు ఋషులనుండియు, బుద్ధిమంతులగు నాప్తులనుండియు నుత్తమ శిక్షను గ్రహించుచు సత్యసంకల్పయుతుఁడయి, సత్యసంధుఁడయి, సత్కర్మపరాయణుఁడయి విశ్వమునం దభివృద్ధిఁగాంచి యశస్వియయి, ప్రసన్నచిత్తుఁడయి యుండుగాక!"

ప్రేమాస్పదులగు విద్యార్థులారా! ఇంతవఱకు "మానవజీవితము" అను నీ గ్రంథమునఁ బ్రథమ ప్రకరణంబాది యంతిమప్రకరణముపర్యంతము నాదర్శ మానవజీవితోచితములగు బహుధర్మములనుగూర్చి ముచ్చటించియుంటిని. భువి యథార్థములగు సౌఖ్యానందములఁ బడయ నభిలషించు ప్రతి విద్యార్థియు నిందలి ధర్మములనెల్ల ధ్యానముతోఁ బఠించి తదనుకూలముగ జరిత్రనిర్మాణ మొనరించుకొనఁదగును. కేవల మిందలి భావములఁ బారాయణ మొనరించి యాచరింపనిచో నీ గ్రంథముచే నెట్టి ప్రయోజనము కలుగనేరదు.

ఈ గ్రంథమున వ్రాయఁబడిన ప్రతివాక్యము విద్యార్థి యొక్క నైతిక జీవితపురోభివృద్ధినే ధ్యానమునం దిడికొని యున్నది. మానవజీవితోత్థానమున కావశ్యకమగు సామగ్రి యంతయు నీ గ్రంథమునఁ జేర్చఁబడియున్నది. ఇందలి ప్రతి వాక్యమును జీవితాభ్యుదయమునకుఁ దారకమంత్రమయి రాణింపఁగల దని భావించుచున్నాఁడను.

విద్యార్థులారా! మీరు ధర్మపరాయణులయి, పవిత్ర హృదయులయి, ప్రేమానందమయులయి, విజ్ఞానధనులయి, నీతిధురీణులయి, విద్యావిశారదులయి స్వచ్ఛంద జీవితానంద సాగరమున నోలలాడఁదలంతు రేని పవిత్రగ్రంథమగు 'మానవ జీవితము'నఁ గల ప్రతి నీతివాక్యమును దివారాత్రములు స్మరించుఁడు. ఆచరించుఁడు. ధన్యులగుఁడు.

సద్వాక్యముల శ్రద్ధతో నాలించి, త్రికరణశుద్ధితో ననుష్ఠించియే సామాన్యమానవులు ప్రతిభావంతులయి, ప్రజ్ఞాసముపేతులయి, మహాపురుషు లను ప్రఖ్యాతి వహించి తమ యశశ్చంద్రికల నాచంద్రతారార్కస్థాయిగ దిగ్దిగంత ముల వ్యాప్త మొనరింపఁజేయఁగల రను రహస్యమును విస్మ రింపకుఁడు.

నిశ్చయముగా విద్యార్థిహితము నపేక్షించు "మానవ జీవితము"న వెలయు నొక్కొక్క ధర్మ మనుష్ఠింపఁ బడినంతనే మీ వికాసశూన్యములగు దుర్బలహృదయముల స్వర్గీయ తేజముచే నింపివేయఁగల దని విశ్వసింపుఁడు. నాయనలారా! వ్యర్థములగు విలాసములకు వశులయి, వాని పరిణామము లగు దుఃఖభయరోగములచే బాధింపఁబడక జ్ఞానపూర్వక

మగు సాధుజీవిత నిర్వహణమునఁ దగిలియుండుఁడు. సచ్చారిత్రము స్వర్గీయసంపద యని తెలియుఁడు.

మీరు సద్గుణశీలురయి, వినయవిధేయతామూర్తులయి, ధీరులయి, ధీమంతులయి, కర్మవీరులయి, లోకోపకారపారీణులయి, విద్యావంతులయి మనుచుందురేని భూతలము స్వర్గతుల్య మగును. మన దేశముయొక్క బంధమోక్షములు రెండును మీమీఁదనే యాధారపడి యున్నవి. సద్వర్తనులయి, సుజ్ఞానులయి, మహాత్ములయి దేశము నుద్ధరించుటకును, దుష్టచారిత్రులయి, అజ్ఞులయి, దురాత్ములయి జన్మభూమిని పాదదళిత మొనరించుటకును మీరే సమర్థులు. స్వర్గనరకములఁ గల్పించు నీరెంటిలోఁ దొల్లింటిదగు దేశభక్తియే మీకుఁ బ్రాణసమానమగుఁగాక !

నాయనలారా! దయామయుండగు పరాత్పరుఁడు మీకొఱకు స్వర్గద్వారములఁ దెఱచియున్నాఁడు. జ్ఞానమార్గము ననుసరింతురా స్వర్గపురినిఁ జేరి సుఖింతురు. అజ్ఞానపథము ననుగమింతురా నరకకుండమునఁబడి దుఃఖింతురు. కావున, మీరలసుల కావలదు. అజ్ఞాననిద్రనుండి మేల్కొనుఁడు. భోగులగుటకు వాంఛింపకుఁడు. యోగు లగుఁడు. భారతభూమి జ్ఞానభూమి - కర్మభూమి యను మాతృదేశప్రఖ్యాతిని మలినము గాకుండ సంరక్షింప దీక్షితులగుఁడు.

లోకమున జగదీశ్వరుని పవిత్రశాసనములగు దయ, అహింస, శౌచము, నిగ్రహము, శాంతము, జ్ఞానము, భక్తి మున్నగువానిని సత్వరము పాలింపుఁడు. దైవశాసనపాలకులే నిర్భయులయి, నిశ్చయచిత్తులయి, ఆనందమూర్తులయి, బాల

భానుని పగిదిఁ బ్రకాశింపఁగలరు. కర్మవీరులయి ధైర్య స్థైర్యములచే సత్యమునకయి బలిదానమగుఁడు.

ధరణి ధ్వజమును స్థాపించ వాంఛింతు రేని ధర్మవైజ యంతినే శాశ్వతప్రతిష్ఠాపిత మొనరింపుఁడు. ధురంధరులు కాఁగోరుదు రేని శీఘ్రమే ధర్మధురంధరులగుఁడు. చింతా నిరతులగుట కభిలషింతు రేని సత్యజీవిత ప్రాణచింతనానిరతు లగుఁడు.

మీపూర్వులవలెఁ బుణ్యమూర్తులు కాఁదలంతు రేని జ్ఞానము నార్జింపుఁడు. శాశ్వతముగ వసుధ శతవత్సరములు మూఢులయి జీవింపఁగోరుటకంటె స్వల్పకాలమేని సుజ్ఞానులై మనుటకుఁ గోరుకొనుఁడు. అపుడే మీ విద్యార్థి నామము సార్థకమగును.

మనుష్యుఁడు జననమాదిగ మరణ పర్యంతము విద్యార్థియే యను రహస్యమును మఱువకుఁడు. సచ్చిదానందుఁడును, లోక కల్యాణకరుఁడును నగు జగదీశ్వరుఁడు మిమ్ము మహా పురుషులుగను, స్వార్థత్యాగులుగను, కర్మవీరులుగను, ధర్మ మూర్తులుగను జీవింపఁ బ్రోత్సహించును గాక!

"మానవజీవితము" మి మ్మాదర్శమానవులుగ సిద్ధ మొనరించుఁగాక! మీ మోక్షమునకు మీరే కారకు లగుదురు గాక!

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకాః సమస్తా స్సుఖినో భవంతు."



వేపు పంచాయతి (గంటాలయం ప్రోలు ... కృష్ణా జిల్లా)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B156 |
| పుస్తకం పేరు | మానవ జీవితము 03 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 457 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | viiib, VIIID, |
| లేని పేజీలు | 1 to 1008,1436 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |